శ్రీ శివాయగురవేనమః.

# శైవమతప్రకాశిక.



## శైవసిద్ధాంతము.

:O:

ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతాద్వైతము, శివాద్వైతము అను వానిలో శైవు లవలంబించిన సిద్ధాంతము అద్వైతమనికొందఱును, ద్వైతాద్వైతమని కొందఱును, విశిష్టాద్వైతమని మఱికొందరును, నభిప్రాయపడుచున్నారు. ఇంక గొందఱు శైవసిద్ధాంత మిదియని నిర్ధారణచేయుటకే వీలులేదని యెంచుచున్నారు. మరికొందరు శైవసిద్ధాంత మిదియని నిర్ధారణకానిది భాష్య మిదియను నిర్ధారణంబును కాసేరదని యుద్దేశపడుచున్నారు. కావున నీనిర్ణయం బావశ్యకమని తోచెడిని.

విద్వన్మణులారా,

ఈ యంశమున నాలోచింపగా పూర్వకాలమున శైవము, వైష్ణవము, మొదలగువానినే ప్రధానమతములనుగా నెంచినట్లును, ద్వైతాద్వైతాదులుపాసనా ధర్మములగుట నైచ్ఛికములుగాన వీని నప్రధానమతములుగా నెంచినట్లును, కనబడుచున్నది.

కావుననే శైవము, వైష్ణవము మొదలగు ప్రతి ప్రధానమతమునందును ద్వైతాదు లవాంతరమతములుగా నున్నట్లు పెక్కు నిదర్శనములు కలవు. అది యె

మొదట మొదటిదగు శైవమతమునందు జూడుడు.

శ్రీ శివాగమములయందు, పతిః, పాశః, పశుశ్చేతిపదార్థత్రితయమ్నాతం అని ద్వైతమే సిద్ధాంతము చేయబడియున్నది. దానింబట్టి శ్రీ మల్లికార్జునపండితులవారు శివతత్త్వసారమునందును, శ్రీ హరదత్తాచార్యులవారు శ్రుతిసూక్తిమాలయందును, అద్వైతమును ఖండించి ద్వైతమునే సిద్ధాంతముచేసియున్నారు.

దీనింబట్టి శైవపూర్వాచార్యులు ద్వైతమునందు సమ్మతిని కనబరిచినట్లు స్పష్టమగుచున్నది.

ఇదిగాక శ్రీ శివపురాణములయందు అద్వైతము కన్పట్టుచున్నది. ప్రభులింగలీల మొదలగు గ్రంథములయందు అద్వైతానుభవము నిరూపింపబడి యుండినట్టు లింకే గ్రంథమునందును కన్పట్టదు. దీనింబట్టి శైవపూర్వాచార్యులలో కొందరభావము అనుభవాద్వైతమునం దభిరుచి కలిగియున్నట్లు తెల్లమగుచున్నది.

ఇది యిట్లుండ శ్రీకంఠ శివాచార్యులవారు బ్రహ్మసూత్రభాష్యమునందు విశిష్టాద్వైతం సాధయిష్యామః అని విశిష్టాద్వైతమును నిరూపించియున్నారు. దీనింబట్టి విశిష్టాద్వైతమునందును శైవపూర్వాచార్యులలో కొందరు అభిమానము కలిగియున్నట్టు విశదమగుచున్నది.

ఇట్లే వైష్ణవమతమునందును నామతమునకు పరమప్రమాణము లయిన పాంచరాత్రాగమములయందు ద్వైతమే సిద్ధాంతము సేయబడియున్నది. అయినను శ్రీవిష్ణుపురాణములయందు అద్వైతమే కన్పట్టుచున్నది. వైష్ణవమత పూర్వాచార్యులలో కొందర కద్వైతాభిమానము లేనిది విష్ణుపురాణములయందు నద్వైతము నిబద్ధమై యుండ నేరదుగదా. అట్లైనను, శ్రీరామానుజాచార్యులవారు శ్రీభాష్యమునందు విశిష్టాద్వైతమును సిద్ధాంతము చేసియున్నారు.

దీనింబట్టి శైవ వైష్ణవాదిమత పూర్వాచార్యుల యుద్దేశమేమియని యాలోచింపవలయును. వారు జ్ఞానలోపముచే యథేచ్ఛముగానట్లు నిర్ణయించిరని వచింప వీలులేదు. పూర్వాచార్యులు సామాన్యముగా జ్ఞానపరిపూర్ణులనియే యంగీకరించి తీరవలయును. అట్లుగాకున్న వీరిలో కొందరే జ్ఞానపూర్ణులనియు నిర్ణయింప నయుక్తముగాన నందరు జ్ఞానశూన్యులే యని యంగీకరింపవలసి వచ్చునుగాన దానింబట్టి మతములకే యప్రామాణ్యమువచ్చును. కావున పూర్వాచార్యుల యాశయమిదియని యంగీకరింపక తప్పదు. ఏమనిన

ద్వైతభావముతోగాని, అద్వైతభావముతోగాని, లేక విశిష్టాద్వైతభావముతోగాని యే భావముతోనైనను శివునినే ప్రధానముగా నుపాసింపవలయునని శైవ పూర్వాచార్యుల యాశయము. అట్లే విష్ణునే ప్రధానముగా నుపాసింపవలయునని వైష్ణవపూర్వాచార్యుల యాశయంబు నగునని యేర్పడుచున్నది. దీనింబట్టి శైవవైష్ణవాదులు ప్రధానమతంబులును, ద్వైతాదు లుపాసనాధర్మంబులుగాన నవియట్లు ప్రధానమతంబులు కావనియు నిశ్చయమగుచున్నది.

దానచే శైవవైష్ణవాదిమతములకు పరస్పరభిన్నములగు నాచారవిశేషములు ప్రమాణసిద్ధములైయున్నవిగాని యట్లు ద్వైతాదిమతములకు నాచారవిశేషములు గన్పట్టుటలేదు దీనింబట్టి శైవవైష్ణవాదులే ప్రధాన మతములనియు, ద్వైతాదులప్రధానమతములనియు, నిరూఢమగుచున్నది.

పూర్వకాలమున, నీభావమే స్థిరమైయుండి రాను రాను కొంతకాలమునకు నీభావము మార్పునొంది ద్వైతాదులె ప్రధానమతములనియు శైవవైష్ణవాదులె అప్రధాన మతములనియు నెన్నవలసి వచ్చుటకు కొన్ని కారణములేర్పడియెను. అందు శ్రీ శంకరాచార్యులవారి మత సంస్కరణము ప్రధానమయినది.

అది యెట్లనిన, శ్రీ శంకరాచార్యులవారు అద్వైతమే ప్రధానమతమనియు శైవవైష్ణవాదులె అప్రధాన మతములనియు సిద్ధాంతము చేసియుండిరి. వారి కామార్గము నవలంబించుటన్న నింకొండుమార్గము కార్యసాధకము కాదు.

ఏలన, వారు సిద్ధాంతము సేయు కాలమున శైవాది షణ్మతములును నెక్కువ ప్రచారమున నున్నవి. దీనికి ఆనందగిరికృత శంకరవిజయమే నిదర్శనము. వారు తమ మతమునకు శైవాది షణ్మతములలోనిదగు నేదేనొక నామము నిర్దేశింప వీలులేదు. అట్లేని కడమయైదు మతములవారును విరోధింతురు. అప్పుడన్ని మతములవారిని సమావర్జనము చేయుటకు వీలు లేకపోవును. కావున సర్వమతస్థులను స్వమతమున జేర్చుకొనుటకు నాయా మతములకు బాధకముగాని సామాన్య నామకరణము గావించుటయే యావశ్యకము. దానంజేసి స్వమతమునకు నద్వైతమనియే నామకరణము గావింపబడియెను. అద్వైతమను పేరు సామాన్యముగ భేదమనుదానిని నిర్మూలనము చేయును గాన, మత భేదములను పాటింపనియ్యకుండుట వింతగాదు. దీనింబట్టి యీ పేరు మత భేదముల నణచి సకల మతములను సమరసము చేయ ననుకూలముగా నున్నది.

అట్లైనిం ఈపద్ధతి నప్పటివారెట్లు విశ్వసించిరని యడుగుదురేని లోకోపకారమునకై యట్లు లంగీకరింపవలసివచ్చెను ఏలన,

శ్రీ శంకరాచార్యులవారు స్వమత సిద్ధాంతము సేయునాటికి నీలోకమంతయు శైవవైష్ణవాది మతకలహములచే కల్లకల్లోలముగా నున్నది. ఎట్లన.

శివయను శబ్దమును వైష్ణవులుచ్చరింపరు. విష్ణుఅను శబ్దమును శైవులు వినరు. శైవులు విష్ణుని పూజింపరు. వైష్ణవులు శివనివంకజూడరు. వైష్ణవులను

శైవులు గ్రామములోనికి రానీయరు. శైవులను వైష్ణవులు దేశమునుండి వెడల నడతురు. లోకమిట్టి సంకటస్థితియందుండి సంస్కారణము నపేక్షించుచుండెను. ఆయదనున శ్రీశంకరాచార్యుల వారవతరించి శివకేశవులకు భేదములేదని యుపదేశింప నారంభించిరి.

వారికి స్వసిద్ధాంతమునుబట్టి యించుకలేని భేదము శివకేశవులయెడ నెట్లుండును? అంతదనుక మతకలహములచే విసుగునొందియున్న వారికి నీవాదము మిగుల రుచింపఁజొచ్చెను. దానింబట్టి తండోపతండములుగ జనులు చుట్టుమూగిరి. అప్పు డాచార్యులవారు వారికిట్లు బోధించిరి.

శివుఁడనినను, విష్ణుఁడనినను నొక్కఁడే. ఇద్దఱకు భేదములేదు. కావున శివుని, కేశవుని, శక్తిని, గణపతిని, గ్రహపతిని నందఱను పూజింపుఁడు. అట్లుగాక, వీరిలో నొక్కనియందు మీకెక్కుడు భక్తికలదేని నద్దేవుని నడుమనిడి తక్కువారిని పరివారములోఁ జేర్పుఁడు. అని బోధించిరి. ఆబోధ జనులకు తృప్తికరముగా నుండెను.

దేవతలు మనము కల్పించినవారేగాన వారిలో నెవ్వని ప్రధానపీఠ మెక్కించినను, మఱియెవ్వరిని పరివారమున నిల్చుండబెట్టినను ఇది యంతయు మన యధికారములోనిదే యని వారి యూహ.

అది యెట్లైన నుండుఁగాక, ఎక్కువ మతాభిమానముగల యాకాలమున నీబోధ ప్రజల కెట్లురుచించెనని యడుగుదురేని ప్రజలకుగల మతాభిమానము, దేవతాభిమానము అద్వైతబోధతో నస్తమించి యుండెను. అద్వైత సిద్ధాంతమునందు తత్త్వము నిర్గుణమేగాని సగుణము కానేరదు. వ్యవహారమున సగుణ మంగీకరింపఁబడినను అది యుపాసనకొఱకు కల్పింపబడినదిగాన ఎంతమాత్రము సత్యమైనదికాదు. దీనింబట్టి జగముయొక్క నామరూపములవలె దేవునియొక్క నామరూపములును కల్పితములేగాని నిజము కానేరవు. ఇట్లు శివకేశవాదులయొక్క నామములు, రూపములును కల్పితములై నిజము కానప్పుడు ఈ నిజము తెలిసినవారికి దేవతలయొక్క నామముల మీదగాని, రూపములమీదగాని వృథాభిమాన మెట్లుండును? ఇఁక నద్దేవతల నామరూపములనుగూర్చి కలహమేల ప్రవర్తించును?

ఈకారణమున శైవ వైష్ణవ సంఘాది మహానదులు చాలవఱకు అద్వైత మహాసముద్రమునం దస్తమించినవి.

వెనుకఁజెప్పిన విధమున పంచాయతనమువందు శివుని ప్రధానముగా నుపాసించిననది శైవము, విష్ణుని ప్రధానముగా నుపాసించిన నది వైష్ణవము. ఇట్టివి యన్నియు నద్వైతమున నంతర్భూతములు. అద్వైతము ప్రధానమైనది. ఇట్లు అద్వైతము ప్రధాన మతమనియు, శైవము, వైష్ణవము మున్నగునవి యైచ్ఛికములుగాన నవియట్లు ప్రధానములు కావనియు నప్పుడేర్పడియెను.

దానింబట్టి కొంతకాలము గడచినమీద నవతరించిన శ్రీరామానుజాచార్యులవారు స్వమతమునకు విశిష్టాద్వైతమని నామకరణము గావించిరి. వారి కదియు నావశ్యకమయ్యెను. ఏలన, తమ మతము వైష్ణవమని చెప్పినంత మాత్రమున అద్వైతమునకు ప్రతిద్వంద్వి కాఁజాలదు. వైష్ణవంబును అద్వైతమునకు నంతర్భూతమై బాధకము కానందున వైష్ణవమనఁగనే అదిమాకు నిష్టమేయని యద్వైతు లనుమోదింతురుగదా? అట్లుగాక విశిష్టాద్వైత మనుచోట నద్వైతు లంగీకరింపరు. అప్పుడద్వైతమును ఖండింప నమవగును. కావున స్వమతము ప్రధానముగా వైష్ణవమే యయినను విశిష్టాద్వైతమను నామకరణము గావించుకొనుట వారికి విధియయ్యెను.

తరువాత మధ్వాచార్యులవారు వెల్వడి తమ మతము రెండిటికి వేరుగా ద్వైతమని సిద్ధాంతముసేసిరి. అట్లుగానిచో వారికి మతమే యేర్పడకపోవును. ఏలన, వారిది వైష్ణవమతమే కావున వైష్ణవమనఁగనే రామానుజమతమునఁ బె యంతర్ధానము చెంది యుండునుగదా? ఇట్లు మధ్వాచార్యులది వైష్ణవమతమే యయినను వేరుగా తమ మతము నిలుపఁబెట్టుకొనుటకు తమ మతమునకు ద్వైతమని నామకరణము గావించికొనుట యావశ్యకమయ్యెను.

ఈవిధమున పెక్కుకారణములచే ద్వైతాది మతములె ప్రధానములుగను శైవవైష్ణవాది మతములె యప్రధానములుగను పరిణమించుట సంభవించెను. శైవము ప్రధానమతమే యైనను తరువాత జరిగిన మార్పునుబట్టి శైవుల మతము ద్వైతమా, అద్వైతమా? అనుశంక కవకాశము కలుగుచున్నది. ఇంతియేగాని నిజమునుబట్టి యిట్టి శంక కవకాశములేదు. అయినను తక్కుమతముల వారితోపాటు శైవులదియు ద్వైతమో అద్వైతమో అను నిర్ణయము అవసరమను భావము కొందఱకు గలదుగాన వారి యాశయమును బట్టియు, ఇప్పటికి దొరికిన ప్రమాణములను బట్టియు నిట్లు నిర్ణయింపవలసివచ్చుచున్నది.

శైవులంగీకరించిన సిద్ధాంతమునకు శివాద్వైతమని పేరు.

ప్ర॥ అదియెట్లు? శ్రీ శివాగమములయందు ద్వైతమే సిద్ధాంతము సేయ

బడి యుండెననియు శ్రీ మల్లికార్జున పండిత స్వాములవారిచేతను శ్రీహరదత్తాచార్యులచేతను అద్వైతము ఖండించి ద్వైతయే సిద్ధాంతము సేయబడియెననియు మీరు చెప్పియుంటిరిగదా ? ఇక శివాద్వైతము శైవుల సిద్ధాంతమెట్లగు ?

ఉ॥ శ్రీ మల్లికార్జున పండిత ప్రభృతులు అద్వైతమును ఖండించినది నిజము. అయినను వారు ఖండించినది శుద్ధాద్వైతముగాని, శివాద్వైతముకాదు.

ప్ర॥ ఈయంశమెట్లు తెలియును ?

ఉ॥ శివతత్త్వసారము,

క॥ తనకంటె వేరెయీశ్వరుఁడన లేడని పలుకునట్టి యద్వైతవిమూ
ఢునకును లోకాయతునకు వినఁగా భేదమ్ముగలదె విష్ణువరేశా ।
అని యనేకవిధముల శుద్ధాద్వైతమును ఖండించికొనను,

క॥ అద్వైతైకస్థితి నీయద్వైతమకాన యీశ్వరాద్వైతము స
ర్వాద్వైతమనగ వేరు జగద్విపరీతమగు తత్త్వగతిగలదె శివా ॥

శాస్త్రములయందు జెప్పబడు నద్వైతము ఈశ్వరాద్వైతమనగా శివాద్వైతమేయనియు సర్వాద్వైతమనగ శుద్ధాద్వైతము అయ్యది శివాద్వైతముకంటె వేరు భిన్నమైనదనియు నిర్ణయించి యున్నారు.

ప్ర॥ అగుగాక వారు శుద్ధాద్వైతమును ఖండించి సిద్ధాంతముసేసినది ద్వైతమేయని చెప్పియుంటిరి. తిరిగి వారు శివాద్వైతమునెట్లు సిద్ధాంతముసేసి యుండిరి ?

ఉ॥ శ్రీమల్లికార్జునపండితులవారు మొరట నిరూపించిన ద్వైతసిద్ధాంతమునకును, కొసకు దెలిపిన శివాద్వైతమునకును నెంతమాత్రము భేదములేదు. అట్లు భేదముండునెడ స్వవచనవ్యాఘాతముగా వారట్లేల చెప్పియుందురు ? కావున పూర్వాచార్యుల వాక్యమందు విశ్వాసముంచవలయుఁగాని సంశయము పెట్టికొనగూడదు. అట్లు సంశయము పెట్టుకొనినవానికి శ్లో॥ సంశయాత్మా వినశ్యతి నష్టముకలుగుననియు చెప్పబడియున్నది.

ప్ర॥ శివాద్వైతమని పేరేల పెట్టవలయును? కేవలమద్వైతమనిన జాలదా?

ఉ॥ చాలదు. అదియేలన- శుద్ధాద్వైతము శ్రీమల్లికార్జున పండిత శ్రీహరదత్తాదులచే ఖండింపఁబడియున్నది గాన నది శైవుల సిదాంతముకాదు.

ప్ర॥ ప్రభులింగలీలయందును మఱికొన్ని శైవమత గ్రంథముల యందును శుద్ధాద్వైతము నిరూపింపఁబడియుండఁగా నది శైవుల సిద్ధాంతమెట్లు గాదు?

ఉ॥ శైవమత గ్రంథములయందు॥ జెప్పఁబడినది శివాద్వైతమే. అట్లు గాక కొన్నిచోట్ల శుద్ధాద్వైత సిద్ధాంతము ప్రతిపాదింపఁబడియున్నను అది శైవ పూర్వాచార్యులచే ఖండింపఁబడియున్నది గాన శైవుల సిద్ధాంతమని యంగీకరింపకూడదు.

ప్ర॥ శైవమత గ్రంథములయందు కొన్నిచోట్ల శుద్ధాద్వైతమును నిబంధించినవారును శైవపూర్వాచార్యులె గాన వీరియందు విశ్వాసముంచి శుద్ధాద్వైతమునె యేలగ్రహింపగూడదు?

ఉ॥ శుద్ధాద్వైతమును కొన్ని గ్రంథములయందు శైవపూర్వాచార్యులే నిబంధించి యుందురు గాక. అయినను శైవమతప్రతిష్ఠాపనా పరమాచార్యులగు శ్రీ నీలకంఠాచార్య శ్రీహరదత్తాచార్య శ్రీ మల్లికార్జున పండిత ప్రభృతులు శుద్ధాద్వైతమును నిరాకరించి యున్నప్పుడు దానిని స్వసిద్ధాంతమునుగా గ్రహింపగూడదు.

ప్ర॥ శుద్ధాద్వైతమును నిరూపించినవారె శైవమత ప్రతిష్ఠాపకులని యేల గ్రహింపగూడదు?

ఉ॥ శుద్ధాద్వైతమును నిరూపించినవారు మధ్యకాలికులు. శివపురాణములలో గొన్నిటియందు శుద్ధాద్వైతము కలదని దానినె నమ్మి వారు తమగ్రంథముల యందు చేర్చియుండవచ్చును. అట్లుగాక అద్వైతబోధ లోక మంతయునిండి సర్వమతస్థులను నావరించియున్నది గాన మధ్యకాలికులు కొందరు అద్వైతానుభవమున నాసక్తిగలవారై యుండి యద్దానిని తమ గ్రంథములయందు జేర్చినను చేర్చియుండవచ్చును. అంతమాత్రమున వీరి వాక్యములనె నమ్మి శైవమతమూలాచార్యులు చేసిన సిద్ధాంతమును త్రోసివేయనగునా? కూడదు.

ప్ర॥ అట్లని వీరిగ్రంథములను ప్రమాణములుగా నెట్లు తీసికొనవచ్చును?

ఉ॥ కడమ యంశములయందు ప్రమాణములుగా బాగుగ గ్రహింపవచ్చును

ప్ర॥ అదియెట్లు? ఇది అర్ధజరతీ న్యాయముకాదా?

ఉ॥ కాదు అదియెట్లనిన అపస్తంబుడు ఆశ్వలాయనుడు మొదలగు ఋషులందరు ద్వైతమునె సిద్ధాంతము చేసి అద్వైతమును ఖండించియున్నారు. అయినను అద్వైతమతస్థులు ద్వైతసిద్ధాంతాంశమున వారి గ్రంథములయందు

ప్రామాణ్యబుద్ధి లేకున్నను కర్మములను జెప్పు తక్కిన (యంశములయందు ప్రామాణ్యబుద్ధి లేకుండునెడ బాహ్యత్వము నకే హానివచ్చునని యెంచి ఆయంశమున పరమప్రామాణ్యబుద్ధి నుంచిరియె యున్నారు. అట్లే మధ్యకాలికులు చేసిన శైవ మతగ్రంధములయందును శుద్ధాద్వైతమును నిరూపించినచోట నప్రామాణ్యంబును కడమయంశములయందు పరమప్రామాణ్యంబును నుంచిన నేమి భాధకము? ఏమియు బాధకములేదు.

ప్ర॥ ద్వైతాద్వైతమే శైవుల సిద్ధాంతమని యేల గ్రహింపగూడదు!

ఉ॥ పూర్వాచార్యులట్లు దెలిపియుండిన బాగుగ గ్రహింప వచ్చును. పూర్వాచార్యులే గ్రంధమునందైనను ద్వైతాద్వైతమును సిద్ధాంతము చేసియుండ లేదు ద్వైతాద్వైతము శైవుల సిద్ధాంతమనియు జెప్పియుండలేదు. కావున ద్వైతాద్వైతము శైవుల సిద్ధాంతముగాదు

ప్ర॥ అదియేమి? శ్రీపతి పండితస్వాములవారు శ్రీకరభాష్యమున ద్వైతా ద్వైతము సిద్ధాంతము చేసియుండిరికాదా?

ఉ॥ శ్రీకరభాష్యమున ద్వైతాద్వైతము కలదన్నమాట నిజమే అయినను ఆభాష్యము పేరుగాని దానియందగు ద్వైతాద్వైత సిద్ధాంతము పేరుగాని శైవ పూర్వాచార్యులలో నొక్కనిచేనైన నొక్కచోనైన నుదాహరింపబడియుండని కారణమునను దోషభూయస్త్వమునుబట్టియు అసభ్యస్తమగు శైలినిబట్టియు నాభాష్యము కేవలము నవీనమని పెక్కువిధముల నిరూపింపబడియున్నదిగాన దానిలోనిదగు ద్వైతాద్వైతము శైవుల సిద్ధాంతమనుట సమంజసముకాదు. శైవ సంఘమునకుకీర్తి దాయకంబునుగాదు.

ప్ర॥ శైవుల సిద్ధాంతము శివాద్వైతమని మాత్రము పూర్వికులలో నెవ్వరు చెప్పిరి. క్రొత్తగ మీరిప్పుడు పేరుపెట్టిన నెవ్వగంగీకరింతురు?

ఉ॥ శైవుల సిద్ధాంతమునకు శివాద్వైతమను పేరు మేము పెట్టినదికాదు. సిద్ధాంత శిఖామణి మామండల వీరభద్రసుధీరచితమైన హైయంగవీన వ్యాఖ్యానమునందు. శ్లో॥ శివాగమైః శివాద్వైతర హస్యైః పారమార్థికైః । కథ్యతే శివసిద్ధాంత తంత్రింషట్త్సల నిర్ణయం॥ అని కలదు శ్లో॥ శివాద్వైత పరిజ్ఞాన పరమానందబోధితం॥ ౭ పరి.

అని మొదలుగా శైవసిద్ధాంత గ్రంధములయందు శైవుల సిద్ధాంతము శివాద్వైతమని వ్యవహరింపబడి యున్నది. దానింబట్టి ప్రాచీనులు శివాద్వైత కల్పలతిక ఈ మొదలగు గ్రంధములయందు శైవుల సిద్ధాంతము శివాద్వైతమని

నిర్ణయించియున్నారు. దానింబట్టి మధ్యకాలికులును విద్వత్కవీంద్రులునైన శ్రీ ములుగు పాపయారాధ్యులవారును పరమశివాద్వైత పండితుండ అని వ్రాసి కొనియున్నారు. కావున శైవుల సిద్ధాంతము శివాద్వైతమనుట శైవపూర్వాచార్య సమ్మతమే.

ప్ర॥ శివాద్వైతమే యగుగాక. అద్దానిని ప్రతిపాదించు భాష్యమేది?

ఉ॥ శ్రీ నీలకంఠభాష్యమే బ్రహ్మసూత్ర భాష్యములలో శివాద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించునది యగును.

ప్ర॥ అది శ్రీకంఠభాష్యము కాదుగదా?

ఉ॥ కాదని యెవ్వరు చెప్పిరి. రెండు నొక్కటెయగు

ప్ర॥ దీనికేమి ప్రమాణము.

ఉ॥ రెండు వేర్వేరనుటకే ప్రమాణము కావలయుంగాని రెండు నొక్కటి యనుటకు నే ప్రమాణముతోను పనిలేదు. అయినను స్వాతిక బ్రహ్మ విద్యావిలాస నిరసనమను గ్రంథమున.

సీ॥ పరమశివాద్వైత పరనీలకంఠాఖ్య

ఘనభాష్యకారు శ్రీకంఠుఁబొగడి॥ అని యున్నది.

దీనింబట్టి నీలకంఠభాష్యమును రచించినది శ్రీకంఠయోగియే యనియు ఆభాష్యము శివాద్వైతమునె ప్రతిపాందించుననియు శైవమత గ్రంథకర్తల యొక్క దృఢ నిశ్చయమేయని యేర్పడియెను.

ప్ర॥ సాత్త్విక బ్రహ్మ విద్యావిలాస నిరసనకారుఁడు అట్లు వ్రాసియుండు గాక ఆయనకు శ్రీకంఠభాష్యముకన్న వేరుగా నీలకంఠభాష్యము దొరకమిచే రెండు నొకటియేయని తలంచి యట్లు వ్రాయుగాక. ఇప్పుడు సరియగు నీల కంఠభాష్యము దొరకి శ్రీకంఠభాష్యముకంటె వేరుగా ప్రత్యక్షముగాఁగన్పట్టు చుండ రెండు నొక్కటేయని మీ మామూలుమాటను మీరు చెప్పిన నెవ్వరంగీక రింతురు!

ఉ॥ అట్లేని నిది యోజింపవలసినదే. కాని సరియగు నీలకంఠభాష్యము ఎవ్వరికి దొరకెను! అది యెచ్చటనున్నది.

ప్ర॥ దొరికినసంగతి మీకు తెలియదా? శ్రీదేవిడీ జమీందారువారు మహీ శూర ప్రాంతములకేగి చాలాసొమ్ము వెచ్చించి అసలు నీలకంఠభాష్యమును తెచ్చియుండిరి కాదా?

Reg. No. April, May 1938.

# వ్యాసకర్తల కొరక మనవి.

---

ప్రాజ్ఞులారా!

శైవమతాభివృద్ధికి సాధనభూతములగు వ్యాసరాజములు మిక్కిలి యవసరము. అట్టి వ్యాసములను పండితులగువారును, లోకజ్ఞాన ధురీణులును, లోకానుభవపరులును నగువారు శ్రమజేసివ్రాసిన మతమునకు మిక్కిలి యుపకారమొనర్పగలవు. అట్టివారు మన మతమునందు వృద్ధులలోను, యువకులలోను చాలమంది గలరు. సంస్కృతాంధ్ర పురాణవిద్యా ధురంధరులగు మతస్థులగు మీరెల్లరు మిక్కిలి యభిమానముంచి, మతాభివృద్ధికై వ్యాసములను రచియించి కార్యస్థానమునకు బంప ప్రార్థితులు.

ఇట్లు,

మేనేజరు:— శైవసభాకార్యాలయము.

బందరు బుట్టాయిపేట,

C/O కే. పి. మల్లికార్జునుడు M. A., B. L.,

అడ్వొకేటు. M. L. C.







# శైవమతప్రకాశిక

ద్విమాసపత్రిక.


| సంపుటము. 1. | బహుధాన్యనామ సంవత్సర జ్యేష్ఠ, ఆషాఢమాసములు. | సంచిక. 2. |
| --- | --- | --- |


శ్లో॥ శ్రీవేదశాస్త్రార్థ తత్వప్రభాసికా। సందేహసందోహ మహానిరాసికా।
తత్వత్రయోద్బోధన సిద్ధదేశికా। జయత్వియం శైవమత ప్రకాశికా॥

బ్ర॥ శ్రీ॥ లో॥ విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు,
శైవమహాసభాధ్యక్షులు.

" కందుకూరి వటుకభైరవమూర్తిగారు బి. ఏ. వకీలు
కార్యదర్శి.

" శివలెంక లింగయ్యఅయ్యావారు రిటైర్డు పోలీసు
సబ్ ఇన్స్పెక్టరు ప్రచారకకార్యదర్శి.

" ఈశ్వరప్రగడ సదాశివశర్మగారు శివభక్తిప్రచారకులు.


సంపాదకుడు:- ఇవటూరి సానందరావుగారు.

ప్రకటన:- పింగళి వీరయ్యపంతులుగారు, బందరు.

ముద్రణ:- మినర్వా ప్రెస్, బందరు.

1938

శ్రీ శివాయగురవేనమః.

# 21 వ శైవ మహాసభానివేదిక

# రాజమహేంద్రవరము.

## 21 వ శైవమహాసభా కార్యనిర్వాహక వర్గము.

1. శ్రీలోకారాధ్యులైన విద్వాన్ సాహిత్యవిద్యాప్రవీణ
మునిగొండ వీరేశలింగశాస్త్రిగారు (వరంగల్.)
శైవమహాసభాధ్యక్షులు.

2. బ్రహ్మశ్రీ లో॥ కందుకూరి వటుకభైరవమూర్తిగారు,
బి. ఏ., వకీలు (గవర్నరుపేట.)
కార్యదర్శి.

3. బ్రహ్మశ్రీ లో॥ శ్రీపతి పండితారాధ్యుల
పట్టెసలింగారాధ్యులుగారు (బెజవాడ.)
సహాయకార్యదర్శి.

4. బ్రహ్మశ్రీ లో॥ శివలెంక శంభూప్రసాదుగారు
ఆంధ్రపత్రికా సంపాదకులు (మదరాసు)
కోశాధికారి.

5. బ్రహ్మశ్రీ లో॥ శివలెంక లింగయ్యగారు (బందరు)
రిటైర్డు పోలీసు సబ్ యిన్స్పెక్టరు, ప్రచారకకార్యదర్శి.

6. బ్రహ్మశ్రీ లో॥ ఇవటూరి సానందరావుగారు (బందరు)
శైవమత ప్రకాశికా సంపాదకులు.



దీనింబట్టి శైవపూర్వాచార్యులు ద్వైతమునందు సమ్మతిని కనబరిచినట్లు స్పష్ట మగుచున్నది.

ఇదిగాక శ్రీ శివపురాణములయందు అద్వైతము కన్పట్టుచున్నది. ప్రభు లింగలీల మొదలగు గ్రంథములయందు అద్వైతానుభవము నిరూపింపబడి యుండి నట్లు లింకే గ్రంథమునందును కన్పట్టదు. దీనింబట్టి శైవపూర్వాచార్యులలో కొందరభావము అనుభవాద్వైతమునం దభిరుచి కలిగియున్నట్లు తెల్లమగుచున్నది.

ఇది యిట్లుండ శ్రీకంఠ శివాచార్యులవారు బ్రహ్మసూత్రభాష్యమునందు విశిష్టాద్వైతం సాథయిష్యామః అని విశిష్టాద్వైతమును నిరూపించియున్నారు. దీనింబట్టి విశిష్టాద్వైతమునందును శైవపూర్వాచార్యులలో కొందరు అభిమానము కలిగియున్నట్టు విశదమగుచున్నది.

ఇట్లే వైష్ణవమతమునందును నామతమునకు పరమప్రమాణము లయిన పాంచరాత్రాగమములయందు ద్వైతమే సిద్ధాంతము సేయబడియున్నది అయి నను శ్రీ విష్ణుపురాణములయందు అద్వైతమే కన్పట్టుచున్నది. వైష్ణవమత పూర్వాచార్యులలో కొందర కద్వైతాభిమానము లేనిది విష్ణుపురాణములయందు నద్వైతము నిబద్ధమై యుండ నేరదుగదా. అట్లైనను, శ్రీరామానుజాచార్యులవారు శ్రీభాష్యమునందు విశిష్టాద్వైతమును సిద్ధాంతము చేసియున్నారు.

దీనింబట్టి శైవ వైష్ణవాదిమత పూర్వాచార్యుల యుద్దేశమేమియని యాలోచింపవలయును. వారు జ్ఞానలోపముచే యథేచ్ఛముగానట్లు నిర్ణయించి రని వచింప వీలులేదు. పూర్వాచార్యులు సామాన్యముగా జ్ఞానపరిపూర్ణులనియే యంగీకరించి తీరవలయును. అట్లుగాకున్న వీరిలో కొందరే జ్ఞానపూర్ణులనియు నిర్ణయింప నయుక్తముగాన నందరు జ్ఞానశూన్యులే యని యంగీకరింపవలసి వచ్చునుగాన దానింబట్టి మతములకే యప్రామాణ్యము వచ్చును. కావున పూర్వా చార్యుల యాశయమిదియని యంగీకరింపక తప్పదు. ఏమనిన

ద్వైతభావముతోగాని, అద్వైతభావముతోగాని, లేక విశిష్టాద్వైతభావ ముతోగాని యేభావముతోనైనను శివునినే ప్రధానముగా నుపాసింపవలయు నని శైవ పూర్వాచార్యుల యాశయము. అట్లే విష్ణునే ప్రధానముగా నుపా సింపవలయునని వైష్ణవపూర్వాచార్యుల యాశయంబు నగునని యేర్పడుచున్నది. దీనింబట్టి శైవవైష్ణవాదులు ప్రధానమతంబులును, ద్వైతాదు లుపాసనాధర్మం బులుగాన నవియట్లు ప్రధానమతంబులు కావనియు నిశ్చయమగుచున్నది.

దాననే శైవవైష్ణవాదిమతములకు పరస్పరభిన్నములగు నాచారవిశేషములు ప్రమాణసిద్ధములైయున్నవిగాని యట్లు ద్వైతాదిమతములకు నాచారవిశేషములు గన్పట్టుటలేదు దీనింబట్టి శైవవైష్ణవాదులే ప్రధాన మతములనియు, ద్వైతాదులప్రధానమతములనియు, నిర్బాధమగుచున్నది.

పూర్వకాలమున, నీభావమే స్థిరమైయుండి రాను రాను కొంతకాలమునకు నీభావము మార్పునొంది ద్వైతాదులె ప్రధానమతములనియు శైవవైష్ణవాదులె అప్రధాన మతములనియు నెన్నవలసి వచ్చుటకు కొన్ని కారణములేర్పడియెను. అందు శ్రీ శంకరాచార్యులవారి మత సంస్కరణము ప్రధానమయినది.

అది యెట్లనిన, శ్రీ శంకరాచార్యులవారు అద్వైతమే ప్రధానమతమనియు శైవవైష్ణవాదులె అప్రధాన మతములనియు సిద్ధాంతము చేసియుండిరి. వారికామార్గము నవలంబించుటన్న నింకొండుమార్గము కార్యసాధకము కాదు.

ఏలన, వారు సిద్ధాంతముసేయు కాలమున శైవాది షణ్మతములును నెక్కువ ప్రచారమున నున్నవి. దీనికి ఆనందగిరికృత శంకరవిజయమే నిదర్శనము. వారు తమ మతమునకు శైవాది షణ్మతములలోనిదగు నేదేనొక నామము నిర్దేశింప వీలులేదు. అట్లైని కడమయైదు మతములవారును విరోధింతురు. అప్పుడన్ని మతములవారిని సమావర్జనము చేయుటకు వీలు లేకపోవును. కావున సర్వమతస్థులను స్వమతమున జేర్చుకొనుటకు నాయా మతములకు బాధకముగాని సామాన్య నామకరణము గావించుటయే యావశ్యకము. దానంజేసి స్వమతమునకు నద్వైతమనియే నామకరణము గావింపబడియెను. అద్వైతమను పేరు సామాన్యముగ భేదమనుదానినె నిర్మూలనము చేయును గాన, మతభేదములను పాటింపనియ్యకుండుట వింతగాదు. దీనింబట్టి యీ పేరు మతభేదముల నణచి సకల మతములను సమగసము చేయ ననుకూలముగా నున్నది.

అట్లైని- ఈపద్ధతి నప్పటివారెట్లు విశ్వసించిరని యడుగుదురేని లోకోపకారమునకై యట్టు లంగీకరింపవలసివచ్చెను ఏలన.

శ్రీ శంకరాచార్యులవారు స్వమత సిద్ధాంతము సేయునాటికి నీలోకమంతయు శైవవైష్ణవాది మతకలహములచే నల్లకల్లోలముగా నున్నది. ఎట్లన.

శివయను శబ్దమును వైష్ణవులుచ్చరింపరు. విష్ణుఅను శబ్దమును శైవులు వినరు. శైవులు విష్ణుని పూజింపరు. వైష్ణవులు శివనివంక జూడరు. వైష్ణవులను

శైవులు గ్రామములోనికి రానీయరు. శైవులను వైష్ణవులు దేశమునుండి వెడల వడతురు. లోకమిట్టి సంకటస్థితియందుండి సంస్కరణము నపేక్షించుచుండెను. ఆయదనున శ్రీ శంకరాచార్యుల వారవతరించి శివకేశవులకు భేదములేదని యుపదేశింప నారంభించిరి.

వారికి స్వసిద్ధాంతమునుబట్టి యించుకలేని భేదము శివకేశవులయెడ నెట్లుండును? అంతదనుక మతకలహములచే విసుగునొందియున్న వారికి నీవాదము మిగుల రుచింపజొచ్చెను. దానింబట్టి తండోపతండములుగ జనులు చుట్టుమూగిరి. అప్పుడాచార్యులవారు వారికిట్లు బోధించిరి.

శివుడనినను, విష్ణుఁడనినను నొక్కఁడే. ఇద్దఱకు భేదములేదు. కావున శివుని, కేశవుని, శక్తిని, గణపతిని, గ్రహపతిని నందఱను పూజింపుడు. అట్లుగాక, వీరిలో నొక్కనియందు మీకెక్కుడు భక్తికలదేని నద్దేవుని నడుమనిడి తక్కువారిని పరివారములోఁ జేర్పుడు. అని బోధించిరి. ఆబోధ జనులకు తృప్తికరముగా నుండెను.

దేవతలు మనము కల్పించినవారేగాన వారిలో నెవ్వని ప్రధానపీఠ మెక్కించినను, మరియెవ్వరిని పరివారమున నిల్చుండబెట్టినను ఇది యంతయు మన యధికారములోనిదే యని వారి యూహ.

అది యెట్లైన నుండుగాక, ఎక్కువ మతాభిమానముగల యాకాలమున నీబోధ ప్రజల కెట్లురుచించెనని యడుగుదురేని ప్రజలకుగల మతాభిమానము, దేవతాభిమానము అద్వైతబోధతో నస్తమించి యుండెను. అద్వైత సిద్ధాంతమునందు తత్త్వము నిర్గుణమేగాని సగుణము కానేరదు. వ్యవహారమున సగుణ మంగీకరింపఁబడినను అది యుపాసనకొఱకు కల్పింపబడినదిగాన ఎంతమాత్రము సత్యమైనదిగాదు. దీనింబట్టి జగముయొక్క నామరూపములవలె దేవునియొక్క నామరూపములును కల్పితములేగాని నిజము కానేరవు. ఇట్లు శివకేశవాదులయొక్క నామములు, రూపములును కల్పితములై నిజము కానప్పుడు ఈ నిజము తెలిసినవారికి దేవతలయొక్క నామముల మీదగాని, రూపములమీదగాని వృథాభిమాన మెట్లుండును? ఇఁక నద్దేవతల నామరూపములనుగూర్చి కలహమేల ప్రవర్తించును?

ఈకారణమున శైవ వైష్ణవ సంఘాది మహానదులు చాలవఱకు అద్వైత మహాసముద్రమునం దస్తమించినవి.

వెనుకఁ జెప్పిన విధమున పంచాయతనమునందు శివుని ప్రధానముగా నుపాసించినదది శైవము, విష్ణుని ప్రధానముగా నుపాసించిన నది వైష్ణవము. ఇట్టివి యన్నియు నద్వైతమున నంతర్భూతములు. అద్వైతము ప్రధానమైనది. ఇట్లు అద్వైతము ప్రధాన మతమనియు, శైవము, వైష్ణవము మున్నగునవి యైచ్ఛికములుగాన నవియట్లు ప్రధానములు కావనియు నప్పుడేర్పడియెను.

దానింబట్టి కొంతకాలము గడచినమీద నవతరించిన శ్రీరామానుజాచార్యులవారు స్వమతమునకు విశిష్టాద్వైతమని నామకరణము గావించిరి. వారికదియు నావశ్యకమయ్యెను. ఏలన, తమ మతము వైష్ణవమని చెప్పినంత మాత్రమున అద్వైతమునకు ప్రతిద్వంద్వి కానేరదు. వైష్ణవంబును అద్వైతమునకు నంతర్భూతమై బాధకము కానందున వైష్ణవమనఁగనే అదిమాకు నిష్టమేయని యద్వైతులనుమోదింతురుగదా? అట్లుగాక విశిష్టాద్వైత మనునెడ నద్వైతులంగీకరింపరు. అప్పుడద్వైతమును ఖండింప ననువగును. కావున స్వమతము ప్రధానముగా వైష్ణవమే యయినను విశిష్టాద్వైతమను నామకరణము గావించుకొనుట వారికి విధియయ్యెను.

తరువాత మధ్వాచార్యులవారు వెల్వడి తమ మతము రెండిటికి వేరుగా ద్వైతమని సిద్ధాంతముసేసిరి. అట్లుగానిచో వారికి మతమే యేర్పడకపోవును. ఏలన, వారిది వైష్ణవమతమే కావున వైష్ణవమనఁగనే రామానుజమతమునను యంతర్ధానము చెందియుండునుగదా? ఇట్లు మధ్వాచార్యులది వైష్ణవమతమే యయినను వేరుగా తమ మతము నిలువఁబెట్టుకొనుటకు తమ మతమునకు ద్వైతమని నామకరణము గావించికొనుట యావశ్యకమయ్యెను.

ఈవిధమున పెక్కుకారణములచే ద్వైతాది మతములె ప్రధానములుగను శైవవైష్ణవాది మతములె యప్రధానములుగను పరిణమించుట సంభవించెను. శైవము ప్రధానమతమే యైనను తరువాత జరిగిన మార్పునుబట్టి శైవుల మతము ద్వైతమా, అద్వైతమా? అనుశంక కవకాశము కలుగుచున్నది. ఇంతియేగాని నిజమునుబట్టి యిట్టి శంక కవకాశములేదు. అయినను తక్కుమతముల వారితో పాటు శైవులదియు ద్వైతమో అద్వైతమో అను నిర్ణయము అవసరమను భావము కొందఱకు గలదుగాన వారి యాశయమును బట్టియు, ఇప్పటికి దొరికిన ప్రమాణములను బట్టియు నిట్లు నిర్ణయింపవలసివచ్చుచున్నది.

శైవులంగీకరించిన సిద్ధాంతమునకు శివాద్వైతమని పేరు.

ప్ర॥ అదియెట్లు? శ్రీ శివాగమములయందు ద్వైతమే సిద్ధాంతముసేయ

బడి యుండెననియు శ్రీ మల్లికార్జున పండిత స్వాములవారిచేతను శ్రీహరదత్తాచార్యులచేతను అద్వైతము ఖండించి ద్వైతమే సిద్ధాంతము సేయబడియెననియు మీరు చెప్పియుంటిరిగదా? ఇక శివాద్వైతము శైవుల సిద్ధాంతమెట్లగు?

ఉ॥ శ్రీ మల్లికార్జున పండిత ప్రభృతులు అద్వైతమును ఖండించినది నిజము. అయినను వారు ఖండించినది శుద్ధాద్వైతముగాని, శివాద్వైతముకాదు.

ప్ర॥ ఈయంశమెట్లు తెలియును?

ఉ॥ శివతత్త్వసారము,

క॥ తనకంటె వేరెయీశ్వరుఁడన లేడని పలుకునట్టి యద్వైతవిమూ
ఢునకును లోకాయతునకు వినఁగా భేదమ్ముగలదె విష్ణువరేశా।
అని యనేకవిధముల శుద్ధాద్వైతమును ఖండించికొనను,

క॥ అద్వైతైకస్థితి నీయద్వైతమకాన యీశ్వరాద్వైతము స
ర్వాద్వైతమనగ వేరు జగద్విపరీతమగు తత్త్వగతిగలదె శివా॥

శాస్త్రములయందు జెప్పబడు నద్వైతము ఈశ్వరాద్వైతమనగా శివాద్వైతమేయనియు సర్వాద్వైతమనగ శుద్ధాద్వైతము అయ్యది శివాద్వైతముకంటె వేరు భిన్నమైనదనియు నిర్ణయించి యున్నారు.

ప్ర॥ అగుగాక వారు శుద్ధాద్వైతమును ఖండించి సిద్ధాంతము సేసినది ద్వైతమేయని చెప్పియుంటిరి. తిరిగి వారు శివాద్వైతమునెట్లు సిద్ధాంతము సేసియుండిరి?

ఉ॥ శ్రీమల్లికార్జునపండితులవారు మొదట నిరూపించిన ద్వైతసిద్ధాంతమునకును, కొనకు దెలిపిన శివాద్వైతమునకును నెంతమాత్రము భేదము లేదు. అట్లు భేదముండునెడ స్వవచనవ్యాఘాతముగా వారట్లేల చెప్పియుందురు? కావున పూర్వాచార్యుల వాక్యమందు విశ్వాసముంచవలయునుగాని సంశయము పెట్టికొనగూడదు. అట్లు సంశయము పెట్టుకొనినవానికి శ్లో॥ సంశయాత్మా వినశ్యతి నష్టముకలుగుననియు చెప్పబడియున్నది

ప్ర॥ శివాద్వైతమని పేరేల పెట్టవలయును? కేవలము ద్వైతమనిన జాలదా?

ఉ॥ చాలదు. అదియేలన- శుద్ధాద్వైతము శ్రీమల్లికార్జున పండిత శ్రీహరదత్తాదులచే ఖండింపఁబడియున్నది గాన నది శైవుల సిద్ధాంతముకాదు. కావున శివాద్వైతమే శైవుల సిద్ధాంతమని యంగీకరింపవలయును.

ప్ర॥ ప్రభులింగలీలయందును మఱికొన్ని శైవమత గ్రంథముల యందును శుద్ధాద్వైతము నిరూపింపఁబడియుండఁగా నది శైవుల సిద్ధాంతమెట్లుగాదు?

ఉ॥ శైవమత గ్రంథములయందు॥ జెప్పఁబడినది శివాద్వైతమే. అట్లుగాక కొన్నిచోట్ల శుద్ధాద్వైత సిద్ధాంతము ప్రతిపాదింపఁబడియున్నను అది శైవ పూర్వాచార్యులచే ఖండింపఁబడియున్నదిగాన శైవుల సిద్ధాంతమని యంగీకరింపకూడదు.

ప్ర॥ శైవమత గ్రంథములయందు కొన్నిచోట్ల శుద్ధాద్వైతమును నిబంధించినవారును శైవపూర్వాచార్యులేగాన వీరియందు విశ్వాసముంచి శుద్ధాద్వైతమునె యేలగ్రహింపకూడదు?

ఉ॥ శుద్ధాద్వైతమును కొన్ని గ్రంథములయందు శైవపూర్వాచార్యులే నిబంధించి యుందురుగాక. అయినను శైవమతప్రతిష్ఠాపనా పరమాచార్యులగు శ్రీ నీలకంఠాచార్య శ్రీహరదత్తాచార్య శ్రీ మల్లికార్జున పండిత ప్రభృతులు శుద్ధాద్వైతమును నిరాకరించి యున్నప్పుడు దానిని స్వసిద్ధాంతమునుగా గ్రహింపకూడదు.

ప్ర॥ శుద్ధాద్వైతమును నిరూపించినవారె శైవమత ప్రతిష్ఠాపకులని యేల గ్రహింపగూడదు?

ఉ॥ శుద్ధాద్వైతమును నిరూపించినవారు మధ్యకాలికులు. శివపురాణములలో గొన్నిటియందు శుద్ధాద్వైతము కలదని దానినెనమ్మి వారు తమగ్రంథములయందు చేర్చియుండవచ్చును. అట్లుగాక అద్వైతబోధ లోక మంతయునిండి సర్వమతస్థులను నావరించియున్నదిగాన మధ్యకాలికులు కొందరు అద్వైతానుభవమున నాసక్తిగలవారై యుండి యద్దానిని తమ గ్రంథములయందు జేర్చినను చేర్చియుండవచ్చును. అంతమాత్రమున వీరి వాక్యములనె నమ్మి శైవమతమూలాచార్యులు చేసిన సిద్ధాంతమును త్రోసివేయనగునా? కూడదు

ప్ర అట్లని వీరిగ్రంథములను ప్రమాణములుగా నెట్లు తీసికొనవచ్చును?
ఉ॥ కడమ యంశములయందు ప్రమాణములుగా బాగుగ గ్రహింపవచ్చును
ప్ర॥ అదియెట్లు? ఇది అర్ధజరతీ న్యాయముకాదా?

ఉ॥ కాదు అదియెట్లనిన ఆపస్తంబుడు ఆశ్వలాయనుడు మొదలగు ఋషులందరు ద్వైతమునె సిద్ధాంతముచేసి అద్వైతమును ఖండించియున్నారు. అయినను అద్వైతమతస్థులు ద్వైతసిద్ధాంతాంశమున వారి గ్రంథములయందు

ప్రామాణ్యబుద్ధి లేకున్నను కర్మములను జెప్పు తక్కిన |యంశములయందు ప్రామాణ్యబుద్ధి లేకుండు నెడ బ్రాహ్మణ్యమునకే హానివచ్చుననియెంచి ఆయంశమున పరమప్రామాణ్యబుద్ధి నుంచియె యున్నారు. అట్లే మధ్యకాలికులు చేసిన శైవ మతగ్రంధములయందును శుద్ధాద్వైతమును నిరూపించినచోట నప్రామాణ్యంబును కడమయంశములయందు పరమప్రామాణ్యంబును నుంచిన నేమి భాధకము? ఏమియు బాధకములేదు.

ప్ర॥ ద్వైతాద్వైతమే శైవుల సిద్ధాంతమని యేల గ్రహింపగూడదు!

ఉ॥ పూర్వాచార్యులట్లు దెలిపియుండిన బాగుగ గ్రహింప వచ్చును. పూర్వాచార్యులే గ్రంధమునందైనను ద్వైతాద్వైతమును సిద్ధాంతముచేసియుండ లేదు ద్వైతాద్వైతము శైవుల సిద్ధాంతమనియు జెప్పియుండలేదు. కావున ద్వైతాద్వైతము శైవుల సిద్ధాంతముగాదు

ప్ర॥ అదియేమి? శ్రీపతి పండితస్వాములవారు శ్రీకరభాష్యమున ద్వైతాద్వైతము సిద్ధాంతము చేసియుండిరికాదా?

ఉ॥ శ్రీకరభాష్యమున ద్వైతాద్వైతము కలదన్నమాట నిజమే అయినను ఆభాష్యము పేరుగాని దానియందగు ద్వైతాద్వైత సిద్ధాంతము పేరుగాని శైవ పూర్వాచార్యులలో నొక్కనిచేనైన నొక్కచోనైన నుదాహరింపబడియుండని కారణమునను దోషభూయిస్త్వమునుబట్టియు అసభ్యస్తమగు శైలినిబట్టియు నాభాష్యము కేవలము నవీనమని పెక్కువిధముల నిరూపింపబడియున్నది గాన దానిలోనిదగు ద్వైతాద్వైతము శైవుల సిద్ధాంతమనుట సమంజసముకాదు. శైవ సంఘమునకుకీర్తి దాయకంబును గాదు.

ప్ర॥ శైవుల సిద్ధాంతము శివాద్వైతమని మాత్రము పూర్వికులలో నెవ్వరు చెప్పిరి. క్రొత్తగ మీరిప్పుడు పేరుపెట్టిన నెవ్వరంగీకరింతురు?

ఉ॥ శైవుల సిద్ధాంతమునకు శివాద్వైతమను పేరు మేము పెట్టినదికాదు. సిద్ధాంత శిఖామణి మామందల వీరభద్రసుధీరచితమైన హైయంగవీన వ్యాఖ్యానమునందు. శ్లో॥ శివాగమైశ్శివాద్వైతర హస్యైః పారమార్థికైః । కథ్యతే శివసిద్ధాంత తంత్రింపష్టస్థల నిర్ణయం॥ అని కలదు శ్లో॥ శివాద్వైత పరిజ్ఞాన పరమానందబోధితం॥ ౮ పరి.

అని మొదలుగా శైవసిద్ధాంత గ్రంధములయందు శైవుల సిద్ధాంతము శివాద్వైతమని వ్యవహరింపబడి యున్నది. దానింబట్టి ప్రాచీనులు శివాద్వైత కల్పలతిక ఈ మొదలగు గ్రంధములయందు శైవుల సిద్ధాంతము శివాద్వైతమని

నిర్ణయించియున్నారు. దానింబట్టి మధ్యకాలికులును విద్వత్కవీంద్రులునైన శ్రీ ములుగు పాపయారాధ్యులవారును పరమశివాద్వైత పండితుండ అని వ్రాసికొనియున్నారు. కావున శైవుల సిద్ధాంతము శివాద్వైతమనుట శైవపూర్వాచార్య సమ్మతమే.

ప్ర॥ శివాద్వైతమే యగుగాక. అద్దానిని ప్రతిపాదించు భాష్యమేది?

ఉ॥ శ్రీ నీలకంఠభాష్యమే బ్రహ్మసూత్ర భాష్యములలో శివాద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించునది యగును.

ప్ర॥ అది శ్రీకంఠభాష్యము కాదుగదా?

ఉ॥ కాదని యెవ్వరు చెప్పిరి. రెండు నొక్కటెయగు

ప్ర॥ దీనికేమి ప్రమాణము.

ఉ॥ రెండు వేర్వేరనుటకె ప్రమాణము కావలయునుగాని రెండు నొక్కటి యనుటకు నే ప్రమాణముతోను పనిలేదు. అయినను సాత్విక బ్రహ్మ విద్యా విలాస నిరసనమను గ్రంథమున.

సీ॥ పరమశివాద్వైత పరనీలకంఠాఖ్య
ఘనభాష్యకారు శ్రీకంఠుఁబొగడి॥ అని యున్నది.

దీనింబట్టి నీలకంఠభాష్యమును రచించినది శ్రీకంఠయోగియే యనియు ఆభాష్యము శివాద్వైతమునె ప్రతిపాందించుననియు శైవమత గ్రంథకర్తల యొక్క దృఢ నిశ్చయమేయని యేర్పడియెను.

ప్ర॥ సాత్విక బ్రహ్మ విద్యావిలాస నిరసనకారుఁడు అట్లు వ్రాసియుండదు గాక అయినను శ్రీకంఠభాష్యముకన్న వేరుగా నీలకంఠభాష్యము దొరకమిచే రెండు నొకటియేయని తలంచి యట్లు వ్రాయుగాక. ఇప్పుడు సరియగు నీలకంఠభాష్యము దొరకి శ్రీకంఠభాష్యముకంటె వేరుగా ప్రత్యక్షముగాఁగన్పట్టుచుండ రెండు నొక్కటేయని మీ మామూలుమాటను మీరు చెప్పిన నెవ్వరంగీకరింతురు!

ఉ॥ అట్లైన నిది యోజింపవలసినదే. కాని సరియగు నీలకంఠభాష్యము ఎవ్వరికి దొరకెను! అది యెచ్చటనున్నది.

ప్ర॥ దొరికినసంగతి మీకు తెలియదా? శ్రీదేవిడీ జమీందారువారు మహీశూరు ప్రాంతములకేగి చాలాసొమ్ము వెచ్చించి అసలు నీలకంఠభాష్యమును దెచ్చియుండిరి కాదా?

ఉ॥ ఆసంగతి మేమును వినియున్నాము. శ్రీవారు తాముసంపాదించిన భాష్యమును ప్రకటించి సంశయము దీర్తురని చాలాకాలమునుండి నిరీక్షించు చుంటిమి. కాని వారు సంశయముందీర్పరైరి దానింబట్టి నీలకంఠభాష్యము వేరుగానున్నదని యెట్లు నిశ్చయింపనగును?

ప్ర॥ ఆసంశయము దీరవప్పుడు రెండు నొక్కటియని మాత్రమెట్లు నిర్ణయింప ననువగును?

ఉ॥ వీలులేదు. కావున చేయునదిలేక మేమును మరికొంత శ్రమముచేసి శ్రీవారు సంపాదించిన నీలకంఠభాష్యమును సంపాదించుటయుగాక అది యేర్పడుటకుఁ గారణమైన మూలచరిత్రముగూడ సంపాదించితిమి. దానింబట్టి మాకా సంశయము తొలంగెను.

ప్ర॥ అందఱ సంశము తీరవలసిన పనిలేదా?

ఉ॥ తీరవలసినదె కావున ఆభాష్యమును ఎవ్వరు మార్పుచేసిరో ఎవ్వరు చేయించిరో? వీరు చేసినమార్పు ఎంతరమ్యముగా నున్నదో. వారెంతమార్పు చేసినను గ్రంధమొక్కటియేయని యెట్లుతేలుచున్నదో ఆయంశమంతయు సమగ్రకముగా రాబోవుపత్రికయందు ప్రకటింపఁబడగలదు.

ప్ర॥ భాష్యములు రెండు నొక్కటియే యగుగాక. అందు విశిష్టాద్వైతము సిద్ధాంతము చేయఁబడినట్లు ప్రసిద్ధముగానుండ నాభాష్యము శివాద్వైతమును ప్రతిపాదించుచున్నదని యెట్లు విశ్వసింపవలయును?

ఉ॥ స్వాతిక బ్రహ్మవిద్యావిలాస నిరసనకారుఁడు మొదలగు ప్రాచీన శైవపండితులయొక్క మాటనుబట్టియే. మరియు విశిష్టాద్వైతమనుమాట శివాద్వైతమను దానికి సమానార్థకమే గాని భిన్నార్థకముకానేరదు.

ప్ర॥ అదియెట్లు?

ఉ॥ నీలకంఠభాష్యము ద్వితీయాధ్యాయమున! చిదచిత్ప్రపంచ విశిష్టశ్శివఏవాద్వితీయం కారణం కార్యంచ భవతీతి విశిష్టశివాద్వైతం అనికలదు. దీనింబట్టి విశిష్ట శివాద్వైతమన్నను విశిష్టాద్వైతమన్నను నొక్కటియేయని తెలియుచున్నది. శ్రీకంఠభాష్యము శివాద్వైత ప్రతిపాదకమని శైవపండితులు నిర్ణయించినదేగాక విమతపండితులగు శ్రీహాలాస్యనాధశాస్త్రిగారును శ్రీకంఠభాష్యముయొక్క యుపోద్ఘాతమునందు శివాద్వైతపరమని వ్రాసియున్నారు. ఇట్లు

స్వమతపండితులును విమతపండితులును నేకగ్రీవముగాఁ జెప్పినయర్థమందును మీసంశయము దీరదేని ఇఁక నద్దానిఁదీర్ప బ్రిహ్మకైన నలవిగాదు గాన నింతటితో ముగించుచున్నాము. దీనిఁబట్టి శైవులవలంబించిన సిద్ధాంతము శివాద్వైతమేయనియు దానింబ్రతిపాదించునది శ్రీకంఠభాష్యమే యనియు నీ యర్థము పురాతనాధునాతన సకల శైవపండిత సమ్మతమనియు నిర్ణయింపఁబడియెను.

ఇట్లు,

మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రి,

తెనాలి.

---

## చందాదారులకు విజ్ఞప్తి.

———:O:———

మహాశయులారా!

శైవమత ప్రకాశికను వెంటనే తమ చందాలను నతి శీఘ్రకాలమున బంపుటయేగాక, క్రొత్తగా చందాదారులను విశేషముగా చేర్పించి, నిరంతరము నీ పత్రిక సాగుచుండుటకు మిక్కిలి ప్రయత్నించవలెనని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

పత్రికా సంపాదకుడు.



Reg. No. April, May 1938.

# వ్యాసకర్తల కొఱకు మనవి.

ప్రాజ్ఞులారా!

శైవమతాభివృద్ధికి సాధనభూతములగు వ్యాసరాజములు మిక్కిలి యవసరము. అట్టి వ్యాసములను పండితులగువారును, లోకజ్ఞాన ధురీణులును, లోకానుభవపరులును నగువారు శ్రీమజ్జేసి(వ్రాసిన) మతమునకు మిక్కిలి యుపకారమొనర్పగలవు. అట్టివారు మన మతమునందు వృద్ధులలోను, యువకులలోను చాలమంది గలరు. సంస్కృతాంధ్ర హూణవిద్యా ధురంధరులగు మతస్థులగు మీరెల్లరు మిక్కిలి యభిమానముంచి, మతాభివృద్ధికై వ్యాసములను రచియించి కార్యస్థానమునకు బంప ప్రార్థితులు.

ఇట్లు,

మేనేజరు:— శైవసభాకార్యాలయము.

బందరు బుట్టాయిపేట,

C/O కే. పి. మల్లికార్జునుడు M. A., B. L.,

అడ్వొకేటు. M. L. C.

శ్రీ శివాయగురవే నమః.

# 21 వ శైవ మహాసభా నివేదిక

# రాజమహేంద్రవరము.

## 21 వ శైవమహాసభా కార్యనిర్వాహక వర్గము.

1. శ్రీలోకారాధ్యులైన విద్వాన్ సాహిత్యవిద్యాప్రవీణ
ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు (వరంగల్.)
శైవమహాసభాధ్యక్షులు.

2. బ్రహ్మశ్రీ లో॥ కందుకూరి వటుకభైరవమూర్తిగారు,
బి. ఏ., వకీలు (గవర్నరుపేట.)
కార్యదర్శి.

3. బ్రహ్మశ్రీ లో॥ శ్రీపతి పండితారాధ్యుల
పట్టెసలింగారాధ్యులుగారు (బెజవాడ.)
సహాయకార్యదర్శి.

4. బ్రహ్మశ్రీ లో॥ శివలెంక శంభూప్రసాదుగారు
ఆంధ్రపత్రికా సంపాదకులు (మదరాసు)
కోశాధికారి.

5. బ్రహ్మశ్రీ లో॥ శివలెంక లింగయ్యగారు (బందరు)
రిటైర్డు పోలీసు సబ్ యిన్స్పెక్టరు, ప్రచారకకార్యదర్శి.

6. బ్రహ్మశ్రీ లో॥ ఇవటూరి సానందరావుగారు (బందరు)
శైవమత పత్రికాశిఖా సంపాదకులు.



## సభ్యులు.

7. బ్రహ్మశ్రీ లో॥ ఇజ్జతాసార్ శ్రీరాజా
కందుకూరి బాలసూర్యప్రసాదరావు బహద్దర్
జమీందారుగారు (దేవిడి.)

8. బ్రహ్మశ్రీ లో॥ శివలెంక అమృతలింగం అయ్యవారు
(తోట్లవల్లూరు)

9. బ్రహ్మశ్రీ లో॥ శ్రీ కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడుగారు
యం. ఏ., బి. యల్., యం. యల్. సి. అడ్వొకేటు (బందరు)

10 బ్రహ్మశ్రీ లో॥ కాశీనాథుని వీరేశలింగం అయ్యవారు (బందరు)

11. బ్రహ్మశ్రీ లో॥ శివలెంక పున్నయ్యగారు బి.ఏ., వకీలు (గుడివాడ)

12. బ్రహ్మశ్రీ లో॥ మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారు
(పమిడిముక్కల)

13. బ్రహ్మశ్రీ లో॥ ఇవటూరి బుచ్చిసోమన్నయ్యవారు,
(విజయనగరము)

14 బ్రహ్మశ్రీ లో॥ సింగరాజు సుబ్రహ్మణ్యంపంతులుగారు
డిస్ట్రిక్టుకోర్టు శిరస్తాదారు, (రాజమండ్రి)

15 బ్రహ్మశ్రీ లో॥ చాగంటి మల్లికార్జునరావుగారు, (కాకినాడ)

16. బ్రహ్మశ్రీ లో॥ ఇవటూరి సుబ్బారావుగారు
(కొత్తపల్లి అగ్రహారం.)

17. బ్రహ్మశ్రీ లో॥ ములుగు బుచ్చయ్యఅయ్యవారు,
(సికింద్రాబాదు.)

18. బ్రహ్మశ్రీ లో॥ ముదిగొండ వీరభద్రారాధ్యులవారు,
(నందిగామ.)

---

## శైవమతప్రచారకులు.

19. బ్రహ్మశ్రీ ఈశ్వరప్రగడ సదాశివశర్మగారు, (భీమవరం)
నందిగామ తాలూకా.

## వ్యాసపరిష్కర్తల సంఘము.

1. బ్రహ్మశ్రీ లో॥ మహోపాధ్యాయ
ముదిగొండనాగలింగశాస్త్రిగారు (తెనాలి)
అధ్యక్షులు.

2. బ్రహ్మశ్రీ లో॥ ముదిగొండ రామలింగశాస్త్రిగారు (ఈమని)
కార్యదర్శి.

3. బ్రహ్మశ్రీ లో॥ కందుకూరి వటుకభైరవమూర్తిగారు వకీలు,
(బెజవాడ.)

4. బ్రహ్మశ్రీ లో॥ మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారు,
(పమిడిముక్కల)
సభ్యులు.

---

## కేంద్ర సభలు.

1 వ సభ బెజవాడ బ్రహ్మశ్రీ లో॥ కందుకూరి
వటుక భైరవమూర్తిగారు (బెజవాడ)
అధ్యక్షులు.
బ్రహ్మశ్రీ లో॥ ముదిగొండ కోటయ్య
శాస్త్రిగారు (ఈమని)
కార్యదర్శి.

2 వ సభ రాజమండ్రి బ్రహ్మశ్రీ లో॥ సింగరాజు సుబ్రహ్మణ్యం
పంతులుగారు (రాజమండ్రి)
అధ్యక్షులు.
బ్రహ్మశ్రీ లో॥ చాగంటి
సుబ్బారాయుడుగారు (రాజమండ్రి)
ఉపాధ్యక్షులు.

బ్రహ్మశ్రీ లో॥ మల్లంపల్లి అచ్యుత
లింగంగారు (కొవ్వూరు)
బ్రహ్మశ్రీ లో॥ ఇవటూరి సుబ్బారావు
పంతులుగారు (కొత్తపల్లి)
జాయింటు కార్యదర్శులు.

3 వ సభ విజయనగరము బ్రహ్మశ్రీ లో॥ ఇవటూరి
బుచ్చిసోమన్నయ్యవారు (విజయనగరము)
అధ్యక్షులు.
చాగంటి మల్లికార్జునరావుగారు (కాకినాడ)
కార్యదర్శి.

4 వ సభ వరంగల్ బ్రహ్మశ్రీ లో॥ శివపురపు
మల్లనారాధ్యులవారు (వరంగల్)
అధ్యక్షులు.
బ్రహ్మశ్రీ లో॥ శివదేవుని వీరభద్రశాస్త్రిగారు
బ్రహ్మశ్రీ లో॥ చాగంటి భాస్కరలింగ
శాస్త్రిగారు
జాయింటు కార్యదర్శులు.

---

## 21 వ రాజమహేంద్రవర సభలోని యుపన్యాసకులు.

1. బ్రహ్మశ్రీ లో॥ సింగరాజు సుబ్రహ్మణ్యంపంతులుగారు
స్వాగతోపన్యాసము.
2. సభాధ్యక్ష ప్రారంభోపన్యాసము.
శైవమతప్రాచీనత, శైవమతవ్యాప్తి, శివదీక్ష, అష్టావరణములు.
3. బ్రహ్మశ్రీ లో॥ ఇజ్జతాసార్ శ్రీరాజా కందుకూరి బాలసూర్య
ప్రసాదరావు బహద్దర్ జమీందారుగారు
శైవసభాభ్యుదయము, షట్స్థలములనుగురించి.

4. బ్రహ్మశ్రీ లో॥ మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారు
శ్రీమహావిష్ణువు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, అర్జునుడు మొదలగువారెల్లరు శివభక్తులు.

5. బ్రహ్మశ్రీ లో॥ ఇవటూరి సుందరరావుగారు
శివభక్తి.

6. బ్రహ్మశ్రీ లో॥ మహోపాధ్యాయ
ముదిగొండ నాగలింగశాస్త్రిగారు
శైవసిద్ధాంతము.

7. బ్రహ్మశ్రీ లో॥ ఇవటూరి సుందరరావుగారు
వైదికమతాదర్శనము, అవైదిక మతాదర్శనము.

8. బ్రహ్మశ్రీ లో॥ మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారు
తత్త్వత్రయమును గురించి, సంస్కృతోపన్యాసము.

9. బ్రహ్మశ్రీ లో॥ ఈశ్వరప్రగడ సదాశివశర్మగారు
ఈశ్వరభక్తి, శివమహిమము.

10. బ్రహ్మశ్రీ లో॥ పఠానేని జోగివంతులుగారు బి ఏ.,
శివపారిశస్త్యము.

11. బ్రహ్మశ్రీ లో॥ కాశీనాధుని వీరేశలింగం అయ్యావారు
శైవసభాభ్యుదయము, విద్యాపీఠములు.

12. బ్రహ్మశ్రీ లో॥ బుద్ధిరాజు హనుమంతరావుగారు
శైవసభాపరిపాలనాక్రమము.

13. శ్రీమతి కాకి పుష్పావతమ్మగారు
శివోత్కర్ష, శైవలాంఛనములయొక్క అంతరార్థములు.

14. సభాధ్యక్షుని యంత్యోపన్యాసము.
శైవసభాకార్యక్రమసంగ్రహము, శైవమతాభివృద్ధికి సాధనోపాయములు.



# శైవమతప్రకాశిక.

## 21 వ శైవమహాసభా కార్యక్రమము.

### గత 20 సభలయొక్క వృత్తాంత సంగ్రహము.

మన శ్రౌతశైవమునందు, విద్యాభివృద్ధి, మతధర్మబోధ మొదలగు సంఘోద్ధరణ కార్యములద్వారా శైవమతాభ్యుదయమును కలుగజేయదలచి యట్టి యభ్యుదయమునకు శైవసాంఘికుల యావన్మంది తోడ్పాటులేనిదే మతోద్ధరణ జరుగుట యసంభవమనితలంచి మతాభిమానధనులగు మనలో పెద్దలు కొందరు శైవసాంఘికులందరిని నొక్కచోట సమావేశపరుచుటకు ప్రప్రథమమున 1909 సం॥ లో సంకల్పించిరి. అంతకుముందు యితరమతస్థులును కులస్థులును మతాభ్యుదయముకొరకున్ను, కులాభ్యుదయముకొరకున్ను, మతసభలను కులసభలను జేయుచుండిరి దానినిజూచి మనసాంఘికులనుగూడ, మంచిదశలోనికి దెచ్చుటకు మహాసభ యొకటి యావశ్యకమని మనలో గొందరు తలంచిరి. అట్లు ప్రప్రథమున తలంచిన వారి నామములను బేర్కొనుచున్నాను 1 ముదిగొండ నాగలింగశాస్త్రిగారు సికిందాబాదు. 2 కొంపల్లి కోట్లింగంపంతులుగారు బి. యె., బి యల్. హైకోర్టు వకీలు గుంటూరు. 3 ముదిగొండ నందికేశ్వరశాస్త్రిగారు గుంటూరు. 4 ముదిగొండ వీరభద్రయ్యఅయ్యవారు తాడికొండ. 5 సింగరాజు వెంకటసుబ్బారావుగారు బెజవాడ. 6 ముదిగొండ చంద్రమౌళిశాస్త్రిగారు తెనాలి. 7 కాశీనాధుని బ్రహ్మయ్యలింగశాస్త్రిగారు బందరు. వీరలేగాక శివలెంక అమృతలింగంఅయ్యవారు. కాశీనాధుని వీరేశలింగంఅయ్యవారు మున్నగు మరికొందరు కూడ గలరు. వారలకు అట్టి సత్సంకల్పముకలిగిన వెంటనే సౌమ్యనామ సం॥ చైత్ర బ ౭ సోమవారము అనగా 1909 సం॥ యేప్రియలు నెలలో శైవసాంఘికుల యావన్మందికిని కరపత్రములద్వారా తమయభిప్రాయమును దెలియపర్చుటయేగాక ది 2-6-1909 వ తేదీన బెజవాడలో మతస్థులందరు సమావేశమగుటకు నాహ్వానమొనర్చిరి. ఆసభకు సమాలోచనసభయని నామకరణముచేసి దానికి

శ్రీ ముదిగొండ శంకరారాధ్యులవారిని అగ్రాసనాధిపతినిగా నెన్నుకొనిరి. ఆసభయందు శైవమతాభివృద్ధికరములైన కొన్ని నిబంధనల నేర్పరచి వాటిని శాశ్వతతీర్మానములనుగా చేయు తలంపుతో ప్రథమశైవమహాసభను సమావేశము చేయనిశ్చయించిరి. ప్రథమ మహాసభ శ్రీ శంకరారాధ్యులవారి యాహ్వానమున ఓర్గుగల్లుపురమున సౌమ్యనామ సం॥ మార్గశిర శు ౧౮ స్థిరవారమునకు సరియైన ది 25-12-1909 సం॥ తేదీన శ్రీవారి యధ్యక్షతక్రింద జయప్రదముగా జరిగి సమాలోచనసభలో నంగీకరింపబడిన నిబంధనలన్నియు నీప్రథమ మహాసభయందు శాశ్వత తీర్మానములుగా చేయబడినవి.

అంతట నీ శైవమహాసభోద్దేశములను, శైవులుగల ప్రాంతములందు తెలుపుటకుగాను, ప్రతియేట నొక్కొక్క ప్రాంతమున నొక్కొకసభను జరుపుచూ వచ్చినారు. 1909 సం॥ లగాయతు 1937 సం॥ వరకు గడచిన 29 సంవత్సరములలో 20 వది సభలనుమాత్రము జరిపినారు. 9 సంవత్సరములుమాత్రము సభలు జరుగలేదు. సభలు జరుగని సంవత్సరము లేవియన 1910, 24, 25, 26, 28, 29, 32, 33, 35 సంవత్సరములైయున్నవి గత యిరువదిసభలును వరుసగా వరంగల్ పెడన, కొత్తపల్లి, ఈమని, విజయనగరం, నర్సాపురం, బెజవాడ, మిలిమించిలిపాడు, దేవాది, రాజమహేంద్రవరం, సికింద్రాబాదు, మాదల, యలకుర్రు, తెనాలి, వరంగల్. మహిసా. వరంగల్, బెజవాడ, యలకుర్రు, బెజవాడపట్టణగ్రామములయందు క్రమముగా 1909, 1911, 12, 13, 14, 15, 16, 17, 18, 19, 20, 21, 22, 23, 27, 30, 31, 34, 36, 37, సంవత్సరములయందు జరిగినవి 11 సార్లు పట్టణములందును 9 సార్లు గ్రామములందును సభలుజరిగినవి. గత 20 సంవత్సరముల సభావృత్తాంతము యింకను విపులముగ దెలిసికొనవలయు నన్నచో శైవమహాసభవారిచే ఈశ్వర సం॥లో ప్రచురింపబడినపంచమప్రచురణములోని వ్యాసమువలన తమకుబోధపడగలదు. ఆప్రచురణములు శైవమహాసభా కార్యస్థానము బందరు బుట్టాయిపేటలో కే పి. మల్లికార్జునుడుగారు యం. ఏ. బి.ఎల్., ఎం.ఎల్.సి. గారివద్దదొరకగలవు వలయువారు తెప్పించుకొనవచ్చును. గత 20 సంవత్సరముల సభావృత్తాంతములలో గమనింపదగిన విషయమేమన మొత్తముమీద 20 సంవత్సరములలో వసూలయిన సభాద్రవ్యము రు 10317-8-6 లు మాత్రమైయున్నది అందు పురాణవిద్యార్థులకు రు 6063-1-0 మాత్రము ఖర్చు చేయబడినది. తక్కిన ద్రవ్యములో రు 1569-5-0 లు వేదపాఠశాల వేదవిద్యార్థులక్రిందను 1175-11-9 లు అచ్చుఖర్చుస్టేషనరీక్రిందను పండిత బహుమతుల

వగైరాలక్రింద 246-8-0 లు న్నూ పోస్టేజవగైరా ఖర్చులక్రింద 232-11-0లు మోటారుచార్జీ వ్రాతఖర్చు పుస్తకములఖర్చులక్రింద షుమారు 85-0-0 లున్నూ ఖర్చుపడగా శేషించిన మొత్తము వడ్డితోగూడ షుమారు 1453-4-9 లు కీర్తిశేషులయి శివసాయుజ్యమందిన విశ్వదాత దేశోద్ధారక కళాప్రపూర్ణ శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారివద్ద నిల్వయున్నవి 1920 సం॥ నాటివఱకు లోగడ సభాద్రవ్యములో నిల్వయున్న మొత్తమది.

గత 20 వది సభలలో మతసూనను మత విద్యావ్యాపనముగగాని, ఆచారవిషయముగగాని లింగధారణాదికార్యములను సక్రమముగ జరిగించు విషయమునగాని యెట్టి యభివృద్ధిని గాంచజాలక, మిక్కిలి నిస్సారముగా నుండియున్నను 1918సం వరకు శ్రీ శంకరారాధ్యులవారి వ్యక్తిప్రభావమువల్ల సభలు జయప్రదముగా జరిగినవి. 1919 సం॥ పు రాజమండ్రిసభకు ఆమహనీయుండు లేడు. కైలాసమున కంతకుపూర్వమేగియుండెను. అయినను ఆమహానీయునకు సానుభూతిని దెలుపుటకుగాను 1919 సం॥ పు 10 వ రాజమండ్రిసభకు పెక్కు మాహేశ్వరజనులు విచ్చేయుటయేగాక షుమారు రు 700-0-0 లు లోపు ద్రవ్యముగూడ వసూలయినది అంతవరకు జరిగినసభలన్నియు పరమ శివస్వరూపుడగు నా మహనీయుని తపఃప్రభావమువల్లనే జరిగినవి ఇది నిశ్చయము. తరువాత జరుగుచూవచ్చిన సభలకు విశేషముగా మాహేశ్వర జనులు రాకపోవుటయు వచ్చినవారైనను సభకు నేపిథమయిన విరాళముల నీయకయు, మూకీభావముతో నుండుటవల్ల సభకు యేమాత్రముద్రవ్యము వసూలుకాలేదు. పైన తెలుపబడిన జమాఖర్చు 1919 సం॥ రమునాటివరకు వసూలుఅయిన మొత్తములని చదువరులు గ్రహింపుతురుగాక. తరువాత జరిగిన సభలన్నియు, భోజనసభలని చెప్పిననే మాత్రము తప్పిదములేదు. పదిమంది మతాభిమానులు సభకువచ్చినను విశేషముగా భోజనముల తోనే సభలు జరుపుచు కాలక్షేపము చేయుచూ వెళ్ళుచుండేవారు. కాని సభను మృతసభనుగాజేయక జీవములోనీడ్చుకొని వచ్చుచున్నందులకు మనము సంతసింపవలసియున్నది.

నిరుడుజరిగిన బెజవాడసభలో నీ శైవమహాసభకు నభ్యుదయమెట్లు కలుగవలయును? ముందేమార్గముల నడువవలయును. అనువిషయములు చాలవరకు నాలోచింపబడినవి చూడుడు. అఖిలదేశీయకాంగ్రెసు మహాసభ మొదటప్రారంభింపబడి కొలది విద్యావంతుల చేతులలో నేనడిచినను క్రియాశూన్యముగ, కొన్ని

వత్సరములు నడచినది. కాలక్రమమున నది ముప్పదియైదు కోట్ల భారతీయులలో ప్రతివ్యక్తికిని సంబంధము కలదని నిరూపింపబడిన తరువాత అందరును దానియందు ఎక్కువ నుత్సాహమును జూపుచున్నారు. అదే ప్రకారము ప్రతిభాశాలుడు గాని తపశ్శీలుడుగాని యైన నొక వ్యక్తిమీద నాధారపడి నడచు నేసంస్థ యైనను, నా ప్రతిభాశాలుడు నాతపశ్శీలుడు చనినపిమ్మట క్రమముగ తేజోవిహీనమై యంతరించుట నిక్కమము ప్రపంచసంస్థలను మనము పరికించినచో దీని యదార్థము బోధపడగలదు. కారణ మట్లుండుటవలన శ్రీశంకరాచార్యుల వారు జీవించినంతకాలము ఆమహనీయునియందుగల ప్రభావమువల్ల సభలు జయప్రదముగా జరుగుటయు తరువాత క్షీణదశనొందుచూ వచ్చుటయు మనము తెలుసుకొనదగును. కావున నిప్పటికర్తవ్యమేమి? మతముయొక్క ఆదర్శము మతమునందుగల ప్రతివ్యక్తికిని నివేదింపబడి మతమునందునభిమానము కలుగునట్లు చేయవలయును. దీనికిగాను ఏమిచేయవలెనని విచారించి మతమునకు ప్రధానమైనదిపీఠమని అట్టియు మతపీఠము అంతరించి చాలకాలము అయినందున మతము యిట్టి క్షీణదశకువచ్చినదనియు, గుర్తింపబడి తిరిగి పూర్వపుపీఠమును పునరుద్ధరించుట యుచితమని తెలిసికొనబడియెను. ఆపిమ్మట 21 వ మహాసభనాటికి పీఠస్థాపనమునకు వలయునిబంధనలతో నొక ప్రణాళిక తయారుచేయుటకు నొక కాన్‌స్టిట్యూషన్ కమిటీకూడా యేర్పాటుచేయబడినది. ఆకమిటీవారు ఆప్రణాళికను 21 వ సభజరుగులోపలనే తయారుచేసి యిచ్చినారు.

## ప్రస్తుత 21 వ సభాకార్యక్రమము.

పైనదెలుపబడిన మహాసభాప్రణాళికను చర్చించి స్థిరపచ్చుటకును మతాభ్యుదయమునకు వలయు సాధనాంతరముల నాలోచించుటకును మతబోధవలన మతస్థులకు మతమునందు నభిరుచిని పుట్టించుటకును మొదలగు నుద్దేశములతో నీ 21 వ మహాసభ యీ రాజమహేంద్రవర పురమున జరుపుటకు కార్యనిర్వాహకవర్గమువారిచే సంకల్పించబడినది, వెంటనే ప్రచారకకార్యదర్శిగారగు, శివలెంక లింగయ్యగారు 1933 సం॥ యేప్రియల్ లో రాజమండ్రినగరమున కరిగి శివభక్తాగ్రణ్యులగు బ్రాహ్మణులతోను వైశ్యప్రముఖులతోను పైవిషయమును నివేదింప వారందరు నపరిమితానందభరితులయి యీ 21 వ శైవమహాసభను తమ పురముననే జరుప కృతనిశ్చయులయిరి. వెంటనే జిల్లాకోర్టు శిరస్తాదారగు సింగరాజు సుబ్రహ్మణ్యంపంతులుగారి యధ్యక్షతక్రింద శ్రీరాజా కాండ్రేగుల

శ్రీనివాసజగన్నాధరావుపంతులుగారు కార్యూరి విశ్వనాధముగారు, పంకాయల వెంకటరత్నముగారు వెత్సా వెంకటరత్నముగారు తొంటెపు శ్రీరామమూర్తి గారు ప్రెగళ్ళపాటి వెంకటరాజుగారు గ్రంధి సత్తిరాజుగారు శీలా వీరభద్రుడు గారు నాగుమిల్లి వెంకటసుబ్బయ్యగారు పండిత సత్యానందంగారు మున్నగు ప్రముఖులెల్లరు నాహ్వానసంఘముగా నేర్పడి 21 శైవమహాసభను జరుపుటకు నేకగ్రీవముగా తీర్మానించి యా తీర్మానమును కార్యస్థానమునకు బంపియుండిరి. తరువాత 1938 సం॥ జూన్ 7, 8, 9 తేదీలయందు సభ జరుపుటకు నిశ్చయింపబడి సర్వశైవసాంఘికులకును ఆహ్వానపత్రికలు బంపబడినవి.

ఈ 21 వ శైవమహాసభ బహుధాన్యనామ సం॥ జ్యేష్ట శు ౧౦ మంగళ వారంబు సరియైన ది 7-6-1938 సం॥ తేది మొదలుకొని శ్రీరాజమహేంద్రవర పురమున గోదావరీతీరస్థమగు శ్రీ బ్రహ్మానంద శివమఠమున నాలుగుదినములు జయప్రదముగా జరిగినది. సభకు వివిధప్రాంతములనుండి పెక్కు మాహేశ్వరజనులు విచ్చేసిరి. శ్రీ ఇజ్జతాసార్ కందుకూరి బాలసూర్యప్రసాదరావు బహద్దూర్ జమీందారుగారు మహోపాధ్యాయ శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిలవారు మున్నగు పండిత ప్రకాండు లరుదెంచిరి మరియును శైవమతాభిమానులయిన చాతుర్వర్ణ్యమువారును విచ్చేసిరి. సభాభవనము వెయ్యమందిపైగా జనముతో క్రిక్కిరిసిపోయినది క్రిందటి రాజమండ్రిసభ జరిగినతరువాత యేసభకును యింత మంది సభ్యులు రాలేదని తెలియుచున్నది.

## 7-6-1938 సం॥ ప్రథమదినచర్య, ఉదయము.

నేటియుదయము 7 గంటలు మొదలుకొని 9-30 గంటలవరకు నగరోత్సవము జరుపబడెను. ఆసందర్భమున సభాధ్యక్షులును విద్వాన్ సాహిత్యవిద్యాప్రవీణేత్యాదిబిరుదాంకితులును అగు శ్రీ లో॥ ముదిగొండ వీరేశలింగంశాస్త్రి గారిని నశ్వశకటారోహణము చేయించి బ్యాండు మున్నగు వాయిద్యములచేతను స్వస్తివాచనములచేతను పురవీధులవెంట నూరేగుచు నగరోత్సవమును జరిపిరి. ప్రతివీధియందును, శివభక్తాగ్రేసరులగు స్త్రీపురుషులెల్లరు సభాధ్యక్షులవారిని కర్పూరపుష్పహారాదికములచే పూజించుటయేగాక కర్పూరనీరాజనములను అసంఖ్యాకములుగానిచ్చుచు, పరశివానందరసనిమగ్నులయి మంగళహారతులను పాడిరి.

ఇట్లు నగరోత్సవము జరిపి గం 9-30 లకు గోదావరీపావనస్రవంతీతీరమున శ్రీమతి కా॥ పుష్పావతమ్మగారిచే నిర్మితమగు మనోహరవిశాలబ్రహ్మానందభవనమున భక్తసముదాయముతో నధ్యక్షులవారు ప్రవేశమొనర్చిరి. అంతట చాగంటి మల్లికార్జునయ్యవారు ఇవటూరి బుచ్చిసోమన్నయ్యవారు స్వస్తివాచనములను మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారు ఆచార్యగణప్రార్థనమును చేసినతర్వాత శ్రీ॥ లో॥ ఇవటూరి సానందరావుగారు ఈశ్వర ప్రార్థనాశ్లోకములను పద్యములను మధురముగా బాడిరి



తరువాత నాహ్వానసంఘమువారి తరపున తత్సంఘాధ్యక్షులగు శ్రీ॥ లో॥ సింగరాజు సుబ్రహ్మణ్యంపంతులుగారు తమ స్వాగతోపన్యాసమును చదువుచు సభ్యులందరికిని ఘనముగు స్వాగతమిచ్చిరి. చాగంటి భాస్కరలింగశాస్త్రిగారిచే రచింపబడిన స్వాగతపద్యములున్ను చదువబడెను. అంతట ఇజ్జితాసార్ శ్రీ రాజా కందుకూరి బాలసూర్యప్రసాదరావు బహద్దూర్ జమీందారుగారు గత సభాధ్యక్షులగు ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారినే యీ సంవత్సరముగూడ అధ్యక్షులుగానుండవలసినదని కోరగా సభ్యులందరు నేకగ్రీవముగ నంగీకరించిరి. అంతట శ్రీ॥ లో॥ వి॥ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు 21 వ మహాసభాధ్యక్షపీఠమలంకరించిరి. అధ్యక్షులవారు నేటికి 19 సంవత్సరములక్రిందట నీరాజమహేంద్రవరపురమున 10 వ శైవమహాసభ జరిగినదనియు, తిరిగి రెండవసారి నేడు యిక్కడ సమావేశమైనదనియు నిదియంతయు శైవ, వైశ్య భక్తవర్యుల ప్రోత్సాహమునచేసి వారి నిరుపమాన శివభక్తి ప్రకటితమగుచున్నదనియు, అట్టి అప్రతిమాన శివభక్తిచే విరాజిల్లుచు, నిరంతరము సకలైశ్వర్యములతో వెలుంగునట్లు భక్తవర్యుల నందరి నాశీర్వదించిరి పలుశ్రమలకోర్చి దూరదేశమునుండివచ్చిన మాహేశ్వరుల మతాభిమానమును ప్రశంసించిరి. మార్కండేయ మునిశ్రేష్ఠునిచే పవిత్రమై సకల పండిత, కవిగాయక గ్రామణులచే మండితంబై శ్రీ రాజరాజనరేంద్రాది ప్రభువులచే పరిపాలితమైన రాజ్మహేంద్రవర ప్రాచీనవైభవమును గొనియాడిరి. అప్పటికి 11 గంటలు కావచ్చినందున అధ్యక్ష ప్రారంభోపన్యాసమునకు మధ్యాహ్నమునకు నవకాశమిచ్చి యప్పటికి సభ ముగింపబడెను.

మధ్యాహ్నము గం ౩–౩0 ని॥లకు తిరిగి సభ సమావేశమైనది.

గత సంవత్సరపు కార్యనివేదిక చదువబడెను. అంతట ఇజ్జితాసార్ శ్రీ రాజా కందుకూరి బాలసూర్యప్రసాదరావుగారు శైవసభాభ్యుదయమునుగూర్చి

యుపన్యసించిన పిమ్మట శైవమత ప్రకాశికాపత్రికాపోషణకై రు 50-0-0 లు విరాళ మొసంగి సహజమైన తమ మతాభిమానమును వెల్లడించిరి. తరువాత సభాధ్యక్షులు శైవమత ప్రాచీనత దాని ప్రాశస్త్యము విదేశములయందలి శివలింగములు, శివదీక్ష అష్టావరణములు శైవమతాభివృద్ధికై ముందుచేయతగిన కార్యములు మున్నగు విషయములనుగూర్చి రమణీయముగా నుపన్యసించిరి. తరువాత విజయనగరవాస్తవ్యులగు ఇవటూరి బుచ్చిసోమన్నయ్యవారిచేత శైవాష్టావరణ ప్రమాణాష్టకాభరణమను పుస్తకములును, నీపురంబున శివభక్తిని విశేషముగ వ్యాపింపజేసిన మహాభక్తురాలగు చాగంటి వీరమాంబగారిచే రచింపబడి ముద్రింపబడిన శైవగ్రంథములును, పెరిగళ్ళపాటి జానకిరామయ్య గుప్తగారిచే రుద్రగీత అను పుస్తకములును, శ్రీ దేవిడీ జమీందారుగారిచే ముద్రింపించబడిన పంచాంగములును సభ్యులకుచితముగ పంచిపెట్టబడినవి. ప్రదోషసమయము కావచ్చుచున్నందున కర్పూరహారతులచే నీశ్వరుని ప్రార్థించి నాటికి సభ నిలుపబడినది.

## 8_6_1938 సం॥ ద్వితీయ దినచర్య ఉదయము.

ఉదయము 8 గంటలకు తిరిగి సభ ప్రారంభింపబడినది. శ్రీ॥ లో॥ మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారిచేత శ్రీమహావిష్ణువు, శ్రీరాముడు, కృష్ణుడు, అర్జునుడు శివుని పూజించి చక్రము, పాశుపతాస్త్రము మున్నగు నాయుధములు పొందుటయే గాక, భస్మధారణాది శివదీక్షల కైకొని సంతానాదివరంబులనొందిరని శ్రుతిస్మృతి వాక్య ప్రమాణములతో నుపన్యసించిరి. పిడపం బుద్ధిరాజు హనుమంతరావుగారు ముందు చేయతగిన శైవమత ప్రచారమునుగూర్చి యుపన్యసించుచు, సభాధ్యక్షులమీద నాశువుగా పద్యములను చదివిరి. అంతట సభ ముగిసినది.

## మధ్యాహ్నము గం 3_30 ని॥లకు తిరిగి సభ సమావేశమైనది.

శివపురాణగాథలనుగూర్చి యీశ్వరప్రెగడ సదాశివశర్మగారు రమణీయముగ నుపన్యసించిన పిదప మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు శైవసిద్ధాంతమునుగూర్చి విపులముగ నుపన్యసించిరి. తరువాత ఇవటూరి సుందరరావుగారు శివభక్తినిగూర్చి మధురముగ నుపన్యసించిరి. తరువాత ఇవటూరి సానందరావుగారిచే రచింపబడిన వైదిక మతాదర్శము, అవైదికమతాదర్శము మను శీర్షికగల యొక గొప్పవ్యాసము వారిచే చదువబడియెను. అంతట నాటికి సభ విరమింపబడెను.

## 9–6–1938 సం॥ తృతీయ దినచర్య ఉదయము.

నేటి ఉదయము 8 గంటలకు పండితసభ ప్రారంభింపబడినది సభాధ్యక్షులు గాయత్రీ తత్త్వమునుగూర్చి సంస్కృతభాషలో నుపన్యసించిన పిమ్మట మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారు సంస్కృత భాషలో తత్త్వత్రయమును గూర్చి తాము వ్రాసికొనివచ్చిన వ్యాసరాజమును చదువుచు నుపన్యసించిరి. మ॥ మా॥ నాగలింగశాస్త్రిగారు సంస్కృతభాషలోనుపన్యసింపబడిన పైవారల విషయములను నాంధ్రభాషలో నెల్లరకు తెలియునటుల వివరించిచెప్పిరి. అంతట అధ్యక్షుని అంత్యోపన్యాసముతో పండిత సభ ముగిసినది, తరువాత ఆగమశాస్త్రజ్ఞసభ ప్రారంభింపబడినది, మ॥ జ్వాలావీరభద్రశాస్త్రిగారిచే ఆగమములు వాని భేదములు అను విషయమునుగూర్చి వ్రాసిన వ్యాసము చదువబడెను వారిచే గత సభాకార్యక్రమమునను సరించి సవరించబడిన ఆగమగ్రంధము సభ వారికర్పింపబడెను. తత్సభాధ్యక్షులు ఆగమశాస్త్రజ్ఞ అవసరసభను త్వరలో సమకూర్చి అందు యీ పుస్తకవిషయమై తీర్మానించుదమనిరి, శ్రీ॥ పం॥ పట్టైస లింగారాధ్యులవారిచే కొన్ని తీర్మానములు ప్రవేశపెట్టబడి సభవారిచే నామోదింపబడెను, తరువాత యువజన సభప్రారంభింపబడినది. ఇవటూరి సుందరరావుగారు శ్రీ॥ పం॥ పట్టైసలింగారాధ్యులుగార్లు యువకులు శైవసభకు తగినంత సహాయముచేసి కార్యక్రమములో పాల్గొనవలెనని గంభీరముగ నుపన్యసించిరి, అంతట కొన్నితీర్మానములు ప్రవేశపెట్టబడి పభ్యులచే నామోదింపబడెను, ఇటులే వైద్యసభకూడా జరిగినది కొన్నితీర్మానములు శ్రీ॥ పం॥ పట్టైసలింగారాధ్యులచే ప్రవేశపెట్టబడి యామోదింపబడెను,

### మధ్యాహ్నము 4 గంటలకు సభ తిరిగి సమావేశమైనది.

ఈశ్వరప్రెగడ సదాశివశర్మగారు శివమహిమనుగూర్చి దీర్ఘోపన్యాసమును గావించిరి. శ్రీ బ్రహ్మానంద భవనాధికారురాలగు కా॥ పుష్పావతమ్మగారు శివోత్కృష్టత శివలాంఛనముల అంతరార్థములనుగూర్చి రమణీయముగ నుపన్యసించిన పిదప భక్తమాహేశ్వరుల ఛాయాపటము తీయబడెను అంతట సభచాలించబడెను నాటిరాత్రి 8 గంటలనుండియు శైవసభవారిచే వరంగల్ పురమునుండి పిలిపించబడిన వైశ్యసహకారసంఘమువారిచే ఈశ్వరతాండవభజన రమణీయముగ గావింపబడినది సభాభవనమంతయు ప్రజలచే నిండిపోయినది 12 గంటలకు తాండవముజరిగి జయధ్వనులతో భజనమాపివేయబడినది

చందాదారులుగఁజేరిరి, శివభక్తాగ్రేసరులగు శ్రీ వీరభద్రుడుగారు శైవసభాధ్యక్షులకు పీతాంబరములొసంగి తమ యవ్యాజభక్తిని వెల్లడించిరి, శివనామ సంకీర్తనముతో కర్పూర మంగళహారతులతో సభ ముగింపు చేయబడినది,

ఓం హరనమః పార్వతీపతయే,

# స్వాగత పద్యములు.

---

ఉ॥ శ్రీకరుఁడార్యుఁడీశ్వరుఁడ । శేషగుణాకరుఁడిందుశేఖరుం
డా కమలాసనాది విబుధావళి వందితపాదయుగ్ముఁడా
ర్యాకమనీయచిత్తవిక చాంబుజనట్పదమూర్తి వేద్యున
స్తోకసుఖంబుగూర్చగను తుల్ వచరించెద సభ్యపాళికిన్

సీ॥ నవరసగుంభిత నవ్యకావ్యౌఘంబు । సృజియింపగల, కవిశ్రేష్ఠులార
షట్ఛాస్త్రములరహస్యార్థముల్ గమనించి । రమణవెలుంగు శాస్త్రజ్ఞులార
అలచతుర్వేదముల మూలముగ వల్లె । వేసిభాసిలు వేదవేద్యులార
అమలపురాణేతిహాసార్థము లెరింగి । పలు పౌరాణికతిలకులార!

గీ॥ రండి కూర్చుండివెండి మాకుండునిండుసంశయధ్వాంత పటలంబుశాస్త్రవాక్య
చండమార్తాండరుక్ప్రాళిజక్కఁజేవ శైవవరులార! మీకిదేస్వాగతంబు॥

సీ॥ షట్కాలశివపూజజక్కఁగా గావించి । వరలెడినైష్ఠికవర్యులార
ఛాత్రపాళులకలశైవదీక్షలొసంగి । గురుమోక్షమొసగెడి గురువులార
గ్రంథరత్నంబులఁగని యందుగలనవ । రసములెరింగిన రసికులార
తగవర్తమానభూశుభవిన్య దఖిలంబు । నచియించునట్టి దైవజ్ఞులార

గీ॥ పండితులటంచు మిమ్ముమాదండజేర్చి। నందుకుఫలంబు బురికొల్పుడయ్యలార
పరిముఖిశాంతస్వభావయులైన।భవ్యులార। శైవవరులార మీకిదేస్వాగతంబు.

సీ॥ కులవృద్ధికైపాలుఁగొననట్టి మనుజుని । జీవచ్ఛవంబని చెప్పవలెను
శివపూజలేకుండ జీవించుమనుజుని । వ్యర్థజీవితునిగ బలుకవలదె
సభయన్నవిముఖుఁడైజనునట్టిమానవు । గుణహీనుడనుచు చేకొనగవలదె
పారమార్థికచింతవదలనినరులను మాఘపతంగులబోల్పదగదె

గీ॥ ఇట్లు పండితులెల్లజర్చించుచుండ । పిదిశమే మనకిప్పుడుఃవిశ్వమందు
ఇట్టినుడులకుపాత్రులైయొసగనట్టి । శైవవరులార మీకిదేస్వాగతంబు.

మ॥ సదయస్వాంతులుగా క్షమాయుతులుగా సచ్ఛీలురై గ్రాలగా
సదభిప్రాయులుగా శివప్రియులుగా సన్మార్గులైయొప్పగా
మదనద్వేషిపదాంబుజార్చకులుగా క్ష్మామండలంబందునన్
సదపీయొన్నడు జక్కచేసెదవొ యీశైవావళిన్ మక్కువన్.

చాగంటి భాస్కరలింగశాస్త్రి.
వరంగల్.



# 21 వ శైవమహాసభా తీర్మానములు

1. దేశోద్ధారక విశ్వదాత కళాప్రపూర్ణేత్యాది బిరుదాంకితులగు శ్రీ॥ లో॥ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు శివసాయుజ్యమునొందినందులకు వారికుటుంబమునకు నీసభవారు సానుభూతిని తెలుపుచున్నారు.

2. శైవసభాపక్షమున శైవగురుపీఠముల పునరుద్ధరించి మతపరిపాలనా విధానములను నడిపించుటకు వలయువిధానమును సభవారిచే నామోదింపజేసి యాలోచనలోనికి తెచ్చుటకు నీసభవారు తీర్మానించుచున్నారు.

ప్ర॥ ఇజ్జతాసార్ శ్రీరాజా కందుకూరిబాలసూర్యప్రసాదరావు బహద్దర్ జమీందారుగారు

అ॥ సింగరాజు సుబ్రహ్మణ్యంపంతులుగారు

3. ఆగమాదిశాస్త్రప్రవీణులును, పమిడిముక్కల గ్రామవాస్తవ్యులును శ్రీముదిగొండ నాగమల్లికార్జునయ్యగారు శివసాయుజ్యమొందినందులకు నీసభవారు వారికుటుంబమునకు సానుభూతిని తెలుపుచున్నారు.

ప్ర॥ మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారు

అ॥ ముదిగొండ పేరయ్యలింగంఅయ్యవారు

4. ఈశ్వరనామ సం॥ శైవమతప్రకాశికా పత్రప్రచురణములోని శైవమహాసభాపరిపాలనా ప్రణాళికను కొన్నిసవరణలతో నీసభవారు ఆమో

ఉ॥ కందుకూరి వటుకభైరవమూర్తిగారు
ఆ॥ సర్వజనాంగీకృతము.

5. శైవమహాసభ యీతేదీనుండి శైవమహాపీఠాంతర్భాగ మగుటచేత దానికిసంబంధించిన పూర్వనియమావళి యావత్తున్నూ యిందుమూలకముగా రద్దు పరచుచు నిపుడామోదింపబడిన శ్రీశైవమహాపీఠ పరిపాలనా ప్రణాళిక యీ తేదీనుండి అమలులోనుండునట్లు తీర్మానించడమయినది.

6. సాధ్యమైనంతవరకు త్వరలో ప్రణాళికతోసహా శైవమహాపీఠమును రిజిష్టరీచేయించుటకుతగినయేర్పాట్లుకావించుటకునీసభవారుతీర్మానించడమయినది

ఉ॥ ఇవటూరి సానందరావుగారు
ఆ॥ సర్వజనాంగీకృతము.

7. శైవమహాపీఠద్రవ్యమునుండి మతప్రచారము వగయిరాలకు నాలుగు వందలరూపాయలకు మించని మొత్తమునుఖర్చుపెట్టుటకు నీసభవారు తీర్మానించు చున్నారు.

ఉ॥ శివలెంక లింగయ్యగారు
ఆ॥ ఇవటూరి సానందరావుగారు

8. శ్రీ లో॥ వి॥ సా॥ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు, కందుకూరి వటుకభైరవమూర్తిగారు మున్నగు పదునెనిమిది మందిని కార్యనిర్వాహక వర్గముగ నెన్నుకోవడమయినది.

9. ఈ శైవమహాసభకు బెజవాడ, రాజమండ్రి, విజయనగరము, వరంగల్ పట్టణములను, నాలుగు కేంద్రసభాస్థానములను యేర్పరచి వాటికి ప్రెసిడెంట్లను కార్యదర్శులనుకూడా యీ సభవారు యేర్పాటుచేయడమయినది.

10. బెజవాడలోని శైవసభాగ్రంథాలయమునకు నవసరములగు శైవ గ్రంథములను సభాద్రవ్యమునుండి తెప్పించుటకు తీర్మానించడమయినది.

ఉ॥ ముదిగొండ పేరయ్యలింగంఅయ్యవారు
ఆ॥ యలకుర్తి శాస్త్రులుగారు

11. శైవమతప్రచారమునకు కావలసిన ద్రవ్యమును మహాసభాద్రవ్యము నుండి యిచ్చుటకు కార్యనిర్వాహకవర్గమున కధికార మీయడమయినది.

ఉ॥ కం॥ వటుకభైరవమూర్తిగారు
ఆ॥ ఈశ్వరప్రగడ సదాశివశర్మగారు

12. శైవులలో ఋగ్వేదీయులకు ప్రత్యేకముగ అంత్యేష్టి ఆరాధన విధి మున్నగు గ్రంథములను ప్రకటించుటకు నీ సభవారు తీర్మానించుచున్నారు.

ఉ॥ కామర్సు రాజయ్యగారి కు॥ వీరరాజుగారు

ఆ॥ బందా గురుఖండేశ్వరముగారు

13 పూరాణవిద్యార్థులకు ధనసహాయము తగ్గించి మతసంబంధమైన వైదిక సంస్కృతవిద్యలకు నెక్కువగ ధనసహాయముచేయుటకు నీసభవారు తీర్మానించుచున్నారు.

14. శైవమహాసభాధ్యక్షుడు ప్రతిసంవత్సరము ఒకమారు కేంద్రస్థానముల సంచారముచేయుచుండవలయునని యీ సభవారు కోరుచున్నారు.

ఉ॥ బుద్ధిరాజు హనుమంతరావుగారు

ఆ॥ రెంటాల వీరభద్రశాస్త్రిగారు

15. బెజవాడపట్టణమున శైవసభాభవన నిర్మాణమునకును వేదపాఠశాలాభివృద్ధికిని శ్రీ॥ వం॥ పట్టెస లింగరాధ్యులవారు అన్యోన్య సహాయమున నపారధనమును చేకూర్చి యిచ్చుటకు వాగ్దానము చేసినందులకు వారిని యీ సభవారు అభినందించుచున్నారు.

16 శైవమతప్రకాశికాపత్రికా నిర్వహణమునకై ప్రధానపోషకులుగ చేరి రు 15-0-0 లు సభకు విరాళమొసంగి శైవమతప్రచారము చేయుచున్న కృష్ణాజిల్లా నందిగామతాలూకా భీమవరంగ్రామవాస్తవ్యులగు బ్ర॥ శ్రీ॥ ఈశ్వరప్రగడ సదాశివశర్మగారిని అభినందించుచు సభతరపున మతప్రచారకులుగనుండుటకు నీ సభవారు తీర్మానించడమయినది.

17 శ్రీ॥ లో॥ ఇజ్జితాసార్ శ్రీరాజా కందుకూరి బాలసూర్యప్రసాదరావుబహద్దరుజమీందారుగారు శైవమతప్రకాశికాపత్రికకు రు 50-0-0 లు విరాళమిచ్చి యీ సభాభ్యుదయమునకై తోడ్పడుచున్నందులకు శ్రీవారిని యీ సభవారు అభినందించుచున్నారు.

ఉ॥ శివలెంక లింగయ్యగారు

ఆ॥ ఇనటూరి సానందరావుగారు

18. శైవమస్థుల యావన్మందియొక్క ఊరు జిల్లా తాలూకా గ్రామం

పోష్టు గోత్రములు మున్నగువాని పట్టికలను సాధ్యమయినంత త్వరలో తయారు చేసి ప్రకటించుటకు నీ సభవారు తీర్మానించుచున్నారు.

ఉ॥ ఇవటూరి సానందరావుగారు
ఆ॥ శివలెంక లింగయ్యగారు

19. రాజమహేంద్రవరపురమున శైవులెల్లర నుపయోగించు శైవసభా భవనమును నిర్మించుటకు నీపురవాసులు సంకల్పించినందులకు శైవమతమందుగల వారి యభిమానమును ప్రశంసించుచు త్వరలో మందిరము నేర్పాటుచేయుటకు నీసభవారు తీర్మానించుచున్నారు.

ఉ॥ అధ్యక్షులు
ఆ॥ సింగరాజు సుబ్రహ్మణ్యపంతులుగారు

## పండిత సభా తీర్మానములు (రాజమండ్రి.)

(1) సర్వైర్ద్విజైః సూర్యనమస్కారాదిషు సూర్యమండలాంతర్వర్తినం, సదాశివం నమస్కుర్మ ఇతివక్తవ్యం - నతు నారాయణం.
(2) గాయత్రీ మంత్రస్థిత భర్గశబ్దస్య, శివఏవేత్యర్థః నతు తేజ ఇతి॥
(3) శైవసిద్ధాంతవిషయాన్ సర్వానప్యేకీకృత్య । సంగ్రహేణ దేవభాషా యామేకో గ్రంథః రచయితవ్యః।
(4) పదవాక్య ప్రమాణజ్ఞైరథవా అలంకారశాస్త్రజ్ఞైర్వా సభ్యత్వపదవీ గృహీతవ్యా। నోచేద్విషయ చర్చాయామవకాశం నోపలభేరన్.
(5) ఏతే ఆగామి సభాపర్యంత మధికారిణః

1 సాహిత్య విద్యాప్రవీణ విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రిణః అధ్యక్షాః.
2 మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రి-మంత్రి
3 మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రిణః } కార్యనిర్వాహక సభ్యాః
4 ముదిగొండ రామలింగశాస్త్రిణః }
5 ముదిగొండ శంకరశాస్త్రిణః }

## 9-6-1938 యువజనమహాసభా తీర్మానములు (రాజమండ్రి)

1. శైవమహాసభతరపున నడుపబడుచున్న ద్విమాసపత్రికను సాధ్యమైనంతత్వరలో మాసపత్రికగా నడిపించుటకు తగినప్రచారము సల్పుటకును

పత్రికకు చందాదారులను చేర్పించు విషయమున శ్రద్ధవహించుటకును నీసభవారు తీర్మానించుచున్నారు.

2. విద్యార్థిగానున్న పత్రీయువకుడున్నూ మనమతమునకు సంబంధించిన ఉపాధివిద్యలను అనగా (వైదికమంత్రభాగము, ఆయుర్వేదము, జ్యోతిషము సంస్కృతము) సాధ్యమైనంతవరకు నభ్యసించుచు మఠసేవకుడు కాగలందులకు నీసభవారు హెచ్చరించుచున్నారు.

3. ప్రతిసంవత్సరము మహాసభజరుగుటకుముందు తత్సభానిర్వహణమునకై తగిన రక్షకదళమును ఏర్పాటుచేసి సభాసమయమున తగుసేవచేయగలందులకున్నూ ఈరక్షకదళమును సభాస్థలమునకు చేర్చుటకుగాను అగు ఖర్చులు మహాసభా వర్కింగుకమిటీవారు శాంక్షన్ చేయించగలందులకున్నూ యీసభవారు తీర్మానించుచున్నారు.

4 ప్రతిసంవత్సరము మహాసభకు నివేదింపబడు యువజనమహాసభా రిపోర్టును కార్యదర్శి తయారుచేయుటకున్నూ సదరురిపోర్టును ప్రచురించుటకున్నూ అగుఖర్చులు మహాసభాద్రవ్యమునుండి పొందగలందులకు నీసభవారు తీర్మానించుచున్నారు.

ఈయువజనసభకు యీక్రిందివారిని కార్యనిర్వాహకవర్గముగా నెన్నుకొనడమైనది.

బ్రహ్మశ్రీ॥ లో॥ కాశీనాథుని సుబ్రహ్మణ్యంగారు బి, ఏ. యలకుర్రు
అధ్యక్షులు.

,, ,, శ్రీపతి పండితారాధ్యుల పట్టైన లింగారాధ్యులు
బెజవాడ॥ కార్యదర్శి

ఇవటూరి సుందరరావు, సింగరాజు త్రిపురాంతకముగార్లు సభ్యులు

## 9-6-1938 ఆగమజ్ఞ మహాసభవారి తీర్మానములు, (రాజమండ్రి)

1. ఆగమశాస్త్రపండితులగు శైవులు తమవద్దగల మూలగ్రంథములతో పండితసభవారు గావించు సమావేశమునకు హాజరై గ్రంథపరిశీలనయందు పాల్గొనవలయునని యీసభవారు తీర్మానించుచున్నారు.

2. ఆగమజ్ఞ మహాసభను పండితమహాసభకు అనుబంధముగా సంగీకరించగలందులకు కోరుచూ యీసభవారు తీర్మానించుచున్నారు.

3 ఆగమజ్ఞమహాసభను ఆగమపండితులు, పలువురుగలప్రాంతమున ప్రత్యేకసమావేశమునుజరిపి తత్సమావేశమున గ్రంథపరిశీలనము గావించుటకున్ను తత్సమావేశమునకు శైవమహాసభనుండి ఖర్చులనిమిత్తం అగు ద్రవ్యమును శాంక్షను చేయించగలందులకున్ను మహాసభవారిని యీసభవారు కోరుచూ తీర్మానించుచున్నారు.

4. ఆగమజ్ఞులైన ప్రతిశైవునకున్ను మంత్రభాగము అత్యవసరమై యున్నందున శైవులు తమబాలురను శైవమతసంప్రదాయముగ నడుపబడుచున్న వేదశాస్త్రపాఠశాలలయందు చదివించి మతగౌరవమును నిలుపుటకు ప్రయత్నించవలె నని యీసభవారు హెచ్చరించుచున్నారు.

5. ఈసభను యీక్రిందివారిని ఆగమజ్ఞమహాసభా కార్యనిర్వాహకవర్గముగా ఏర్పరచుకొనవలసిన దనుకొనబడినది.

బ్ర॥ శ్రీ॥ వి॥ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు వరంగల్ అధ్యక్షులు
ఉభయభాషాప్రవీణ మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారు వమిడిముక్కల
ఉపాధ్యక్షులు
శైవాగమవిశారద శ్రీపతిపండితారాధ్యుల నట్టెపలింగారాధ్యులు
బెజవాడ, కార్యదర్శి.

## ది 9–6–1938 సం॥ శైవ వైద్య మహాసభా తీర్మానములు, రాజమండ్రి.

1 శైవులు, తమబాలురకు ఆయుర్వేదము మొదలగు ఆరోగ్యశాస్త్రములను అభ్యసింపజేయుట అవసరమని యీ సభవారు తీర్మానించుచున్నారు.

2 ప్రతి సంవత్సరము మహాసభజరుగు సమయమునకు వైద్యులగు వారందరును హాజరై, విద్యాప్రాముఖ్యమును వెల్లడించి వైద్యవిద్య నభ్యసించెడి విద్యార్థులకు ప్రోత్సాహముచూపుచు, మానసిక వైద్యవిద్యారహస్యములనుగూడ, ఆచరణయందుంచుటకు తగిన అవకాశమును మహాసభవారివలన పొందగలందులకు నీ సభవారు తీర్మానించుచున్నారు.

3 రాబోవు 22 వ సభనాటికి శైవులయందుగల వివిధవైద్యప్రావీణ్యతగల వారిలిస్టును తయారుచేసి విపులముగా ప్రచురించుటకున్ను దానికగు ఖర్చులను మహాసభవారివల్ల పొందుటకున్ను యీ సభా కార్యదర్శికి అధికారమీయడమయినది.

4 ఈ శైవవైద్యమహాసభకు యీ దిగువవారిని కార్యనిర్వాహకవర్గముగా నెన్నుకోవడమయినది

బ్రహ్మశ్రీ॥లో॥ డాక్టరు కాశీసాధుని అంబామల్లేశ్వరవరప్రసాదరావుగారు
గుడివాడ, అధ్యక్షుడు.

,, డాక్టరు శ్రీపతి పండితారాధ్యుల పట్టైసలింగారాధ్యులుగారు
బెజవాడ, కార్యదర్శి.

అధ్యక్షోపన్యాసము.

శ్రు॥ యోదేవానాం ప్రభవశ్చోద్భవశ్చ । విశ్వాధి పోరుద్రోమహర్షిః ।
హిరణ్యగర్భం జనయామాసపూర్వం।సనో బుద్ధ్యా శుభయా సంయునక్తు

శైవమహాజనులారా!

ఏనగరము రాజరాజనరేంద్రపరిపాలితమై, మహాభారతగ్రంధావలమై, గోదావరీ మహానదీపావనతరంగ మధుర నినాదంబుల శ్రుతిసుఖంబు నొసగుచు నాగరికతా లక్ష్మీ సమాలింగితమయి, యశోడిండిమముల దశదిశలమ్రోగించి పేరుగాంచెనో అట్టి రాజమహేంద్రవరపురంబున గోదావరీనదీమతల్లికాతీరంబున శ్రీబ్రహ్మసంఘభవనంబున నింపటి దివ్యవైభవముతో నీయిరువదియొకటవ శైవమహాసభ సమావేశమగుట పురోభివృద్ధికి సూచకము. 19 సంవత్సరముల క్రిందట నీసభకు పుష్పాంజలియిచ్చిన దీపురవరంబె. శైవమతాచార్యులలో దిట్టయై ప్రత్యక్ష నిదర్శనములజూపించిన మల్లికార్జునపండితారాధ్యులవారి జననముచే బవిత్రమయిన ద్రాక్షారామము యీగోదావరీమండలములోనిదియే. ఆరాధ్యత్రయములో నొకరైన విశ్వారాధ్యులవారి చరణకమల విన్యాసమున పావనమయిన కోటిపల్లి క్షేత్రమునీపురంబునకు సమీపంబుననె కలదు. మరియు సాత్విక బ్రహ్మ విద్యావిలాసనిరసనమను మతగ్రంధమును రచించిన బుద్ధిరాజు పేరయ్యశాస్త్రిగారి నివాసము యీరాజమహేంద్రవరపురంబే.

ఇట్టి దివ్యపురంబున, శివభక్తులగు తామెల్లరు నిరుపమానమగు భక్తిని మహేశ్వరునందును మహేశ్వరపూజాపరాయణులగు మాహేశ్వరులయందును గన్పరుచుచున్నందులకు సుమానసహితుడగు మార్కండేయేశ్వరస్వామి తమకెల్లరకు నాయురారోగ్యైశ్వర్య పుత్రపౌత్రాభివృద్ధినొసగి కాపాడుగాత.

దూరదేశమునుండి, మతాభిమానపరవశులయి యేతెంచిన మాహేశ్వర బృందమునకు నాశరణులు. ఈ సభకు నన్నధ్యక్షునిగ నెన్నుకొనుటచేత నాయం

జెట్టి దక్షత లేకున్నను, వరణీయం దగ్నివలె మీయందు నిగూఢమైయున్న మీపూర్వుల తపశ్శక్తియు, మార్కండేయేశ్వరస్వామి యనుగ్రహంబును నీసభా కార్యమును నిర్వహింపజేయగలవని నా దృఢసంకల్పము.

## శైవమతము.

వేదములయందు శివోపాసన విధింపబడియుండుటచేత శివలింగమునుధరించి శివోపాసనము చేయువారు శైవులనియు, వారిదే శైవమతమనియు, ధర్మశాస్త్రములయందునుగలదు, శివలింగార్చనమాత్రమే గలవారు శుద్ధశైవులు పూర్వశైవులు మిశ్రశైవులు, మొదలగు నామంబులచేతను, శివలింగధారణముగలిగి శివోపాసనమాచరించువారు శైవులను నామంబుచేతను, వ్యవహరింపబడుచుండుట జగద్విదితము శివలింగార్చనము శివలింగధారణమును ఎప్పుడార్యావర్తమున ప్రారంభింపబడెనో మనము విచారింతను.

## వేదకాలమే శైవమత ప్రారంభకాలము.

శు॥ శివఏకోధ్యేయః॥ అమృతస్యదేవధారణోభూయాసం॥ త్ర్యంబకం యజామహే॥ వ్రతమే తచ్ఛాంభవం॥ ఇత్యాదిశ్రుతులును. (లింగపురాణే) శ్లో॥ బ్రహ్మవిష్ణ్వాదయో దేవామునయో గౌతమాదయః ధారయంతిసదాలింగ ముత్తమాంగేషు సర్వదా॥ ఇత్యాది పురాణవచనములును వేదకాలమునుండియు శివలింగధారణము పూజయు గలవని నిరూపించుచున్నవి. “ధిగ్భస్మరహితం ఫాలం ధిగ్గ్రామమశివాలయం” అనునూక్తివలన శివాలయములేని గ్రామమే లేదని ధృవపడుచున్నది. నేటివరకు శివాలయములేని గ్రామములో భోజనము చేయరాదని ధర్మజ్ఞులు పలుకుచున్నారు. ఆసేతుహిమాచలపర్యంత మెన్ని గ్రామములుకలవో, యన్నిటియందును శివాలయములు శివపూజయు ననాదినుంచిగలవని నచో నింతకంటె శైవమతము ప్రాచీనమని చెప్పుటకు వేరేనిదర్శనమేమికావలయు?

## విదేశములయందలి శివాలయములు.

ఈశివలింగార్చనము కాశీరామేశ్వరము శ్రీశైలమున్నగు ప్రదేశములందు మనదేశమందు జరుగుటయేగాక విదేశములయందును గలదు రోమకయూనాను దేశములందలి శివలింగములకు (ప్రియేఫస్ ఫల్లాస్) అనుపేర్లుగలవు ఫాల్గుణమాసమునందు వసంతోత్సవము అను పేరుతో “శివపూజ” మహోత్సవ

ముగ నటజడుగును. కర్నల్ తాడ్ మహాశయుడు ఫలేశ అను పదములోనుండి ఫల్లాస్ అను శబ్దము నిష్పన్నమైనదని వ్రాసినాడు. అరబ్బులు శివలింగములను లాత్ అను పేరుతో పిలచెదరు. పురాతనమగు బైబిల్ గ్రంధమునందు రైహోబోయరుయొక్క పుత్రుడగు ఆశ అనువాడు తనతల్లి మామకను బలియివ్వబోవు చుండగా నిరోధించెనట. ఇట్టిచరిత్రములవలన క్రీస్తుపూర్వమే శివలింగార్చనము విదేశములయందుగలదని ధృవపడుచున్నది. అరబ్బులదేవతయగు లాత్ అను లింగము యేబదిమనుష్యుల పొడుగుకలిగియున్నదట. ఆదేవాలయస్థంభములు బంగారముతో కప్పబడియున్నవి, ఫ్రాన్సుదేశమున సత్రములయందును దేవలంబులయందును, ధర్మశాలలయందును అన్నిప్రదేశములందును శివలింగములుంచబడియున్నవి కాబేయందు మక్కేశ్వరలింగము కలదు. మక్కేశ్వరలింగప్రశంస భవిష్యత్పురాణములో బ్రహ్మపర్వమునందుగలదు.

అమెరికాదేశమునందు 'ఫేరులియా' అను ప్రాచీనప్రదేశము కలదు అందు పురాతనమానవులు నసింతురట. వారును లింగములనర్చింతురట. ఇటలీ గ్రీసుదేశములయందు లింగార్చనకలదు. ఈజప్టుదగ్గరగల మేఫిజ్-అసీరిజ్, అను క్షేత్రములందు నందివాహనారూఢులైన ఈశ్వరవిగ్రహములు కలవు అచ్చటి వారు శివలింగములకు పాలచేత అభిషేకమును బిల్వదళములతో పూజయు చేయుచున్నారు

తుర్కీస్థానములో 'హెడ్రాపోలీన్' అనునగరమున గొప్పశివాలయము కలదు అందు 300 అడుగుల యెత్తుగల శివలింగముకలదు. అచ్చట జం జం అను పేరుగల నొక కోనేరు కలదు అచ్చటివారు ఖర్జూరపాకులచేత ఆలింగమును బూజింతురు స్కాట్లెండునందు సువర్ణాచ్ఛాదితమగు శివలింగము కలదు నేటికిని దానిని భక్తితో నచ్చటివారు పూజించుచున్నారు.

మరియు బాబలీజ్ నగరమందు నొకమహాలింగము కలదు అయ్యది 1200 అడుగులు యెత్తుగలిగియున్నది. ఇంతటిగొప్పలింగము భూమియందెచ్చటను లేదు అనామ్ దేశమున భద్రవర్మరాజుచే గట్టించబడిన శివాలయము కలదు. ఆరాజ చంద్రుని శాసనములందు మొట్టమొదట ఓం నమశ్శివాయ అను షడక్షరీమహామంత్రము వ్రాయబడియున్నది.

ఈరాజ దేశమండలిరాజులు తమనాణెములందు వృషభవాహనారూఢుడై

త్రిశూలహస్తముగల శివవిగ్రహములనే వేయుచుండెడివారు. ఇటులే కానిష్క రాజులుకూడా తమనాణెములందు శివవిగ్రహములను వేసెడివారు. జయేంద్రవర్మ యనురాజు శంభుభద్రేశ్వరస్వామికి క్రీ॥ 1088 సత్సరమున 1720 తులముల బంగారముపెట్టి సువర్ణకవచమును చేయించెను. కుషాణదేశీయులు తమనిక్కాల యందుగల 'మహేశవిగ్రహమును' 'మయూసేనో' అని పిల్చుచుందురు క్రీస్తుకు పూర్వము 1 వ శతాబ్దమునందు బైక్ట్రియన్ రాజులును శకరాజులు రాజ్యము చేయుచున్నకాలములో శివవిగ్రహములను వందివాహనాయూథమైనవిగాజిత్రించి శైవమతప్రచారము చేయుచుండెడివారు. గుప్తవంశీయులు శివారాధన పర తంత్రులుగ నుండిరి.

మనము నిష్పక్షపాతముగ విచారించిన విదేశములందును స్వదేశమునందును రాజులు, ప్రజలు శివలింగారాధనమే ముఖ్యముగ భావించి యాచరించుచున్నటులను క్రీస్తుపూర్వమే చాలకాలమునుండి లింగార్చనయున్నటులను చారిత్రిక ముగ ధృవపడుచున్నది. విదేశములందు శివలింగములెందుకుగలవని యాశ్చర్య పడనవసరములేదు. సర్వఖండముల సృష్టించిన మహాదేవుడగు శివునిరూపము సర్వజనోద్ధరణమునకై అంతటను ప్రదర్శింపబడుట సహజమేకాని వేరుకాదు. అనాదినుండియు సర్వులచే బూజింపబడుచున్న శివలింగమును బూజించుచు శివుడేదైవమనిఘంటాఘోషముగ మనమతాచార్యులచే ప్రచారముగావింపబడిన శైవమతము వైదికమతమనియు చాల పురాతనమనియు జెప్పుటలో నానంతయు సందియములేదు.

## శివదీక్ష.

సనాతనమగు నిట్టి శైవమతమున జన్మించిన మనకు శివానుగ్రహము కలుగుటకై శివోపాసన ప్రధానమగుటచేత తదుపాసనముకొరకై శివదీక్ష యొసంగ బడుచున్నది. "వ్రతమేతచ్చాంభవంతత్సమాచరేత్ ముముక్షుః నపునర్భవాయ॥ అని యుపనిషత్తులయందు నీశివదీక్షయే పేర్కొనబడినది. దీనికే పాశుపతవ్రత మనిపేరు. ఈ దీక్షగైకొని శివలింగమును బూజించి యిహలోకమున సర్వసౌ ఖ్యములనంది పరలోకమున ముక్తినొందుటయే ఫలము.

## అష్టావరణములు.

భూతిరుద్రాక్షపంచాక్షరీమంత్రములు; గురులింగజంగమములు,తీర్థప్రసా

దములు, అనునష్టావరణములు, ఈ పాశుపతదీక్షకు సంగములు వీటిని ప్రతిదినము నాచరణలోనుంచికొనిన శివలింగతీర్థప్రసాదముల నిత్యము గ్రహించుచున్న మనమతము సర్వమతములలో నాచరణగల యుత్తమమతమని తేలుచున్నది.

## శైవమహాపీఠము—కార్యస్థానము.

పీఠకార్యక్రమము సులభముగా నెరవేరుటకై 1 బెజవాడ 2 రాజమండ్రి 3 విజయనగరం 4 వరంగల్లు అనునవి ప్రధానస్థానములుగ నుంచవలెను. ప్రతి కేంద్రస్థానమునందు నాయాపట్టణవాసులు శైవమందిరముల నెలకొల్పుకొని మతప్రచారము చేయవలెను. శైవమతపత్రికాశికాపత్రికలు తమయొద్దకురాగానే అచ్చటవారు వెంటనే శైవులకు శైవమతాభిమానులకు బంప శ్రద్ధవహింపవలెను

## శైవమతపత్రికాశిక.

శైవులకెల్లరకు ప్రధానమగు పత్రిక యిదియొక్కటియే. దీనియందలి విషయములు 1 క్షేత్రములు 2 శివలీలలు 3 శైవధర్మములు 4 శివభక్తచరిత్రలు 5 వృత్తాంతములు 6 తదితరవిషయములుండిన బాగుండునని తోచెడిని. ప్రతిసంచికయందును ఒకటి లేక రెండు చిత్రపటము లుండవలెను. నాలుగు పేజీలకుమించని రమణీయములగు విషయములు పండితులువ్రాసిపంపవలెను. అవి ఒక నెలముందుగా కార్యదర్శికిచేరుట జరుగవలెను. ఆవిషయములు పాఠకజనహృదయాకర్షముగ నుండవలయు. ఎల్లరు చందాదారులుగ జేరినగొలదిరయు పత్రికరణీయముగ వెలువడగదు.

## మతప్రచారము.

మన మతమందుగల వృద్ధులు యువకులు లఘు శివపూజనాచరించుటయు, హృదయమున శివలింగమునుధరించుటయు సువర్ణసూత్రగుంభితమగు సన్నని రుద్రాక్షమాలనయిన మెడలో నలంకరించుకొనుటయు ప్రతి సోమవారము సాయంకాలము ఒక అరగంట శివభజనకాని శివకథాపురాణోపన్యాస శ్రవణములుగాని చేయుటయు నత్యవసరకృత్యములని ప్రతివారును గ్రహించవలెను. పలువురు శివలింగధారణములేకయు శివలింగమునుధరించి పూజచేయకయు పూజయుండి లింగపేటిక హృదయమున ధరించుటకు సిగ్గుపడియు, సంతానవంతులయ్యు శివపూజయన నేమియో యెరుగక ముందెపుడో చేయుదమను దురూహోపాత్రు

లుగ గాన్పించుచున్నారు. గురువులమనియు, శాస్త్రజ్ఞులమనియు, పెద్దలమనియు ప్రగల్భములు కొట్టుకొను వారలలోనే శివపూజయందు శ్రద్ధలేక శివలింగమందు దైవభావముంచక, శైవధర్మములందు గౌరవముంచక ఆచరణీయములయియు న్నచో తదితరులకది యెంతవరకు రుచించునో బుద్ధిమంతులూహింతురుగాక. తాను బోధించునదియు నాచరించునదియు నొకటిగాయుండవలెనుగాని భిన్నముగా నున్నచో మతాభిమానులకు వట్టిదానియందు గౌరవములేక పోవుటయే గాక, మతమందుగూడ గౌరవము తగ్గుననుటలో సందేహములేదు. కావున శైవమతస్థు లెల్లరు యెవరికివారు సింహావలోకనము చేసికొని, తమపూర్వు లాచరించినటుల శివపూజనాచరించుచు శివమహిమను బోధించుచు శివలింగధారణము చేయిం చుచు శైవమత ప్రభావమును వెల్లడింతురుగాక,

ముగింపు.

శైవమహాశయులారా!

మనపూర్వులుపాతిన కీర్తిస్తంభములు నేటివరకు నలుదిశల సమాజకాం తుల బ్రకాశించుచున్నవి. వానిని సంరక్షించుకొనుట మనవిధి. ఈ సభకు మహో ఘనతవహించిన ఇజ్జతాసాద్ శ్రీరాజా కందుకూరి బాలసూర్యప్రసాదరావు బహద్దరు జమీందారుగారు మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ। లో॥ ముదిగొండ నాగలింగశాస్త్రులవారు మున్నగు ప్రముఖులు వచ్చియున్నారు. వారి మతాభి మానమెంతయు శ్లాఘనీయము. శైవమతాభివృద్ధికై మీరెల్లరు ఏ కార్యములు చేయ తీర్మానములు చేయుదురో వాటిని నెరవేర్చ ప్రయత్నించుట నావని నెరవేర్చుట సర్వేశ్వరునివని. ఈసభ జయప్రదముగ నిర్వహింపజేయగలందులకు మహోన్నగ మండలికి మార్కండేశ్వరస్వామివారికిని పునః ధన్యవాదంబు లర్పించుచు నింతటితో విరమించుచున్నాడ.

మంగళంమహాత్

మ॥ వరుపై శైలజపై రమావరునిపై నాగేంద్రుపై చండిపై
సురమందాకినిపై మృకండుసుతుపై శుభాంగుపై భృంగిపై
వరగంజూపిన నీకృపారసము నాపై గొంతరానిమ్ము నీ
చరణాబ్జంబుల నమ్మినాను జగదీశా! ఈశ! ముక్తేశ్వరా॥



# 1937-38 సం॥ పు కార్యనిర్వాహక సభా చారిత్రము.

1937వ సంవత్సరములో జరుపబడిన 20వ మహాసభనాటికి లోగడ సభాద్రవ్యము తాలూకు రు 1453-4-9 లు శ్రీదేశోద్ధారక విశ్వదాత కళాప్రపూర్ణ శ్రీకాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారివద్దనున్నూ డాక్టరు శివలెంక మల్లిఖార్జునరావుగారివద్ద రు 1-9-9 లున్నూ వెరశి 1510-6-5 లు నిల్వయున్నది. ఆధనములో విద్యార్థుల విరాళములక్రింద తీసుకున్న రు 65-0-0 లు పోను శేషము 1445-6-5 లు మాత్రము పూర్వపు సభాధనము పైవారివద్ద నిల్వయున్నది. దానినుండి యింకను వ్యయించినయెడల సభకు మూలధనము సన్నగిల్లుచు సభ నిర్ధనమై పోవుననుభీతిచే నా ధనమునుండి వ్యయింపకుండ శైవసాంఘికులవల్ల నూతనముగ వసూలు చేయబడే ద్రవ్యమునుండి ఖర్చులుపోగా శేషించినధనమును మూలధనమునకు చేర్చవలయునని నిశ్చయింపబడియున్నది ఆప్రకారం 20 వ సభా సందర్భమున అవసరములగు ఖర్చులకు మూలధనమునుండి పైనచెప్పబడిన రు 65-0-0 లు తప్ప యింకేమియు ముట్టకయే సాంఘికులవల్ల వసూలుకాబడిన రు 284-7-0 ద్రవ్యములో ఖర్చుపడిన 228-15-1 లు పోను రు 55-7-11 లు నిల్వయున్నది.

ఇంతవరకు చందాలవల్ల గాని. మహేశ్వరార్చనలవల్లగాని, ధర్మములు విరాళములవల్లగాని యీసంవత్సరము సభకు రు 416-3-3 లు జమవచ్చినది గత సంవత్సరపునిల్వ రు 55-7-11 లతో కలసి రు 471-11-2 లు నూతనముగ సభాద్రవ్యమేర్పడినది. ఇందుతో నుదహరింపబడిన యీసంవత్సరపు టాదాయ వ్యయపట్టికలో తెలుపబడినప్రకారం ఖర్చులక్రింద రు 509-0-11 లు వ్యయింపబడినది అనగా అధికముగా ఆదాయమును మించి రు 37-5-9 లు ఖర్చుపెట్టబడినది. యీమొత్తము భావ్యపుచందా నిల్వఫండులోనుండి అప్పుతీసుకోబడినది. మతాభివృద్ధికి మతగ్రంథముల ముద్రించుట వేదశాస్త్రపాఠశాలలను స్థాపించుట, సభాభవనమును నిర్మించుచు గ్రంథాలయమును స్థాపించుట మున్నగు కార్యముల నెరవేర్చవలయునన్న నెంతద్రవ్యముకావలెనో వేరజెప్పవలసినపని లేదు. ముందుప్రకటింపబడబోవు శైవమతస్థుల జనాభారిపోర్టును అధమపక్షము

రు 200 ల వరకైనను అవసరమైయుండును. ఇట్టితటిసంపూర్ణ ధనసహాయముచే శైవసాంఘికులెల్లరు నిట్టియమూల్యకార్యముల చేయించుకొని యందువలన లాభముల బడయుదురు.

ఈశ్వరనామ సం॥ నకు శైవ సభా ప్రచురణములు సక్రమముగా నడచియున్నవి. ప్రచురణములకును యువజనసభా రిపోర్టునకును పోస్టేజిగాక ప్రింటింగు పేపరు వగైరా ఖర్చులక్రింద 261-0-0 లు ఖర్చుపడినది. ఈపత్రికా ప్రచారమునకు చందాదారులను చేర్పించుటకును, గుంటూరు, కృష్ణామండలముల యందును నిజాంరాష్ట్రములందును సంచారముచేసి షుమారు 120 మంది చందాదారులను చేర్పించి పత్రికయాగిపోనీయకుండ కార్యమును నిర్వహించిన ప్రచారకకార్యదర్శిగారగు శివలెంక లింగయ్యగారు మిక్కిలివందనీయులు.

కార్యనిర్వాహకవర్గమువారు అప్రమత్తులుగాక కార్యక్రమమును నిర్ణయించుటకు మూడుపర్యాయములు యీ సంవత్సరము సమావేశమైరి మొదటి సమావేశము 20 వ బెజవాడసభ జరిగినతరువాత రెండవ దినమున అనగా 13-6-37 సం॥ తేదీన బెజవాడ దుర్గావిలాసమున జరిగినది. రెండవసమావేశము 18-11-37 సం॥ తేదీన బెజవాడ సత్యనారాయణపురములో శ్రీ॥ లో॥ ముదిగొండ బసవయ్యశాస్త్రిగారి గృహమున జరిగినది, మూడవసమావేశము సత్యనారాయణపురములో మల్లంపల్లి వీరభద్రరావుగారియింట జరిగినది. మొదటి సమావేశమునందు హాణవిద్యార్థులకున్నూ వేద సంస్కృత విద్యార్థులకు కావలసిన ద్రవ్యములను నిర్ణయించినది రెండవ సమావేశమున హాణ విద్యార్థులకు రు 48-0-0 ల వరకు సన్మానించబడినవి. మూడవసమావేశమున వేదశాస్త్రపాఠశాలలను సభాభవన నిర్మాణములనుగూర్చి చర్చించినది. ఆసందర్భములో శ్రీ॥ ముదిగొండ బసవయ్యశాస్త్రిగారు శ్రీ॥ పం॥ పట్టెస లింగారాధ్యులగార్లు ఉచితముగ విద్యార్థులకు విద్యనుగరపుటకు తమ సమ్మతిని వెలిబుచ్చి మిక్కిలి ప్రశంసాపాత్రులయిరి. 2 వ సమావేశమందు చేయబడిన 14 వ తీర్మానము ననుసరించి శైవసభాపరిపాలనా ప్రణాళికను తయారుచేయుటకు కాన్స్టిట్యూషన్ కమిటీని యేర్పాటుచేసినది. ఆకమిటీవారును ప్రణాళికను పూర్తిచేసి యిచ్చినారు.

శైవసభవారిచే ప్రచురింపబడిన మహోపాధ్యాయ శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రులవారి వేదపధవ్యాసపధ గ్రంథములను వేదాంతార్థపరిష్కార తారహార గ్రంథమును కాశీమొదలుకొని కన్యాకుమారివరకు గల భరతఖండము

నందలి సుప్రసిద్ధ విమత పండితులకును ఖండాంతరములందలి సంస్కృతవిద్యా పారంగతులగు ప్రొఫెసర్ కీత్ మున్నగు పండితులకును బంపబడినవి. కార్య నిర్వాహకవర్గము వారియొక్క 1, 2, 3 సమావేశములచర్యతీర్మానములను, ఈశ్వర సం॥ తాలూకు శైవమహాసభవారి 2, 3, 5 ప్రచురణములయందుముద్రింపబడి సాంఘికులకు నందజేయబడినవి అవి గ్రంథవిస్తరభీతిచే నిచట నుదాహరింపబడలేదు.

ఇంతవరకు కొంత కార్యక్రమము నడచినదిగాని అంతట సంతుష్టిజెందుటకువీలులేదు. ముందు జరుగ దగిన యపారకార్యభారముగలదు. మతాభివృద్ధికరములగు పైకార్యములు నెరవేరుటకు నపారధన మవసరముగాన మతాభిమానధనులయినట్టియు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రవర్ణములలో చేరినట్టియు శివభక్తులైనట్టియు సమస్తశైవులును సత్వరముగ నీమహాసభకు ప్రధానపోషక ఉపపోషకాది చందాదారులుగ జేరుటయేగాక సభకు నపారధన సంపాదమునకు మార్గాన్వేషణ మొనర్చి కృతకృత్యు లగుదురుగాక.



# 12-6-1937 సం॥ -30-6-38 సం॥పు టాదాయ వ్యయపట్టిక.

## జమ

| | |
|---|---|
| [illegible]గడి సభ తాలూకునిల్వ | 55- 7-11 |
| కాశీనాథుని వీరేశలింగంగారివద్ద అప్పుపుచ్చుకున్న రొఖ్ఖం | 30- 0- 0 |
| కాశీనాథుని వీరేశలింగంగారిధర్మం | 19- 0- 0 |
| ప్రధానపోషక పోషకాది చందా తాలూకు | 175- 8- 0 |
| మాహేశ్వరార్చనల తాలూకు | 5- 1- 3 |
| దేవాదిజమీందారుగారి పత్రికావిరాళము | 50- 0- 0 |
| తదితరవిరాళములు ధర్మములు | 138-10-0 |
| వెరశి | 471-11- 2 |
| అధికముగ వ్యయింపబడినది | 37- 5- 9 |
| వెరశి | 509- 0-11 |

## ఖర్చు

| | |
|---|---|
| కారురైలు బండ్లకిరాయి వగయిరా ట్రావిలింగుఖర్చు | 65-14- 6 |
| కాగితములు పుస్తకములు వగైరా | 1- 4- 0 |
| కార్డులు కవరులు వగయిరా | 2-10- 9 |
| విద్యార్థివేతనములక్రింద | 34- 0- 0 |
| శైవసభాప్రచురణములకున్నూ శైవమతపత్రికా శికా యువజనసభారిపోర్టు వగయిరాలకు పేపరు అచ్చువగయిరాలకు | 261- 0- 0 |
| ప్రయాణములలో సామాను మోతకూలి | 3- 9- 6 |
| మతస్థులువగైరాలకు పత్రికలు పంపినందులకు పోస్టేజ్ చార్జి | 44- 0 -0 |
| వరంగల్ భజనసమాజమువారికి | 50- 0 -0 |
| బెజవాడ 20 వ సభా ఫోటోగ్రాఫుకాపీలు 25కి | 31- 4-0 |
| వేదశాస్త్రపాఠశాల సందర్భములో ఖర్చుచేసినవి | 15- 6- 2 |
| వెరశి | 503- 0-11 |

# భాష్యగ్రంథముల తాలూకు అకౌంటు.

**జమ**

| | |
|---|---|
| నిరటిసభవరకు వసూలుఅయిన మొత్తం | 945- 0-0 |
| దరిమిలా రాజమండ్రిసభవరకు వసూళ్ల మొత్తం | 71- 0-0 |
| | 1016- 0-0 |
| ఖర్చు | 908- 0-6 |
| నిల్వ | 107-15-6 |

**ఖర్చు**

| | |
|---|---|
| 11-6-1937 సం॥ 20 వ సభా రిపోర్టు దాఖలా ఖర్చు | 722- 8-6 |
| నాగలింగశాస్త్రిులుగారికి బహుమానంక్రింద | 116- 0-0 |
| భాష్యగ్రంథములను స్వదేశమందును విదేశమందును పండితులకు పంపినందులకు పోస్టల్ రిజిష్టరీ ఖర్చులక్రింద | 69- 8-0 |
| వెరశి | 908 -0-6 |

ఇట్లు

శివలెంక పున్నయ్య,

20 వ శైవమహాసభా కార్యదర్శి.

# చందాల వివరము.

---:0:---

| | |
|---|---|
| ప్రధానపోషకులకు సంవత్సరమునకు | రు 5-0-0 |
| పోషకులకు సంవత్సరమునకు | 3-0-0 |
| ఉపపోషకులకు సంవత్సరమునకు | 2-0-0 |
| సభ్యత్వచందా సంవత్సరమునకు | 1-0-0 |
| పత్రికచందా సంవత్సరమునకు | 1-8-0 |
| విడిపత్రిక 1. కి | 0-6-0 |

ప్రధానపోషక, పోషక, ఉపపోషకులకు పత్రిక యుచితముగా పంపబడును. వీరికి ఓటింగు హక్కు గలదు.

సభ్యత్వచందాదారులకు సభయందు ఓటింగుహక్కు కలదు. వీరికి పత్రిక పంపబడదు.

పత్రిక చందాదారులకు పత్రికపంపబడును గాని వీరికిఓటింగు హక్కు లేదు.



---

గమనిక:— సవరణచేయబడిన శైవమహాపీఠపరిపాలనా ప్రణాళిక ముందుసంచికలో ప్రకటింపబడును.

ల్లం పల్లి కామేశ్వరమ్మగారు

శ్రీ శివాయగురవేనమః




ద్వి మా స ప త్రి క .


| | | |
|---|---|---|
| సంపుటము 1 | బహుధాన్యనామ సంవత్సర శ్రావణ, భాద్రపదమాసములు | సంచిక 3 |


శ్లో॥ శ్రీవేదశాస్త్రార్థ తతిప్రభాసికా। సందేహసందోహ మహావినాశికా।
తత్త్వత్రయోద్బోధన సిద్ధదేశికా। జయత్వియం శైవమతప్రకాశికా॥

బ్ర॥ శ్రీ॥ లో॥ విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు,
శైవమహాసభాధ్యక్షులు

,, కందుకూరి వటుకభైరవమూర్తిగారు బి. ఏ. వకీలు
కార్యదర్శి

,, శివలెంక లింగయ్యఅయ్యవారు రిటైర్డు పోలీసు
సబ్ యిన్స్పెక్టరు ప్రచారక కార్యదర్శి

,, ఈశ్వరప్రగడ సదాశివశర్మగారు శివభక్తిప్రచారకులు


సంపాదకుడు:- ఇవటూరి సానందరావు

ప్రకటన:- పింగళి వీరయ్యపంతులుగారు, బందరు.

ముద్రణ:- మినర్వాప్రెస్, బందరు.

1938

శ్రీ శివాయగురవేనమః

# శైవమతప్రకాశిక.

## శివుని యైశ్వర్యము.

సమస్తదేవతాగ్రగణ్యుండగు శివునకు మహాదేవుండను నామముగలదు. ఈదేవుండఖండైశ్వర్య విభవముచే సమస్తదేవతలకు మిన్నయై యుండును. ఐశ్వర్యమనగా దేనియందును కొరతలేనిది. కొరతను పూర్తిచేయని యైశ్వర్య ముండియును లాభములేదు. పరమేశ్వరుడిట్టి యైశ్వర్యమహిమాతిశయుండగుటచే, దేవదానవాదులకుఁ దనయాశ్రితులకుఁ గోరినకోర్కెలొసంగె. ఈ దేవుని యైశ్వర్యవిషయమై యీ దిగువ విచారింతముగాక,

1 శ్లో॥ కైలాసే కమనీయరత్నఖచితే । కల్పద్రుమూలేస్థితం।
కర్పూరస్ఫటికేందుసుందరతనుం । కాత్యాయనీ సేవితం।
గంగోత్తుంగ తరంగ రంజిత జటా । భారం కృపాసాగరం।
కంఠాలంకృత శేషభూషణ మముం । మృత్యుంజయం భావయే॥
ఆదిశంకరులు.

ఈశ్వరుడు కల్పద్రుమూలే స్థితుండని చెప్పబడినది. కల్పవృక్షంబు కోరిన కోర్కెలనిచ్చునదిగావున తన్మూలమున నాసీనుండగు శివుండాశ్రిత పారిజాతమని చెప్పబడుట కెట్టి సందియములేదు.

2 శ్లో॥ కుండలీకృత కుండలేశ్వర । కుండలం వృషవాహనం।
నారదాది మునీశ్వరస్తుత । వైభవం భువనేశ్వరం।
అంధకాంతకమాశ్రితామర । పాదపం మదనాంతకం।
చంద్రశేఖరమాశ్రయే మమ । కింకరిష్యతివై యమః॥
వేదవ్యాసులు

ఇందు ఈశ్వరుండాశ్రిత కల్పతరువని వర్ణింపబడెను. మొదటి శ్లోకములో జెప్పబడిన ప్రకారము పరమేశ్వరుడు రత్నఖచిత సింహాసనాసీనుండని యున్నది. రెండవశ్లోకములో జెప్పబడినట్లు మహేశ్వరుండని వర్ణింపబడినది. ఇటులనే విశ్వేశ్వరుండనియును బ్రసిద్ధి

3 శ్లో॥ రత్నసాను శరాసనం। రజతాద్రి శృంగనికేతనం।
శింజినీకృత పన్నగేశ్వర। మచ్యుతానల సాయకం।
క్షిప్రదగ్ధపురత్రయం త్రిది। వాలయైరభివందితం।
చంద్రశేఖరమాశ్రయే మమ। కింకరిష్యతి వై యమః॥

వేదవ్యాసులు

నవరత్నములతో నిండిన మహోన్నతమైన మేరుపర్వతము పరమేశ్వరుని శరాసనంబని చెప్పబడుచున్నది. మేరుపర్వతము యొక్క భాగము విచారించగ భూమికి లక్షయోజనములు గలదని భూగోళశాస్త్రజ్ఞులచే గణింపబడియె. ఆగణితమెట్లనగా మనము నివసించు ద్వీపమునకు జంబూద్వీపమని పేరు. ఇదిగాక నారు ద్వీపములుగలవు. ఈ సప్తద్వీప విస్తీర్ణంబగు భూమికి నూరుకోట్లు సూర్యుడనిన్ని, సూర్యునకు నూరుకోట్లు మేరుశైలంబని వర్ణింపబడినది. ఇట్టి మేరువు నవరత్నములతో నిండియుండునవియు, నీగిరిసువర్ణాకృతిగలదనియు మహామహులు వర్ణించిరి. ఈ దిగువశ్లోకమును విలోకింపుడు.

4 శ్లో॥ మధురిపు విధిశక్రముఖ్యదేవై। రపి, నియమార్చిత పాదపంకజాయ।
కనకగిరి శరాసనాయతుభ్యం। రజిత సభాపతయే నమశ్శివాయ॥

వేదవ్యాసులు.

కనకగిరియని మేరువునకు జెప్పబడినది. ఇట్టిమహామేరువును చేతధరించిన శివుండెంతటి ధనికుడో యూహింపనశక్యమైయున్నది.

నవనిధులుగల కుబేరుడీశ్వరునకు దాసుడు.

శ్లో॥ ధరణీధర శుభ ధవళ విభాస్వర। ధనదాది ప్రియదాస శివ।
సాంబసదాశివ సాంబసదాశివ సాంబసదాశివ సాంబశివ॥

ఆదిశంకరులు

కుబేరుడు ధనాఢ్యుడగుటచే, ధనదుడని నామాంతరమున్నది ఆయన శివునకు దాసుడని స్పష్టపడుచున్నది. కుబేరుని నవనిధులనుగురించి విచారింతము. వజ్ర, వైడూర్య, గోమేధిక, పుష్యరాగ మరకత మాణిక్యాది వివిధ రకముల రత్నములుగలవు. అనగా నొక్కొక్క రత్నమున కొక్క సముద్రరాశియు

డుటచేత సముద్రమున కంతులేదని యన్నట్లు, యిట్టి నవరత్ననిధులు తొమ్మిది గల కుబేరుండెంతటి ధనికుడో, అట్టి నవనిధులు కుబేరునకొసంగిన శివుడెంతటి వైభవోపేతుడో యూహించుటకు బ్రహ్మాదులు చాలరన్న నేతన్మాత్రులకు లెక్కయే లేదు. ఇట్టి కుబేరుల డీశ్వరునకుదాసుండట.

ఈశ్వరుడు వెండికొండ నధిష్టించి యున్నాడని సమస్తమైన వారలకు దెలియును. ఈ వెండికొండయే కైలాసమనంబడును. ఈ పర్వతము సహిత మీశ్వరుని ధనాధిక్యతను వెల్లడిచేయుచున్నది. సముద్రంబునకు రత్నాకరం బనిపేరుగలదు మధ్యసముద్రమందు మానవులకలవిగాని రత్నములున్నవనిప్రసిద్ధి. అట్టి రత్నముల కాలయంబగు సముద్రమును పరమేశ్వరుండంబుఱపాదిగా జేసి కొనెను. ఇట్టి రత్నరాశినివద్దగల యీశ్వరుని యైశ్వర్యమపారము.

వేయి ఫణములపై సువర్ణకిరీటములుగలిగి మాణిక్యకాంతులతో తేజరిల్లు శేషుండు శివునకు గంతాభరణంబు. ఈ విషయములో మొదటి శ్లోకంబున నాల్గవపాదంబున విశదీకృతము చేయబడినది. వాసుకియను నింకొక సంపన్న పన్నగము శివుని జందెము. జందెముయొక్క బ్రహ్మముడి, వాసుకియొక్క పడగల రత్నకాంతులతో నిండియుండును. ఇదిన్నిగాక తక్షకుండను నింకొక సమతుల్య సర్పరాజు పరమేశ్వరునకు దండగడియమై మణికాంతుల బ్రకాశింప జేయుచుండును. శివుండు మణిగణభూషితుండని చెప్పుటచే పన్నగమణి భూషణములు సహితము గారణంబులే. ఈ సర్పంబులన్నియు సువర్ణాకృతిగల సర్పంబులట. ఆదిశంకరులిట్లు వర్ణించిరి.

శ్లో॥ నానామణిగణ భూషణనిర్గుణ । నటనజన ప్రియనాట్యశివ।
సాంబసదాశివ సాంబసదాశివ సాంబసదాశివ సాంబశివ॥

ఇకశివుండెక్కెడి వృషభము సంగతి విచారింతము. వృషభవాహనము యొక్క వర్ణన, శివగీతలయందిట్లు చెప్పబడియున్నది.

శ్లో॥ పీయూషమథనోద్భూత । నవనీతస్య పిండవత్।
స్వర్ణవాలం మరకత । చ్ఛాయా శృంగద్వయాంచితం।
నీలరత్నక్షణం హ్రస్వ । కంఠ కంబళభూషితం।
రత్నపల్యాణ సంయుక్తం । నిబద్ధం శ్వేతచామరైః।
ఘంటికాఘుర్ఘురీశబ్దైః । పూరయంతం దశోదిశః।
తత్రాసీనం మహాదేవం । శుద్ధ స్ఫటిక సన్నిభం॥

పై శ్లోకములో జెప్పబడిన ప్రకారము పరమేశ్వరుండధిష్ఠించు వృషభమునకు బంగారుతో కయున్న మరకతముల జెక్కిన శృంగద్వయమును, నీలమణి కాంతులీను నేత్రంబులును, కంఠమునకు గట్టిన రత్నకంబళియును రత్ననిర్మితమైన పల్లంబుగలిగి శ్వేతచామరంబులు పదిదిక్కుల బూరించుచున్న గంటల శబ్దంబు గలిగి యున్నట్లు వ్రాయబడినది.

ప్రపంచంబున నీ వృషభముయొక్క ప్రయోజనము మానవ జాతికి యున్నది. వృషభంబుచే భూములు దున్నబడుటవలన పంటలు పండుట పాడిగల్గుట యిత్యాది సకలజీవన సదుపాయమునకు మార్గమేర్పడియున్నది. ఇట్టి వృషభము నధిష్ఠించిన పరమేశ్వరుడు ప్రపంచసౌఖ్యమునకు గారణభూతుం డనుటకు సందియంబులేదు. ఇహపరముల కాశ్రయస్థానంబగు శంకరుని మహిమ వర్ణింప నసాధ్యము. "శంకరోతీతి శంకరః" అని చెప్పబడినట్లు శంకరుడు సౌఖ్యము నొనగూర్చు దేవుండను నర్థము స్పష్టపడినది.

శ్లో॥ ప్రాతర్భజామి పరమేశ్వర బాహుదండాన్।
ఖట్వాంగశూల హరిణాపి పినాకయుక్తాన్।
గౌరీకపోలకుచరంజిత పత్రిరేఖాన్।
సౌవర్ణ కంకణ మణి ద్యుతి భాసమానాన్॥

ఆదిశంకరులు

సర్పములను శంకరుడు కంకణములుగ ధరియింపగ, నాపన్నగములమీద నుండు దివ్యరత్నములు పరమేశ్వరుని హస్తంబుల ప్రశస్తకాంతులతో బ్రకాశించును. ఈశ్వరుడు దేవతల నాజ్ఞాపించునపుడును ప్రమథగణముల బాలించునపుడును దనహస్త సౌంజ్ఞలచే దన యభిప్రాయము వెలిబుచ్చునపుడు తత్కర సంచలనముచేత బుట్టబడిన మాణిక్యకాంతులను బోల్చుటకు దేవగంధర్వాదుల తరంబుగాదు.

శ్లో॥ ప్రాతర్నమామి పరమేశ్వర పాదపద్మం।
పద్మోద్భవామర మునీంద్ర మనోనివాసం।
పద్మాక్ష నేత్ర సరసీరుహ పూజనీయం।
పద్మాంకుశ ధ్వజసరోరుహ లాంఛనాఢ్యం॥

ఆదిశంకరులు

శ్రీమహేశ్వరుని పాదములయందు పద్మము, అంకుశము, ధ్వజము మున్నగు మహదైశ్వర్య సంపన్నములగునట్టియు, అఖిలాండకోటి బ్రహ్మాండ

పై శ్లోకములో జెప్పబడిన ప్రకారము పరమేశ్వరుండధిష్ఠించు వృషభమునకు బంగారుతో కట్టియున్న మరకతముల జెక్కిన శృంగద్వయమును, నీలమణి కాంతులీను నేత్రంబులును, కంఠముక్రింద రత్నకంబళియును రత్ననిర్మితమైన పల్లంబుగలిగి శ్వేతచామరంబులు పదిదిక్కుల బూరించుచున్న గంటల శబ్దంబు గలిగి యున్నట్లు వ్రాయబడినది.

ప్రపంచంబున నీ వృషభముయొక్క ప్రయోజనము మానవ దేశమునే యున్నది. వృషభంబుచే భూములు దున్నబడుటవలన పంటలు పండుట పొడిగట్టుట యిత్యాది సకలజీవన సదుపాయమునకు మార్గమేర్పడియున్నది. ఇట్టి వృషభము నధిష్ఠించిన పరమేశ్వరుడు ప్రపంచసౌఖ్యమునకు గారణభూతుం డగుటకు సందియంబులేదు. ఇహపరముల కాశ్రయస్థానంబగు శంకరుని మహిమ వర్ణింప నసాధ్యము. "శంకరోతీతి శంకరః" అని చెప్పబడినట్లు శంకరుడు సౌఖ్యము నొనగూర్చు దేవుండను నర్థము స్పష్టపడినది.

శ్లో॥ ప్రాతర్భజామి పరమేశ్వర బాహుదండాన్।
ఖట్వాంగశూల హరిణాప పినాకయుక్తాన్।
గౌరీకపోలకుచరంజిత పత్రిరేఖాన్।
సౌవర్ణ కంకణ మణి ద్యుతి భాసమానాన్॥

ఆదిశంకరులు

సర్పములను శంకరుడు కంకణములుగ ధరియింపగ, నాపన్నగములపైనుండు దివ్యరత్నములు పరమేశ్వరుని హస్తంబుల ప్రశస్తకాంతులతో బ్రకాశించును. ఈశ్వరుడు దేవతల నాజ్ఞాపించునపుడును ప్రమథగణముల బాలించునపుడును దనహస్త సౌంజ్ఞలచే దన యభిప్రాయము వెలిబుచ్చునపుడు తప్పక సంచలనముచేత బుట్టబడిన మాణిక్యకాంతులను బోల్చుటకు దేవగంధర్వాదుల తరంబుగాదు.

శ్లో॥ ప్రాతర్నమామి పరమేశ్వర పాదపద్మం।
పద్మోద్భవామర మునీంద్ర మనోనివాసం।
పద్మాక్షనేత్ర సరసీరుహ పూజనీయం।
పద్మాంకుశ ధ్వజసరోరుహ లాంఛనాఢ్యం॥

ఆదిశంకరులు

శ్రీమహేశ్వరుని పాదములయందు పద్మము, అంకుశము, ధ్వజము మున్నగు మహదైశ్వర్య సంపన్నములగునట్టియు, అఖిలాండకోటి బ్రహ్మాండ

నాయకుండన బరగినట్టియు చిహ్నములుగలవు. ఇట్టి చిహ్నములలో నొకటి యైనను సంపూర్ణముగనున్నయెడల సామాన్యుడు చక్రవర్తి యగునని సాముద్రిక శాస్త్రము ఘోషించుచుండ సర్వపరిపూర్ణ శుభరేఖలు పాదంబులగల శంకరుండు సర్వేశ్వరుండనియు, భువనంబులకు కర్తగావున భువనేశ్వరుండనియు నీ చరాచర మయ విశ్వమున కధికారి గావున విశ్వేశ్వరుండనియు, సమస్తరాజులు శివభక్తింజేయుటచేత వారలకు సామ్రాజ్యములు బ్రసాదించుటచేత శ్రీ రాజ రాజేశ్వరుండనియు పలునామాంతరములు గలవు.

శ్లో॥ శాంతం పద్మాసనస్థం శశిధరమకుటం పంచవక్త్రం త్రినేత్రం।
శూలం వజ్రంచ ఖడ్గం పరశుమభయదం దక్షభాగేవహంతం।
నాగంపాశంచఘంటాం ప్రళయహుతవహం సాంకుశంవామభాగే।
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి॥

అని చెప్పబడు నెల్లరకు దెలిసిన శ్లోకమందు శివునిచేత వజ్రాయుధము గలదని నిరూపింపబడియె. వజ్రాయుధం బింద్రునిదిగదాయని కొందరకు సందేహముతోచును. ఇంద్రుడు వృత్రానురవధార్థమై త్రయస్త్రింశత్కోటి దేవతలతోగూడి ప్రదోషకాలంబున బంచాక్షరారాధనంబుజేసి శివుని బ్రసన్నునిగ జేసికొని తదాజ్ఞ ననుసరించి దధీచి మహర్షి వెన్నెముకతో నాయుధంబుజేసికొనెను. శివుండు దనవజ్రాయుధంబుననుండు నంశముకొంత నీయింద్రునాయుధంబున బ్రవేశపెట్టించె. అది మొదలుగ దేవేంద్రుని యాయుధమూ వజ్రాయుధంబని వాడుకలోనికివచ్చె. చలసినపుడు దేవవల్లభుండగు నాయింద్రుని వజ్రాయుధంబీశ్వర మహిమాన్వితంబగుట రాక్షసుల జక్కాడునపు డుపయోగింపబడుచుండును. ఇట్లే శ్రీమహావిష్ణువునకు జక్రంబును లవణాసురునకు శూలంబును పరమేశ్వరుడు ప్రసాదించెను ఇట్టి యాయుధంబుల నీశ్వరుడు భక్తులకు బ్రసాదించుచున్నను, దనయందీ యాయుధములనుగూడ నుంచుకొనును. మున్నృంధీగాధలను విపులముగ వివరించెదము గాక. ప్రస్తుతము మనము పరమేశ్వరునిచేతి వజ్రాయుధ ప్రశంసకు బోవుదము. అతులితంబగు నీ వజ్రంబువెల, మహేశ్వరుచేతి నాయుధంబగు నీవజ్రంబువెల నిర్ణయింపగవీలులేదు.

శ్లో॥ ఐశ్వర్యాగ్రియ చిన్మయ చిద్ఘన అమృతానంత మహేశ శివ!
సాంబసదాశివ సాంబసదాశివ సాంబసదాశివ సాంబశివ॥

ఆదిశంకరులు

శివుండైశ్వర్యాశ్రియుండని వర్ణించిరి.

శ్లో॥ ఆహారప్రియ ఆదిగిరీశ్వర భోగాదిప్రియ పూర్ణశివ।
సాంబసదాశివ సాంబసదాశివ సాంబసదాశివ సాంబశివ॥

ఆదిశంకరులు

ఈశ్వరుండు సమస్తభోగ సమన్వితుడని శ్రీశంకర భగవత్పాదులు వర్ణించిరి.

శివుని మామగారగు హిమవంతుండఖండైశ్వర్య సంపన్నుండని శివరహస్యఖండమందు వివరింపబడియున్నది. పర్వతము శివునకు మామయెట్లగునని సందేహము గొందరి నవనాగరికులకు గలుగవచ్చును. పురాణవిషయంబులు విచారించినయెడల దక్షయాగంబున దాక్షాయణి దగ్ధయై హిమవంతుని గర్భవాసంబున జనించి శివుని పెండ్లాడెననియు, ఆమెయే పార్వతి యను నామంబున వెలసెననియు దెలియుచున్నది. ప్రఖ్యాతపర్వతంబులు పాషాణమయమగు స్థూలరూపమును సూక్ష్మంబున దివ్యసుందర విగ్రహంబులు గలిగి విహరించుట, మాటలాడుట యిత్యాది దేవతాశక్తులు గలిగియుండును. ఉదాహరణముల బొందుపరతును. శ్రీ ఆంజనేయుడు సీతాన్వేషణార్థమై సాగరంబుపై నేగుచు మైనాక శైలంబుచే ప్రార్థింపబడి నాగిరియందొక కాలూనెననియు వింధ్యమేరువు వలె పొడవుగ నెదుగవలెనని విజృంభింపగ నగస్త్యుడు దేవతలచే ప్రార్థింపబడి యా శైలమువద్దకు రాగ, నావింధ్యంబు దేవతాకృతిగ మునికెదురేగి నమస్కరించెననియు నంత నగస్త్యునిచే వింధ్యుని గర్వంబు దూలెననియు గాథలుగలవు. ఇట్లే సముద్రంబుగూడ రూపంబుధరించియుండుననియు సముద్రుడను నామంబున వెలయునని యందరకు దెలియును. గంగాది నదులకు నిట్టి రూపములే యున్నవి. ఈ విమర్శన మింతటితో గట్టిపెట్టి హిమవంతుని యైశ్వర్యము విలోకింతము. పర్వతములకు సిరియుండునాయని కొందరనియెదరు. పర్వతములందు వజ్రపుగనులు గలవని శాస్త్రజ్ఞులు షించుచున్నారు, వజ్రపుగనులుగల పర్వతములిపుడు సైతము కొన్నిగలవట, రాత్రికాలమందు మహోన్నత పర్వతములు వజ్రకాంతితో ప్రకాశించునట. మునీశ్వరులు తమ కొండగుహలయందు జ్వాజ్వల్యమానములగు నీవజ్రములనుంచెదరట. గుహాలీవజ్రకాంతులతో చీకటిని పారద్రోలి పట్టపగలువలె వెలుగుచుండున.

కృష్ణామండలంబున ప్రసిద్ధంబగు బెజవాడ పట్టణ ప్రాంతములనున్న కొండలలో శ్రీ కనకదుర్గాదేవి తన యపారధనమును దాచియుంచి యాద్వారమును

బంధించెననియు నాద్వారను నేరికిం దెఱవబడదనియు జనులు చెప్పుకొనుచుం దురు. ఇందుకు దార్ష్టాంతముగ నొకగాథ జరిగినవిషయముగ జెప్పుదురు పూర్వమొక బీదగొల్లవానికి దుర్గాదేవి ప్రసన్నయై తన ధనమున్న గుహనుండి పదిదోసిళ్ళ నాధనమును దీసికొమ్మనియు నంతకంటె హెచ్చుదీసికొనవద్ద నియు జెప్పెనట. ఆగొల్లవాడు పదిదోసిళ్ళ ధనమును దీసికొని సంతుష్టి నొం దక పదునొకండవదోసిలి దీసికొనబోవ, నావాడు పాషాణంబయ్యెనని జెప్పుదురు. ఇట్టి సామాన్య పర్వతములయందే యైశ్వర్యరాసులుండగ, శ్రేష్ఠనగంబగు హిమ శైలంబున ధనంబుండునన్న వింతయుండునా?

ఇదిన్నిగాక పర్వతములం దమూల్యమూలికలు ప్రకాశించుచుండును. యుద్ధంబున లక్ష్మణుండు రావణునిచేమూర్ఛితుండుగాగ నాంజనేయుడు సంజీవి నిమిత్తమై నామూలికయుండెడి పర్వతంబును సమీపించి యది దానియందుండు టెఱింగి నామూలికను గుర్తెఱిగికొనలేక నాశైలంబును బీకి శ్రీరాముని సన్నిధానంబునకు దెచ్చెనన్న సంగతిని రామాయణంబు జాటుచున్నది. ఇట్టి వెల లేని మూలికలు సైతము శైలములందు గాననగును, మనుచరిత్రలో ప్రవరాఖ్యు డనునొక బ్రాహ్మణుండొక యోగి పుంగవుని యనుగ్రహంబున నొకయాకు పసరు సంపాదించి దాని ప్రభావంబున, హిమశైలాగ్రభాగంబున విహరించుచు నాశైలముయొక్క సిరియు నందుండు దేవకాంతల యుద్యానవనంబులు రమ్యమైన మణికాంతుల వెలుగొందు దేవమందిరంబులగాంచి ముగ్ధుడయ్యెను. వరూధిని యనునొక గంధర్వ కాంత నవలోకించుట నామె వైభవము మొదలుగాల దృశ్యములను నేత్రోత్సవంబుగ జూచెను.

పర్వతములు సూక్ష్మంబున దేవతాకృతిని గల్గియుండునని పైన వివరించి తిమిగదా! అట్లే హిమవంతుడు దేవతాకృతిగలిగి మేనకయను నామెను వివాహముజేసికొని నొక కుమారికను గనెననియు శివరహస్య ఖండమందు వివరింపబడి యున్నది. శంకరుండు చర్మచేలుండనియు, గపాలహస్తుండనియు, జడదారి యనియు, భిక్షుకుడనియు, బన్నగభూషణుండనియు హిమవంతుండు శంకించి తన కుమార్తెయైన పార్వతి పెండ్లాడనియ్యకొనినను, నాపెద్దదైవమునకు దనకుమార్తె నెటుల బాణిగ్రహణంబు జేయింతునని యాలోచించుటజూడ నానొక సంపన్ను డని తేటపరచె. సప్తమహామునులవలన శివుని యైశ్వర్యమును దెలిసికొని, తరు వాత దన కుమార్తెనిచ్చెను. ఇట్టి యుపమానంబులనంతంబులైయుండ విస్తర భీతిని వ్రాయక మానినాడను.

వైజయంతి వనమాలికలచే ప్రకాశించు శ్రీమహావిష్ణువు. శివుని చేతి బాణంబు. త్రిపుర సంహార కాలంబునందు మహావిష్ణువు శివుని చేతి బాణంబయ్యె. ఇందలి పలువిధంబులైన భావంబులు ముందు రాబోవు వ్యాసములందు వివరింపబడును, వైజయంతి వనమాలల వెలయింతని చెప్పరాదు. అలంకార ప్రియుండగు నా మహావిష్ణుండు ధరించు మాలల వెలయున్ను, నారత్నముల వైఖరియున్ను వర్ణించుట యేరికి తరము? ఇదిన్ని గాక శ్రీమహాలక్ష్మి విష్ణువక్షస్థలవాసిని యనబరగుచున్నది. సర్వదేవతలను తన కటాక్షవీక్షణములచే నైశ్వర్యవంతులనుగ జేయు నా రమాదేవివి వక్షంబున నిడికొన్న శ్రీమహావిష్ణువే శ్రీశివుని చేతి బాణంబైయుండ నాశివుని వైభవంబింకెంతటిదో యెన్నుటకేరికిని సాధ్యంబుగాదు. శ్రీ శంకరులీ క్రిందివిధమున విష్ణుండు శివుని బాణమని వర్ణించిరి.

శ్లో॥ భూరథోవిష్ణు బాణశ్చ ! వేదాశ్వో బ్రహ్మసారథిః।
త్రిపురారిశ్చ ధనుర్ధన్వా । శివఏవగతిర్మమ॥

ఐశ్వర్యమందు లక్ష్మి సరస్వతులకంటె మిన్నయగు పార్వతి శివుని యర్ధాంగి. ఈమె యీ యిద్దరి రాణులకంటె పెద్దశక్తి. మహాకాళియను నామంబున బరగుచుండును. ఈమెయొక్క వైభవము లలితా సహస్రనామ త్రిశతనామ స్తోత్రంబున నిట్లు వివరింపబడెను. 'సచామర రమావాణీసవ్యదక్షిణ సేవితాయై'

సరస్వతియును, లక్ష్మియును, జెరియొక వైపున పార్వతికి వింజామరలు వీచుచుండెదరట, ఇట్టి పార్వతి శివున కర్ధాంగియని తెలుపబడెను. "శంకరార్ధాంగశరీరాయై" యని వివరింపబడెను. ఈ పార్వతి కేయూరహారములు గలదనియు, శరీరము బంగరుకాంతితో నుండుననియు చేత బంగారు కమలము ధరించెననియు, సర్వసంపత్ప్రదాత్రియనియు, బంగరుచేలము ధరించుననియు సర్వమునులచేతను, దేవతలచేతను నిరూపింపబడెను, ఈమె వజ్ర మాణిక్య కాంతుల శోభిలు కిరీటము ధరించెనట. ఈమె యైశ్వర్య మాదిశంకరులు, కాళిదాసు మొదలగు మహనీయులును పలువురాంధ్రకవులు ప్రబంధములలో వర్ణించిరి. అట్టి విషయములను దెలుపు కొన్నిటిని మాత్రమిందు పొందుపరచుచున్నాడను.

లసత్కాంచన తాటంకయుగళాయై।
వజ్రమాణిక్య కటక కిరీటాఢ్యై॥

శ్లో॥ ధ్యాయే పద్మాసనస్థాం వికసితవదనాం పద్మపత్రాయతాక్షీం।
హేమాభాం పీతవస్త్రాం కరకలితలసద్హేమ పద్మాం వరాంగీం।
సర్వాలంకారయుక్తాం సతతమ భయదాం భక్తనమ్రాంభవానీం।
శ్రీవిద్యాం శాంతమూర్తిం సకల సురనుతాంసర్వసంపత్ప్రదాత్రీం॥

అను నసంఖ్యాకవర్ణనలుగలవు. ఇట్టి మహదైశ్వర్యోపేతయు; వజ్రకాంతితో బ్రకాశించు పార్వతి శివుని భార్యయన్న నామహాదేవుని యైశ్వర్య విభవమెన్న యేరికి దరంబుగాదు.

నానామణిగణభూషితయగు గంగ శివుని రెండవభార్య. గంగయొక్క పవిత్రతనుజాటు వేరుపన్యాసమందు కొన్ని విషయములు తెలిపెదను. గాన ప్రస్తుతమీమె సిరిసంపద్రాయమే యిందు దెల్లము చేయబడును గంగాదేవి యొక్క సిరి యౌన్నత్యము చరిత్రాత్మకంబగు పండితరాయల గాధయందు గాన్పించును. ఒకపర్యాయము పండితరాయలు గంగను స్తోత్రముజేసి యామెను ప్రత్యక్షంబుజేసికొనినపుడా గంగ తనయొక్క హస్తమును మాత్రము జలముపై జూపెననియు నాహస్తమునుజూచుట కందలి మణిదీప్తులచేతను, ఆభరణముల కాంతిచేతను, ధగద్ధగాయమానమై యుండెననియు దెలుపబడియుండెను. ఇది కలియుగంబున జరిగిన విషయంబగుట నవీనవృత్తాంతంబగు. అట్టి గంగను శిరమున ధరించిన పరమేశ్వరుని మస్తకమానుందరియొక్క మణులకాంతులతో నెంత తేజోవంతమైయుండునో యైశ్వర్య మెంత యగణితమో యేరికినెన్న నసాధ్యంబు.

అసంఖ్యాకములైన ప్రమథగణకోట్లచే పరివేష్టింపబడియుండుటవలన నిందర సేవకుల బోషించు శివుని యైశ్వర్యమపరిమితమని చెప్పతగును. ఈశ్వరునిగురించి యత్యుగ్రతపంబుజేసిన, నందీశ్వర, భృంగీశ్వర చండీశ్వరాదులున్ను చిత్రరథాది గంధర్వులున్ను రావణబాణాదిరాక్షసులున్ను, ప్రమథగణపదవి నందిరి. ఇందులో రావణుండు ప్రమథులలోనున్నాడని చెప్పినంత, నమ్మకము లేనివారు కొందరుందురు. కొంచెము భాగవతగాధ యుందుదహరింపబడవలెను. పూర్వము జయవిజయులను వైకుంఠద్వారపాలకులు సనకసనందనాదులను లోనికిబోనీయక, నిలిపినందున వారలు నీద్వారపాలకులను రాక్షసులగునటుల శపించిరి. తరువరి మహావిష్ణుతో వైరంబున మూడు జన్మములలో వైకుంఠంబు జేరునట్లు శ్రీమన్నారాయణునిచే ననుగ్రహింపబడి మొదటి భవంబున హిరణ్యాకశ్యప హిరణ్యాక్షులుగను, రెండవ భవంబురావణ కుంభకర్ణులుగను, మూడవ భవం

బున శిశుపాల దంతవక్త్రులుగను భూమియందుండిరి. ఇందులో రావణుని చరిత్రమే మనకు గావలసియున్నది. ఈయన శివభక్తిజేసియుండుట రాక్షసదేహవిముక్తుడై ప్రమథగణపదవినందెను. దీనికి తార్కాణములు, ముస్ముందు రాబోవు వ్యాసంబులలో బొందుపరచెదను గాన నిందు క్లుప్తముగ దెలుపవలసియున్నది.

ఈశ్వరుని పరివారమున బ్రహ్మవిష్ణ్వాది సమస్తదేవతలు, సప్తమహర్షులు, అనేక యోగులు సంఖ్యాకమితమై కైలాసంబున లెక్కకుమీరిన గుహలలో నుందురు. ఒక శ్రీమంతుని వైభవము సేవకుల సంఖ్యనుబట్టి గనిపెట్టను విధమున, నిట్టి యసంఖ్యాక ప్రమథగణకోట్లను పాలించు పరమశివుడెట్టి శ్రీమంతుడో యూహింపవలయునేగాని వ్రాయవలసిగాదు.

పరమశివుండు సిరియందే గాక, సంపదయందును సమస్త దేవతలయందును మిన్న. సంపదలేకున్న సిరి రాణించదు. అందులకే ప్రపంచమున సిరి, సంపద, యనుపేరు వాడుకలోనికి వచ్చినది. ఈయన పెద్దకుమారుడు విఘ్నేశ్వరుడు. ఈ విఘ్నేశ్వరుని సేవించకున్న విఘ్నములు నివారింపబడవు. ప్రతి శుభకార్యమందును ప్రతి వ్రతమందును, వాపీకూపతటాక దేవాలయ ప్రతిష్ఠలయందును ప్రథమమున నీవిఘ్నేశ్వరుని బూజింపవలయు. ప్రప్రథమమున నీదేవుని గానము చేయవలయు. బ్రహ్మ, విష్ణు, యింద్రుడు మొదలగువారలు దమకార్యములు సాఫల్యమునొందుటకై యీ వినాయకుని బూజించిరి. విస్తారభీతిచే వానికథల నిందు బొందుపరచుటకంటె వేరు వ్యాసములయందు దెల్పిన సమంజసముగ నుండును. కావున సంకుచితపరచుచున్నాడను. ఇట్టి విఘ్నగణాధిపతి శివ పెద్ద కుమారుడైయుండ శివుని శ్రేష్ఠత్వమునకును, అమితైశ్వర్యమునకును విలువ యింత యని యెవరు చెప్పగలరు.

రెండవ కుమారుడు వీరభద్రుడు. ఈ కుమారుడు దక్షయాగంబున దాక్షాయణి ధ్వంసంబుగాగ దక్షుని యాగంబు నాశనంబుచేయదలంచి శంభుండు తన జడ నొకదానిని పెరికి పాషాణంబున జరువగ, నీవీరభద్రుండు జన్మించె. ఈ వీరుని ప్రతాపమీయన నామమే చెప్పుచున్నది. ఈయన బలంబు గణనాతీతంబు ముప్పదిమూడుకోట్ల దేవతలను జయించి పారద్రోలి యింద్రుని పట్టద్రోలి, బ్రహ్మను పరాజితునిజేసి, శ్రీమహావిష్ణువుచేతి సుదర్శనచక్రము లాగికొనిన, యీ యసహాయశూరుని ప్రతాపంబు వేరువ్యాసములందు వ్రాయవలసి

నదేగాని యిందుదహరించుటకు చోటుచాలదు. ఇటువంటి వీరుని కుమారునిగా గన్న శివుని బ్రశంసమడుగవలయునా ?

మూడవ కుమారుడు కుమారస్వామి. ఈయనకే షణ్ముఖుండనియు శరవణభవుండనియు బిలుతురు. ఈయన సమస్త దేవసైన్యములకు సేనాని. విలువిద్యయందసమాన ప్రజ్ఞగలవాడు. బ్రహ్మవిష్ణ్వాది సమస్తదేవతలకజేయులగు తారక, శూరపద్మ, సింహవక్త్రాది రాక్షసుల నీకుమారుడు ద్రుంచె. మృగశరపాషాణాది సమస్తమాయారూపంబుల ధరియించి శూరపద్ముడుజేయు యుద్ధమున కంతులేదు, ఈ రాక్షసులు హిరణ్యకశ్యప హిరణ్యాక్షరావణకుంభకర్ణ యింద్రజిత్తు మొదలగువారలను మించినవారు, షణ్ముఖుఁడీరాక్షసవధానంతరము సమస్త దేవతలచే గొనియాడబడెను. ఈయన యీశ్వరునకు శిష్యుడుగాను భక్తుడుగానుండుచు పరమశివునివలన యఖండ జ్ఞానము దెలిసికొనబడి బ్రహ్మజ్ఞానంబున నారదుని మించినాడు. ఈ మహాత్ముని వృత్తాంతము మున్ముందు వ్రాయుదునుగాన నింతటితో సమాప్తిజెందింతుము.

ఇవన్నిగాక, భైరవుడు; ఆంజనేయుడు మొదలగు మహనీయులందరు శివవీర్యసంజనితులగుటవలన శివుని కుమారులలో లెక్కింపబడిరి. ఇటువంటి బలాఢ్యులను తేజోధనులను పుత్రులనుగాగన్న శివుండు సంపదలో సహితమగ్రగణ్యుండనుటకు సందియమా ?

శ్లో॥ దివ్యమందరగీతానిగాయత్కిన్నరబృందకం।
తత్రత్ర్యంబకమంత్రం జపద్విజకదంబకం।
గాయంతంవీణయాగీతం నృత్యంతంనారదందివి।
నృత్యతోలాస్యవృత్తేన రంభాదీనప్సరోగణాన్॥ శివగీత.

కైలాసంబున నీశ్వరుని సన్నిధానంబున, దివ్యగీతంబుల బాడెడి కిన్నరులు గలరనియు, త్ర్యంబకమంత్రంబు జపించు ద్విజులుగలరనియు; ఆకాశంబున నారదుండు వీణాగానంబుజేయుచు, పరమశివునికానందము గూర్చుచుండు ననియు, రంభాద్యప్సరసలు నృత్యంబులు చేయుచుందురనియు దెలియుచున్నది. ఇట్టి దేవతలగానంబులును అప్సరసలనృత్యంబులను దిలకించెడి శివుండెంతటి భాగ్యవంతుడో జెప్పవలవికాదు.

శ్లో॥ క్వణత్కంకణనిక్వాణైః। మంజుమంజీరశింజితైః।
వీణావేణుస్వనైర్గీతైః। పూర్ణమాసీజ్జగత్త్రయం॥ శివగీత.

ఈశ్వరుని సాన్నిధ్యంబున నాడు దేవస్త్రీల కంకణములయొక్కయు పాదములయందియలయొక్కయు మధురనినాదములు వినుటకు బ్రహ్మానందంబగు తద్దేవకామినుల సౌందర్యాతిశయంబులజూడ నేత్రోత్సవంబగు. ఇట్టి యాటల పాటల దనరొలువుకూటంబునగల శంకరుని వైభవంబెన్న నేరికి తరము.

శ్లో॥ గాయచ్చిత్రరథాదీనాం। గంధర్వాణాంశదంబకం।
కంబళాశ్వతరేశంభోః। కర్ణకుండలతాంగతౌ॥ శివగీత.

చిత్రరథుండను నొక గంధర్వాధీశ్వరునియొద్ద నాడుచు గానంబు జేయుచుండును. పరమేశ్వరుని కర్ణకుండలంబులై కపాలకంబళులను పన్నగులు తమ దివ్యగీతంబుల వినిపించుచుండురు. ఇట్టి వైభవంబుతో భగవచ్ఛివుండలరారు,

ఇట్టి మహదైశ్వర్యవిభూతితో నీశుండొకసరి వృషభవాహనంబధిష్ఠించియు, మరియొకపర్యాయము నందీశ్వర రావణ బాణాది ప్రముఖగణాగ్రేసరులగు వారలనే వాహనంబులుగా నధిష్ఠించి సంచరించుటయు, కైలాసంబునకు వన్నె దెచ్చుచుండును. ఇందులో వృషభము వేరు నంది వేరని తెలియబరచితిని. యథార్థముగ నందీశ్వరుడు వృషభము వేరువేరని ప్రమాణములుగలవు. కావున మున్ముందు తెలియబరచెదను. జనులందరు నందీశ్వరుడనగా నీవృషభంబును కొనుచున్నారు. ఇది సరియైన యభిప్రాయము గాదు.

ఒక్కొక్కపర్యాయము పరమేశ్వరుడు విమానారోహణంబొనర్చినదియు గానబడుచున్నది. శివుడధిష్ఠించు విమానరాజంబిట్టిదని శివగీతయందు వ్రాయబడెను. దానినిందు పొందుపరచుచున్నాడను.

శ్లో॥ ముక్తాతోరణ సంయుక్త శ్వేతచ్ఛత్రశతావృతః।
శుద్ధహేమఖలీనాశ్వతురంగగణసంయుతః।
ముక్తావితానవిలసదూర్ధ్వదేశేప్సురధ్వజః।
మత్తవారణికాయుక్త పట్టితలోపశోభితః।
పారిజాత తరోర్వృద్ధ పుష్పమాలాభిరంచితః।
మృగనాభిసముద్భూత కస్తూరీ మదపంకిలః।
కర్పూరాగరు ధూపోత్థగంధాకృష్టమధువ్రతః।
సంవర్తఘనఘోషాఢ్యనానావాద్య సమన్వితః।
వీణావేణుస్వనాసక్త కిన్నరీగణ సంకులః॥

ఏవందృష్ట్వారథ శ్రేష్ఠం వృషముత్తర్య శంకరః।
అంబికాసహిత స్తత్ర పట్టతల్పే విశత్తదా।
సురనీరజనేత్రాణాం శ్వేతచామరచాలనైః।
దివ్యవ్యజనవాతైశ్చ ప్రహృష్టోనీలలోహితః॥

దిగంతంబుల బ్రకాశింపజేయు ననేక రత్నకాంతులుగల మహాచక్రంబులు గలిగి, ముత్యాల తోరణంబులచే నొప్పారుచు, ననేక శ్వేతచ్ఛత్రంబులు గలిగి, స్వర్ణభూషణములుగల మండపములుగలిగి పారిజాత పుష్ప మాలలుగలిగి, కస్తూరీ పరిమళముగలిగి నానావిధరూపగంధవాసనలు గలిగి పరమశివుండధిష్టించు రథం బొప్పారును. ప్రళయకాల మేఘధ్వనులకు సరియైన నానావాద్యధ్వనులతో కిన్నెరలు సేవింప నొకపట్టు తల్పంబుపై కిన్నెరస్త్రీలు వింజామరలువీవ, నా రథంబున పార్వతీసహితుండై పరమశివుండు గూర్చుండును.

విభూతిర్భూతిరైశ్వర్యంబని, చెప్పబడునట్టి పరమేశ్వరుని భక్తిలాంఛ నంబగు భస్మమే యైశ్వర్య ప్రదంబు. పరమశివుడనేక పర్యాయంబులు దనమేని భసితము, భక్తులకనేకులకు బ్రసాదింప నిహమందప్టైశ్వర్యముగలిగి యంతమందు మోక్షమందిరి. ఇట్టి గాథలనేకములుగలవు ఈశ్వరుని మేనునుండు నొక భసి తరేణువునకు కుబేరుని యైశ్వర్యము సరితూగలేదనిచెప్పిడి. యొక పురాణేతి హాసంబుగలదు. దాని నిందు బొందుపరచెద.

ఒకానొక సమయంబున వైకుంఠనాథుని భార్యయగు శ్రీమహాలక్ష్మి కైలా సమునునుండెడి శ్రీపార్వతీదేవిని పేరంటమునకు బిలిచెనట. పార్వతీదేవి శంకరునాజ్ఞబడసి, వైకుంఠమునకు బోయినంత పేదముత్తైదువబోలె నగుపడు నా శాంకరిని గాంచి యమ్మహాలక్ష్మి గర్వాతిరేకంబున, మిగిలిన దేవకాంతలతో సమానగౌరవం బి చ్చె గా ని, స ర్వ శ క్తి స మ న్వి త యై జ గ దే క మా త యై బ ర గు నాకాత్యాయినికి ముఖ్యగౌరవంబీయదయ్యె అనంతవిభవంబున నలరారు శంకరుడు నివురు గప్పిన నిప్పువోలె దనయైశ్వర్య విభూతిని బ్రదర్శింపక నెట్లుండెనో యటులనే నాయార్యామహాదేవి తనభర్త ననుసరించియుండు. అంత భవాని కైలాసంబునకు దిరిగివచ్చి కనుల బాష్పములు గ్రమ్మ, దీనవదనంబున భర్తయెదుట నిలువబడెను. కొంతసేపటికి శంభుడు తన భార్యనవలోకించి విచారణకారణమడిగెను. అంత నాదేవి తన యాభరణ విహీనతను తేటపరచి వైకుంఠంబున జరిగిన విన్నదనంబు విన్నవించెను. పర

మేశ్వరుండా దేవి యుద్దేశ మెఱింగి తన మేనునుండెడి భసితమును గొంచెమునువ్వు బోలు మాత్రనుజేసి యద్దానికి సరితూగు కాంచనము కుబేరునివద్దనుండి తెమ్ము కొమ్మని యాజ్ఞనిచ్చెను. ఇంత స్వల్పభాగమునకేలాటి సువర్ణము తూగునని యెఱింగియుండిన భవాని భర్తయాజ్ఞ మీరక త్వరగ కుబేరునింట బ్రవేశించుట దెలిసికొని కుబేరుండు దనయాసనము దిగి యెదురేగి వందనశతంబులర్పించి యర్హా మణి పీఠంబున గూర్చుండజేసి యర్ఘ్యపాద్యంబులనిచ్చి, పాదంబుల దడియొత్తి తత్పాదజలము శిరమున జల్లుకొని యంజలి ఘటించి “తల్లీ నీ రాకచే నేను ధన్యుండ నైతిని. నా భవనంబు పావనంబయ్యెను నీ రాకకు గారణంబేమో సెలవిమ్మ”ని యడిగెను. అటుపిమ్మట నాయాది శక్తి తన భర్తయిచ్చిన భస్మరేణువు కుబే రునకిచ్చి, దీని సరితూగు కాంచనంబిమ్మనియె. శ్రీమంతుండగు కుబేరుండాశ్చ ర్యము మానసమున దోప “జననీ! నీ భర్తయు నా దైవమగు పరమశివుండిచ్చిన నవనిధులుండ నవి గోరక స్వల్పమగు ధనము గోరనేల? వలసిన నీభర్తయిచ్చిన ధనరాసులవన్నిటిని దీసికొమ్మ”ని వేడుకొనెను. పార్వతి తన భర్తయాజ్ఞ అంత వరకే యనియు నంతకంటె నెక్కువ పేక్షించిన భర్తయాజ్ఞాతిక్రమణము జరు గుననియు నుడివెను. విధిలేక ధనదుడొక తులను దెచ్చి దానియందుండు నొక దండెయందీ భసిత రేణువు నుంచి, యద్దాని రెండవ దండెయందు సమతుల్యం బగు గాంచనంబునిడ, జాలకుండిన నాశ్చర్యమునొంది, ధనరాసుల క్రమక్రమం బున దెచ్చి తులయందిడుచుండెను. కుబేరుండాశ్చర్యమానసుండగుచు, నేమియు దోపక పరమేశ్వరు మహిమాతిశయంబుల నుగ్గడించుచు, దన నవనిధులు దాని యందుంచినను భసితరేణువుతో సరిదూగవయ్యె. కుబేరుండు దనయాభరణములు దన భవనమునగల మిక్కిలి వెలగల రత్నములు నగలు తన మేనునుండు నాభరణ ములు సహితము నాతులయందిడెను. కుబేరుడు తనయొద్ద నెట్టి యాస్తియు లేదని భార్యమెడలో మాంగల్యసూత్రము తక్క మిగిలిన సమస్తమైన నగల నాతులయందుంచెను. అప్పటికిని జాలకుండిన కుబేరుండు పరమేశ్వరుని విను తించుచు దన శక్తిహీనతను వెల్లడించెను. కాత్యాయని యదియెల్లగాంచి నా భర్తయొక్క భసితరేణువునకు సరిపోలని నీయైశ్వర్యమునుండి యేమి? లేకేమి? యని తలపోసి నిలుచుండెను. ధనదుడా దేవినిగాంచి “జననీ నాయైశ్వర్యము నంతయు దీసికొమ్ము. నేనోడితిని”అని ప్రార్థించు దాసునిగాంచి భవాని నాభ సితరేణువు మాత్రము దీసికొని మిగిలిన సిరియంతయు తృణమువోలె తిరస్క రించి మరల కైలాసమునకేగుదెంచి భర్తపాదములమీద వ్రాలి తనను క్షమించ బ్రార్థించెను. నాథా! నీ మహిమ బ్రహ్మాదులెరుంగరు. ఏరికిని గానరాని

యంతర్ముఖుండవు. నీభసితరేణువునకు గుబేరుని సిరి సరిపోలేదన్న నీమేననుండు మహాభస్మప్రభావమునకు లోకము లేకాదు, లోకాధిపతులు దమసిరిధారవోసినను లాభముండదు. నేను చాలనర్థంబగు యీయైశ్వర్యమును గోరితిని. నిఖిల తత్వవేత్తయగు నీ మహామహిమ యజ్ఞానులెఱుంగరు. అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండవై, షడ్గుణైశ్వర్యసంపన్నుండవైన నిన్నునుతింప నీసామర్థ్యము నగ్గడింప నెవ్వరునుచాలరు. అనునంతలో గుబేరునింట జరిగిన వృత్తాంతము సర్వోర్ధ్వలోకంబులకు వ్యాపించగ నమ్మహావిష్ణుండద్దానిని దెలిసికొని తనభార్య పొరపాటునకు విచారించి మరల నాయాదిశక్తిని సపరివారముగ సబహుమానముగ నాహ్వానించి దివ్యవిమానంబున దీసికొనిరావలసినదిగ మహాలక్ష్మి కాజ్ఞాపించెను.

మహాలక్ష్మియు జరిగినదానికి వగచుచు కైలాసంబునకేగి పార్వతీపరమేశ్వరుల వినుతించి యప్పార్వతిని దన యపరాధంబు క్షమింప బ్రార్థించి మరల వైకుంఠంబున కాహ్వానించెను. దివ్యవిమానంబున వేంచేసిన నాదేవమాత కొకవైపున లక్ష్మియు, వేరొకవైపున సరస్వతియు వింజామరలువీవ దేవతలు కుసుమవృష్టిని గురియింప రంభాద్యప్సరసలాడ నఖండవైభవంబున వైకుంఠమునకు దీసికొనివచ్చి యద్దేవినిబూజించి బహుకాలము సేవించిరి. బ్రహ్మవిష్ణ్వాదిసమస్త దేవతలు ఆదేవిని దివ్యకుసుమంబుల కుంకుమచేతను, నానావిధ రత్నములచేతను, బహువిధముల దమరాణులకు సాయపడి పూజించిరి. మరలయనంతవైభవంబున నుచిత సత్కారములతో నాదేవిని కైలాసంబున భర్త సాన్నిధ్యమునకంపిరి. ఇది స్కాందపురాణాంతర్గత గాథ.

ఇంక నీమహనీయుని చిహ్నములగు భస్మరుద్రాక్ష మాహాత్మ్యములగురించి వేరువేరు వ్యాసములలో పొందుపరుతును గాన నిట విరమించడమయినది. నీభస్మరుద్రాక్షల ఖండైశ్వర్య ప్రదములని పెక్కు పురాణవచనములుగలవు.

బ్రహ్మేంద్రాదులు వర్ణింపజాలని విభవముననుండు శంకరుండు కపాలపాత్రంబు గరముననిల్పి చర్మంబుల చేలములుగధరించి జడలదాల్చి, భస్మవిలేపనుండైయుండుట జూడ నీపరమేశ్వరు డైశ్వర్య ప్రదాతయగుటయే గాక మోక్షప్రదాతయని స్పష్టపడుచున్నది. వైరాగ్యసంపన్నుండగుటచే నిరాడంబరుడనియు విశదమగుచున్నది. తనను సేవించిన మానవులకు భక్తి జ్ఞానవైరాగ్యముల

నిచ్చి ధృవముగ మోక్షంబిచ్చునని యాపరాత్పరుని యందరికియే ఘోషింపరచు చున్నది.

"ఓం హరనమః పార్వతీపతయే హరహరమహాదేవ"

ఇట్లు శివభక్తజనవిధేయుడు

ఈశ్వరప్రెగడ సదాశివశర్మ

భీమవరం, పెనుగంచిప్రోలు పోస్టు,

నందిగామతాలూకా.



శ్రీ శివాయగురవేనమః.

# శ్రీ శివుని యైశ్వర్యముదెలుపు కీర్తనలు.

కమాస్ రాగము—అటతాళము.

ప శివునియైశ్వర్యము చింతనచేయగ । సురపతినుగజ్యేష్ఠుల । కనకమ్ము
అ నవనిధులుగల యక్షనాధుడుదాసుడై । నరవత్న్నపానువృషభువుగాగ జెలగు
॥శివుని॥

చ 1 రజతాద్రినిలయము రత్నాకరముబాణా । రాశీస్థైమెరయగను ।
అసంఖ్యాకప్రమధులు గొలువగాను । ప్రచండతేజమున ।
బొలుపారు పరమేశ । ప్రతిభాశేషము । బొగడనలవిగాదు ॥శి॥

2 సహస్రఫణముల మకుటముల్ మెరయగ । శేషుడు భూషణంబు అహో
యనగా వాసుకిజంధ్యంబు । బహుళశ్రీమంతుడు తక్షకఫణి
రాజు । బాహుదండంబున వలయమై వెలగడి ॥శి॥

3 స్వర్ణవాలముగల్గి మరకతమణులచే । సొంపగునృషభంబు
వాహనంబు । దానికను లింద్రనీలమణులు । స్వర్ణపల్యాణముపై
వెలసెడివాని । స్సపర్ణవాహనుండైన గొనియాడగలడెయా ॥శి॥

4 వైజయంతి వనమాలచే వెలయునా । విష్ణువుబాణంబు । వజ్రపు
తళుకువనితకళత్రంబు । గజముఖశరజన్మ ఘనవీరభద్రులు ।
గజచర్మచేలుని తనయులై వెలయగ ॥శి॥

5 ఇట్టి యైశ్వర్యముల కిరవొందునీశుండు । యిపుడు గజచేలంబుచే ।
కరమున కలితకపాల పాత్రింబుచే । బట్టియుండుట జూడ
భోగమోక్షములను । భక్తులకెల్లపుడు భవుడిచ్చునని తోచు ॥శి॥

6 భీమవరపురమున నెలకొన్న పశుపతి । భీమేశుడితడనగా ।
సదాశివకవిబోధించు వాడనగా । నామరూపంబుల నానావ ।
ర్ణంబుల ! వంతటనిండియు భేదమైయుండెడి ॥శి॥

బేగ్ పలాస్ రాగము—ఆదితాళము.

ప శ్రీమహేశ్వరుని శ్రీవైభవమును । శ్రీఫణిపతి బలుకగలండెయా ॥
అ కామితఫలదాయకుడగు శంభుడు । కైలాసంబును నేలుచుండును
॥శ్రీమహేశ్వరుని॥

చ 1 ఛత్రకిరీట సుకుండల శోభితు । ఛత్ర ధ్వజలాంఛిత పాదపద్ము ।
చిత్రరథాది గంధర్వులు దమ । చిత్రగానముల దృప్తిబరచెదరు
॥శ్రీమహేశ్వరుని॥

2 కర్ణంబుల గీతంబుల బాడుచు । గపాలశంబళ పన్నగులుగలరు ।
నిర్ణయించుటకు సాధ్యంబుగాదు । నిలింపకాంతల దివ్యగీతములు
॥శ్రీమహేశ్వరుని॥

3 రంభాద్యప్సరసల నాట్యంబులు । రమ్యవేణువీణానిక్వణములు ।
అంబుజాసనాదులాలకించెద । రచ్చరమంజీర ధ్వనులు
॥శ్రీమహేశ్వరుని॥

4 అంబరంబునందు జెలగు నారదు । రమ్యమైన రాగాలాపంబును ।
తుంబురు శృంగారపుస్వరములు । తెంపుమీరియుండును నానందము
॥శ్రీమహేశ్వరుని॥

5 భృంగీశుడు తాండవంబుజేయగ । వినయంబుగ నంది చండి మ్రొక్కగ ।
నిగమవేద్యుడైనట్టి పరశివుడు । నిజభక్తప్రముఖుల వీక్షించును
॥శ్రీమహేశ్వరుని॥

6 ఈశ్వరప్రగడ వంశాన్వయుండు । ఈశ్వరపదరాజీవములుగొల్చు ।
నశ్వరపదముల గోరకయుండిన । నాగభూషణుడిచ్చు వరంబును
॥శ్రీమహేశ్వరుని॥

బీజాపలాస్ — ఆదితాళము.

ప శ్రీశివశంకర భక్తవశంకర । శేషవిభూషణ సురవినుతాహర ।
అ కాశీనిలయ కమలాసనవందిత । కరుణాకర విశ్వేశభవాహర
॥శ్రీశివశంకర॥

2 పన్నగభూషణ పాపవినాశన । ప్రమథగణాధిప శూలధరాహర ।
కన్నులజూపుము నీదురూపము । గజచర్మాంబరధరభర్గాహర
॥శ్రీశివశంకర॥

3 నందివాహన నతజనపోషణ । నమస్కారముల జేతుమయాహర ।
కందర్పహరణ కాత్యాయనీశ । కైలాసశైల వినివేశాహర
॥శ్రీశివశంకర॥

4 బాలురమయ్యా పూజింతుమయ్యా । ఫాలలోచన నీ మృదుపదములు ।
కాలునిగెల్చిన ఘనమగుజోదువు । కామితార్థముల నొసగుమయా హర
॥శ్రీశివశంకర॥

5 చల్లనిదొరవని చాలనమ్మితిమి । సకలవిద్యలను నొసగుమయా హర ।
తెల్లనయ్యా నీభక్తిజేతుము । ధరణిభీమవర పురసదనాహర
॥శ్రీశివశంకర॥

6 ఈశ్వరప్రగడ సదాశివసన్నుత । ఈశ్వరభువనాధీశహర ।
శాశ్వతుండవని స్తోత్రముజేతుము । చాలజ్ఞానము నొసగుమయా హర
॥శ్రీశివశంకర॥

## రుద్రాక్ష మహాత్మ్యము దెలుపు కీర్తనలు.

హిందూస్థాని కాపీ — ఆదితాళము.

ప॥ భస్మధారణమహిమ । బాగడగనశమా ॥భస్మ॥
అ॥ భస్మధారణచే । భవబంధంబులు । భస్మీకృతమౌను । బాగుంపమౌను ॥భస్మ॥
చ॥ భూతగణంబుల । బంధించెదియా । భూతివిశేషమే । భువినిసుఖమా ॥భస్మ॥
2 వాసిష్ఠగౌతమ । వ్యాసపరాశర । కౌశికమునివరులు । కనుగొనరే ॥భస్మ॥
3 శిరమునజేరెడి । చెడునీరంబును । గరముహరించెడి । ఘనవైద్యంబౌ ॥భస్మ॥
4 పంచాక్షరమంత్ర । పరమసిద్ధికై । వంచనలేకను । వరలుచుండెడి ॥భస్మ॥
5 సదాశివభక్తికి । సదాచిహ్నమౌ । సదాశివకవిచే । సదాదరణీయమౌ ॥భస్మ॥

భైరవి—ఆటతాళము.

ప॥ భస్మము శివరూపం। బనిబుధులు బల్కిరి।
అస్మదాదులతరమా। అభివర్ణింప ॥భస్మముశివరూపం॥

అ॥ విస్మయమగు దీని। విధమెల్ల వివరింప।
వాస్మరహరుడే యెరుగు। నన్యు లెఱుంగరు ॥భస్మ॥

చ॥ కాముని దహియించి। కణకాద్రిచాపుడు।
కామవిదూరము। గాజేసె జగము।
కామదహిత భస్మ। కాయుడై పరశివుడు।
కామాదిదుర్విషయ। ఖండనుడై నెగడె ॥భస్మ॥

2 అగ్నివీర్యంబౌట। నధికబలంబిచ్చు।
భగ్నంబుజేయుంచు। బంధంబులనుమనో!
లగ్నంబుగలిగించు। లక్ష్యశుద్ధినిగొల్పు।
ప్రాజ్ఞులసేవించి। ప్రౌఢిమతోఁదాల్ప ॥భస్మ॥

3 రమణీయవిభూతి। రాముడుధరియించి।
ఉమాధవునిసేవ। ఉన్నతముగజేసి।
భీమబలుండౌచు। భీషణదైత్యుల।
వామరూపంబుల। నాశమొందింపడె ॥భస్మ॥

4 అంత్యకాలమందు। హరునిభసితమా।
వంతశిరమునబూయ। వంతకభటులకు।
చెంతజేరగరాక। చింతలమునుగుచు।
నంతకాంతకునాజ్ఞ। నతిభీతిబారెదరు ॥భస్మ॥

5 సర్వానుపర్వుల। శ్రేయోదాయకమగుచు।
సర్వమునులకెల్ల। సాదరంబెయగుచు।
శర్వునిపదభక్తి। చిత్తముననిల్పు నీ।
శ్వరప్రగడసదా। శివునాచరణీయమా ॥భస్మ॥

## రుద్రాక్షలనమ్ముకొనవచ్చు బైరాగిపాడు కీర్తనలు.

భూపాలం—ఆదితాళము.

ప॥ రుద్రాక్షలగొనరయ్యా। రుద్రాక్షలగొనుడందరు।
రుద్రకృపకుపాత్రులౌదురు! రుద్రాక్షలగొనుడుబాలు ॥రుద్రాక్షల

2 తనువున రుద్రాక్షనీరు । దినదినమును పారుచుండిన ।
ఘనులకబ్బును నిశ్చయముగ । ఘనతరయాయుర్విభవము ॥రుద్రాక్షల॥
3 పంచముఖిరుద్రాక్షమాలతో । పంచాక్షరజపము చేయుడు ।
పంచముఖుని సాన్నిధ్యము । బడయగలుగుదురయ్య బాబు ॥రుద్రాక్షల॥
4 చూడుడయ్యా రుద్రాక్షలు । జూడుడయ్యా రకరకములు ।
కడుసరసమైనధరల । కిచ్చివేయుచుంటిబాబు ॥రుద్రాక్ష॥
5 కేదారక్షేత్రంబున । కేదారేశ్వరుడు భక్తుల ।
క్షేమంబును బాపదలచి । కల్పించెను నీతరువుల ॥రుద్రాక్ష॥
6 విరివిగగాయును పండ్లు । వృక్షంబులశాఖలపై ।
పరిపరివిధశాకములను । పండ్లపులుసువండెదరు ॥రుద్రాక్ష॥
7 ఈఫలముల భక్షణచే । నీపునిగాంచెడియోగము ।
కఫవాతపైత్యహరణచే । గడువృద్ధినిగాంచువినుడు ॥రుద్రాక్ష॥
8 మునులందరు నీ ఫలముల । ముదమలరగ నారగించియు ।
పెనుతపంబు చేయుచుందురు । పరమమోక్షసిద్ధికై ॥రుద్రాక్ష॥
9 విత్తనముల నెండించియు । వివిధప్రదేశములకును ।
విత్తులుమాలలుగట్టియు । వేరువేరుగను దెత్తుము ॥రుద్రాక్ష॥
10 సన్నని మిరియములబోలు । సన్నని రుద్రాక్షలున్నవి ।
ఎన్నగనీ సరములవెల । యధికమగును వినుడయ్యా ॥రుద్రాక్ష॥
11 ధరభీమపరమునందు । ధవళాంగుని గొల్చునీ ।
శ్వరప్రగడ సదాశివుండు । సంతతమును దెల్పుచుండెడి ॥రుద్రాక్ష॥

ఇట్లు శివభక్తుడు
ఈశ్వరప్రగడ సదాశివశర్మ.

శ్రీ శివాయనగురవేనమః

# నాప్రచారానుభవము.

## శైవసాంఘికులకు నావిజ్ఞప్తి

శైవమతము వేదసమ్మతమైనమతము. భస్మధారణ, రుద్రాక్షధారణ, పరమేశ్వరోపాసనము, ఆచారధర్మములు దీనికి ప్రధానములుగా వేదములయందే చెప్పబడియుండెను. మరియేమతమునకుగూడ నిట్టి యాధారములులేవు. శైవ

మతమునందు విశేషమైన కట్టుబాట్లు, నిష్ఠలు, నియమములు చెప్పబడియుండుట చేత నీవేదమతమునందున్న కొందరు ఆహారవిహారములయందు స్వేచ్ఛగోరినవారై వేదములకుకొన్ని విపరీతార్థములు కల్పనజేసి వాటికితగిన యాచారములను కల్పనజేసి, యేదిచేసినను తెరచాటున జరపవలెననే నియమముతో వైష్ణవమతమును బయలుదేరతీసిరి. ఇది కేవలము శైవమతమునకు పోటీగా బయలుదేరిన మతమగుటచేత, వైష్ణవులు శైవులమీద తీవ్రప్రచారము సాగింపగ శైవమతమునకు కొన్ని ప్రతిబంధకములేర్పడెను. రాను రాను యీమతమునందుగూడ కొంత వెగటుగలిగి వైష్ణవమునకు కొద్దిమార్పులతో మధ్వమతమును బయలుదేరతీసిరి. అప్పుడు బౌద్ధమతముగూడ మంచి ప్రబలముగానుండెను. ఇట్లు క్రొత్తమతములు పెచ్చుపెరిగిపోవుచూ, ఆయామతములవారు వారి వారి కార్యములు సాధించుకొను నిమిత్తము దుండగములుకూడ చేయప్రారంభించిరి. ఇట్టి మహా తరుణమున శ్రీ శంకరాచార్యులవారుద్భవించి లోకమునకు శాంతికొలుపు నిమిత్తము, వారి సామర్థ్యముచేత, మతములన్నికలిపి కలగాయపులగంచేసి, పంచాయతనం యేర్పాటుచేసి యొక క్రొత్తమతమును స్థాపనచేసినారు. క్రొత్త యొకవింతయన్నట్టు చాలామంది యీ నూతన మతమునందు దుమికిరి. ఈ మతమువారలే ప్రస్తుతము స్మార్తవులుగా సరిగణింపబడుచున్నారు. శంకరాచార్యులవారుగూడ వేదములకు కొన్ని విపరీతార్థములు కల్పనచేసి, వానికి తగినట్టుకొన్ని యితర కట్టుబాట్లనుకూడ తయారుచేసి నీతగవులమూకను సరిపోవునట్లేర్పాటుచేసి ప్రజలయందు శాంతినెలకొల్పినారు. మతకలహములులేకుండ చేసినారు. యిదియే వారి ముఖ్యోద్దేశము.

శంకరాచార్యులవారు మాత్రము పరమశైవులుగానుండి, సదాచంద్రమౌళీశ్వరస్వామివారి నారాధించి తరించినారు. వారి శైవభక్తిని చాటించు గ్రంథములనేకములు గలవు. వారు యేర్పాటుజేసిన మతమును పుచ్చుకున్నవారు మాత్రము నేటివరకు గురువుయందు విశ్వాసముగలవారై తామవలంబించిన మత ప్రచారము చేసుగొనుచు పొట్టపోసకొనుచున్నారుగాని, శివకేశవులు సమానమని వారుచెప్పిన ధర్మమును మాత్రము వారు ఆచరణయందు పెట్టుటలేదు.

వైష్ణవులందరు శివభక్తిని విడనాడియుండుటలో వింతలేదు. వారు శివుని సంబంధమైన పర్వములుగూడ పాలింపరు. ఈ భాగములో వారు హిందువులుకానివారివలెనే, తటస్థముగా యూరకుందురు. మధ్వులుగూడ శివజ్ఞాన

మునందు, పూజయందు విశేషతాత్పర్యముగలవారుకారు. శాస్త్రములన్నో
శివకేశవులు సమానమని చెప్పెడివారలేగాని శివోత్కర్షనుగూర్చి బోధించువారు
నెయ్యికి నొకరైననులేరు. అందరూ కేశవనామములే చెప్పుకొనుచుందురుగాని
శివనామములు చెప్పువారొక్కరునులేరు. వైష్ణవ, మధ్వమతములనే కుమార
ములను, శంకరమతమువారు పిపీలికలవలె తోచ్చెడి, ఆదిశైవమును మహానందన
వనమునకు గొప్ప యుపద్రవము కలుగజేయుచున్నారు. శంకరమతమువారికి పర
మేశ్వరోపాసనతప్ప శైవదీక్షలు పూర్తిగాగలవు. శివునిగూడ వారలప్పు
డప్పుడు పూజించుచుందురు: ఆకారమంత శైవమే గాని అంతస్సుమాత్రముకాదు.
నూటికి 80, 90 మార్కులు తెచ్చుకోవలసినవాడు పరీక్ష నిచ్చుటకుంత గ్రహ
చారమో అటులనే వీరు శైవుల కష్టాలో పడవలసియుండి పడకపోవుటయే
గాక శైవమునకు భిన్నముగా ప్రచారము చేయుటవల్లగూడ శైవమునకు కొన్ని
ప్రతిబంధకములేర్పడినవి. వీరు వైష్ణవులుగారు శైవులుగారు, కాని, అబ
ద్ధంవాసుబద్ధంవా కుంటిప్రత్రోళ్ళి వినాయకః అన్నట్లు వీరేగ్రంథమును చేతపట్టు
కున్నను, పతాత్తినామా పుచ్చుకున్నట్లు విష్ణుప్రాశస్త్యమునే చాటుచుందురు.

వైష్ణవప్రతిపత్తుకు వేదసంబంధమైన బాధలున్నవన్నను. కృష్ణమతమునకు
రామమతమునకు, శంకరమతమునకు, గురుసాంప్రదాయ నిష్ఠములున్నవన్నను,
వినువారులేరు. బలముగలవాడిదే రాజ్యమన్నట్లు, యెవరి యిష్టం వారిదన్నట్లు
ప్రజలు కాలంగడుపుచున్నారు. కలియుగధర్మమని సమాధానము చెప్పుచు
న్నారు. రాత్రి దొంగలు వస్తారని తెలిసినప్పుడు మనమెక్కువ జాగ్రత్త
యేలాపడవలెనో అటులనే కలియుగమని మనకు తెలిసినప్పుడు ధర్మములను
కాపాడుటకు మనమెక్కువ శ్రద్ధబూనుట యావశ్యకము. వేదమంతయును
శివునిగూర్చిన మంత్రములుతప్ప వేరులేదు, భారతం రామాయణం భగవద్గీతలు
పూర్తిగా శివోత్కర్షనే తెలుపుచున్నను, శివునికిబదులు విష్ణువనియును,
నారాయణుడనియును, తారుమారుచేయుచు మొత్తంమీద శ్రీకృష్ణునిమహిమను
రాములవారి మహిమను వేనోళ్ళ చాటుచుందురు. ఇంతియేగాక శివుని విష్ణు
మూర్తి భక్తుడుగను, బంటుగను చేయుటకుగూడ ప్రయత్నించుచున్నారు
భక్తి పారవశ్యములో తన్మయము పొంది చెప్పుచున్నట్లు కనబడుచున్నను, నిజ
మైన శివజ్ఞానము లేకపోవుటచే భక్తి తప్పుదారిలోపడి బాధపడుట తప్ప వేరు
కాదు.

శ్రీమహావిష్ణువు శివునిగూర్చి ఘోరతపస్సుచేసి వరములు పొందినట్లున్నూ
ఆదేవిధముగా శ్రీకృష్ణుడు శివునిగూర్చి తపస్సుచేసి తరించినట్లున్నూ గ్రంథ

ములు ఘోషించుచుండగా భక్తి వైరాగ్యములు పురిగొల్పు భక్తులఘోష వేరుగా నుండుటకు కారణము తెలియదు ఇది అల్లుడొచ్చిన పారవశ్యమున అత్తగారు గుడ్డకట్టుకోవడం మరచిపోయినదన్నట్టున్నది. అత్తగారి పారవశ్యమునకైన కొంతయర్థము కలదుగాని యిట్టి కృత్రిమభక్తుల ఘోషకేమియు కనబడదు శివునకు మరింతమహిమ తగ్గించి రామభక్తిని పెంపుచేయవలెననెడి తాపత్రయముతో ఆధ్యాత్మరామాయణమనే తడక నొకదానిని తయారుచేసి దానిచాటున అమాయకులగు భక్తుల నెందరినో తప్పుమార్గముల దింపుచున్నారు. యిది కడుశోచనీయమైనసంగతి. రాములవారి మహిమ శివుడు పార్వతికి చెప్పటేమిటింతయని ప్రశ్నవేస్తే మూఢజనులకు భక్తి పురిగొల్పునిమిత్తము వ్రాయబడినదని చల్లగా సమాధానము చెప్పుదురు తెరచాటున. అందువల్ల రాముని మహిమను చాటుచుందురు బహిరంగముగా. శ్రీశర్మగారువ్రాసిన వ్యాసమును బట్టి చదువరులకు శివోత్కర్షనుగురించిన విషయములుకొన్ని చక్కగా బోధపడగలవు.

ఏదేవునిగొల్చి యెవరుతరించిరో యెవరు ధన్యులయిరో ఆదేవునిగొల్చి తరించుటయే ధర్మముగాని కొల్చినవారినికొల్చి, వారితరువాతవారినికొల్చి, వారి తరువాతవారినికొల్చుటచే ఫలమున్నగిలి తుదకు నశించునే తప్ప ప్రయోజనములేదు. ఈనెత్తిమీదగా వంగినవాడిక్రింద వంగినట్లున్నది. కేవలము వేదమతమైన శైవమతమును విడనాడి అన్యమతము లెప్పుడు ప్రబలప్రారంభించినవో అప్పుడే ప్రజలకు నియమములు తొలగి నిజమైనభక్తి జ్ఞానములయందు విముఖత గలిగి తప్పుదారి తొక్కినట్లు స్పష్టమగుచున్నది. తప్పుదారినితొక్కిన కొత్త దినములలో ప్రజలందరు అపకృతిజేసినను తెరచాటున చేయుచుండెడివారు. ఇప్పుడు మతములు భీమాకంపెనీలవలె హెచ్చు పెరిగిపోయి ప్రజలుపూర్తిగా స్వార్థపరులై యేయపకృతిచేసినను బహిరంగముగానే చేయదొడంగిరి. యెప్పుడైతే నిజమైన మతమును విడనాడి భక్తికి దూరులయినారో అప్పుడే ప్రజలు వ్యసనములకులోనై బ్రహ్మవర్చస్సును గోల్పోయి అల్పాయుష్మంతులయి అకాలమృత్యువునకు పాలబడుచున్నారు. ఇట్టి తరుణములో శివజ్ఞానమును వెదజల్లుట ప్రతిమానవునకు కర్తవ్యమైయున్నది శివభక్తిని లోకమునకు వెదజల్లినగాని, ముండ్లకంచెలవలె హెచ్చు పెరిగిపోవుచున్న యితరమతముల బాధనుండి ప్రజలు తప్పించుకొనజాలరు యిదికేవలము పరమేశ్వరుని కార్యముగనుక ప్రతిమం

చేత యెటులా హతనుచేయుబడినవో అలాగుననే అసత్యమైన మతములన్నియు శివజ్ఞానమునకు పటాపంచలయిపోయి శివకళ్యాణము అచిరకాలములోనే నెర వేరగలదు.

జ్వరపీడితునకు అన్నమునందు అయిష్టముకలుగుమాదిరిగా రానురాను ప్రజలకు మతమన్న గొప్ప ద్వేషముకలుగుచున్నది. ప్రపంచమున నాగరికత పెరిగిన కొలదిన్ని ప్రజలకు పశుత్వము హెచ్చుపెరిగిపోయి ఆహారవిహారములయందు నియమములు శూన్యమైపోయినవి. ఆకారణముననే ప్రజలు వ్యసనములపాలై అల్లాడుచు అనయవములు స్వాధీనముదప్పి అల్పాయుష్మంతులగు చున్నారు. అట్టివారికి తాము సంఘసంస్కర్తలమనిగూడ కొంతగర్వముకలదు. వారు సంఘమునకు నుపకారముచేయకపోగా ద్రోహముచేసినవారగుచున్నారు. ప్రజలను తప్పుమార్గమున బడద్రోయుచున్నారు.

నాకు ప్రచారములో అనేకమంది ఆర్యమతస్థులు బ్రహ్మసమాజ మతస్థులు, సత్సంగమతస్థులు, హరివాధశాబాగారిమతస్థులు అనేకమంది తటస్థించినారు. వారనేక అడ్డుప్రశ్నలువేసి లోకమంతయు మతపిశాచమును పాగద్రోలుచూయుండగా మీరు మతపిశాచమును మామెడకంట్ల కట్టదలచుచున్నారాయని తీవ్రముగా పలికినారు. యేసంస్కరణచేసినను అదియొక మతమేయగును, దానికి కొన్ని కట్టుబాట్లుండి తీరవలయును. యేమతములో చెప్పబడిన ధర్మములుగూడ మన హిందూమతములో చెప్పబడిన ధర్మములేగాని వేరుకాదు. వారిధర్మములన్నియు మనమతములో నిమిడియున్నవి. మన ధర్మములన్నియు వారికిలేవు. మన మతమే సంపూర్ణమైనమతము. కేవలము భ్రమచేత ప్రజలు పైమతములకు బోవుచున్నారే తప్ప వేరుకాదు. తల్లిదండ్రులను మార్చుకొనుటకు మనకెలా యవకాశములేదో మతమును మార్చుకొనుటకుగూడ వదేవిధముగా మనకు నవకాశములేదు. మతముల నుద్ధరించుకొనే నిమిత్తం పూర్వము ప్రజలు తమ ప్రాణములను గోల్పోయిన చరిత్రలువినియున్నాముగాని, మతిపోయిన వారివలె ప్రజలు బుర్రలుగొరుక్కొని బొట్టుతుడుచుకొని మతములుమార్చుకొని యుండలేదు. ప్రథమమున క్రైస్తవమతములో చేరినవారుకూడ శిఖలనుతీసి వేయించుకొనుట కంగీకరింపరైరి. అందునుగురించిన తగవులు మతగురువులైన పోపువద్దకుపోయినను ప్రయోజనము లేకపోయినది. మత ధర్మములు నశించిన కొలది యీ పట్టుదలలుగూడ నశించెను. మతమనునది పుట్టుకతోవచ్చునది గాని

మధ్యవచ్చేది మధ్యపొయ్యేదికాదు. మతిపోయి యెంగిలాకులు నాకువాడు సహితము, తాను ఫలానిమతమువాడనని గర్వముగా చెప్పుకొనుచుండును గాని వేరుమతమునకు చెందినవాడుగా చెప్పుకొనుటకు సమ్మతింపడు.

ప్రతిమతమునకును గ్రంథములే ప్రామాణ్యము. గ్రంథముల ప్రామాణ్యము తెలుసుకొనలేక ప్రజలనేక తప్పు మార్గములు తొక్కుచున్నారు. బుద్ధిపూర్వకముగా నమాయకులను తప్పుమార్గములోదింపి కాలక్షేపము చేయువారనేకు లుండుటచేత నిట్టి ప్రమాదము వాటిల్లుచున్నది. ఎట్లులనగా భగవద్గీతయందు శ్రీకృష్ణులవారు కనపఱచిన విశ్వరూపము పరమేశ్వరుని విశ్వరూపము గాని శ్రీకృష్ణులవారి విశ్వరూపముకాదు. పరమేశ్వరుని విశ్వరూపమును యోగసాధనచే శ్రీకృష్ణులవారు అర్జునునకు కనపఱచ గలిగిరి. ఈనిజమైన యర్థమును మరుగుపరచి యీ విశ్వరూపము శ్రీకృష్ణులవారిదేయని యనేకమంది భక్తులు దేవాలయములలో పురాణములు చెప్పుచూ దేవుని సాన్నిధ్యమందు ప్రమాణము చేసినట్లుగా ముమ్మారు నొక్కి చెప్పుచుండుట యనేకమారులు నేను స్వయముగా వినుట తటస్థించినది. ఇది శోచనీయమయినసంగతి. నిజమును మరుగుపరచుటకన్న వేరు దుర్మార్గములేదు, పాతకములేదు. భగవంతుడు సత్యస్వరూపుడను విషయము వారు గుర్తెరిగినయెడల వారట్టి యపచారముచేయ సమకట్టరు.

తరువాత మరియొకసంగతి యేమన, వ్యాసునిచే రచియింపబడిన దేవీభాగవతము ప్రమాణగ్రంథముగాని ప్రస్తుత మమలులోనున్న తెలుగుభాగవతము నకు మాతృకయైన సంస్కృత భాగవతముకాదు. వ్యాసమహర్షి నిజమైన శ్రీకృష్ణమాహాత్మ్యమును తన చేరచియింపబడిన భారతమునందు ప్రకటించి యున్నాడు. ఆమాహాత్మ్యమునకును ప్రస్తుత మమలులోనున్న సంస్కృతభాగవతములోని శ్రీకృష్ణమాహాత్మ్యమునకును నన్ని విషయములలోను విశేషమైన పరస్పరవైరుధ్యముగలదు. భారతమునందలి శ్రీకృష్ణమాహాత్మ్యమే గ్రహింపతగినది గాని భాగవతమందలి దానినట్లు గ్రహించుటకువీలులేదు. అట్టి భాగవతములో శివమాహాత్మ్యమును నీచపరచినందులకే బమ్మెర పోతరాజుగారికి కొంతబాధ కలిగినట్లున్నూ, దాని, నివృత్తికై వీరభద్రవిజయము రచించినట్లున్నూ, యెల్లరకును తెలిసినసంగతియే. ఇటులనే గొప్పవారు కొద్దివారుకూడ తెలిసియో తెలియకయో శివాపచారములు చేయుచురాగా రాగా లోకమునకు సరియైన

ధర్మమర్మము బోధపడక మతమంతయు సరదాలుగాను గమ్మత్తులుగాను తమాషాలుగాను మారిపోయి వ్యసనములపాలై ఆయురారోగ్యైశ్వర్యములకు దూరులయి ప్రజలుయమబాధలు పడుచుండుట గాంచుచున్నాము. వ్యసనములనగా చుట్టలు, బీడీలు, సిగరెట్లు, కాఫీ, టీ, సోడాలు, కిళ్లీలు వగైరాలు సదా సేవించుటయే. మతధర్మములయందు వీనికెంతమాత్రమును తావులేదు. వీటికేవిధమైన గౌరవమర్యాదలులేవు. శరీరపోషణకు వీటియావశ్యకత యెంతమాత్రములేదు. వీటి నభ్యసించినవారు విడుచుటకు సమ్మతింపరు. విడుపజాలరు. మృత్యువువాత నుండి తప్పించుకొనుటకైనను యనేకసాధనాంతరములు కలవుగాని దీనికి సాధనములేదు ఈవ్యసనములు విపరీతమయిన వేడిపుట్టించి శుక్లనష్టవ్యాధిని కలిగించి శరీరపటుత్వమును నిర్మూలముచేసి, అకాలమృత్యువు వాతపడద్రోయుచున్నవి. 'శరీరమాద్యం ఖలుధర్మసాధనమ్మ'ని శరీరపోషణము చెడుపోవుటచే సర్వధర్మములకు దూరమయిపోవలసి వచ్చుచున్నది. కార్యశక్తిని వహించుటకు తగినయవకాశములు లేకపోవుచున్నవి. అర్థములేని పిచ్చిపిచ్చిమతములు పిచ్చివెఱ్ఱి ఆచారములు ప్రబలిపోవుచున్నవి వ్యభిచారిణులను మార్చుకొనుచుండు చందమున ప్రజలు మతములను మార్చుకొనుట తటస్థించుచున్నది.

పైనవ్రాసిన వ్యసనములలోబడి కొట్టుకొనువారికన్న మద్యపానముచే పీడింపబడువారలే ధన్యులవలె గనుపించుచున్నారు. ఏలయన మద్యమునొకు కాలములయందు మాత్రమే వీరలకు మద్యపానముసేయు నభ్యాసముండును. మిగిలినకాలములయందు వారికట్టి భ్రాంతియుండదు. వీరు కార్యక్రమమున ప్రవేశించిన, గొప్ప పట్టుదలగా పనిచేయగలరు. వీరికి శరీరపోషణము చెడదు. తమకు తెలియని విషయములలో తెలిసినవారినడిగి తెలిసికొనుటకు, వీరలు సంసిద్ధులుగానుందురు. ఈ యోగ్యతలన్నియు పైనవ్రాసిన వ్యసనములలోబడి కొట్టుకొనువారియందు గనుపించవు. శరీరములనుండా తమ జీవితము గడుపవలెననే కోరికతప్ప వారికి కష్టపడి జీవనముచేయుటయందు తాత్పర్యముండదు. అందుకు కావలసిన యవచిత్యము లెన్నియైనను చేయుదురు. వారికి బోధను, చెప్పితే వినరు. ధర్మమును గ్రహించినప్పుడు వారు ఆచరించరు. ఇతరులు ఆచరించుటయందు వారికిష్టముండదు. వారి మిట్టవేదాంతమునే వారు పరమావధిగా చేసికొని కాలక్షేపము చేయుచుందురు. వారి వ్యసనములు వారికి నిత్యనైమిత్తికములు.

వ్యసనములన్నియుంగూడ, భీమాకంపెనీలలాటి మతములలోబాటు, నాగరికతా ప్రపంచములోబడి, చపలచిత్తులగువారినందరిని పీడించి నాశనము చేయు

చున్నవి. వీటి ప్రభలేనియెడల ప్రజలందరు, నిజమైన మతమును, ధర్మములను గుర్తెరిగి అన్నవస్త్రములకు లోటులేక పూర్ణాయుర్దాయము కలిగియుండెడివారు. నిజమైన భక్తియడుగంటి, జ్ఞానము తప్పుదారిని నడుచుచుండుటచేత నిజమైన వేదమతము బోధపడక, గురుభక్తిలేక, దైవభక్తిలేక, బ్రహ్మచర్యము చెడి ఆరోగ్యముకొఱకల్లాడుచు, మతిపోయి, ధర్మము తలకెక్కక, ప్రజలు పిశాచలక్షణములు గలిగి సంచరించుచున్నారు. శైవమత ధర్మములు, నియమములు బోధపడినప్పుడే ప్రజల కీదుస్థితి తొలగగలదనే మొదలైన సంగతులు, మతపిశాచమును పారదోలవలెనని చెప్పిన యువకులకు బోధించగా వారు లజ్జపడి, కడుసంతసించి, వారి యానందమును మాటలతో వెలిబుచ్చజాలక, శైవమహాసభకు సభ్యులుగా జేరి పోషక చందాలను వెంటనే దయచేసి, ప్రచారలోపముచేత మన మతమున కీపాట్లువచ్చినవని విచారపడుచు, నీ మతప్రచారమునకు తామెంతయు తోడ్పడగలమనిగూడ వాగ్దానముచేసిరి.

నా ప్రచారములో నొకనాడు కాలిదారిని పోవుచుండగా నొక మాదిగవాడు నావద్దకువచ్చి "కొంచెము దయచేయండి" 'కొంచెము దయచేయండి' యని సంజ్ఞలుచేసి చెప్పసాగెను. ఏమిటియని యడుగగా సిగ్గులేనిదియని సమాధానము చెప్పెను. సిగ్గులేనిదనగా నేమిటియని యడుగగా పొగాకుయని చల్లగా సమాధానము చెప్పెను. దీనినిబట్టిచూడగా కడజాతివారుకూడ చుట్టవగైరాలను కడుహేయముగా చూచుచున్నట్లు స్పష్టమగుచున్నది.

ఈ నాగరికతా ప్రపంచములో నిట్టి వానికన్నిటికి లేనిగౌరవము కొంత కల్పనచేసి ప్రజలు తమ గౌరవమును కోల్పోవుచున్నారు. రాను రాను మనిషికొక మతము కల్పనయగుచున్నది. నీచవృత్తులు గౌరవింపబడుచున్నవి. గౌరవమైన వృత్తులు నిరసించబడుచున్నవి. సర్వధర్మములు కలిగి యేకమతముగానున్న శైవమతము భిన్నభిన్నమై యనేక మతములుగా నేర్పడుటయే దీనికి ముఖ్యకారణము. ప్రస్తుతము ప్రజల నావరించియున్న పీడలను బాపవలెనన్న శివజ్ఞాన ప్రచారమే కావలసియుండును.

కృష్ణార్జునులు మొదలైన వారి చరిత్రనుబట్టి చూడగా, నేమతములవారైనను మిక్కుటమైన భక్తితో వారి వారి దైవములను కొల్చినగాని వారికి శివభక్తిజ్ఞానము పొడమనట్లు గన్పట్టుచున్నది. శివజ్ఞానసంపత్తియందు వారి కభిమానము కుదరనంతకాలము వారి పూజావిధానము పెరటిదారిబట్టి పోవుచున్న

వనియే భావింపవలెను. వారి మత ధర్మములను వారు సరిగా గ్రహించుట లేదనియే భావింపవలెను. క్రైస్తవగురువులు చేసినప్రచారం వలననే ప్రతి నాటను గొప్పవారుకావచ్చును. శివ కీర్తనములు బహు నేర్చుకొనవచ్చును. వారి వలెనే విశ్వరూపమును జూడవచ్చును. లోకమున ఆనందార్ణవులుగ కీర్తిని బడయవచ్చును. శైవమతమునందు పెక్కు జనులు గురుత్వము వహించి సంచారములుచేసి కాలక్షేపము చేయుచున్నారుగాని వారి యోగ్యత్వము మతమును వర్ధించవలెననిన్ని, ప్రజలకు శివజ్ఞానసంపత్తి చేకూర్చవలెననిన్ని కాదు. శిష్యులను యేదోవిధముగా బాధపెట్టుటమూలముననో, భయపెట్టుటమూలముననో, యాచనమూలముననో, ధనము లాగుటకన్న వారికి యోగ్యమైన యోగ్యత్వమేమియు వారు పెట్టుకోలేదు. దీనికి ముఖ్యకారణము గురుత్వము చేయు వారిలో చాలా భాగము, నిరక్షరకుక్షులుగను, యోగ్యతాశూన్యులుగనునుండి, సామాన్యజనుల కన్న హీనముగా వ్యసనములపాలైయుండుటయే. ఇది కడుశోచనీయము. గురువుల నిట్టి దుస్థితికి తీసుకునివచ్చినది, శిష్యులేయనుట కొంతమాత్రమును సందేహము లేదు. దీనినిబట్టి గురుభక్తి వీడమని హెచ్చరించు టెంతమాత్రమును గాదు, గురువులను సమర్థులుగను యోగ్యులుగను చేసికొనగల యవకాశమునగూడ శిష్యుల యందేయున్నదని నాముఖ్యభావము. శిష్యులను యోగ్యులను గావించుట గురుధర్మము. గురువులను, యోగ్యులుగను, సమర్థులుగను సంస్కారులగున చేసి గొనుట శిష్యుల ధర్మము. ఈ భాగములో శిష్యునియందుకన్న, గురువునందే విశేషబాధ్యతకలదు. కావున గురువులు తమ భావమునే, తమ యోగ్యతయందును, సమర్థతయందును ఆధారపడియున్నదని నమ్మవలెను. గురువులుగా నున్న వారిలో కొందరు శైవమహాసభకు సభ్యులుగా చేరుట తమపని కాదనియు, తమకవసరములేదనే భావముతో తటస్థులుగానుండిపోవుచున్నారు. ఇది కేవలమవినీతితప్పు నేరకాదు. శైవమహాసభకు సభ్యులుగా చేరినవారిపక్క నుండి ధనసహాయముకావలెనని కోరుచుందురు. ఇటువంటి సంఘ సభ్యులనిన్నీ శైవమహాసభను పోషించుటయందు మహాసభవారి యేర్పాటులన్నియును మన్నించుటయందు శైవులందరకు సమానమైన బాధ్యతగలదని గ్రహించుటయే ప్రతి శైవునియొక్క ముఖ్యధర్మము. అందులో గురుత్వము చేసి జీవించువారి కీబాధ్యత ద్విగుణీకృతముగా కలదనియే వారు గ్రహించవలెను.

శైవులలోగూడ సమర్థులగు ప్రచారకులు కొందరు గలరు. వారు కేవలము స్వార్థపరులుగానుండుటచేత, ధర్మములన్నియు స్వార్థమున కనుకూలము

గనే నడిపించవలసిన బాధ్యత వారికి కలుగుచున్నందున, నిది సంఘమునకు ప్రమాదమేకాకుండా, మతమునకుకూడ నొక విధమైన కళంకముగా నేర్పడు చున్నది. ఇట్టి దురాచారములు అచిరకాలములోనే తొలగిపోగలవని నమ్ము చున్నాను. శైవ ప్రచారకులకుగాని, మతగురువులమని చెప్పి బ్రతుకువారికి గాని, శైవమహాసభవారి యోగ్యతాపత్రములుండి, శైవమహాసభకు కొంత సం బంధము కలిగియున్నయడల, అర్థములేని, స్వార్థమున కవకాశములు చాలవరకు తొలగిపోవును. శిష్యకోటికి సుబోధనలు వినుటయందుగలయవకాశములు గూడ పెరుగుచుండునని నానమ్మకము. శైవులుగానున్నవారందరు తక్షణము శైవమహాసభకు సభ్యులుగాచేరి, మహాసభవారి కార్యక్రమమునకు సదా తోడ్ప డుచు, ప్రచారకులకు తగిన సహకారముసల్పి, తీవ్రప్రచారమునకు తగిన పరి స్థితులు కలుగజేతురుగాకయని భగవంతుని ప్రార్థించుచున్నాను.

ఇంతియేగాక శైవమహాసభవారు వెలువరించుచున్న పత్రికకు అల్పసంఖ్యాకులు మాత్రమే చందాదారులుగనున్నారు. ఈ పత్రిక ప్రతి రెండుమాసములకు వెలువడుచుండును. శైవులగువారు చక్కగా తెలిసికొన వలసిన విషయము లనేకములిందుపొందుపఱచుచుందురు. వీటిని శైవులే గ్రహిం చనియెడల, వీరల శైవమున కర్థమేమి? ఈపత్రికవలన ప్రయోజనమేమి? శైవులాతురతతో దీనిని జదివినగాని విషయములు శైవప్రపంచమునకు వెల్లడియగు టకు వీలులేదు. పత్రికలయందు తగినంత యభిరుచికలిగి, సభ్యులు పత్రిక చందాదారులుగా చేరుదురనే విశ్వాసముతో ననేకమంది సభ్యులకు పత్రికల నుచితముగా పంపుచున్నాము. పత్రికలు వీరికి క్రమముగా ముట్టుచున్నవా? లేదా? యని నాప్రచారములో విచారించగా క్రమముగావచ్చుచుండుటలేదనియే సమాధానములు చెప్పుచుండెడివారు. అందుపైన నింటిలోకిపోయి యిల్లు సోదా చెయ్యగా పరుపులక్రిందనో మెరపకాయలబుట్టలలోనో ప్రతులు దొఱకు చుండుట ఆచారముగానున్నది. కొంతమంది యిండ్లలో పత్రికలు దొఱకక పోయినను పత్రికలువారికి ముట్టినట్టున్నూ యెవరో తీసుకొనిపోయినట్టున్నూ సాక్ష్యముమాత్రము వచ్చుచుండెడిది. కార్యస్థానమునుండి పత్రికలు గ్రామ గ్రామమునకు సక్రమముగా చేరుచున్నట్టే తెలియవచ్చినది. సభ్యులు జాగ్రత్త గా తమ పత్రికలు దాచుకొని శ్రద్ధగా చదువుచూ పత్రికకు చందాదారులుగా నేర్పడినగాని, పత్రిక యభివృద్ధిగాంచుటకు వీలులేదు సభ్యులకీ యభిమానము ఉత్సాహముకలిగినప్పుడే ద్వైమాసపత్రిక, మాసపత్రిక కాగలదు. మాసపత్రికపక్ష

పత్రిక కాగలదు. సభ్యులు పత్రికలు చదువుచూ శైవసభా కార్యక్రమమును యెంత ఆతురతతో గమనించుచుందురో, సభయంత శ్రేయోభివృద్ధిని గాంచగలదు. గనుక సభ్యుడుగాని శైవుడుండగూడదనియు, పత్రిక చందాదారుడుగాని, సభ్యుడుండగూడదనియు నా యాశయము. ఇందుకు సభ్యులు మన్నింతురు గాక. మాటలు చెప్పవచ్చును గాని చందాల నిచ్చుకోవటము కష్టమన్నమాట యథార్థమే. కార్యక్రమమునందు గౌరవము కుదిరినగాని కార్యసాధనకు మార్గములు కుదురవు. శైవమహాసభ మహేశ్వరపీఠమనియు, గురుపీఠమనియు లక్ష్యము కుదిరినయెడల సహాకారము అప్రియత్నముగనే చేయగలుగుదురు. అది కుదరనియెడల సహాకారము కష్టసాధ్యముగ గన్పట్టును. (1) ప్రతిసభ్యుడును సభ్యురాలును పత్రికలోని వాంశములు చక్కగా జదివి సదరు వాంశముల నుపన్యసించుటకు తగిన స్థితిలో నుండవలెను. (2) మహాసభజరుగు దినముల కెదురుచూచుచు తప్పక సభకు హాజరగుచుండవలెను- (3) ఎవరికితోచిన యుప న్యాసమును వారు తయారుచేసుకొని సభలో చెప్పుటకు తయారుగానుండవలెను- ముఖ్యముగా మగవారికన్న ఆడువారే యీ పనియందు మిక్కిలి కుతూహలము గలవారుగా గన్పట్టుచున్నారు- మగవారు యిది గ్రహించి తమ యాడువారిని సంతోషపెట్టునిమిత్తమైనను కార్యక్రమమున బ్రవేశించి తామియ్యవలసిన చందాలు వగైరాలను సంతోషముగా నిచ్చివేయుచుండవలెను- అట్లు చేయజాలని యెడల అదియొక శివాపచారముగ భావింపవలెను- ఏలయన మనము చేయు పరమార్థకార్యములలో నిదిగొప్ప పరమార్థకార్యము, మనము చేయు దైవకార్య ములలో నిది గొప్ప దైవకార్యము. గనుక మన దృష్టియంతయు యీకార్యనిర్వ హణమునందే యుండవలయును, శివాపచారమనగా పైపైతలపులన పోవు సం కటముగాదు- కొండనెక్కి- కొబ్బరికాయలు కొట్టుకొని, కొవ్వొత్తులుంచు కున్నమాత్రమున సర్దుబాటుకావలసిన దోషముకాదు- ఇది తరతరములు బాధిం చవలసిన గొప్పతప్పు- పరమేశ్వరునియందు సదా భక్తిజ్ఞానములు గలవారికి సదా పరోపకారచింతగలవారికి, సదా పరశ్రేయ సహవముగలవారికి మాత్రమే యీ పరమరహస్యము బోధపడగలదు- వారట్టి తప్పిదమును సవరణ చేసుకొన గలరు- పైరహస్యము బోధపడక, యోగసంబంధమైన గంజాయి పరబ్రహ్మ సేవలు చేయుచు, మెట్టవేదాంతమునే పరమావధిగా బెట్టుకొని కాలక్షేపము చేయ దలచినవారు కులగౌరవము చెడి, కుటుంబగౌరవము చెడి, ఆరోగ్యముకోల్పోయి ఐశ్వర్యముకోల్పోయి, అల్లాడుచు అధోగతి పాలుకావలసినవారే ఈ హిందూప్రపంచములోని ప్రజలు విశేషభాగమిట్టి యుపచారమునకు గురియై

యున్నారని చెప్పుటకెంతమాత్రము సందేహములేదు- ఈ విషయము ప్రజల గుండెలయందు నాటినగాని యీశ్వరైశ్వర్యమునకు వారు పాత్రులుకానేరరు- ప్రపంచము తిరిగి యుద్ధరింపబడనేరదు- ఇంతియేగాక మన పిల్లలకుగాని కుటుంబమునకుగాని యెప్పటికైనను తోడ్పడగల మహాసంస్థ యిదియొక్కటియే గావున ప్రతి సభ్యునకు నీ సంస్థను పోషించుటయే మొదటికర్తవ్యము. మరి యొక దుస్థితియేమన, ప్రచారకులువచ్చినారు, సమావేశము జరుగవలసియున్న దని సభ్యుల నింటింటికి పోయి పదిమారులు తెలియజేసినను సమావేశములు జరుగుట బహు దుస్తరముగానున్నది, ఇదియే దుస్థితి ప్రతిగ్రామము నందును ప్రబలియున్నది- వారి కనేకవిధములయిన ద్వేషభావములుండవచ్చును గాని మత సందర్భములో నట్టి భావమును ప్రవేశపెట్టతగదు. ఇది నాగరికతా ధర్మము నకును విరుద్ధమే, సనాతనధర్మమునకును విరుద్ధమే. యీదుస్థితితొలగని యెడల మనము మనుష్యులమనిపించుగొనుటకు తగిన యవకాశములనుగూడ వదులుకొను చున్నవారమగుచున్నాము- ఈ దురాచారము కూడ వెంటనే తొలగిపోవల యును- ఇంతియేగాక ప్రచారకులు గ్రామములకు వచ్చినప్పుడు గౌరవముగా వారికితగిన సామాన్య సదుపాయములయినను జూచుట సభ్యుల కర్తవ్యము. ఉమ్మడి గొర్రె పుచ్చిచచ్చినదన్నట్లుగా ప్రతివారును తటస్థముగా నూరుకొనగూడదు- ఈ ధర్మమును కొంతవరకు సభ్యులు మాత్రము పాలించుచున్నట్లు నా ప్రచారములో తెలియవచ్చినది గాని సభ్యులు ప్రచారకులందరియందుకూడ నదే భావము కలిగియుండవలెనని నా యాశయము-

ప్రతివారును నీ రీతిగ జేసినయెడల తాము ధన్యులగుటయే గాక, మతమును మతమువారలనుకూడ నుద్ధరించిన వారగుదురు- ఇంతియేగాక పండితులని పేరుపెట్టుకున్నవారు శివలీలలు, శివపురాణగాథలు అందరకు తెలియునట్లుగా సులభశైలిని వ్రాసినయెడల చిన్నపుస్తకములుగా తయారుచేసి చవుకధరలకు విక్రయించిన, ప్రజలకు, రామ, కృష్ణగాథలవలె వెల్లడియగుచుండును- ఇది యొక గొప్ప ప్రచారము- అధ్యక్ష కార్యదర్శులు యిందును గురించి త్వరపడి కృషిసల్పుదురని నానమ్మకము- చిరకాలముక్రిందటనే యీ పని జరుగవలసి యుండెను. మాటలుమాత్రమే జరుగుచున్నవిగాని విషయము కార్యరూపము దాల్చుటలేదు. పత్రికలోని విషయములుచక్కగా చదువవలెనని మరల నందరిని హెచ్చరించుచున్నాను.

"కృషితో నాస్తి దుర్భిక్షమ్మనే' యార్యోక్తిగలదు. ఏకార్యమునకైనను కృషియవసరము. తగినంత కృషిసల్పినగాని కార్యసిద్ధిగానేరదు. శైవ మహా

సభను సరియైన ప్రచారములేని కారణమున చాలా కాల లోపమువలన కార్య క్రమము దాదాపుగా నిలచిపోవుచున్నదని సభ్యులందరు గ్రహించి నన్ను ప్రచారములో దిగవలసినదని సభ్యులు కోరగా దైవ ప్రేరణ చేత నేనీ కార్యమునకు పూనుకొంటిని. దైవకటాక్షమువల్లనున్నూ, పెద్దలయాశీర్వచనమువల్లనున్నూ గత రెండు సంవత్సరములలోను శైవమండలియందు కొంత సంచలనము కలిగినది- మత ధర్మములయందు కొంత ఆవేశము కలిగినది. దీని ప్రభావము కొంతవరకు రాజమహేంద్రవరములో జరిగిన శైవమహాసభకువచ్చిన వారికి బోధపడగలదు. ఒక్క ప్రచారకుని ప్రచార ఫలితమీరీతినియుండ నీ సంవత్సరము సమర్థులగువారు కొందరు స్వార్థత్యాగము చేసుకుని ప్రచారమునందు కృషి చేయుటకు గొప్పయుద్రేకముతో సమకట్టినారు. అందులో ముఖ్యులగు వారు (1) ఈశ్వరప్రగడ సదాశివశర్మగారు, భీమవరం, నందిగామ తాలూకా (2) ముదిగొండ రామలింగశాస్త్రిగారు, ఈమని గుంటూరుజిల్లా (3) ముదిగొండ బుచ్చిసోమన్నయ్యవారు, విజయనగరం (4) చాగంటి సుబ్బారాయుడుగారు రాజమండ్రి (5) చాగంటి మల్లికార్జునరావుగారు. కాకినాడ (6) చాగంటి భాస్కరలింగశాస్త్రిగారు, వరంగల్లు. శ్రీ దేవిడీ జమీందారుగారు మొదటి నుండికూడ నీ శైవమహాసభను కంటికి రెప్పవలె కాపాడుచున్నారు- వారు మొన్న జరిగిన రాజమహేంద్రవరసభకు దయచేసి సభను జయప్రదముగాజరిపి, యెన్నియో శైవసాంప్రదాయములను, సభాభివృద్ధికి కావలసిన కార్యక్రమమును చక్కగా వెల్లడిజేసియున్నారు- శైవమహాసభ భావిదశ వారియందు ఆధారపడి యున్నదని గ్రహించి శైవులెల్లరును వారియుత్సాహమునను సరించి సభాకార్య క్రమమునకు తోడ్పడుదురని ప్రార్థిస్తూయున్నాను- అదే విధముగా ప్రచారకుల కార్యక్రమమునకుగూడ తోడ్పడిన యెడల అచిరకాలములోనే శైవమహాసభ గొప్ప అభివృద్ధినిగాంచగలదు- అప్పుడీమహాసభ సభ్యుల ననేకవిధముల పోషించగలదు- గౌరవములు కాపాడగలదు- రాబోవు శైవమహాసభా భావిదశను గుర్తింపగలిగిన ప్రతిమానవుడుకూడ ముందంజవేసి పోషక చందాదారులుగ చేరుదురనుటలో అతిశయోక్తి యేమియును లేదు. కార్యభారము వహించిన వారలకందరకు పరమేశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యములనిచ్చి వారి కార్యములయందు వారిని నిమగ్నులగునట్లు చేసి కాపాడుగాక యని భగవంతుని సదా ప్రార్థించుచున్నాను- ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఇట్లు శైవమహాజన విధేయుడు,

శివలెంక లింగయ్య,

ప్రచారక కార్యదర్శి.

బుట్టయ్యపేట, మచిలీబందరు.

---

శ్రీ శివాయగురవేనమః




ద్విమాసపత్రిక.

| సంపుటము. | బహుధాన్యనామ సంవత్సర | సంచిక. |
|---|---|---|
| 1. | ఆశ్వయుజ, కార్తీకమాసములకు | 4 |

శ్లో॥ శ్రీవేదశాస్త్రార్థ తతిప్రభాసికా।సందేహసందోహ మహానిరాసికా।
తత్వత్రయోద్బోధన సిద్ధదేశికా।జయత్వియం శైవమతప్రకాశికా॥

ప్ర॥ శ్రీ॥ లో॥ విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు,
శైవమహాసభాధ్యక్షులు.

కందుకూరి వటుకభైరవమూర్తిగారు బి. ఏ. వకీలు
కార్యదర్శి.

శివలెంక లింగయ్యఅయ్యవారు రిటైర్డు పోలీసు
సబ్ యిన్ స్పెక్టరు ప్రచారక కార్యదర్శి.

ఈశ్వరప్రగడ సదాశివశర్మగారు శివభక్తిప్రచారకులు

సంపాదకుడు:- ఇవటూరి సానందరావు


ప్రకటన:- పింగళి వీరయ్యపంతులుగారు, బందరు.
ముద్రణ:- మినర్వాప్రెస్, బందరు.
1938

శ్రీ శివాయగురవేనమః.

# శైవమతప్రకాశిక.

## భస్మధారణమహిమ.

—:O:—

ప్రపంచమున మానవులు శరీరమందు ధరించు సమస్తవిలేపనములలో భస్మవిలేపనంబత్యుత్తమమైనది. ఈ భస్మముయొక్క యుత్పత్తి పరమేశ్వరునుండి వచ్చినది గావున నతిపవిత్రంబైనది.

పూర్వము తారక, శూరపద్మ, సింహవక్త్రులను రాక్షసులీశ్వర వరగర్వితులై యేరికసాధ్యులైయుండిరి. వారలను సంహరించుటకు శంకరుండు లేక తద్వీర్యజనితుడు తప్ప యన్యులకలవిగాదయ్యెను. అంత సమస్తదేవతలు సమావేశమై యాలోచింపగ బ్రహ్మవిష్ణువులు తమ యశక్యతను వెల్లడించిరి. అటుపిమ్మట దేవతలు మన్మథుని ప్రార్థించి, దక్షయాగంబున దగ్ధమై హిమవంతునకు జనించి శంకరునికరముబట్ట దపంబుచేయుచున్న పార్వతికిని, దక్షిణామూర్తి స్వరూపుడై తపస్సమాధినున్న శంకరునకును, కామోద్రేకముగల్పించవలసినదిగా గోరగ, మన్మథుడు కష్టముతో నియ్యకొని శంకరుని సమీపంబునకేగి, పుష్పబాణంబుల బ్రయోగించెను. శిథిలంబగుచున్న తన సమాధినిగాంచి యీశ్వరుడు ఫాలనేత్రము దెరచినంత, కుసుమబాణుడు భస్మంబయ్యెను. తదనంతరము శంకరుడు కామదహితభస్మమును ధరించినవాడై కామాది దుర్విషయఖండనుడై వెలగడెను.

భస్మముయొక్క మహిమములనంతంబులైనను కొన్నినిటు బొందుపరచుచున్నాడను.

శ్లో॥ భూతిర్భూతికరీ పవిత్రజననీ పాపౌఘవిధ్వంసినీ।
సర్వోపద్రవనాశనీ శుభకరీ సర్వార్థ సంపత్కరీ।
భూతప్రేత పిశాచరాక్షసగణారిష్టాది సంహారిణీ।
తేజో రాజ్య విశేష మోక్షణకరీభూతిస్సదాధార్యతాం॥

శ్లో॥ శ్రీకరంచ పవిత్రంచ। రోగశోకనివారణం।
లోకవశ్యకరం పుణ్యం। భస్మంత్రైలోక్యపావనం॥

పై శ్లోకములలో భస్మముయొక్క ప్రయోజనము విపులంబుగా సెల్లగను తెలియుచుండవేరుగ వివరింపనక్కరలేదు.

రాజౌధములలో తయారుకాబడిన భస్మములవలన అనగా రజిత, తామ్ర, సువర్ణ, కాంస్యభస్మములవలన, దీర్ఘశారీరకవ్యాధులు నివారింపబడుచుండ, శాస్త్రవిధిగ తయారుచేయబడినట్టియు, మంత్రపూరితమైనట్టియు భస్మమువలన, శారీరకరోగములేగాక, మానసికరోగములు సహితము నశింపజేయబడుననుటలో నెట్టి సందియములేదు. కాలముసన్నిహితమై మృత్యువాతంబడబోవు వారలకీభస్మధారణము చేయుటకద్దు. భస్మరేఖలుగల శరీరమును యమదూతలు పట్టవెరతురని యొక ప్రసిద్ధికలదు.

భస్మము శ్రీశైలమందును, రుద్రాక్షలు కేదారమందును, లింగములు కాశియందును స్వయంబుగ బుట్టియున్నవి; కావున మహిమగలవని చెప్పనొప్పును.

పాపములను భస్మచేయుచదిగావున శ్రీశైలము సమస్తక్షేత్రములలో గొప్పది. ఈ క్షేత్రమున కీపేరు దానియందుండుభస్మపుగనులవలన నేర్పడినది.

భస్మంబగ్నివీర్యంబని ప్రసిద్ధికలదు. అగ్నివలన పవిత్రత చెందించబడియుండుటవలన అగ్నివీర్యంబని వాడబడుచున్నది. భస్మధారణము చేయువాడధిక బలశాలియగు. భస్మస్నానంబుచేయుచు, భస్మశాయియై, జితేంద్రియుండై సకలపాపంబులను బాసి శివసాయుజ్యంబునొందు.

శ్లో॥ వీర్యమగ్నేర్యతో భస్మ। వీర్యవాన్ భస్మసంయుతః।
భస్మస్నానరతో విప్రో। భస్మశాయీజితేంద్రియః॥
సర్వపాప వినిర్ముక్త। శ్శివసాయుజ్యమాప్నుయాత్ ॥శి.గీత॥

శరీరము కానరాకుండ భస్మముధరించిన అంటుజాడ్యములు రావు. చలిబాధచెందనేరదు. సూర్యుని తాపమున్న, అగ్నివేడియున్న అంతగాసోకవు చర్మముయొక్క మృదుత్వమును కాపాడును. భూతప్రేత పిశాచబాధలనివారణకున్ను, చిరకాలవ్యాధుల హరింపుచేయుటకున్ను భస్మమీయబడును.

శరీరమందుండు వాతపైత్య ఉష్ణసంబంధముగల నీరు హరించుటలో భస్మము మేలయినది. శిరస్స్నానము జేసిన పిమ్మట ముఖమునకు భస్మమలంకరించగా

శిరస్సునందుండు దుష్టనీరు హరించుటయేగాక మెదడునకు నిర్మలత్వమిచ్చి యీశ్వరధ్యానమునకును మనోలగ్నమునకును విశేషగుణమిచ్చును.

భస్మధారణమును ఋషులు ప్రేమించెదరు. ఇదియే వారల గొప్పవైద్యము.

తపోజపాది క్రియల కనుష్ఠానపరులు భస్మముధరించెదరు. భస్మము ధరించనియెడల జపసిద్ధియు మంత్రసిద్ధియు గలుగవని వచింతురు.

భస్మత్రిపుండ్రములు శరీరమందుంచగ జ్ఞానవిషయకమగుశక్తి, కట్లచే బంధింపబడియున్నట్లు వాయాస్థానముల యందుండును.

శ్లో॥ భస్మధారణసామర్థ్యా । చ్ఛత్రుసైన్యంవిజేష్యసి॥

॥బ్రహ్మోత్తర ఖండం, శివకవచం॥

తా॥ భస్మధారణ సామర్థ్యంబున సర్వశత్రు విజయముకాగలదు.

శ్లో॥ విభూతిరణుమాత్రేణ । త్రికాలమనులేపనం।
రోమరోమభవేల్లింగం । తచ్ఛిరంతు శివాలయం ॥గార్గేయం॥

తా॥ అణుమాత్రంబైనను భస్మము శిరంబున ధరించిన తచ్ఛిరంబు; శివాలయంబనియు, తద్విలేపనము రోమములకు దాకిన వవి యెల్లను లింగములనియు తాత్పర్యము.

శ్లో॥ ఏతాని తాని శివమంత్ర పవిత్రితాని।
భస్మాని కామదహనాంగ విలేపనాని।
త్రైపుండ్రితాని రచితాని లలాటపట్టే।
లుంపంతిదైవలిఖితాని దురక్షరాణి ॥గార్గేయం॥

తా॥ లలాటంబున లిఖింపబడియుండిన బ్రహ్మయొక్క వంకరపంక్తులను దురక్షరములను పంచాక్షరీమంత్రపూరిత భస్మముచేత తుడిచివేయబడును.

శ్లో॥ భస్మస్నానం సుపుణ్యం విరచితమమలం వ్యాధినాశం పవిత్రం।
గంగాస్నానేన తుల్యం విషమమృతకరం సర్వదారిద్ర్యనాశం।
రక్షోపక్షః పిశాచగ్రహవిధి హరణం సర్వలోకాధిపత్యం।
వశ్యం లోకేనరాణాం జయతి మహామహాన్ పార్వతీశప్రసాదః॥

॥గార్గేయం॥

తా॥ భస్మస్నానపుణ్యవిశేషంబున, నతిపవిత్రతయు సర్వవ్యాధి నివారణయు, గంగాస్నానఫలంబును, సర్పవృశ్చికాది విషములను హరించు సామర్థ్య

మున్నూ దారిద్ర్యవినాశనమున్నూ, వక్షస్థలమందు మంత్రించి ధరించినయెడల భూతప్రేత పిశాచాది బాధానివారణయు, సమస్తలోకాధిపత్యము సర్వలోక జనవశ్యమును గలుగును. భస్మము యీశ్వరప్రసాదము.

భస్మము ధరించనియెడల దేహముననుండు జ్ఞాన విషయికమగు శక్తి పంచ భూతంబులలో లీనమైపోవును. తాపసులకీశక్తి చాల ముఖ్యము గనుక దీనిని కాపాడుకొనుచుందురు.

భస్మమును నీటియందు కలిపి, కొన్ని చుక్కలు త్రాగినయెడల హృదయము నకు నిర్మలత్వమును, తలంపులు పుట్టక నిలుచుటయు, అనగా అమనస్కయోగం బునకు సహాయమున్నూ, గర్భమందుండు క్రిములు నశించుటయును గలుగును.

స్నానానంతరమందు భస్మమును నీటితో దడిపి యేతద్భస్మముండవలసిన స్థానంబుల బంచాక్షరంబుల వ్రాసి ముఖమునకు విలేపనము చేసికొనినయెడల "సర్వస్యగాత్రస్య శిరః ప్రధానం"బని చెప్పబడినటువంటిన్ని, బుద్ధికి శిరస్సు మూలంబగుట నింద్రియచలనంబుడిగించి మనస్సును పరమేశ్వరైక్యాను సంధా నము చేయుచు నీశ్వరైక్యజ్ఞానముగలిగించును. ఈశ్వరానుగ్రహంబుగలిగించును.

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానం"బని చెప్పబడినట్లు నేత్రద్వ యముయొక్క దృష్టిని భ్రూమధ్యరేఖకు దెప్పించి మనస్సును లయింపజేయు శక్తి నీ లలాట భసితమునకుగలదు.

విభూతిమహిమ యత్యుత్తమంబగుట, పురుషులకేగాక, స్త్రీలకు సహితము ముఖ్యముగ బాలింతరాండ్రును, పసిపిల్లలకు దృష్టిదోషములు, బాలగ్రహాది దోష ములు తగులకుండులాగున నిట్టి నవనాగరికతాకాలమందు ధరించుట చాలముఖ్య కర్తవ్యము

మంత్రశాస్త్రమందారితేరిన మలబారుదేశీయులలో స్త్రీలు విశంతువులే గాక సువాసినీలు సహితము భస్మత్రిపుండ్రమున్ను కుంకుమతిలకమున్ను ధరిం చుట యిప్పటికిని గమనించుచున్నాము.

శ్రీలలితాష్టోత్తర శతనామస్తోత్రమందు "భస్మరేఖాంకితలసన్మస్తకాయై నమోనమః" అని దేవిని వర్ణించియున్నారు. కావున శ్రీగౌరీదేవి శివభక్త చిహ్నమగు భస్మరేఖలు ధరించుటయును వంశము చాల ముఖ్యముగానున్నది. సువాసినీలు ముఖ్యముగ నాంధ్రరాష్ట్రమందు గల సువాసినీల కివి యేల యవ లక్షణంబుగ గాన్పించుచున్నవో శోచనీయము.

మంగళప్రదమైన భస్మము సువాసినీలు సహితము ధరించిన తమ పతులకు నాయురారోగ్యైశ్వర్యాభి వృద్ధియగుటయే గాక, తమ మాంగల్యమునకెట్టి లోప మున్నురాక శ్రీయుమామహేశ్వరానుగ్రహంబున సర్వశ్రేయంబుల నొందగల రని నిడువుట నిక్కమైయున్నది.

---

# రుద్రాక్షమాహాత్మ్యము.



పూర్వము కృతయుగంబున, నరుణాక్షుండను రాక్షసుండు బహుబలవం తుడై బ్రహ్మాది దేవతలకజేయుండైయుండె. సమస్త సురానీకంబుచే బ్రార్థి తుండై శంకరుండు వాని సంహారణమునకుబూని, రణభూమి నాక్రమించి, యద్దానవుని నేత్రద్వయంబున,నుగ్రముగజూచిన నాతండు భస్మంబయ్యె. అంత నాపరమేశ్వరుని నేత్రంబులనుండి ఫలములు జారిపడగ, శంకరుండు నాఫల ములు తనయక్షిజనితములగుట రుద్రాక్షలని నామంబిడి వాటిని తనువున దాల్చిన వారలు ధన్యులగుదురనియు తనయందు భక్తి యబ్బుననియు వరంబులనిచ్చె. తదాదిగ రుద్రాక్షయను పదము వాడుకలోనికి వచ్చెను. ఇది స్కాందపురా ణాంతర్గత గాథ.

భస్మముయొక్క గుణములే రుద్రాక్షలకుండును. గనుక రుద్రాక్షధార ణము భస్మధారణమహిమమును, ద్విగుణీకృతము జేయును.

రుద్రాక్ష నీరు శరీరమున బారినయెడల నారోగ్యమున్నూ, మనోస్థైర్య ల్యమును గలుగును.

శ్లో॥ నగోభస్మసమాదాయ విశుద్ధం శ్రోత్రియాలయాత్।
ఉద్ధూళయతి గాత్రాణి తేనాశ్చరతిమామపి।
తస్మాత్పరతరోభక్తోమమ రామనవిద్యతే।
సర్వదాశిరసాకంఠే రుద్రాక్షాన్ ధారయేత్తుయః।
పంచాక్షరీ జపరతస్సమేభక్తస్సమేప్రియః॥ ॥శివగీత॥

తా॥ శివుండు రామచంద్రున కిట్లుపదేశించెను. పరిశుభ్రంబైన భస్మంబును శరీరంబున నలందుకొనియు, శిరమున, కంఠంబున, రుద్రాక్షల ధరించియు పంచాక్షరీ జపంబు చేయుచుండు నరుండు శంకరున కతి ప్రియభక్తుండు.

శ్లో॥ సర్వేణ సర్వదాకార్యం। భూతిరుద్రాక్షధారణం।
యుక్తేన వాప్యయుక్తేన। శివభక్తిమభీప్సతి॥ ॥శివగీత॥

తా॥ శివభక్తి నపేక్షించు సర్వజనంబులును భూతిరుద్రాక్షల ధరింపవలెను.

శ్లో॥ నరోభస్మసమాయుక్తో। రుద్రాక్షాన్ యస్తుధారయేత్।
మహాపాపైరపిస్పృష్టో। ముచ్యతేనాత్రసంశయః॥ ॥శివగీత॥

తా॥ భస్మరుద్రాక్షధారి యెట్టి పాపియైనను ముక్తుండగు.

శ్లో॥ అంత్యకాలే తురుద్రాక్షాన్। విభూతింధారయేత్తుయః।
మహాపాపోపపాపౌఘైరపిస్పృష్టోనరాధమః।
సర్వదానోపసర్పంతి తం, జనం యమకింకరాః॥ ॥శివగీత॥

తా॥ మహాపాపునకైనను అంత్యకాలంబున భూతిరుద్రాక్షల ధరించెనేని యమదూతలు వారిని ముట్టజాలరు.

భస్మరుద్రాక్షధారణగల నరుడు శంకరతుల్యుడు. రుద్రాక్షధారి శివజ్ఞానపరుండు కాగలడు.

రుద్రాక్ష వృక్షంబుల నీడలయందు ఋషులాశ్రమము లేర్పరుచుకొని యెదరు. ఆచెట్టుగాలి మహాపవిత్రమైనది. యోగమునకు ప్రసిద్ధదేశము గనుక యుత్తరదేశమందే రుద్రాక్షల యుత్పత్తి విశేషంబుగ నుండును.

శ్లో॥ తూర్పురోగే। దక్షిణభోగే।
పశ్చిమత్యాగే। ఉత్తరయోగే॥

పంచముఖములు గల రుద్రాక్షలు మాలగ ధరియించి జపముచేయువాడు పంచముఖములుగల సదాశివుని, చేతధరించినవాడేయగు. శివధ్యానాసక్తుండయ్యెనేని శివరూపుండగు.

రుద్రాక్షమాలతో జపంబుచేసిన నొక పంచాక్షరీ సిద్ధియేగాక సర్వమంత్రసిద్ధియు గల్గును. ఇది ప్రసిద్ధము.

శ్లో॥ తులసీదళభిఃప్రోక్తం। మౌక్తికం లక్షమేవచ।
పద్మాక్షం దశలక్షంతు। సువర్ణం కోటిముచ్యతే।
కుశగ్రంధి శతంకోటి। రుద్రాక్షామితముచ్యతే॥ ॥నిర్ణయసింధు॥

తా॥ తులసీపూసల మాలజపము పదిరెట్లు ఫలమును, ముత్యాల మాలతో చేసిన జపము లక్షరెట్లును; తామరపూసలతో చేసిన జపము పదిలక్షలరెట్లును; బంగారుతో కోటిరెట్లు ఫలమును, దర్భముళ్ళతో నూరుకోట్లును; రుద్రాక్ష మాలతో జపముజేసిన ఫలంబనంతంబు, అమితము, వర్ణనకసాధ్యంబు.

శ్లో॥ రుద్రాక్షమూలం బ్రహ్మాచ। తన్నాళం విష్ణురుచ్యతే।
అగ్రంసదాశివం ప్రోక్తం। బిందువత్సర్వదేవతాః॥ ॥నిర్ణయసింధు॥

తా॥ రుద్రాక్షమూలంబున బ్రహ్మయు రంధ్రంబున విష్ణువు అగ్రభాగంబున సదాశివుండును నుండెదరు. సర్వదేవప్రీతికరంబగు నీ రుద్రాక్షమాలతో జపంబుజేసిన దానిఫలంబెంచ శక్యంబుగాదు.

శ్లో॥ రుద్రాక్షాన్ కంఠదేశే దశనపరిమితాన్ మస్తకేవింతిద్వే।
షట్ షట్ కర్ణప్రదేశే కరయుగళకృతే ద్వాదశ ద్వాదశయుతే।
బాహ్వోరిందోః కలాభిఃనయునయుగకృతే యేక మేకం శిఖాయాం।
వక్షస్యాష్టాధికం యఃకలయతిశతకం సస్వయం నీలకంఠః॥నిర్ణయసింధు॥

తా॥ రుద్రాక్షలు కంఠమందు ముప్పదిరెండును శిరస్సునందు నలుబదిన్ని ఆరుఆరుచొప్పున రెండు చెవులకున్ను పదిరెండు చొప్పున రెండుచేతులకున్ను బాహువులకు రెండు చొప్పునను నేత్రములమధ్య నొక రుద్రాక్షయున్ను, శిఖయందొకటియును వక్షస్థలమందు నూటయెనిమిదిపూసలుగల మాలయున్ను ధరించువాడు శివుడేయని తాత్పర్యము.

మ॥ వరపంచాక్షర మంత్రపాఠకులు శైవాచారపారీణులీ।
శ్వరభక్తుల్భసిత త్రిపుండ్ర విలసత్ఫాల ప్రదేశాంచితుల్।
గురు రుద్రాక్షమణి ప్రదీప్తకరయుగ్మల్వాజ్యులైనట్టియా।
పురుషశ్రేష్ఠులు నిల్చియుండురెపుడున్ భూతేశు లోకంబునన్ ॥

బ్రహ్మోత్తరఖండము

శివచిహ్నములైనట్టి భస్మరుద్రాక్షలే యింత ప్రయోజనకరంబులై యుండ శివధ్యాన సౌభాగ్యంబెంత క్షేమకారియో భక్తులూహింపుడు.

భస్మరుద్రాక్షధారణమున బ్రహ్మరాక్షసులు పారిపోయినట్లును, జరతు ఫ్లులుసహితము తరించినట్లు పురాణగాధల సంఖ్యాకములుగాగలవు.

ఇట్లు
శివభక్తజనవిధేయుడు
ఈశ్వరప్రగడ సదాశివశర్మ, భీమవరం.
పెనుగంచిప్రోలు పోస్టు, నందిగామ తాలూకా.

---

శ్రీ శివాయగురవేనమః

# శైవకవులు.

కం॥ శైవాన్వయమున బుట్టుట
యా వాఙ్మయరచనసేత యారాధ్యాంకున్
వావిరి శిష్యుండగుటయు
శైవకవుల్ త్రివిధగతులు జర్చింప శివా॥

కం॥ శివపారమ్యము జెప్పెడి।
కవియును శివకవియెయంచు। గణియింపబడున్।
శివనామస్మరణంబున
శివములుజనియించు వోలగు। ధర్త్రియెల్లన్॥

చం॥ తెలుగున వాఙ్మయంబునను। దేటపడన్ రచియించువారలె।
ల్లనుగన శైవసత్కవులె। లాతులుగారు తలంచిచూడవే।
మనయము శైవుడేయగు వి। మర్శన దర్పణమందు బండితుల్।
వినుడు గనుండు శైవకవి। వీరుల బేర్కొనువాడ గొందఱిన్॥

ఉ॥ నన్నయభట్టు రాజకవి। నన్నియచోడుడు తిక్కయజ్వయు।
జన్న.ప్రతాపరుద్ర నర। నాయక పాల్కురి సోమనాధులున్।
సన్నుతుడైన పండితుడు। నాచన సోమన పెద్దనార్యమా।
రన్నలు నీదుభక్తి చరి। తాళి రచించి ప్రసిద్ధికెక్కరే॥

ఉ॥ ఎన్నఁగ నేలవేఁడగను । నీ దృశ కావ్య విధానచాతురీ ।
సన్నుతుఁడైన తిక్కనయు । సర్వకవీశ్వర సార్వభౌముఁడ ।
భ్యున్నతిఁ గాంచి నైషధము నుజ్జ్వలమై తగు శైవవాఙ్మయం ।
బెన్నిక కెక్క మున్న రచియించరె । నీదు పదాబ్జసేవనన్ ॥

శా॥ సాటింతుంగన రానివాఁడయిన ని । శ్శంకుండు కొమ్మన్నవా ।
గ్ధాటీ విర్జిత నిర్జరావగ కవి । త్వ శ్రీ విలాసంబునన్ ।
చాటింపందగు నీ విలాసములమున్ । బల్కుండె యత్యున్నతిన్ ।
సాటేరీ! భవదీయ భక్తులకు నీ । సర్వం సహామండలిన్ ॥

శా॥ తెన్నాల్యన్వయు రామలింగకవియుం దిమ్మన్న యన్నయ్య మ ।
ల్లన్నల్ పింగళి సూరనార్య శివరామయ్యల్ గవీంద్రుండునై ।
యౌన్నత్యంబును గాంచు ధూర్జటియు సోమన్నన్ గవీంద్రుండు లిం ।
గన్నన్ నీదు విలాసముల్ రచనసేయంగాదె ధన్యాత్మకుల్ ॥

ఉ॥ బాలసరస్వతీబిరుద । భాసితు లిర్వురు రాజలింగమున్ ।
బాలశశాంకమౌళి పద । పద్మ సమర్పిత కావ్య కన్యకా ।
జాలుఁడు కూచిమంచి కవి । చంద్రుఁడు తిమ్మనసార్వభౌముఁడున్ ।
చాల ప్రసిద్ధి గాంచుటలు । శంకర నీనుతి నేర్చియే గదా ॥

ఉ॥ శాకరపర్తి కృష్ణకవి । గంధగజంబును సోమలింగమున్ ।
నాకధునీ సమానకవ । న ప్రథితుండగు పాపయార్యుమున్ ।
శ్రీకర సత్కవిత్వుఁడగు । కృష్ణయ సత్కవినాగభూషణుం ।
డీ కవిలోకమం దిటుల । నెన్నిక కెక్కుట నీ ప్రసాదమే ॥

మ॥ శరభారాధ్యుఁడు నంజరాజకవి యజ్ఞేశ్వరయారాధ్యుడున్ ।
కరి లక్ష్మన్నయు బట్టుమట్టుకుల రాకా చంద్రివాలేశకీ ।
ధరమత్వేంకటసాములున్ గణపతిన్ ధన్యుండు పాపార్యుడున్ ।
సరియెందున్ గనరానివారగుట యీశా నీదువాత్సల్యమే ॥

శా॥ తంజావూరుపురాధినాథ రఘునాథ క్ష్మాతలేంద్రుండు దా ।
గుంజన్మంజుపదంబులన్ని యొకటన్ గుప్పించి బల్సోయగ ।
మ్మున్ జేకూర్చుచు పార్వతీపరిణయమ్మున్ జెప్పడే పద్యమున్ ।
జుంజుమ్మంచును మూగు తుమ్మెదలటుల్ జాడంగవీంద్రాగ్రణుల్ ॥

భీమవరంతాలూకాలోని యెనమదుర్రుగ్రామములోని శ్రీశక్తీశ్వరుని సందర్శించిన సందర్భమున వ్రాయబడిన పద్యములు.

మ॥ సొలయల్కంగు పితాత్మజైన గిరిరాట్పుత్రి పరీరంభణం ।
చెలమింగోరినఁగో విలాసముల నెంతేవేడి తానొస్వనిన్ ।
లలనా చారుపదాబ్జసేవన సముల్లాసంబునుం జెందితో ।
తలక్రిందైతి విచేటికయ్యె యమరారాధ్యాంగ శక్తీశ్వరా ॥

మ॥ తలమిన్నైఅను పార్వతీసతియు బంతాలాడ నీనందునన్ ।
గులకాంతం గెలుపింపగా నదియు సం చి తానాసతో ।
గలయంబో ప్రతిమాలవచ్చితివొ కో కాంతాసమేతంబుగా ।
దలక్రిందైతివి ॥

మ॥ తలక్రిందౌటయె మాసి మేలుదలపం దచ్చంద్రకాంతిచ్ఛటల్ ।
తెలిసిరేఅను భూమిపైకిడిగగా దేదీప్యమానంబుగా ।
బలుపంటల్ ఫలియింపజేయుటకునై భావించి కావించితే ।
దలక్రిందైతివి ॥

మ॥ తలపైకెక్కను గంగయంచు మిగులన్ దర్కించి సాధించి ని ।
న్నిలు వన్నియని గట్టు పట్టి కొలకా! నీయర్థనారీశ్వర ।
త్వలసల్లీలను తల్లక్రిందిటుల దేవా! నీవు కావించితే ।
తలక్రిందైతివి ॥

మ॥ తలక్రిందో సరియో యెఱుంగను భవత్తత్వంబు నా కియ్యెడన్ ।
దలపందోచిన యట్లు వ్రాసితిని నా తప్పుల్ క్షమింపందగున్ ।
దలక్రిందౌనటు వేనవేలుగను నే, తండ్రీ! నతుల్ సేసెదన్ ।
తలక్రిందైతివి ॥

మ॥ గుణుపూడెం దమిదాను గంగడలపై గూర్చుండగా ట్టికో ।
గని కోపించిన పార్వతీసతి యపాంగ క్రోధవీక్షాపటిన్ ।
గని చేతంబు భయాకులంబగుడు గిరీకత్రస్యతా పార్శ్వచే ।
ష్టను గ్రిందయ్యెనో నీ శిరంబు యమరారాధ్యాంతరంగా శక్తీశ్వరా ॥

ఇట్లు
బుధజనవిధేయుఁడు,
మల్లంపల్లి వీరేశ్వరుడుఅయ్యవారు,
యలకుర్రు అగ్రహారం.

శ్రీ మేధాదక్షిణామూర్తి గురవేనమః.

# శివతత్త్వవిచారము.

శ్లో॥ యశ్శివో నామ రూపాభ్యాం । యా దేవీ సర్వమంగళా।
తయోస్సంస్మరణాత్పుంసాం । సర్వతో జయమంగళం॥

శ్లో॥ దూర్వాస కౌశిక సుకేశి మృకండుపుత్ర। దైవీజ్యబాణవిధిశక్తిదధీచిరామాన్।
శ్రీవామదేవకవిమంభజగౌతమాత్రీన్। పుణ్యానిమాన్పరమపాశుపతాన్స్మరామి॥

శ్వేతాశ్వతరోపనిషత్తునందు "శివ ఏవ కేవలః" శివుఁడొకఁడే కలఁడని నిశ్చయింపఁబడినది. "నకించన శివాదన్యం నకించన శివాత్పరం శివాతిరిక్తం నహిచ సర్వం శివమయం జగత్" శివునికంటె నన్యమును బరమునతిరిక్తమునగు నెద్దియును లేదు. సర్వమును శివమయమగునని స్కాందమహాపురాణమందలి శివతత్త్వసుధానిధియందు వచింపఁబడినది.

"నసన్న చాసచ్ఛివ ఏవ కేవలః" యను వేదవచనము సృష్టికిఁబూర్వము సత్తుగాని - అసత్తుగాని యుండలేదు. శివుఁడొక్కఁడే కలఁడని చెప్పుచున్నది. ఎయ్యది సృష్టికంటెను బూర్వమునఁగలదో యదియే సర్వమునకుఁ గారణమగుచున్నది. కావున నే యయ్యది పరబ్రహ్మాభిధమగుచున్నది. ఈ విషయమును గూర్చి మఱియునందే బ్రహ్మలక్షణ నిరూపణావసరమున "యతోవా ఇమాని భూతాని జాయంతే యేనజాతానిజీవంతి యత్ప్రియన్త్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వతద్బ్రహ్మ" ఎవ్వనివలన నీభూతములన్నియుఁ బుట్టుచున్నవో, పుట్టియే మహనీయుని కారణమున జీవింపుచున్నవో, మఱియు నాశనమంది యెందు జేరుచున్నవో యాతఁడే జిజ్ఞాసకు యోగ్యుఁడును బ్రహ్మయునగుచున్నాఁడని వివరింపఁబడినది. వ్యాసభగవానుఁడును 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యను బ్రహ్మసూత్రమున బ్రహ్మజిజ్ఞాసయొక్క కర్తవ్యమునుపదేశించు రెండవదియగు "జన్మాద్యస్యయతః" యనుసూత్రముచే జగజ్జన్మాది కారణత్వమే బ్రహ్మలక్షణముగా స్మరించియుండెను. జగజ్జన్మాది కారణత్వమే బ్రహ్మలక్షణమందు గలుగుటకతన బూర్వోక్తమయిన "నసన్న చా సచ్ఛివ ఏవ కేవలః" యను శ్రుతియందా బ్రహ్మమే శివునిగా నిరూపింపఁబడినది. 'సత్' చేతనము 'అసత్'

అచేతనములని చెప్పఁబడుచున్నవి. జగద్రూపకములగు నీరెండును నెప్పుడులేవో, యప్పుడు శివుఁడు మాత్రమే యుండెనని వచింపఁబడుటచే కార్యోత్పత్తికి బూర్వ మెప్పుడును నియంతమైయుండునో యాతఁడే యాకార్యమునకు, కారణరూపుఁ డగుచున్నశక్తిచే చరాచరములకుఁ బూర్వమందున్న యాతఁడే వానియొక్క కారణమై యుండవలయును. ఇద్దాన జగత్సృష్టికి కారణభూతుఁడగు బ్రహ్మము శివుఁడే యని సిద్ధమగుచున్నది.

బ్రహ్మయు విష్ణువును జగత్కర్తృత్వముకొరకై "అహమేవ జగత్కర్తా మయ్యేవేదం జగత్స్థితం" నేనే జగత్కర్తను నాయందే యీ సర్వమును గలదని కలహించుకొనసాగిరి. పరమేశ్వరుఁడు వారి శక్తిని హరించెను. వారొక్కమారుగ నిర్వీర్యులయిరి విష్ణ్వాదులను నందీశ్వరుఁ డటకనుదెంచి "ఓ విష్ణుప్రముఖదేవతలారా! మహానుభావుఁడగు శివుఁడే సర్వమునకుఁ గర్తయై యున్నాఁడు. సర్వసాక్షియు మహేశ్వరుఁడును బరబ్రహ్మరూపుఁడగు నాతఁడు సర్వాత్మగతుఁడై యున్నాఁడు. సర్వనియంతయగు వానిని యనుగ్రహలేశమే యీ విష్ణ్వాదిపదములకుఁ గారణము. ఆమహాత్ముని సంకల్పము లేకయేదియుఁ గాఁజాలదు కావున భ్రాంతివీడి మహాత్ముఁడగు శివుని శరణంబు వేఁడుఁడని" శివపరంజ్ఞానమును బోధించుటయు వారీశ్వరుఁబూజించి శివప్రసాదమున లబ్ధజ్ఞానులయి యిష్టార్థముల నందిరని సూతసంహితయందుఁ గలదు.

"ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగళం ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయవైన మోనమః" "ఈశానస్సర్వ విద్యానా మీశ్వరస్సర్వభూతానాం బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోధిపతిర్బ్రహ్మా శివోమే అస్తు సదాశివోం" అను మొదలుగాగల శ్రుతిసంచయము పరబ్రహ్మముగ శివుని నుతించి తృప్తినందియుండెను.

యోగసూత్రములయందు "తస్యవాచకః ప్రణవః" యని పరమేశ్వరుఁడు ప్రణవవాచకుఁడని యుపపాదింపఁబడినది. ఈయర్థముచే శివపురాణము "ప్రణవోహి పరబ్రహ్మ ప్రణవః పరమంపదం ప్రణవోవాచకస్తస్య శివస్య పరమాత్మనః" యని ప్రణవమే పరమేశ్వరుఁడనియు నయ్యదియే పరమపదమనియు పరమాత్మయగు శివునకది వాచకమనియుఁ బ్రకటించినది. ఇట్లగుట శివుఁడు పరబ్రహ్మమనియు బ్రణవస్వరూపుఁడనియు నిర్ధారితమగుచున్నది.

శివగీతాశాస్త్రమందలి విభూతియోగమున "ఆసం ప్రథమమేవాహం వర్తామిచ సురేశ్వరాః। భవిష్యామిచ లోకేస్మిన్ మత్తో నాన్యోస్తికశ్చన। వ్యతిరిక్తం నమత్తోస్తి నాన్యత్కించిత్సురేశ్వరాః" దేవతలారా! నే బురాతనుఁడను నేనే ప్రథమంబునఁ బ్రవర్తింతును నాకంటె నితరుఁడు మఱియొకఁడులేఁడు ఇతరమగు వస్తువులేదని శివునిచే వచింపబడియె. మఱియు నేగుహాశయుండ నిష్కళుఁడ. నద్వితీయుండను, "శ్రుత్వేతిదేవామద్వాక్యం కైవల్యంజ్ఞానముత్తమం। జపంతో మమనామాని మమధ్యానపరాయణాః। సర్వేతేసర్వదేహాంతే మత్సాయుజ్యం గతాస్సురాః। అతోయే పరిదృశ్యంతే పదార్థాః మద్విభూతయః" సకలదేవతలును మద్వాక్యములువిని నాధ్యానమందే నిమగ్నులై నా సాయుజ్యమునందుదురు, దృశ్యమానంబులగు పదార్థములన్నియు నా విభూతులు ఇట్లని వచించినటులఁగలదు. ఈ యర్థమే "అహంప్రథమమాసం వర్తామిచ భవిష్యామిచ నాన్యః కశ్చిన్మత్తో వ్యతిరిక్తః" యనిశ్రుతియు "జడభూత ప్రపంచేస్మిన్ శివచైతన్యయోగతః సర్వం శివమయంభాతి" జడభూతమగు నీ సర్వమందునను శివచైతన్యముండుట కతన నంతయు శివమయమై ప్రకాశింపుచున్నదని శివమహాపురాణవాయవీయసంహితయందును గలదు.

"ఏకోరుద్రో నద్వితీయాయతస్థే" "విశ్వాధికో రుద్రోమహర్షిః" "శివఏకోధ్యేయః" అను మంత్రోపనిషదాదికములగు వాక్యములు రుద్రుని విశ్వాధికునిగ నద్వైతునిగను ధ్యానయోగ్యునిగ ననేకవిధముల బ్రశంసింపుచున్నవి. రుద్రశబ్దార్థమును శివతత్త్వసుధానిధి యిటుల పరిష్కరించినది. "రుచ్ఛబ్దేనచ సంసారదుఃఖం ద్రావయతి ప్రభుః। రుద్రఇత్యుచ్యతే వేదైరపి వేదాంతవేదిభిః। రు-ఏవశివః ప్రోక్తః। రుద్రఏవసదాశివః। రుద్రఏవ పరంజ్యోతి రుద్రోవాం ఏసవాక్యతః। సంసారదుఃఖమును హరించు నాతఁడు రుద్రుఁడగుచున్నాఁడు ఆతఁడే పరంజ్యోతియగు శివుఁడని చెప్పఁబడును.

"శివేన నవినాశక్తిః నశక్త్యాచ వినాశివః" శక్తిరహితుండై శివుఁడును శివుఁడులేక శక్తియు నుండుటలేదు. శక్తి సాక్షాన్మహాదేవియనియు, చంద్రచంద్రికవలె నంతరము నూహింపరానిస్థితి శివశక్తులయందుఁ గలదనియును, శివమహాపురాణమున వక్కాణింపఁబడినెను. సత్త్వరజస్తమోగుణయుతయు మాయాస్వరూపిణియు సంకల్పరహితయుఁ జిద్రూపిణియుఁ బ్రసవధర్మిణియు నగు నాశివునందలి శక్తి "విభజ్యబహుధా విశ్వం విదధాతిశివేచ్ఛయా" శివేచ్ఛచేతనే బహురూపములుగ విశ్వమును రచింపుచున్నదనియు నందే వచింపఁ

బడెను. కనుకనే "మాయాంతు ప్రకృతింవిద్యాన్మాయినంతు మహేశ్వరం" ప్రకృతి మాయాస్వరూపిణి. ఇట్టి మాయగలవాఁడే శివుఁడని చెప్పుటఁజేసి సర్వమును దానయై తన మాయాబలముననే పరమేశ్వరుఁడు సర్వమును త్రిప్పుచున్నాఁడనుట నిర్వివాదాంశము.

ఈ యర్థమే చంద్రజ్ఞానాగమమున "బిందునాదాత్మకం సర్వం జగత్స్థావర జంగమం । బిందుశ్శక్తిశ్శివో నాదః శివశక్త్యాత్మకం జగత్" జంగమస్థావరాత్మకమగు సకలజగంబును బిందునాదరూపమే యగును. బిందువు శక్తియు నాదమే శివుఁడగుట జగమంతయు శివశక్త్యాత్మకమైయున్నది నాదాధారము నంది బిందువును బిందువే జగమున కాధారమునగును కావన, బిందునాదములు జగమున కాధారములగును. బిందునాదసమ్మేళనమున జగమేర్పడుచున్నది గాన బిందునాదాత్మకుఁడగు శివుఁడే జగత్కారణమని చెప్పఁబడుచున్నాఁడని గలదు. పరిమళమువీడి పుష్పమునుండనటుల శక్తిరహితుఁడై శివుఁడుండఁడు స్వశక్తి[illegible] మాత్రమున లీలాభిముఖుఁడైన శివునిచేఁ బ్రేరేపింపఁబడి శక్తి కార్యములఁ జేయుచున్నది. లీలాంతమందయ్యది యా శివతత్త్వముననే లీనమగుచున్నది. కాలయోగమున బీజమెటుల నంకురించి పల్లవించి పుష్పించి ఫలించుచు ననేకరూపములఁ గన్పడుచున్నదో, యటులనే శివునియందు శక్తియోగమున ననేకములగు మూర్తులు ప్రకాశింపుచున్నవి. తత్త్వమొక్కటియయ్యు [illegible] నవశక్తులంగూడి శివసంజ్ఞకలదియై ప్రకాశింపుచున్నది. ఇద్దాననే భేదములనేకములు గల్పింపఁబడినవి.

శైవసిద్ధాంత దీపికయందును బ్రహ్మము సమస్తమగు సంసారదోషములు లేనిదియు, సకలమాంగళ్య గుణముల కాధారభూతమైనదియు నగును. ఇట్టి బ్రహ్మమే జగమునకు నిమిత్త కారణము నుపాదానకారణము నగును. సూక్ష్మ చిదచిత్తులతోఁ గూడిన బ్రహ్మయు కారణంబును, స్థూలచిదచిత్తులతోఁ గూడిన బ్రహ్మయు కార్యంబునగును. ఈ జగత్తు పరమేశ్వరునకు శరీరమగును. పరాశక్తి చేతనాచేతనాత్మకమగు సకలప్రపంచమైయున్నది ఇట్టి పరాశక్తికి శివ పరమేశ్వరుఁడొక్కఁడే యుండునని నీలకంఠాచార్యులవారు సిద్ధాంతీకరించియుండిరి.

గ్రంథాంతరమున శివతత్త్వవిచారమిట్లు చెప్పఁబడియెను. మూలతత్త్వము శివసదాశివమహేశ్వరభేదమున త్రివిధమగుచున్నది శివతత్త్వము నిష్కళము

నియు, సదాశివతత్త్వము సకల నిష్కళమనియు మహేశ్వరతత్త్వము సకలమనియు వచింపఁబడును. శివతత్త్వమొకేవిధము. సదాశివతత్త్వమయిదువిధములు. మహేశ్వరతత్త్వ మిరువదియయిదు విధములుగ జెప్పంబడినది ఈముప్పది యొక్క తత్త్వములును, శివునియందవినాభావముననున్న శక్తిక్షోభమాత్రమున సహస్రాంశగలిగి పరాశక్తియు, పరాశక్తి సహస్రాంశమున నాదిశక్తియు, నాదిశక్తి సహస్రాంశమున నిచ్ఛాశక్తియు, నిచ్ఛాశక్తి సహస్రాంశమున జ్ఞానశక్తియు. జ్ఞానశక్తి సహస్రాంశమునఁ గ్రియాశక్తియు జనించినవి. ఈశక్తి పంచకమునుగూడి షట్త్రింశత్తత్వములుగ వచింపఁబడెను. సదాశివతత్త్వము సదాశివ, ఈశ, బ్రహ్మేశ, ఈశ్వర, ఈశాన భేదంబులఁ బంచవిధంబులు ఇవియే శివసాద, అమూర్తసాద, మూర్తసాద, కర్తృసాద కర్మసాదములనంబడు. (సాదమన స్వరూపమగును) కర్మసాదము పూర్వముఖమగు తత్పురుషరూపమనియు కర్తృసాదము దక్షిణముఖమగు యఘోరస్వరూపమనియు మూర్తసాదము పశ్చిమముఖమగు సద్యోజాతరూపమనియు, అమూర్తసాదముత్తరముఖమగు వామదేవముఖమనియు. శివసాదమూర్ధ్వమగు నీశానరూపమనియు నుడువంబడియెను. పంచశక్తిసహితమై పంచస్వరూపమగునదియే సదాశివతత్త్వమగును. మహేశ్వరతత్త మిరువదియైదువిధములు. ఈతత్త్వము త్రినేత్రమును ఏకముఖమునుగలిగి సర్వాభరణసహితమై యీశ్వరుఁడని చెప్పంబడును. పంచవింశతి లీలల నీ మహేశ్వరుఁడు ధరించెను. సృష్టిస్థితి సంహారతిరోధానానుగ్రహములను నైదుకార్యములచేఁ బ్రకాశింపుచున్న నీ త్రివిధతత్త్వరూపుఁడగు శివుఁడే సర్వమునకును గారణుఁడగుచున్నాఁడని చెప్పంబడియెను.

“సర్వేషామేవ తత్వానాం మూలం శివఇతిస్మృతః” అన్నితత్త్వములకును శివుఁడే మూలమని వాతూల శివాగమునందును “యచ్చకించిజ్జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతే పివా తత్సర్వం శంకరస్యాజ్ఞా బలేన సమధిష్ఠితం” జగమునందేది చూడఁబడుచున్నదో, యెయ్యది వినఁబడుచున్నదో యా సర్వము నీశ్వరాజ్ఞాబలమువనే సమధిష్ఠితమైనదని వాయవీయసంహితయందును “అండం హిరణ్మయం మధ్యేసముద్రం ఉపర్యస్య వీర్యాత్ప్రభవం బభూవ। అండాద్విష్ణుర్బ్రహ్మా జాతవేదాశ్చతన్మేమనశ్శివ సంకల్పమస్తు” బ్రహ్మ విష్ణ్వాగ్న్యాది జనన కారణము శివుఁడగుననియు, “పరాత్పరతరో బ్రహ్మా తత్పరాత్పరతో హరిః యత్పరాత్పరతః శంభుః తన్మేశివ సంకల్పమస్తు” అనియు శివుఁడే పరాత్పరుఁడుగ శివసంకల్పోప నిషత్తునందుఁ జెప్పబడినది.

స్కాందమహాపురాణమున "బ్రాహ్మణానాం శివో దేవః । శివోఽగ్నిః కర్మదైవతం శివ ఏవ పరబ్రహ్మ శివో వేదః శివో గతిః । శివో గురుర్జగతాం శివః పశుపతిః ప్రభుః । శివాంగభూతాః విష్ణ్వాద్యాః తస్మాద్విప్రః శివం యజేత్" సమస్తమును శివస్వరూపమైయున్నది. శివునినుండియే విష్ణ్వింద్రాది సమస్తదేవతలును జనించిరి. సర్వమునకుఁ గారణమై బ్రాహ్మణ దైవమగు శివుని సదా పూజింపవలయుననియు నాదిత్య పురాణమున "బ్రహ్మవిష్ణ్వర్క శక్రాగ్ని ... పురోగమాః సురాసురాస్సంప్రసూతాస్త్వత్తస్సర్వే మహేశ్వర । బ్రహ్మాదీనాం సురేశానాం ప్రష్టా యః ప్రభురవ్యయః బ్రహ్మాదయః పిశాచాన్తాః యస్య కింకరతాం యయుః" మహేశ్వరా! నీవలన బ్రహ్మ విష్ణ్వాదులును సకల దిక్పాలకులును బుట్టిరి. బ్రహ్మాది పిశాచాంతగణమంతయు నీకింకరులై యున్నారు. నీవు ప్రభుఁడవు నవ్యయుఁడవై యున్నావని శివుని కింగల సర్వాధికత్వ సర్వకారణత్వ సర్వజ్ఞత్వ సర్వాధీశ్వరత్వములు ప్రశంసింపఁబడియున్నవి.

"ఏక ఏవ మహావిష్ణుశ్శివజ్ఞానమహోదధిః" శ్రీ విష్ణువొక్కఁడు మాత్రమే శివజ్ఞానమును గుర్తెరిగియున్నాఁడని శ్రీ మహావిష్ణువుయొక్క శివోపాసనాదృఢత్వము ప్రశంసింపఁబడుటయు సత్యసంధునకు వరదానానంతరమున "నాహం సంసారమగ్నానాం సంసారమోచకః బ్రహ్మాదిదేవతాశ్చాన్యే నైవ సంసారమోచకాః శివ ఏవ హి జంతూనాం మహాసంసారవర్తినాం సంసారమోచకస్సాక్షాత్ సర్వజ్ఞస్సాంబ ఈశ్వరః అతః పూర్వం ప్రసాదాన్ము సత్యసంధ మముపిప్రియ మహాదేవం మహాత్మానం భజ కామ్య గణోత్తమం" నేనుగాని బ్రహ్మాదులుగాని నిన్నుఁదరింపఁజేయఁగల శక్తిగలవారము గాము. అట్టి శక్తి సాంబుఁ డంబికానాథుఁడును, సర్వజ్ఞుఁడును మహాదేవుఁడునగు నీశ్వరుఁ డొక్కఁడే. సత్యసంధా! ఆమహానీయుని ముక్తికై ప్రార్థింపుమని నారాయణమూర్తి పలికిన వచనములను - సూతసంహితయందుఁ బ్రశంసింపఁబడినవి.

ఆదిత్యపురాణమందలి సర్వేశ్వరముఖ్యకృతి వచనమందును "... ఉమాకాంతం విశ్వాంతర్యామినం శివం న బ్రహ్మాదిసమం ... పార్వతీం" ఉమాకాంతుఁడును, విశ్వాంతర్యామియును శివుఁడు బ్రహ్మాదులతో సముఁడని పలుకఁదగదు. ఇట్లని పరమేశ్వరుని విశ్వాధికత ప్రకటింపఁబడెను. కల్పభేదములచే నొకొక్కచో బ్రహ్మాదులకంటెను రుద్రునకుఁ దెల్పఁబడిన హీనత్వభావము సంహారరుద్రవిషయము. సంహారరుద్రుని యవతారవిశేషము లగువాని విషయమగును. తురీయుఁడగు పరశివుని విషయము గాఁదు.

స్కాంద మహాపురాణ కాశికా ఖండమందలి వ్యాసవిష్ణు సంవాదమున విష్ణువచనమిట్లు గలదు "కర్తాహం సర్వజగతాం మమకర్తా మహేశ్వరః। తస్యదేవాదిదేవస్యకర్తా కోపివవిద్యతే। యజ్ఞకర్తాచ దేవేంద్రః, వేదకర్తాచ వాక్పతిః। అహమేవ జగత్కర్తా మమకర్తా। మహేశ్వరః। వర్ణానాం బ్రాహ్మణోదేవో। బ్రాహ్మణానాంచ దేవతాః। దేవతానాం మహాదేవో దేవోస్మాకం మహేశ్వరః।" నేను సర్వమునకుఁ గర్తను నాకు మహేశ్వరుఁడు కర్త। ఆ మహాత్మునకుఁ గర్త లేదు. యజ్ఞకర్త శచీపతియు దేవకర్త బ్రహ్మయు నేను జగత్కర్తయు నగుచున్నాము. నాకు మహేశ్వరుఁడే కర్త. వర్ణములకు బ్రాహ్మణుఁడున్ను - బ్రాహ్మణునకు దేవతలున్ను- నాకును దేవతలకును శివుఁడే కర్తయై యున్నాఁడు.

"లోకనాథ పరానంద నిత్యంమే వర్తతేమతిః వాసుదేవ పరాదేవ వాఙ్మనః కాయకర్మభిః। యథాత్వం దేవదేవస్య భవస్య పరమాత్మనః। తథా భవామ్యహం విష్ణో తవదేవ జనార్దన" వాసుదేవా! నాచిత్తము మనోవాక్కాయకర్మములు యుష్మత్పరాయణములై యున్నవి. నీ వెట్లు పరమాత్మయగు పరమేశ్వరునకుఁ బరమ భక్తులై యుంటిరో, ఓజనార్దనా! నేను నట్లేయున్నానని లింగపురాణోత్తర భాగమునఁ బంచ మాధ్యాయమున భక్తశిఖామణియగు నంబరీషుఁడు వాసుదేవునిఁ బ్రార్థించినటులఁగలదు. పూర్వోక్తమగు నీ ప్రసంగము వలనఁ బరమేశ్వరుని యందు శ్రీ మహావిష్ణువునకుఁ గల సంపూర్ణమగు భక్తి భావము ప్రకటితమగుచున్నది.

మహాభారత సౌప్తిక పర్వమున "అహం యథా వదారాధ్యః కృష్ణేనా క్లిష్టకర్మణా తస్మాదిష్టతమః కృష్ణా దన్యో మమ నవిద్యతే" యథా విధిగా నన్నారాధించిన నక్లిష్టకర్ముఁడగు కృష్ణునికంటె నాకిష్టులితరులు లేరను నీశ్వర వచనమున శ్రీకృష్ణునకు శివుని యందుఁగల ననన్య భావము దెల్లమగు చున్నది. మఱియు భగవద్గీత యందు "ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా। తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత" ఓ యర్జునా! సర్వభూత హృదయ కమలములనుండి తన మాయచే నీ భూతజాలమంతటి నీశ్వరుఁడు ద్రిప్పుచున్నాఁడు. ఆ యీశ్వరుని సర్వభావముల శరణము వేఁడుమని శ్రీకృష్ణ భగవానుఁ డుపదేశించి తన యాత్మ నిశ్చయమును లోకమునకుఁ బ్రదర్శించెను. భారతమునందలి ద్రోణ పర్వమునను "ఈశానం వరదం పార్థ దృష్టవానసి శంకరం తంగచ్ఛ శరణం

దేవం వరదం భువనేశ్వరం తస్మైనమస్తు కుర్వంతు దేవా స్తిష్ఠంతు నైదివి! యే చాన్యే మానవాలోకే యేచ స్వర్గజితో నరాః యేభక్తా వరదం దేవం శివం రుద్ర ముమాపతిం । అనన్య భావేన సదా సర్వేశం సముపాసతే" పార్థా! వరదుండు నీశానుండునగు శంకరునిఁ గాంచితివి. భువనేశ్వరుండగు వానినే శరణముఁ జొచ్చుము. ఆ పరమేశ్వరుని నమస్కరించుచు దేవత లంతరిక్షమున నున్నారు. ఏనరులు స్వర్గమును జయించువారలో వారెల్లరును వరదుఁడును నుమాపతియు సర్వేశ్వరుఁడగు శివుని ననన్య భక్తి భావమున భజింపు చున్నారని పార్థునకు వ్యాసుఁడుపదేశించి యనంతరమునకౌంతేయా! "ప్రపద్యే శరణం దేవం శరణ్యం చీరవాసినం" నేను మహాదేవుఁడగు శివునే శరణము వేడు చున్నానని వచించుటచేత శిష్టులకు గల దృఢతమమగు శివప్రపత్తి నిరూపింపఁ బడుచున్నది.

"నామతశ్చార్థతో వాపి మహాదేవో మహేశ్వరః । యస్యాన్యే కేవలం దేవాః మహాదేవ నతేనఘాః । మహాదేవం వినాయోన్యాం భజతే శ్రద్ధయాసహ, నాస్తితస్య వినిర్మోక్షః సంసారా జ్జన్మ కోటిభిః" నామార్థముల రెంటను మహేశ్వరుఁడే మహాదేవుఁడని చెప్పఁబడును. ఇతర దేవతలందరును కేవలము దేవశబ్దవాచ్యులు ఎవరు మహాదేవుని విడి నన్య మాత్రమే సేవింపు చున్నారో వారు జన్మ కోటి శతంబులకైనను విముక్తులు కానేరరని సూత సంహిత యందలి యజ్ఞవైభవ ఖండమున విష్ణు వచనము పరమేశ్వరు సర్వాధిక్యతను దెలియఁ జేయుచున్నది.

శైవ సిద్ధాంత శిఖామణి యందీ యర్థమే "శివఏవ సమస్తానాం శరణ్య శ్శరణార్థినాం సంసార రోగ దగ్ధానాం సర్వజ్ఞ స్సర్వగో విభుః" శరణార్థులందఱకు శివుఁడే శరణ్య మగునని చెప్పఁబడియె.

కవికులమండనుఁడగు కాళిదాసమహాకవి "మహేశ్వరస్త్ర్యంబక ఏవనాపరః" మహేశ్వరుఁడు త్ర్యక్షుఁడగు నీశ్వరుఁడే యను నభిప్రాయమును దెలిబుచ్చెను. ఆచార్యశంకరులు "సాంబో నః కులదైవతం" అంబికానాథుఁడగు నీశ్వరుఁడే మా బ్రాహ్మణకులమునకు దైవతమనియు క్షుద్రఫలప్రదాతలగు దేవులనేకులున్నారు; స్వల్పమందయిన వారిచ్చు ఫలములఁగాని వారలఁగూర్చిగాని నే వాంఛించుటలేదు; ఈశ్వరా! బ్రహ్మవిష్ణ్వాదులకు నసాధ్యమగు భవదీయ పాదభజనము మాత్రమే యాచింపుచున్నాను;" "యథాబుద్ధిశ్శుక్తౌరజతమితి కా

చాశ్మని మణిర్జలే పైష్టే క్షీరం భవతి మృగతృష్ణాసు సలిలం। తధా దేవభ్రాంత్యా భజతి భవదన్యం జడమతిః మహాదేవేశం త్వాం మనసి చ న మత్వా పశుపతే" ఓయీశ్వరా! ముత్యపుగుల్లను రజతభ్రాంతితోడను- గాజుపెంకును రత్నమనియు- పిండినీటిని పాలనియు యెండమావులను జలమనియు లోకము భ్రమించులాగున మూఢుడు నీకంటె నితరుని మహాదేవుడని భ్రమచెందుచున్నాడనియును వచించి "సత్యం బ్రవీమ్యఖిలలోకహితం బ్రవీమి సారం బ్రవీమ్యుపనిషద్ధృదయం బ్రవీమి సంసారముల్బణమసారమవాప్య జంతో స్తారోయమీశ్వరపదాంబురుహస్య సేవా" సర్వహితమును సత్యమును నుపనిషద్ధృదయమును జెప్పుచున్నాను, అసారమగు సంసారబంధితులకు నీశ్వరపాదసేవనమే తారకమని స్మరించి లోకమును శాసించియుండిరి.

"విష్ణ్వాది దేవసంఘానాం రక్షకత్వాత్సదాశివః" విష్ణ్వాది సర్వదేవతలకును రక్షకుడగుట సదాశివుడయ్యెనని క్రియాసాగమునగలదు.

సాయణాచార్యులవారును "శివః కల్యాణరూపస్స్వయం నిష్కల్మషః" యని శివుని నిష్కల్మషుడగు కల్యాణస్వరూపునిగ దలచియున్నారు.

కూర్మపురాణమున "సేతుమధ్యే మహాదేవమీశానం కృత్తివాససం స్థాపయామాస వై లింగం పూజయామాస రాఘవః తస్య దేవో మహాదేవః పార్వత్యా సహ శంకరః ప్రత్యక్షమేవ భగవాన్ దత్తవాన్ వరముత్తమం" "సేతుమధ్యమున శ్రీరాముడు పరమాత్మయగు శివలింగమును స్థాపించి పూజించి యిష్టార్థముల నందినటుల దెలుపబడియున్నది. మఱియు నీయర్థమే పద్మపురాణమున "రామః పుష్పకాదవరుహ్య మహాదేవం ప్రతిష్ఠాపితవాన్ సోస్మై ప్రసన్నోభూత్" పుష్పకమునుండి దిగి శ్రీరాముడు శివలింగమును బ్రతిష్ఠించెను. పరమేశ్వరుడు ప్రసన్నుడయ్యెనని యువచింపబడినది. వాల్మీకమునందు నీయర్థమే "అత్ర పూర్వం మహాదేవః ప్రసాదమకరోత్ప్రభుః" అని గలదు. మఱియు నందే "నాన్యం పశ్యామి భైషజ్య మంతరేణ వృషధ్వజం నాశ్వమేధాత్పరోయజ్ఞః ప్రియశ్చైవ మహాత్మనః" వృషధ్వజుడగు శివుని విడచి సంసారవైద్యునితరుని జూడను. అట్టి మహాత్మునకు నశ్వమేధముకన్న ప్రియమగు యజ్ఞము లేదని తానాచరించెడి యశ్వమేధముచేత శివుడే యారాధనీయుడను దన యాశయమును శ్రీరామచంద్రుడు ప్రకటించినటుల బ్రదర్శింపబడియెను.

"వృక్షస్యమూలసేకేన శాఖాః పుష్యంతి వై యథా శివధ్యానేన దేవాశ్చతృప్తాభవంతిహి" వృక్షమూలమును దడపుటచే దచ్ఛాఖలన్నియుఁ బుష్పించునటుల శివధ్యానముచేతనే సకల దేవతలు తృప్తినొందుదురనియు "సర్వాననశిరోగ్రీవః సర్వభూతగుహాశయః సర్వవ్యాపీచ భగవాన్ తస్మాత్సర్వగతశ్శివః" యని శివుని సర్వవ్యాపకత్వమును గూర్చియు శివమహాపురాణమునఁ జూడంబడుచున్నది. మాండూక్యోపనిషత్తునందు "చతుర్థం మన్యంతే శివమద్వైతం" శివునిఁ దురీయునిగను నద్వైతునిగను వచింపఁబడినది. బ్రహ్మాది సర్వదేవతలును పశువాచ్యులనియు "ఏషామీశే పశుపతిః పశూనాం చతుష్పదాముతద్విపదాం" "రుద్రః పశూనామధిపతిః ఉమాపతయే పశుపతయే" మొదలుగాఁగల శ్రుతిసంచయము నుమాపతియే పశుపతియని యుపన్యసించుచున్నది. ఈ యర్థమే స్కాందకాశీకాఖండమున "బ్రహ్మాద్యాస్థావరాంతాశ్చపశవః పరికీర్తితాః తేషాంపతిత్వాద్దేవేశః భవః పశుపతిస్స్మృతః" బ్రహ్మాది స్థావరాంతములగు పశువులన్నిటికిని శివుఁడే పతియైయున్నాఁడనియును గలదు.

"అబధ్నన్ పురుషంపశుం" పురుషుని బంధించువాఁడు పశుపతియని చెప్పఁబడుచున్నాఁడు. అక్షరము పశువు- క్షరము పాశము యీ రెంటికంటె నతీతమగు వాఁడే పతియగుచున్నాఁడు. ఈ పశుపతియే సర్వమునకును గారణమైయున్నాఁడు. ఈ రుద్రునికంటె నుత్కృష్టుఁడగువాఁడు లేఁడు. ఈ మహాత్ముఁడే సర్వాధిపతి. ఆదిత్యమండలాంతర్గతుఁడు. తమస్సుకంటెఁ బరముగను వసింపువాఁడునైయున్నాఁడు. "అథర్వశిరమునందు "కింతద్ధ్యానం - కోవాధ్యాతా - కశ్చధ్యేయః" అను ప్రశ్నలకు సమాధానరూపకమగు "ధ్యాయీతేశానం ప్రధ్యాయితవ్యం సర్వమిదం బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాస్సంప్రసూయంతే సర్వాణి చేంద్రియాణి సహభూతైర్నకారణం కారణానాంధాతాధ్యాతా కారణంతుధ్యేయః సర్వైశ్వర్యశ్శంభురాకాశమధ్యే........ఈశానునే ధ్యానము చేయవలెను సర్వమును బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాదులు నాతనివలననే గలుగుచున్నారు. ఆతఁడెవరివల్లను బుట్టుటలేదు, సర్వేశ్వరుఁడగు నాతఁడే హృదయాకాశమున ధ్యానింపఁదగినవాఁడు. అన్యదేవతలనువీడి శివునే ధ్యానింపుండని వివరింపఁబడినది.

ఇద్దాననే శివుఁడు. పరబ్రహ్మయు, సర్వాధికుఁడును సర్వజ్ఞుండును ధ్యానయోగ్యుఁడును సకల శిష్టపూజనీయుఁడును సర్వాధిపతియు సర్వకారణుఁ

డును మంగళస్వరూపుడు నద్వితీయుడు మోక్షదాతయు నగుచున్నాఁడు. ఇట్లు సకల శాస్త్రసమ్మతముగ సిద్ధమగుచున్నది.

ముదిగొండ కోటయ్యశాస్త్రి,
ఈ మ ని.

---

శ్రీ శివాయగురవేనమః

# శైవమత ప్రకాశికా పత్రికా ప్రచారము



భక్తమాహేశ్వరులారా !

ఏమతమైనను ప్రచారమునగాని యభ్యుదయ మొందనేరదు. అట్టి ప్రచారములలో పత్రిక మతగ్రంథరచనము. మతబోధ మున్నగు సాధనములు ముఖ్యములు. ఇంకను ననేక విధములుగా ప్రచారములు చేయుటకు వేఱు మార్గములు కలవు. మతాభివృద్ధి కలుగునట్లు కాలానుసారముగా నొక్కొక్క రీతిగా ప్రచారముచేయుట ముఖ్య కర్తవ్యము

ఈ సంగతిని గమనించియే శ్రీ లోకారాధ్యశైవ మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగ శాస్త్రులవారు 1900 సం॥ ఆప్రాంతమునందు శ్రీ శైవ ప్రకాశిక, యను పేర నొక పత్రికను చెన్నపట్టణమున స్థాపించి కొంత కాలము నడిపినారు. కాని మతమునందది విశేషవ్యాప్తిని బొందలేదు. ఆపత్రిక కొంత కాలంబునకు నిలిచిపోయినది. తరువాత 1913 సం॥ లో శైవ మహాసభవారు శైవ మత ప్రకాశిక యను పేర సభ తరపున నొక మాస పత్రికను షుమారు మూడు, నాల్గు సంవత్సరములు నడపినారు గాని శ్రద్ధవహించమిని నదియును నిలచిపోయినది. తరువాత కొంతకాలమునకు 'శైవ రహస్యబోధినీ, యను పేర మహోపాధ్యాయ — ము॥ నాగలింగ శాస్త్రుల వారిచే తెనాలి పట్టణమున నొకద్విమాస పత్రిక స్థాపింపబడి షుమారు 15 సంవత్సరములు నడుపబడి యది యును నిలిచిపోయినది. వారిచే జ్ఞానవాహిని యను పత్రిక స్థాపింపబడి యదియు నంత మొందినది. ఆకాలముననే వరంగల్ పట్టణమున శ్రీ విద్వాన్

ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారిచే శైవ ప్రచారిణి యను పత్రికయును బెజవాడపట్టణమున శ్రీ శివపురపు వీరభద్ర పాకయాజిగారిచే 'శైవ ధర్మప్రకాశిక' యనుపత్రికయు స్థాపింపబడినచిరకాలమునకే కాలధర్మము నొందినవి. దీనినిబట్టి చూడ పైపత్రికలన్నియు జనన మొందినవన్న మాటయేగాని వానికి దీర్ఘాయుర్దాయము పట్టలేదు. ఆపత్రికలకు చందాలనిచ్చువారు ప్రతి సంవత్సరము సరిగా నీయకపోవుటవల్ల ద్రవ్యలోపముచే నంతరించిన మాటవాస్తవము. ఒక్క శైవ రహస్య బోధినీ పత్రికకు చందాలు క్రమముగా నంతరించినను శ్రీ నాగలింగశాస్త్రులువారు స్వంత ద్రవ్యమును కూడ వెచ్చించి చాలనష్టమును పొందినారు. ఆప్రకారం యెంతకాలము వారు నష్టమును సహింపగలరు? ఆకారణమున నదియు నాగిపోవలసివచ్చినది శైవ ప్రచారిణీ శైవధర్మ ప్రకాశికల పతనమునకు గూడ నదియే కారణము. మాకు తెలిసినంతవరకు మన మతము నందలి యింతకు పూర్వపు పత్రికా ప్రచారమును తెలిసితిమి.

పై పత్రికల కన్నిటికిని సుమారు యే రెండువందలమంది మతస్థులమన్ననో మాత్రము ప్రచారము సాగినది. మతధర్మములకు ప్రాముఖ్యమునీయక, కేవల రాజకీయార్థికాది విషయములయందు నిమగ్నులైయున్న సాంఘికులలో, మత ప్రచారము చేయుట యత్యంతదుర్ఘటము. అట్లని మతప్రచారమును నేయ గూడదందురా? ప్రపంచ చరిత్రనుబట్టి మేమట్లు తలంచము. రాజకీయార్థికాది విషయపరతంత్రులైన యింగ్లీషు, జర్మని, ఫ్రాంసు మున్నగు పాశ్చాత్యదేశముల వారు, ఆఫ్రికా, ఆసియాఖండములయందు క్రైస్తవమత ప్రచారమునకై లక్షలు కోట్లాదిగా ద్రవ్యమును వెచ్చించి క్రైస్తవమత ప్రచారమును నేటికిని చేయుచున్నారు. అట్లే మహమ్మదీయులును తమ ఇస్లాం మతమునుగూర్చి పాటుపడుచున్నారు. బౌద్ధమతస్థులగు చైనా, జపాను దేశీయులుగూడ అట్లే వారి మత విషయమున పాటుపడుచున్నారు దీనినిబట్టిజూడ పైవారగల రాజకీయార్థికాది విషయ విజ్ఞానమును, వారి వారి మతజ్ఞానములతో సమన్వయము చేసుకొనుచున్నారు. వారి మతజ్ఞానములను విడనాడి వారెప్పుడును ప్రవర్తించుటలేదు. మనమో రాజకీయాది కేవల ప్రాపంచికవిషయలంపటులమై, మతవిషయములయందప్రమత్తులమైయున్నాము. అది తగదు. అట్లుండుటచేతనే, మన భారత దేశమున మతసంబంధమైన పత్రికలు వికాసమునుబొందుటలేదు. ఈ తత్త్వమును తెలిసికొని ప్రతి వ్యక్తియు మతధర్మమును గౌరవించుట కలవాటుపడవలెను. లేనిచో జీవితమునకు పరమావధియగు నీతిధర్మములు నశించుటతోడనే యధఃపతనము తప్పదు.

శైవమహాసభతరఫున 1913 సం॥లో ప్రారంభింపబడి నిలచిపోయిన శైవమతప్రకాశిక, యను పత్రికయే మరల నిప్పుడు ద్విమాసపత్రికగా పునరుద్ధరింపబడినది. ఈ పత్రికకు శైవసంఘమునందెల్లను ప్రచారముండుట ముఖ్యావసరమని తలంచి, గంజాంజిల్లాలగాయుతు మద్రాసువరకున్నూ గల జిల్లాలయందును, నైజాం ప్రాంతమునందునుగల యీ దిగువ పట్టీలో తెలుపబడిన షుమారు 153 శైవగ్రామములకు షుమారు 900 కాపీలు పైగా బంపుచున్నాము. ఈ ద్విమాస పత్రిక కడవకు 1000 కాపీలు ముద్రింపబడుచున్నది. పోష్టుఖర్చుల క్రింద షుమారు 15 రూపాయలుపైగా ఖర్చుఅగుచున్నది. మొత్తము రు 50 లకు పైగా ద్రవ్యము ప్రతికడవకు కావలసియున్నది. ఇంతవరకు జరిగిన పత్రికలకు చందాలరూపముగను విరాళములు మున్నగుమార్గములద్వారా లభించు ద్రవ్యంతో నీపత్రిక నడుపుచున్నాము। ఇప్పుడు పత్రికకు నిల్వ ద్రవ్యములేదు. అందువల్ల శైవులు గల ప్రతిప్రాంతమునకును ప్రచారకులను బంపుచున్నాము. వారలను శివస్వరూపులనుగాయెంచి ప్రతిశైవుడును తప్పక గౌరవించి ప్రచార సందర్భములో కావలసిన యావత్తు సమాచారములను దెలిపి వారిద్వారా మీమీ గ్రామములయందు, శైవమహాసభకు నంగములుగానుండునట్లు గ్రామసంఘములను నెలకొల్ప హెచ్చరిక చేయుచున్నాము. మరియు మీమీస్థితిగతులకు తగినట్లు ప్రధానపోషకోపపోషకాది చందాదారులుగ చేరి చందా ద్రవ్యమును వారలకు యిచ్చి వారివల్ల మహాసభవారు యేర్పాటుచేసిన ప్రింటెడ్ రశీదును పొందగోరుచున్నాము.

మరియు 20 వ బెజవాడ మహాసభలోని 5 వ తీర్మానము ననుసరించిన్ని 21 వ రాజమండ్రి సభలోని 18 వ తీర్మానము ననుసరించిన్ని శైవసాంఘికుల యొక్క జనాభా రిపోర్టు తయారుకావలసియున్నది. గడచిన 20 సభలకాలమందు అట్టి రిపోర్టు తయారై యుండలేదు. ఇంతవరకు మేము ఒక్క కృష్ణా జిల్లాలోని శైవుల జనాభానుమాత్రము 2, 3 గ్రామములు తప్ప తక్కిన గ్రామములకు పూర్తిచేసితిమి. తక్కిన జిల్లాలలోని శైవజనాభాకూడా పూర్తిచేసుకుని శైవసాంఘిక జనాభా రిపోర్టును తయారుచేయుదుము. ఇదివరలో చాలా గ్రామములకు, కార్యస్థానములనుండి అచ్చువేయబడిన జనాభా ఫారములు పంపియుంటిమి వరంగల్ నిగ్నల, ఈపని, విజయనగరములనుండి తప్ప, తక్కినచోట్లనుండి ఫారములు పూర్తిచేసి పంపియుండలేదు. ఇప్పుడట్లుగాక ప్రచారకులు మీకు అచ్చుఫారములు యిత్తురు. వాటిని శ్రమయనకపూర్తిచేసి

వారికి యివ్వగోరుచున్నాము. లోగడి ఫారములందినవారు పూర్తిచేసి కార్యస్థానమునకు బంపవేడుచున్నాము.

ప్రతి జిల్లాలోనివారును, యీదిగువపట్టికలోని గ్రామములుగాక యింకా తమకు తెలిసియున్న శైవగ్రామముల పేర్లను, యాగ్రామవాసులగు శైవుల పేర్లను వెంటనే కార్యస్థానమునకు పంపగోరుచున్నాము. అందువల్ల ప్రచారకులకు ప్రయాణసందర్భములో అనుకూలమైన ప్రోగ్రాము యేర్పాటుచేయుటకు వీలుండగలదు.

---

# పత్రిక పంపబడు శైవ గ్రామముల పట్టిక

## గంజాంజిల్లా

1 ఉర్లాం, 2 శ్రీకాకుళం, 3 బరంపురం, 4 కాపురం, 5 జేవిడి.

## విశాఖపట్టణం జిల్లా

1 విశాఖపట్టణం, 2 విజయనగరం, 3 భీమునిపట్నం, 4 చీపురుపల్లి, 5 కపా, 5 నిడిఘట్టు 7 వీరభద్రపురాగ్రహారం, 8 పర్లాకిమిడి 9 పెక్కలింగను సాధపురం 10 వనితమండలం 11 ఆముదాలవలస 12 చీకటికోట 13 పిఠిడి 14 ఉత్తరావిల్లి 15 గజపతిపురం 16 శిరిపురం 17 నెల్లిమర్ల 18 అనకాపల్లి 19 కసింకోట 20 వాల్తేరు 21 లచ్చమ్మపేట 22 శృంగవరపుకోట 23 పార్వతీపురం 24 సులకాలపల్లి 25 మాడుగులు 26 పెరుమాళ్ళు 27 సాతాంవలస 28 పూండి 29 దేవపల్లి 30 మిండి 31 అన్నవరం 32 అలమండ.

## గోదావరిజిల్లా

1 రాజమండ్రి 2 కొవ్వూరు 3 కొత్తపల్లి 4 యేలేటిపాడు 5 అయితంపూడి 6 తణుకు 7 యేలూరు 8 మిలిమించిలిపాడు 9 సామర్లకోట 10 కాకినాడ 11 కొత్తపేట 12 అమలాపురం 13 గోకవరం 14 దువ్వ 15 నరసాపురము 61 చింతలపూడి 17 తుని 18 భీమవరం 19 ఎనమదుర్రు.

## కృష్ణాజిల్లా

1 బందరు 2 పెడన 3 గండగ్రాము 4 శేరీవర్ర్లపల్లి 5 వడ్లమన్నాడు 6 గోశవరం 7 బొల్లిబోతుపాలెం 8 కప్పలదొడ్డి 9 మడక 10 గుడివాడ 11 యలకుట్లు 12 సైదేపూడి 13 పెసరమిల్లి 14 పెదపాలపట్లు 15 కోభనాద్రిపురం 16 కొట్లి గుంటపాలెం 17 శ్రీరామవరం 18 వాడపల్లి 19 చమిడిముక్కల 20 బెజవాడ 21 నెప్పల్లె 22 ఈడుపుగల్లు23 తోట్లవల్లూరు, 24 కంకిపాడు 25 మున్నపుపాడు 26 పెదఓగిరాల, 29 నందిగామ, 28 వేములపల్లి, 29 తోటరావులపాడు 30 అడివిరావులపాడు, 31 భీమవరం, 32 చందర్లపాడు, 33 కోనాయపాలెం, 34 కొండూరు, 35 జగ్గయ్యపేట, 36 లచ్చపాలెం, 37 కీరెళ్ళపాడు, 38 తక్కెళ్ళపాడు 39 వల్లంపల్లి, 40 సోమవరం, 41 కన్నెనీడు, 42 చినముత్తేవి, 43 కాట్రేనిపాడు, 44 రాయనపాడు, 45 నందిగామ.

## గుంటూరు జిల్లా

1 గుంటూరు 2 తెనాలి 3 రేపల్లె 4 నరసారావుపేట 5 అమరావతి 6 ఈవని 7 మున్నంగి 8 పెదపులివర్రు 9 బేతపూడి 10 అల్లూరు 11 గుడిపూడి నందిగామ 12 తాడికొండ 13 కొల్లిపర 14 ఊటుకూరు 15 కస్తలఅగ్రహారం 16 అత్తలూరు 17 బయ్యవరం 18 చామర్తి 19 సత్తెనపల్లి 20 చింతపల్లి 21 అచ్చంపేట 22 తొండపి 23 తాళూరు 24 కొమిరెపూడి 25 ఈతముక్కల 26 తాళూరు గుళ్ళవాగు ఫిరంగిపురం 27 తక్కెళ్లపాడు 28 శివపురం 29 వలపల 30 గార్లపాడు 31 పమిడిపాడు 32 రాజెంగివరం 33 చినపావులూరు 34 పెదపావులూరు 35 స్వర్ణ 36 ఇనగల్లు 37 ఇంటూరు 38 కొత్తపట్నం.

## నెల్లూరు జిల్లా

1 దూచవరం 2 కందుకూరు 3 నెల్లూరు టౌన్సుపేట

## నైజాం

1 నిర్మల 2 సికింద్రాబాదు 3 వరంగల్ 4 పాలకుర్తి 5 వేములవాడ 6 సిద్దిపేట 7 లచ్చుపేట 8 సంగెం 9 ముకుందాపురం 10 గుండ్రాతిమడుగు 11 కొమ్మినపల్లి

## మదరాసు జిల్లా

1 మద్రాను

ఇట్లు,
మేనేజరు—శైవ మహాసభా కార్యాలయము,
బుట్టయ్యపేట, బందరు.

శ్రీ శివాభ్యాం నమః

# శ్రీ శివలింగ ధారణమ్

(నిర్మల శంకరశాస్త్రీ)

శ్లో॥ యస్మై నమో భవతి యస్య గుణా స్సమగ్రా,
నారాయణోపనిషదా యదుపాసనోక్తా ।
యో నః పరిచోదయతి బుద్ధిమధీశ్వరో యః,
స్తం త్వా మనన్యగతి రీశ్వర సంశ్రయామి

అయిభో శైవాచరణం సాః?   కించిద్విజ్ఞాప్యతే !

పరమేశ్వరసృష్టే౽స్మిన్ జగతి హ్యనంతకోటి జంతు సంతానాని సంతి. తేషు భగవద్దత్త విజ్ఞానైకధనత్వా న్మానవజాతే రుత్కృష్టత్వ మాయాతమ్. ఏతాదృశ సర్వోత్తమజన్మానో మానుషాః స్వస్వసాంప్రదాయానుగతాచారా నవలంబ్య తత్తదుక్తమార్గేణ సమాదరంతో యథాశక్తి ప్రబోధయంతశ్చ పరమేశ్వరానుగ్రహపాత్రా భవంతి. తాదృశసాధకేషు కేచన శివభక్తాః-కేచన విష్ణుభక్తాః కేచన శక్త్యాద్యుపాసకా భూత్వా పరాత్పరం పూజయంతి ఇత్థం కే కియ న్మార్గావలంబినో౽పి

విధాతారం కశ్చిద్భజతి భజతే కశ్చన హరిమ్,
సురానన్యానన్యే జగతి సఫలా స్సర్వవిధయః ।
తథాపి త్వద్భక్తే శ్శివశివ యథా చర్మపదితి,
శ్రుతో మంత్రో దేవాన్తరభజనదైన్యం వసహాతే॥ ఇత్యాకారక

శ్రీ హరదత్తాచార్య భణితిపరికార । ముపాసకానాం తేషాం సర్వేషాం సమీచీనాంతికాపతి శ్శరణ్య ఇతి మంతవ్యమ్

ప్రకృతమనుసరామి.

ముఖే మంత్రం హృది ధ్యానం-మస్తకే లింగధారణమ్,
శిఖా మాలిం తథా భస్మ-హ్యేతద్బ్రాహ్మ్యాగ లక్షణమ్॥ఇతి॥

గౌతమోక్త మనుస్మృత్యా భస్మధరాస్త్రిపుణ్డ్ర ధృత్వా శిఖా యజ్ఞోపవీ
తిన స్సంతః పంచాక్షరీ మహామంత్ర ధ్యానపరాయణా హృది తత్పరమేశ్వరం
చింతయంతో విప్రా లింగధారి బ్రాహ్మణా ఇతి శైవా ఇతి ఆరాధ్యా ఇతిచ వ్యవ
హ్రియమాణా వేదానను, క్రియాత్మక దీక్షా క్రియేణ గురోస్సకాశాచ్ఛివలింగం
గృహీత్వా తదేవ లింగం నిరంతరం పూజయమానాః శివైకమానసాశ్చ విద్యంతే

అపిచ

యోహస్తపీఠే నిజలింగ మిష్టం-విన్యస్య తల్లీనమనః ప్రచారః,
బాహ్యక్రియాసంకుల నిస్పృహాత్మా-సంపూజయత్యంగ సవీరశైవః॥
ఇత్యాకారక సిద్ధాంతశిఖామణి వచనప్రకారేణైతేషా మిష్టలింగధారణ
పూర్వక శివలింగలీనమనస్కత్వాద్బాహ్యనిస్పృహత్వేనచ వీరశైవా ఇత్యపి
నామ వ్యవహర్తుం శక్యతే.

"సర్వలింగస్థ్ధారయతి పాణిమంత్రం పవిత్రమ్,
పవిత్రంతే వితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః॥
ఇత్యాదిశ్రుతయః సర్వేషాం భూసురాణాం శివలింగధారణం నిత్యమేవ
జ్ఞాపయంతి అతఏవ ప్రత్యహాయోఽపి స్తీతి లింగధారణదీపికాయా ముక్తమ్.

శ్లో॥ బ్రహ్మాదయోఽపి దేవాశ్చ- మునయో గౌతమాదయః,
ధారయంతి సదాలింగ- ముత్తమాంగేషు సర్వదా॥
ఏతాదృశ మహల్లింగధారణం నకేవలం మనుష్యా ఆచరంతి కింతు బ్రహ్మా
దిదేవాః గౌతమాది ఋషయః బాణాసురాది రాక్షసాశ్చ నియత్యం శివలింగం
తత్తదుత్తమాంగేషు ధృత్వాస్వం స్వమన్నతపదం ప్రాప్తవంత ఇతి పురాణేషూ
ద్ఘోషితమ్

అద్వైతినాం మతే మోక్షైక సాధనతయా యస్తురీయాశ్రమో నిర్ణీతోఽస్తి
తాదృశసన్యాసినా ఏతచ్ఛివలింగధారణ మతిరిక్తమితి జ్ఞాతవ్యమ్.

లింగధారి బ్రాహ్మణానాం సతతపునీతత్వేన పాపాదిదోషా స్సంభవంతీ
తి తేషా మేకజన్మన్యేవ శాశ్వత శివసాయుజ్యం లభ్యతఇతి నతథా దేవతాం
తరోపాసకానాం శీఘ్రమేవ బంధవిమోచనం స్యాదితిచ నిగమాగమేషు ముక్తా
క్తం భవతి.

ఇతోఽపి శివలింగధారణవిషయే౽నేకప్రమాణాని విద్యంతేఽ యావన్మా
హాత్మ్యం తస్మిన్ తావద్వక్తు మాదిశేషోఽపి నక్షమః మయా యథాబుద్ధి హ్యేత
స్మిన్ విషయే కించిన్నివేదితమ్.

# చందాలవివరము.

| | |
|---|---|
| ప్రధానపోషకులకు సంవత్సరమునకు | రు 5_0_0 |
| పోషకులకు సంవత్సరమునకు | 3_0_0 |
| ఉపపోషకులకు సంవత్సరమునకు | 2_0_0 |
| సభ్యత్వచందా సంవత్సరమునకు | 1_0_0 |
| పత్రికచందా సంవత్సరమునకు | 1_8_0 |
| విడిపత్రిక 1 కి | 0_6_0 |

ప్రధానపోషక, పోషక, ఉపపోషకులకు పత్రిక యుచితముగా పంపబడును. వీరికి ఓటింగు హక్కు గలదు.

సభ్యత్వచందాదారులకు సభయందు ఓటింగు హక్కు కలదు. వీరికి పత్రిక పంపబడదు.

పత్రిక చందాదారులకు పత్రిక పంపబడును గాని వీరికి ఓటింగు హక్కు లేదు.

ప్రచారకులు తమ ప్రచారములో శైవమతగ్రంధములుగాని మరియితరగ్రంధములుగాని సంగ్రహించి కార్యస్థానమునకు బంపుచుండవలెను. అధ్యక్ష కార్యదర్శులు మరి పండితసమితివారు కూడ గ్రంథాలయమునకు కావలసిన పుస్తకములు అవి దొరకు స్థలములు విచారించి గ్రంధములు చేకూర్చుటలో తగినంత కృషిచేసి త్వరలో గ్రంథములు కార్యస్థానమునకు చేర్పవలయును. గ్రంధము లుచితముగా దొరకునెడల దాతలపేర్లుగూడ వ్రాయుచుండవలెను.

ఇట్లు, మేనేజరు,
శైవమహాసభా కార్యాలయము,
బుట్టాయ్యపేట, బందరు.

---

విలేఖకులకొక విజ్ఞప్తి.

తాము రచించు వ్యాసములను స్పష్టమైన యక్షరములతో విడివిడిగా, కాగితమునకు నొకవైపున మాత్రమే వ్రాసి యంపుడ కోరుచున్నాము. అందువల్ల ప్రెస్సువారికి కంపోజింగుచేయుటకు సుళువుగానుండును.

ఇట్లు
పత్రికాసంపాదకుడు

శ్రీ శివాయ గురవేనమః.




ద్విమాస పత్రిక.


| సంపుటము | బహుధాన్యనామ సంవత్సర | సంచిక |
|---|---|---|
| 1 | మార్గశిర, పుష్యమాసములు. | 5 |


శ్రీవేదశాస్త్రార్థ తతిప్రభాసికా । సందేహసందోహ మహావిరాసికా ।
తత్వత్రయోద్బోధనసిద్ధదేశికా । జయత్వియం శైవమతప్రకాశికా ॥

సంపాదకుడు:— ఇవటూరి సానందరావు

1939

శ్రీ శివాయగురవేనమః

# శైవమతప్రకాశిక.

## వైదిక మతాదర్శము అవైదిక మతాదర్శము.

సకల చరాచరంబులగు, సమస్తవస్తుజాలములయందంతటను, నిండి పరిపూర్ణుడైన, పరమేశ్వరుడు, అనాదియగు, తన మాయాశక్తిచే ననేకములగు, లోకముల సృజించెనని, వేదశాస్త్రములుద్ఘోషించుచున్నవి. ఆలోకములలో మనము ప్రస్తుతము జన్మించినది మానవలోకము. ఈ మానవలోకమున, మానవేతరములగు ననేక జీవరాసులు జన్మించియున్నను, విజ్ఞాన జ్ఞానములచే శ్రేష్ఠుడగు మానవుడే ప్రధాన జంతువగుటవలన, నీలోకమునకు మానవలోకమని నామకరణము గావింపబడియెను. కాబట్టి యీలోకమునగల సమస్త జంతువులలో మానవుడే సర్వోత్కృష్టుడనుట నిర్వివాదము.

ప్రకృతి, కాలానుసారముగ, ననేకమార్పుల జెందుచుండును. ఆవిధమగు మార్పులచే నీ భూమండలము, గతించిన కాలములయందు, నెన్నో లెక్కలేని మార్పులజెందుచు, ప్రస్తుత మొకవిధమగు పరిస్థితియందుండెను ప్రస్తుత పరిస్థితినిబట్టి, ఆసియా, యూరపు, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా యని పిలువబడునట్టి యైదు పెద్ద భూభాగములచేతను, జావా సుమిత్రా మున్నగు ననేక పేరులచే బిలువబడునట్టి చాల చిన్న చిన్న భూఖండములచేతను, నీమహీమండలము ఖండితంబై యున్నది.

ఇట్టి మహీమండలమున సుమారు రెండువందలకోట్లకుపైగా, మానవ జీవరాసియున్నట్లు నన్నిదేశముల జనాభా లెక్కలనుబట్టి విశదమగుచున్నది. ఈ మానవులందరు నొక్క జీవరాశికే చేరినవారైనను, మతములచేతను, జాతులచేతను, వృత్తులచేతను ననేక సంఘములుగా విడగొట్టబడియుండిరి.

# శైవమత ప్రకాశిక.

మతదృష్టితో జూచినయెడల, వేదమతము, బౌద్ధమతము, మహమ్మదీయ మతము, క్రైస్తవమతము, అను నాలుగు పెద్దమతములును, యూదుమతము, పారసీకమతము, సిక్కుమతము, జైనమతము మున్నగు ననేక చిన్నమతములును, నీమానవసంఘమున, వెలుగొందుచున్నవి.

వృత్తిదృష్టితో జూచినయెడల, వర్తకులనియు, వ్యవసాయదారులనియు, కుమ్మరులనియు, కమ్మరులనియు, ననేకములగు భేదములచే మానవసంఘములు గాన్పించుచున్నవి.

జాతిదృష్టితో జూచినయెడల, మన హిందూదేశమున మాత్రము బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను, నాలుగు జాతులు ప్రత్యక్షగోచరము లగుచున్నవి.

దేశదృష్టితో జూచినయెడల, ఇండియనులనియు, అమెరికనులనియు, చైనీయులనియు, పెక్కు భేదములు గన్పట్టుచున్నవి.

భాషాదృష్టితో జూచినయెడల, నాంగ్లేయులనియు, జర్మనులనియు. నాంధ్రులనియు, అరవలనియు, పెక్కురీతులుగా, విభాగములు గాన్పించుచున్నవి.

రంగుజాడనుబట్టి పరిశీలించిన, తెల్లవారనియు, నల్లవారనియు, మున్నగు భేదములు గన్పట్టుచున్నవి.

గుణములనుబట్టి చూచినచో, నొక విధముగా, సాత్వికులనియు, రాజసులనియు, తామసులనియు, మతియొక విధముగా, సజ్జనులనియు, దుర్జనులనియు, భేదములచే మానవులు గన్పట్టుచున్నారు. పరికించినచో నొక్కొక్కదృష్టితో, నొక్కొక్క భేదము కలిగియుండుట జూడనిదియంతయు నీశ్వరవైచిత్ర్యమే యని నాకు దోచుచున్నది.

ఇట్టి భేదములు ఈశ్వరనిర్మితములని యొకతరగతివారును మానవకల్పితములని మరియొక తరగతివారును వివదించుచు భేదములు లోకోద్ధారార్థమై యావశ్యకములుగా నుండవలసినవేయని మొదటి తరగతివారును, భేదములే యనేక కలహములకు కారణములై యనేకములయిన యనర్థములకు హేతువులనియు కావున వశ్యముగా భేదములను, త్వరలో నిర్మూలించి సమానత్వమును నెలకొల్పవలయునని రెండవతరగతివారును వాదించుచున్నారు. ఇందేది సత్యమో మనదృష్టితోను శాస్త్రదృష్టితోనుగూడ పరిశీలించవలసియున్నది.

పరిశీలించినచో, భేదములు ఈశ్వరనిర్మితములనియు, జీవనిర్మితములనియు, రెండురకములుగా గన్పట్టుట యుంద రంగీకరించవలసినదే. కాని యిప్పటివారు వాదించునట్టి సర్వమానవ సమానత్వమను వస్తువు, విషముష్టిపండువలె మనోహరముగా గాన్పించినను అనుభవించుటకు బ్రయత్నించినయెడల విషముష్టిపండు యేవిధముగ మనలకు హానికరమో అట్లే యీ సమానత్వము నాచరణ కసాధ్యమై యనేకములగు ననర్థములకు హేతువై యున్నదని చారిత్రిక జ్ఞానముగలవారు మాత్ర మంగీకరించక తప్పదు.

సమానత్వము, భేదమనురెంటియొక్క విషయమును మనము సమగ్రముగా దెలిసికొనవలయునన్న ముందు భేదమును గురించి విచారించి సమానత్వమును గురించి తరువాత విమర్శచేయుదము. భేదమనగా, నానారూపములుగలిగి నానావికారములు కలిగియుండుటయనియు సమానత్వమనగా నానారూపములుగాని నానావికారములుగాని లేక యేకరూపమై నిర్వికారముగా నుండుటయనియు నర్థము చేయవచ్చునుగదా! ఇంతకంటె మరియొక యర్థము కుదురుటకూడ దుర్లభము గదా! దీనినిబట్టిజూడ నానారూపములు నానావికారములు లేకుండజేసినగాని, నిర్వికారమైనట్టియు నేకరూపమైనట్టియు సమానత్వము సంప్రాప్తించుట దుర్లభముగదా! అదియెట్లు సాధ్యమగునో పదంపడి విచారింతము.

సమానత్వరూపమై, నిర్వికారమైన యేకరూపము సృష్టికిపూర్వమునందుండునా? లేక సృష్టికితరువాత నుండునా? అను విషయమును ముందు విమర్శ చేయుదము. దీనికి ముందు సృష్టియననేమియో తెలిసికొనవలయును. సృష్టియనగా సృజింపబడినది యని యర్థము. సృజింపబడుట యనగా యేర్పరచబడుటయని యర్థము. ఏది యేర్పరచబడినదని ప్రశ్నకలుగగా ఆకాశము, వాయువు, అగ్ని జలము, భూమి మరియు వీటివలనగలుగు నుద్భిజ్జస్వేదజాండజ జరాయుజ రూపమగు సమస్త వస్తుజాతమని సమాధానము చెప్పక తప్పదు. ఈ సమస్త వస్తుజాతము సృజింపబడక పూర్వమున్న వస్తువు నిర్వికారమై యేకరూపమైనదనియు, అట్టి యేకరూపమైన వస్తువునుండి సృజింపబడినదనగా భేదముకలిగినదనియు గ్రహింపకతీరదుగదా! కనుక సృష్టి, భేదమును వస్తువులేనిదే కలుగదని విశదమగుచున్నది. కాబట్టి భేదమును నిర్మూలించి సమానత్వమును చేయగలయునన్న ముందు సృష్టినే నిర్మూలనము చేయవలయునుగదా! సృష్టిని నిర్మూలించుట యల్పశక్తివంతులగు మానవుల కసాధ్యముగనుక మానవుడైనవాడు నందునను

వివేకమున్నవాడు నా ప్రయత్నమునకు పూనుకొనగూడదు. సృజింపబడినదనగా భేదములుగా జేయబడినదనియు ఇంకను సృష్టి జరుగుచున్నదనగా నింకను భేద రూపములగు నానా వికారములు కల్గుచున్నవనియు, నిట్టి వికారములు సృష్టి జరుగుచున్నంతవరకు నుండక తప్పదనియు సృష్టికాలములో సమానత్వమును సాధించబూనుకొనువాడు అవివేకియనియు తలంచుటలో నేమాత్రమును పొరపాటు ఉండదు.

సృష్టిగతములైన భేదములు సజాతీయ విజాతీయ, స్వగతములని ముత్తెఱంగుల విలసిల్లుచున్నవి, విజాతీయభేదమనగా తనజాతికి మరియొక జాతికిగల భేదము ఉదాహరణము, కుక్క పిల్లి యెద్దు మొదలైనవి. సజాతీయ భేదమనగా తనజాతియందుగల భేదము. ఉ॥ ఊరకుక్క వేటకుక్క మొదలగునవి. స్వగత భేదమనగా తనయందుగల భేదము. ఉ॥ కాలు, చెయ్యి, ముక్కు, మొదలైనవి. కాబట్టి సృష్టి జరిగినది మొదలుకొని యది అంతమయ్యేవరకు నీ త్రివిధభేదములు నుండక తప్పదు. ఇది వేదప్రబోధితము. కాబట్టి సమానత్వమనునది సృష్టిలో చేరిన వస్తువుకాదనియు సృష్టికతీతమైన వస్తువనియు గ్రహింపుడు.

భేదమునే నిమిత్తముచేసికొని, సృజింపబడినవస్తువులలో నాకాశముకంటె వాయువువేరు వాయువుకంటె నగ్ని వేరు. అగ్నికంటె జలము వేరు. జలముకంటె భూమివేరు. ఇట్టి భేదవస్తువులచేనిర్మింపబడిన జీవరాసులు వేరు. ఆజీవరాసులమన స్తత్వములు వేరు. శరీరములు వేరు. అట్టి శరీరులచే నేర్పడిన సంఘములు వేరు. మతములు వేరు. వృత్తులు వేరు. ఇట్లు సకలమును వేరుపాటును గలిగియుండగా సమానత్వముకావలెనని వాపోవుచున్నారేలకో కారణ మూహింప దురూహ్యము.

ఇక సమానత్వమన నిప్పటివారి యాశయ మెద్దియో మనము కనుగొన వలసియున్నది. లోకమున మానవులందరు తిండివిషయములో దృష్టిదోషమును పాటింపగూడదనియు, మానవులలో నొకతరగతివారు, ఎక్కువ యనియు మరొక తరగతివారు తక్కువయనియు తలంపగూడదనియు సర్వపురుషులకును స్త్రీలకును నిష్టమువచ్చినట్లు స్వేచ్ఛ యుండవలయుననియు అనగా వారుభయులు రాజకీయములందుగాని యార్థిక వ్యాపారములందుగాని వలసినట్లు వర్తింపవచ్చు ననియు జాతిమత విచక్షణ లేకుండ స్త్రీపురుషులు వర్తింపవలెననియు వివాహములకు నెట్టి నియమములేక స్త్రీపురుషులు తమ యిష్టమువచ్చినవారిని వరింప వచ్చుననియు ఇష్టములేనప్పుడు విడాకుల నీయవచ్చుననియు మొదలగు సిద్ధాంత

ముల నవలంబించినయెడల సమానత్వము లభించునని వారలయాశయమైయున్నది. ఇట్టి యాశయమునే వారు సమానత్వమని వ్యవహరించుచున్నారు. పైన నేను భేదమునకును సమానత్వమునకును జేసిన విచక్షణయందు జేరిన సమానత్వమువంటి సమానత్వముకాదు వీరి సమానత్వము. వీరి యాశయమును బట్టి దానిని సమానత్వమనుటకంటె, స్వేచ్ఛయని నిర్వచించుట యుక్తమని నాతలంపు. కాబట్టి యిట్టి స్వేచ్ఛ మనుష్యుల కవసరమో, లేక తిర్యగ్జంతువులకవసరమో? అట్టి స్వేచ్ఛను నవలంబించినయెడల మనుష్యత్వమునిలుచునా? మనుష్యత్వమననేమి? మానవాభ్యుదయమననేమిటి? మానవాభ్యుదయమునకు నట్టి స్వేచ్ఛ యుపకారకమా? యను విషయములను గురించి చర్చించి, ఏది హేతుబద్ధమైయుండునో నా మార్గము నవలంబించుట మానవజన్మలక్షణమని గుర్తింపబడుగాక.

లోకమున నాస్తికులనియు ఆస్తికులనియు మానవులు రెండు తెఱంగులు. నాస్తికులు దేవుడేలేడనువారును యేజంతువుగాని జన్మించి మరణించిన పిమ్మట తిరిగి మరియొక జన్మ యెత్తదనియు ప్రతి జంతువునకును జన్మయెత్తుటకు పూర్వము వేరొకజన్మనుండి సుకృత దుష్కృత సంస్కారవశమున, నీ జన్మ యెత్తినదని తలంచగూడదనియు ఏ జన్మకాజన్మయే ప్రారంభమనియు దాని నాశనమే మరణమనియు మరణానంతరమున నిలిచియుండు వస్తువేదియు లేదనియు ప్రాపంచిక సౌఖ్యయే పరమసౌఖ్యమనియు త్రికరణశుద్ధిగా వాదించు వారును నాస్తికులని జెప్పబడుదురు. తాము స్వతంత్రులమనిగూడ నాస్తికులు చెప్పుదురు.

ఆస్తికులనగా సమస్త సృష్టికిని కారణభూతుడగుసర్వశక్తివంతుడైన దేవు డొకడు కలడనియు ఆదేవుడు పరమేశ్వరాది నామములచే నుతింపబడుననియు ఆదేవుడు జనన మరణాదులులేనివాడనియు అనాదియై యనంతుడుగ నుండువాడనియు నిత్యుడనియు జెప్పువారికి ఆస్తికులని పేరు. మరియు జీవులు అనాది మాయాపాశములచే బంధింపబడి యీసంసారసాగరమున ననేక జన్మపరంపరల నొందుచు క్షణికములై యనిత్యములయిన సుఖములతోగూడిన బహువిధదుఃఖములచే మగ్గి నాస్తికభావమును విడనాడి తాను స్వతంత్రుడను గాననియు పరమేశ్వర పరతంత్రుడననియు దెలిసికొని యీ సంసారసాగరమునుండి తరించుట జీవుల కావశ్యకమనియు పరమేశ్వరానుగ్రహముచే తరింపదగుననియు నట్టి పరమేశ్వరానుగ్రహము భక్తిజ్ఞానవైరాగ్యములనెడు సాధనములద్వారా లభించు

ననియు జెప్పువారును ఆస్తికులని చెప్పబడుదురు. మరియు కర్మను చేయుట యందే జీవులకు స్వతంత్రత కలదుగాని తమ యిష్టమువచ్చినట్లు ఫలమును బొందుటకు జీవులు స్వతంత్రులు గారనియుగూడ జెప్పుదురు.

నాస్తికులెప్పుడును మతములను మతగ్రంథములను శాస్త్రజ్ఞానమును నిందింతురు. ఆస్తికులు మతగ్రంథములయందును మతములయందును పరమేశ్వరుని యందును నమ్మకముంతురు. మరియు నాస్తిక సిద్ధాంతములను నిరసించుచుందురు. ఆస్తికులకును నాస్తికులకును గట్టి పరస్పర వైరుధ్యము ఏకాలము నందును గలదు.

పైన జెప్పబడిన వేదమతము, మహమ్మదీయమతము, క్రీస్తుమతము, బౌద్ధమతములగు నాల్గు పెద్ద మతములలో మొదటి మూడు సగోత్రములును చిన్న మతములగు యూదుమతము, పారసీకమతము మున్నగు కొన్ని మతములును ఆస్తికమతములుగా వ్యవహరింపబడుచున్నవి.

ఆస్తిక మతములలో ప్రాచీనతనుబట్టిచూడగా వేదమతమే పరమప్రాచీనముగ గన్పట్టుచున్నది. తక్కిన యాస్తికమతములు తరువాత కాలకాలమునకు వరుస వరుసగా నేర్పడినట్లు గన్పట్టుచున్నవి. ఎట్లన క్రీస్తుమతము పుట్టి యిప్పటికి 1938 సంవత్సరములైనది. అనగా యేసుక్రీస్తును దీక్షను చేసిన తేది మొదలుకొని యిప్పటికి 1938 సంవత్సరములు గడచినవి. అంతకు పూర్వము క్రీస్తుకు 50 సంవత్సరములు వయస్సున్నదనుకొన్నను, 1988 సంవత్సరములకు పూర్వము క్రైస్తవమతమే లేదు. తరువాత మహమ్మదీయమతము పుట్టి యిప్పటికి 1348 సంవత్సరములయినది. ఇది 1[illegible] వ ఫసలీ అనగా 1348 వ సంవత్సరమన్నమాట. మహమ్మదునకు మతస్థాపనకు పూర్వము 50 సంవత్సరముల వయస్సు ఉన్నదనుకొన్నను. 1898 సంవత్సరములకు పూర్వము మహమ్మదీయమతమే లేదని యొప్పుకతప్పదు. ఇట్లే బౌద్ధము మొదలగు ప్రధానములగు ఆయాకాలములలో యీమతములు లేనట్లును యీపురుషులు అవతరించిన తరువాతనే యీమతములు ఉత్పన్నములయినట్లును రుజువగుచున్నది. ఇక వేదమతమునకో యనిత్యులైన యట్టి పురుషులందరికంటె పరమపురుషుడైనట్టియు నిత్యుడైనట్టియు పరమేశ్వరుని చేనిర్మింపబడినదిగా ననిది పరమప్రాచీనమనగా యనాదియని గ్రహింపక తీరదు.

ఇక నాస్తికమతస్థులకు లక్ష్యము పరిత్యక్త ప్రాపంచిక సౌఖ్యమే. ఈ ప్రాపంచికసౌఖ్యము యీ దినదిన విధముగా ననేక రకములుగా గోచరించుచున్నది.

1. ఆహారమువలన గలుగు సానందము అనగా యిష్టమువచ్చిన యన్నములను మాంసాదులను దినుటయు కాఫీ, టీ, కో, కో, సోడా, లిమినేడ్, కల్లు, సారా మొదలగు పానీయములను త్రాగుటయు చుట్ట, బీడీ, సిగిరెట్, భంగు మొదలగు పొగలను త్రాగుటయు మొదలగువానివలనగలుగు సంతోషము.

2. పగలనక రాత్రియనక యిష్టమువచ్చినట్లు నిద్రించి నిద్రాసౌఖ్యమును అనుభవించుటవలనగలుగు సంతోషము.

3. లోకమున జాతి మతకులవిచక్షణలేకుండ యిష్టమువచ్చిన స్త్రీలతో గలసియుండుటవలన గలుగు సంతోషము.

4. ఈ శరీరమును నానావిధములయిన వస్త్రముచేతను సుగంధవాసనలచేతను పుష్పమాలికలచేతను నలంకరించుకొని తలవెండ్రుకలను చిత్రవిచిత్రముగా కత్తిరించుకొని తమ దివ్యవిగ్రహములను నిలువుటద్దములయందు జూచుకొని సంతసించుటయు జాలక ఫొటోగ్రాఫులను తీయించుకొనుట మున్నగు కార్యములవలన గలుగు సంతోషము.

5 మేనా పల్లకీ గుర్రపుబగ్గీ ట్రాం మోటారు విమానము మొదలగు యానములయందు స్వేచ్ఛగా చరించుటయు గుర్రములు ఒంటెలు ఏనుగులు మొదలగు వాహనములయందు నారోహించుటయు మున్నగు కృత్యములద్వారా గలుగు సంతోషము

6. సినీమా నాటకములు మొదలగు వినోదములు దర్శించుటవలనను, మీటింగులు మున్నగుచోట్లకు బోవుటవలనను గలుగు సంతోషము

7. కర్నాటక మరాఠీ హిందూస్థానీ గానములను వినుటవలన గలుగు సంతోషము

8. లోకమున కృత్రిమముగు యశస్సును సంపాదించుటకు వార్తాపత్రికలలో నిజ చరిత్రములను ప్రకటించుకొనుటవలన తద్వారా లోకులు తనను గూర్చి చెప్పుకొను గుణకీర్తనమును వినుటవలన గలుగు సంతోషము. ఈ విధమున నింక నెన్నియేనియు జేర్చుకొనవచ్చును.

నాస్తిక సిద్ధాంతప్రకారముగ ప్రాపంచిక సౌఖ్యమే ముఖ్యముగా ననుభవించదగిన దగుటవలన నాస్తికుడగు పురుషుడుగాని, నాస్తికురాలగు స్త్రీగాని మరణపర్యంతము పైన జెప్పబడిన సుఖములయందు చరించుచుండుట స్వభావము. తిర్యగ్జంతువులకు పైన చెప్పబడిన సౌఖ్యములలో కొన్నితగ్గినను ముఖ్య

ములగు నాహార నిద్రాభయమైథునములయందు మానవులకంటె నెక్కుడుగా చరించుచున్నవి మానవుడై జన్మించియు నట్టి పశుసౌఖ్యమునే వాంఛించునెడ మానవత్వ మెంతవరకు నిలుచునో విజ్ఞానధనులూహింతురుగాక.

మృగత్వమునుండి పశుత్వమును బొందుటయు పశుత్వమునుండి మనుష్యత్వము నొందుటయు మనుష్యత్వమునుండి జీవుడు మోక్ష సామ్రాజ్యమును బొందుటయు ననువానికి నభ్యుదయములని మనవిచేయుచున్నాను. ప్రస్తుతము మనస్థితి యెట్లున్నను మన మతప్రకాశకులగు సమస్త ఋషులును మన మతోద్భవులయిన యనేక మహనీయులును తుచ్ఛములగు ప్రాపంచిక సౌఖ్యములను తృణప్రాయముగా నెంచి పవిత్రములగు వర్ణాశ్రమధర్మములనుష్ఠించి తమ మానవత్వమును నిలుపుకొనుటయేగాక మోక్షసామ్రాజ్యమునుగూడ నలంకరించినట్లు నా మహామహుల చరిత్రములు వేనోళ్ళ చాటుచున్నవి. అటువంటి మహనీయుల పవిత్ర గోత్రములయందు జనించిన మనకు కర్తవ్యమేమి? యని ప్రతివారును విచారించక తప్పదు.

ఏదోయొక పుణ్యవిశేషమున తిర్యగ్జంతువులనుండి మనుష్యజన్మ లభించినవాడు తా మూర్ధ్వగతికిబోవుటకు ముఖ్యముగా ప్రయత్నించవలయును. అట్లుగాక మానవజన్మ లభించినను మనుష్యధర్మమును వీడి పశుసౌఖ్యమునే వాంఛించి యుండుకుగానే మరణపర్యంతము కృషిచేయునెడ మరణానంతరము అతని చిత్తవృత్తినిబట్టి పశువుగాగాని యంతకంటె నీచమగు మృగముగాగాని జన్మింపక తప్పదుగదా! ఈవిషయము వేదాది ప్రాచ్యశాస్త్రములచే స్థిరపడి యుండుటయేగాక ప్రస్తుత కాలస్థితి ననుసరించి ప్రకృతిశాస్త్రజ్ఞానమునుబట్టి పాశ్చాత్యులచేగూడ నంగీకరింపబడియున్నదిగదా! వారలచే పరమగురువులనుగా నంగీకరించిన నవీనాచారపరాయణులును నీ విషయమును ముఖ్యముగా గమనింపవలయును.

పైన తెలుపబడినట్లు నాస్తికులనగా నెవరో గుర్తించియున్నారు గదా! వీరి లక్ష్యము కేవల ప్రాపంచిక సౌఖ్యానుభవమేకదా!

ఇక ప్రవర్తనయందు నాస్తికులవలెనే చరించుచు దేవుడు కలడని యొప్పుకొనుచు స్వర్గ నరకములు కలవని తలంచుచు ప్రవర్తించువారలు మరికొందరు కలరు. వీరలును నాహారనిద్రాభయమైథునాది సర్వకార్యములద్వారా సుఖాను

ములగు నాహార నిద్రాభయమైథునములయందు మానవులకంటె నెక్కుడుగా చరించుచున్నవి మానవుడై జన్మించియు నట్టి పశుసౌఖ్యముతో వాంఛించునెడ మానవత్వమెంతవరకు నిలుచునో విజ్ఞానధనులూహింతురుగాక.

మృగత్వమునుండి పశుత్వమును బొందుటయును పశుత్వమునుండి మనుష్యత్వమునొందుటయును మనుష్యత్వమునుండి జీవుడు మోక్ష సామ్రాజ్యమును బొందుటయును ననువానికి నభ్యుదయములని మనవిచేయుచున్నాను. ప్రస్తుతము మనస్థితి యెట్లున్నను మన మతప్రకాశకులగు సమస్త ఋషులును మన మతోద్భవులయిన యనేక మహనీయులును తుచ్ఛములగు ప్రాపంచిక సౌఖ్యములను తృణప్రాయముగాయెంచి పవిత్రములగు వర్ణాశ్రమధర్మములనుష్ఠించి తమ మానవత్వమును నిలుపుకొనుటయేగాక మోక్షసామ్రాజ్యమునుగూడ నలంకరించినట్లు నా మహామహుల చరిత్రములు వేనోళ్ళ చాటుచున్నవి. అటువంటి మహనీయుల పవిత్ర గోత్రములయందు జనించిన మనకు కర్తవ్యమేమి? యని ప్రతివారును విచారించక తప్పదు.

ఏదోయొక పుణ్యవిశేషమున తిర్యగ్జంతువులనుండి మనుష్యజన్మ లభించినవాడు తామార్థ్యగతికిబోవుటకుముఖ్యముగా ప్రయత్నించవలయును. అట్లుగాక మానవజన్మలభించినను మనుష్యధర్మమునువీడి పశుసౌఖ్యముతో వాంఛించియుండుటగానే మరణపర్యంతము కృషిచేయునెడ మరణానంతరము అతని చిత్తవృత్తినిబట్టి పశువుగాగాని యంతకంటె నీచమగు మృగముగాగాని జన్మింపక తప్పదుగదా! ఈవిషయము వేదాది పవిత్రశాస్త్రములచే స్థిరపడియుండుటయేగాక ప్రస్తుత కాలస్థితి ననుసరించి ప్రకృతిశాస్త్రజ్ఞానమునుబట్టి పాశ్చాత్యులచేగూడ నంగీకరింపబడియున్నదిగదా! వారలనే పరమగురువులనుగా నంగీకరించిన నవీనాచారపరాయణులును నీ విషయమును ముఖ్యముగా గమనింపవలయును.

పైన తెలుపబడినట్లు నాస్తికులనగా నెవరో గుర్తించియున్నారు గదా! వీరి లక్ష్యము కేవల ప్రాపంచిక సౌఖ్యానుభవమేకదా!

ఇక ప్రవర్తనయందు నాస్తికులవలెనే చరించుచు దేవుడు కలడని యొప్పుకొనుచు స్వర్గ నరకములు కలవని తలంచుచు ప్రవర్తించువారలు మరికొందరు కలరు. వీరలును నాహారనిద్రాభయమైథునాది సర్వకార్యములద్వారా సుఖాను

పైనచెప్పబడినవారలతో మనవేదమతస్థులకు రాజకీయ సంబంధము కలుగుటవలన మన వైదిక కర్మానుష్ఠానములకు లోపము కలిగి మన వేదమతస్థులయందును నాభావములే నాటుకొనియుండుట చాలవరకు చూచుచునేయున్నాము. విశేషించి యిది కలియుగముగాన నిట్టి వైపరీత్యములు కలుగగలవని యార్షగ్రంథములయందు విశేషముగా గన్పట్టుచున్నవి. అందువలననే కులాభిమానధనులకు వైదికమతగౌరవము అవసరముగా గన్పట్టుచున్నది.

అధర్మమెట్లు చెలరేగుచున్నదో! చూడుడు! కృతత్రేతాయుగముల క్షత్రియుల ప్రభుత్వము కలియుగములో జనమేజయునితో సంబంధించినది. తరువాత నధర్మమార్గప్రవర్తకులగు నృపతులచే కొంతకాలము రాజ్యములు జరిగినవి. తరువాత శూద్రప్రభువులచే కొంతకాలము రాజ్యములు జరిగి ధర్మము మరింత సన్నగిల్లినది. తరువాత మ్లేచ్ఛులలో నొక తరగతివారగు మహమ్మదీయుల సంపర్కమున నీకర్మభూమి దుష్కర్మభూమిగను పుణ్యక్షేత్రములు పాపక్షేత్రములుగను మారినవి. తరువాత మరియొక తరగతివారగు నాంగ్లేయులచే పరిపాలన జరుగుచున్నది. అందునను కొంతకాలము వర్ణాశ్రమధర్మరహితులగు బ్రాహ్మణులద్వారాయైనన్యా అట్టివారలేయగు శూద్రులచే కొంతకాలమును పరిపాలనము జరుగుచు ప్రస్తుతము వీరిద్దరికి తోడుగ పంచముల సమ్మేళనమున నీకలి మహాచక్రవర్తి తాండవమాడుచున్నాడు. "కలౌ పంచసహస్రాణి జాయతే వర్ణసంకరః" అన్ననుడి సార్థకమైనది. కలికాలమున జరిగిన రెండువేలయేండ్లనుండి క్రమముగా కర్మసంకరమును తదుపరి వర్ణసంకరమును జరుగుచున్నది. దీనికితోడు విధవావివాహములు రజస్వలానంతర వివాహములు స్త్రీపునర్వివాహములు వర్ణాంతర వివాహములు జరుగుచున్నవి. ఏజాతియందు ఆజాతివారు విధవా వివాహములుగాని రజస్వలానంతర వివాహములుగాని స్త్రీపునర్వివాహములుగాని జరుపుకొన్నచో నపవిత్రములుగనైనను కొంతకాలము జాతులు నిలుచునుగాని వర్ణాంతర వివాహములతో జాతి నిర్మూలనముగాక మానదు. అపవిత్రములుగనైనను జాతులు నిలిచియుండుల కొంతకాలమునకైనను వానిని పవిత్రీకృతములుగ చేసికొనుటకును తదుపరి జాతిధర్మము లనుష్ఠించుటకును వీలుగలదు. జాతియే నిర్మూలింపబడినయెడల జాతిధర్మములు నశించిపోయినట్లేగదా!

భరతఖండమునందలి బ్రాహ్మణజాతిని నొక్కసారి పింహావలోకనము చేసినచో బ్రాహ్మణులలో నొక తెగవారు మాంసభక్షకులుగను నొక తెగవారి

విధవా వివాహమును మరియొక తెగవారు శూద్రాన్నపానీయగ్రహణమును మరి యొక తెగవారు దృష్టిదోషమును గమనింపకను వేరొక తెగవారు రజస్వలా నంతర వివాహమును జేయుచును నన్ని తెగలయందును బ్రాహ్మణులు తమ కర్మా నుష్ఠానమును వీడుటయే గాక యనేకములగు నకార్యములనుగూడ జేయుచున్నారు. ఇక తక్కిన జాతులను గురించి వేరజెప్పవలసిన యవసరములేదు. ఆహా! ఏమి కలికాలమహిమ! ఇంక నెన్ని విపరీతములు కలుగునోకదా! ఇట్టి దుష్కాల ములో సత్కర్మానుష్ఠానపరాయణులను రక్షింపడొక్క సర్వేశ్వరుడు దక్క యన్యుడులేడు. ఇక ప్రకృతమనుసరింతును.

ప్రపంచమునయున్న సర్వమతములకంటె విలక్షణమైన మన వేదమత మెట్టిదో దానిని తెలిసికొని యందువలన మనకెట్టి లాభము చేకూరగలదో విచా రించుట మిక్కిలి యవసరము.

వేదమతము వేదవేదాంతవేద్యుడగు సర్వేశ్వరునిచే నెలకొల్పబడినది. ఆ మతజ్ఞానము సర్వులకు తెలియగలందులకును తెలిసి సత్కర్మానుష్ఠానపరాయ ణులయి యైహికాముష్మికములగు సుఖములను బడయుచు తదనుగ్రహమున మోక్షసామ్రాజ్యమును బొందుటకును వేదములనుపేర ధర్మాధర్మములను నిర్మించి యున్నాడు. అట్టి ధర్మాధర్మములనుష్ఠించుటవలన గలుగు స్వర్గనరకాదిలోక ములనుగూడ నిర్మించియున్నాడు. మరియు నిరతిశయమైనట్టియు సచ్చిదానంద రూపమైనట్టియు పునరావృత్తిరహితమైనట్టియు మోక్షసామ్రాజ్యమును బొందు టకును భక్తిజ్ఞానవైరాగ్యములనుగూడ బోధించియున్నాడు.

ఈ వేదమతమే యాగమమతమనియు స్మృతిమతమనియు పురాణమత మనియు వ్యాసమతమనియు గీతామతమనియు బేర్లచే లోకమున వెలయుచున్నది. శబ్దములనే ప్రధానముగాజేసి వేదములును నర్థమునే ప్రధానముగాజేసి యాగమ ములును పరమేశ్వరునిచే ననుగ్రహింపబడినందున నీమతము వేదమతమనియు నాగమమతమనియు జగమున మిక్కిలి ప్రసిద్ధినొందియున్నది. సర్వజ్ఞులనం దగిన మునులచే నాయర్థము సంగ్రహింపబడినందున స్మృతిమతమనియు పురాణ మతమనియు శ్రీనారాయణమూర్తి యవతారములగు వ్యాస శ్రీకృష్ణులచే వరు సగా సూత్రములయందును గీతలయందును నీయర్థము నిబంధింపబడియున్నందున నీమతమునకు వ్యాసమతమనియు గీతామతమనియును బేర్లుగలవు. ఇట్లు

ఒక్కొక్క కారణమున నీవేదమతమే యనేక నామములతో నీమహీమండలమున నిండియున్నది. కాబట్టి యీవేదధర్మము బహుళ గ్రంథములచే విస్తరింపబడుటవలనను సూత్రాదులచే సంగ్రహింపబడుటవలనను నీగ్రంథములన్నియు వేదార్థమును వెలయించుటకు నేర్పడిన వ్యాఖ్యానములని ద్యోతకమగుచున్నది. ఇక నీమతముయొక్క లక్ష్యమెద్దియో మనము తెలిసికొనుట ముఖ్యావసరము.

పరమేశ్వరునిచే వెలయింపబడిన యనేకములగు లోకములలో కొన్ని దుఃఖదాయకములును కొన్ని సుఖదాయకములును మరికొన్ని సుఖదుఃఖదాయకములునై యున్నవి. దుఃఖదాయకములయిన లోకములకు నరకలోకములనియు సుఖదాయకములగు లోకములకు స్వర్గలోకములనియు సుఖదుఃఖదాయకములగు లోకములకు మిశ్రలోకములనియు పేరు.

ఇప్పుడు మనము నివసించుచున్న మానవలోకము నరకలోకములలో చేరునా ? స్వర్గలోకములలో చేరునా ? లేక మిశ్రలోకములలో చేరునా ? యని విచారించినచో నీలోకానుభవమునుబట్టి యిది మిశ్రలోకములలో చేర్పబడుటకు నేయాక్షేపణయునుండదు. ఎట్లన నీలోకము బహుళదుఃఖములతో గూడిన యల్పసుఖములమాత్రమొసంగగలదు. అనగా జీవుడు మిక్కిలి శ్రమ జెందినంగాని యల్పసుఖములను బొందజాలడు. ఈ యల్పసుఖములయినను క్షణికములు. వీని ననుభవించిన తరువాత తిరిగి దుఃఖములే సంప్రాప్తమగుచుండును. పోనీ ! అనేక దుఃఖములతోగూడిన నీయల్పసుఖసంపాదనములో తృప్తి జెందుదమన్న ప్రతి జీవికిని ఘోరదుఃఖప్రదమగు మరణము సంప్రాప్తమగుచుండుట తప్పకున్నదిగదా ! ఈ మరణమునుండి తప్పించుకొని కొన్ని కల్పములవరకైనను జీవించుటకు జీవునకు స్వాతంత్రతలేదుగదా ! కావున మరణపర్యంతము ననిత్యమగు నీ శరీరమును నమ్మి బుద్బుదప్రాయములై బహుళ దుఃఖములకు కారణములయిన నీయల్పసుఖముల నార్జించుటకు మాత్రమే జీవితమును వ్యయపర్చుట మానవజన్మధర్మము కాదు.

పోనీ ! యీ మానవజన్మ నూరేండ్లవరకు నేవిధమగు శైథిల్యములేక నిలుచునని చెప్పుటకును వీలులేదు, మరియు నెల్లప్పుడును మంచిదశలో నీశరీరము నడచునని చెప్పుటకును వీలులేదు. దీనికి బాల్యయౌవన కౌమారవార్ధక్యములను, నాలుగు దశలుకలవు. ఒకదశవెంట మఱియొకదశ గడువక తప్పదు. దశాపరిణామమునుబొందుచున్నకొలదిని, నీశరీరము అనేక వికారములకులోనై తుదకుజీవుని

ఒక్కొక్క కారణమున నీవేదమతమే యనేక నామములతో నీమహీమండలము నిండియున్నది. కాబట్టి యీ వేదధర్మము బహుళ గ్రంథములచే విస్తరింపబడుటవలనను సూత్రాదులచే సంగ్రహింపబడుటవలనను నీగ్రంథములన్నియు వేదార్థమును వెలయించుటకు నేర్పడిన వ్యాఖ్యానములని ద్యోతకమగుచున్నది. ఇక నీమతముయొక్క లక్ష్యమెద్దియో మనము తెలిసికొనుట ముఖ్యావసరము.

పరమేశ్వరునిచే వెలయింపబడిన యనేకములగు లోకములలో కొన్ని దుఃఖదాయకములును కొన్ని సుఖదాయకములును మరికొన్ని సుఖదుఃఖదాయకములునై యున్నవి. దుఃఖదాయకములయిన లోకములకు నరకలోకములనియు సుఖదాయకములగు లోకములకు స్వర్గలోకములనియు సుఖదుఃఖదాయకములగు లోకములకు మిశ్రలోకములనియు పేరు.

ఇప్పుడు మనము నివసించుచున్న మానవలోకము నరకలోకములలో చేరునా? స్వర్గలోకములలో చేరునా? లేక మిశ్రలోకములలో చేరునా? యని విచారించినచో నీలోకానుభవమునుబట్టి యిది మిశ్రలోకములలో చేర్పబడుటకు నేయాక్షేపణయునుండదు. ఎట్లన నీలోకము బహుళదుఃఖములతో గూడిన యల్పసుఖములమాత్రమొసంగగలదు. అనగా జీవుడు మిక్కిలి శ్రమ జెందినంగాని యల్పసుఖములను బొందజాలడు. ఈ యల్పసుఖములయినను క్షణికములు. వీని ననుభవించిన తరువాత తిరిగి దుఃఖములే సంప్రాప్తముగుచుండును. పోనీ! అనేక దుఃఖములతో గూడిన నీయల్పసుఖసంపాదనముతో దృప్తిజెందుదమన్న ప్రతి జీవికిని ఘోరదుఃఖప్రదమగు మరణము సంప్రాప్తముగుచుండుట తప్పకున్నదిగదా! ఈ మరణమునుండి తప్పించుకొని కొన్ని కల్పములవరకైనను జీవించుటకు జీవునకు స్వాతంత్ర్యతలేదుగదా! కావున మరణపర్యంతము ననిత్యమగు నీ శరీరమును నమ్మి బుద్బుదప్రాయమునై బహుళ దుఃఖములకు కారణములయిన నీయల్పసుఖముల నార్జించుటకు మాత్రమే జీవితమును వ్యయపర్చుట మానవజన్మధర్మము కాదు.

పోనీ! యీ మానవజన్మ నూరేండ్లవరకు నేవిధమగు శైథిల్యములేక నిలుచునని చెప్పుటకును వీలులేదు, మరియు నెల్లప్పుడును మంచిదశలో నీశరీరము నడచునని చెప్పుటకును వీలులేదు. దీనికి బాల్యయౌవన కౌమారవార్ధక్యములను నాలుగు దశలుకలవు. ఒకదశవెంట మఱియొకదశ గడువక తప్పదు. దశాపరిణామమును బొందుచున్నకొలదిని, నీశరీరము అనేక వికారములకులోనై తుదకుజీవు

అభ్యుదయమనగా నభివృద్ధి. జీవుడు తాను తిర్యగ్జంతువులనుండి మానవ జన్మకువచ్చుట మొదటియభివృద్ధి. మానవజన్మనుండి దేవతాలోకమునుబొంది దైవశరీరమునుగ్రహించుట రెండవయభివృద్ధి. యేజన్మరెత్తినను తిరిగి మరణించుట నిశ్చయమని యెఱింగి జన్మరాహిత్యమును బొందుట మూడవయభివృద్ధి. సూక్ష్మదృష్టితో బరిశీలించిన పైనచెప్పబడినవి ముఖ్యములయిన యభివృద్ధులు. ఇట్టి యభివృద్ధులు ప్రతిజీవికిని ముఖ్యముగా కలుగవలసినవే. ఇక మానవునిగూర్చి విచారింతము. మానవజన్మవచ్చినవెంటనే తిర్యగ్జంతుజనమునుండి ముఖ్యమైన మొదటి యభివృద్ధినిబొందెనన్నమాట. ఇక మానవజన్మలో నభివృద్ధులెట్టివన ధనహీనునికంటె ధనవంతుడు గొప్ప, విద్యావిహీనునికంటె విద్యావంతుడు గొప్ప. యశోవిహీనునికంటె యశోవంతుడు గొప్ప. అధికారహీనునికంటె అధికారవంతుడు గొప్ప. కులహీనునికంటె కులవంతుడు గొప్ప. గుణహీనునికంటె గుణవంతుడు గొప్ప. అనాచారపరునికంటె ఆచారపరుడు గొప్ప. అధర్మమార్గవర్తనునికంటె ధర్మమార్గప్రవర్తకుడు గొప్ప. ఈ విధముగా ననేకవిధములైన మానవాభ్యుదయములు మనకు ప్రత్యక్షగోచరములగుచున్నవి. మానవజన్మయందు విరాగము కలుగవలయునన్న ప్రతిమానవుడిట్టి యభ్యుదయముల ననుభవించితీరవలసినదే. అట్లు ప్రతిమానవాభ్యుదయమును అనుభవించిన పిమ్మట మానవజన్మలో సంపాదింపబడు నిట్టి యభ్యుదయములు అనిత్యములు బహుళ దుఃఖదాయకములనియెడు ననుభవము కలుగగానే మానవజన్మయందు విరాగము కలుగుటకు నారంభమగును. అట్టి విరాగము సంపూర్ణస్థితి జెందుటవలన మానవాభ్యుదయములలో పరమపవిత్రమైన వైరాగ్యమనెడు నభ్యుదయము కలిగినదని చెప్పవచ్చును. ఇట్టి యభ్యుదయముల ననుభవించి వైరాగ్యము కలుగువరకు ననేక జన్మలనెత్తిక తప్పదు.

పైన చెప్పబడిన యభివృద్ధులను బడయుటకు ధర్మముతో గూడుకొన్న యర్థకామములవసరము. అంతియేగాని, యధర్మముతో గూడుకొన్న యర్థకామముల నాశ్రయించగూడదు. ధర్మార్థకామములను పురుషార్థత్రితయము మూలమున మానవుడూర్ధ్వగతికి బోవును. అర్థకామములను పురుషార్థద్వితయము మూలమున మానవుడధోగతినొందును. దీనినిబట్టిచూడ ధర్మమే యూర్ధ్వగతికి సాధనమని తెలియుచున్నది. కాబట్టి ధర్మమనగానెట్టిదో మనము తెలిసికొనుట యవసరము.

లోకములో ప్రతి మానవుడును లాభముకొరకే ప్రయత్నించుచున్నాడు. అట్టి లాభము లభించినవెంటనే సంతుష్టినొందుచున్నాడు. కాబట్టి ప్రతివాని లాభము యతని సంతుష్టికి కారణమగుచున్నది. ప్రతివానికి లాభము అతని కోరిక ననుసరించియుండును. అతని కోరికను ననురూపమైన లాభము లేక ఫలము లభించినంగాని యతనికి సంతుష్టి కలుగదు. ప్రతివానికిని నొకేవిధమైన కోరికయుండదు. కొందరికోరికలుమఱికొందరికోరికలకంటెభిన్నములు ఒకవ్యక్తి యొక్క కోరిక మరియొక వ్యక్తియొక్క కోరిక కంటెభిన్నము. ఒక సంఘము యొక్క కోరిక మరియొక సంఘముయొక్క కోరిక కంటె భిన్నము. కాబట్టి ప్రతి వ్యక్తికిని యతని కోరిక ననుసరించి పొందవలసిన ఫలమును సాధించుటకు కారణమైన ప్రతి కార్యమును ఆఫలము నుద్దేశించి యాతని విషయములో ధర్మ్మమగుచున్నదని కొందరు వాదించుచున్నారు. దీనిని విపులముగా విమర్శించినచో నీయర్థములు స్ఫురింపకమానవు.

ఒకడు మరియొకనికి హానికలిగించుటవలన సంతుష్టినొందుచున్నాడు. ఒకడు వేరొకని దారపరిగ్రహణమున తనివినొందుచున్నాడు. ఒకడు యింకొకనికి నుపకారముచేసి సంతసించుచున్నాడు. ఒకడు ఒక పదార్థమును తిని సంతసించుచున్నాడు. వేరొకడు ఒక సంగతిని విని సంతసించుచున్నాడు మఱియొకడు యొకని గృహమును తగులబెట్టి సంతసించుచున్నాడు.

పైన చేర్కొనబడిన ప్రతివ్యక్తియొక్క మనస్సంతుష్టికిని కారణమొకే విధముగానుండలేదు. అట్టి ప్రతి వ్యక్తియొక్క మనస్సంతుష్టికి ననురూపమైన ఫలమును బొందవలయునన్న వారలాచరించు పనులు హానికలిగించుటయు, పరదారపరిగ్రహణమొనరించుటయు ఉపకారము చేయుటయు తినుటయు వినుటయు గృహమును తగులబెట్టుటయునను కార్యములు జరిగించవలయును. అప్పుడుగాని నాప్రతివ్యక్తియొక్క కోరికను ననురూపమైన పైనచెప్పబడిన ఫలము కలిగి యా ఫలానుసారియైన మనస్సంతుష్టి కలుగనేరదు. కాబట్టి పైనచెప్పబడిన నిర్వచనమును బట్టి ధర్మ్మశబ్దమునకు నాయర్థమునే గ్రహించునెడ సంఘమునందు ననేకములగు నరిష్టములు బొడసూపకమానవు కాబట్టి ధర్మశబ్దమునకు నట్టి యర్థమును గ్రహింపగూడదు.

పరమేశ్వరుడు జీవులనుభవించుటకు లోకమున ననేకఫలముల నేర్పఱచియున్నాడు. ఇందు గొన్ని ఫలములు జీవుల యభివృద్ధికిని కొన్ని ఫలములు జీవుల

యధోగతికిని కారణమగుచున్నవి. జీవులభివృద్ధికి బోవలయునన్న నభివృద్ధికి సాధనములగు ఫలములను గోరవలయుననియు, నధోగతి బొందవలయునన్న నధోగతికి సాధనములగు ఫలములను గోరవలయుననియు, విశదమగుచున్నది. రాజససాత్త్వికగుణములచే బ్రకాశించు జీవులెప్పుడును నభివృద్ధికి సాధనములైన ఫలములను గోరును. తామసగుణములచే మలీమసవృత్తములగు, జీవులెప్పుడును నధోగతికి సాధనములయిన ఫలములగోరును.

మృగత్వ, పశుత్వ, మనుష్యత్వ, దేవత్వములను, క్రమాభివృద్ధులద్వారా మోక్షసామ్రాజ్యమును బొందుట జీవపరమాభ్యుదయమని వెనుక దెలిపియుంటిమి గదా!

కాబట్టి యిప్పుడు ధర్మమన నేమి తేలుచున్నది? ఏది జీవునకు బాధకర మగుటయే గాక నూర్ధ్వగతికి సాధనమగునో యట్టి ప్రతికార్యము ధర్మమని వ్యవహరింపబడుట సమంజసము. ఈ దృష్టితో నేర్పడినవే ధర్మములు. అట్టి ధర్మములలో సత్తమోత్తములైనవి వర్ణాశ్రమధర్మములు. వీనియొక్క ప్రశంసనే వేదములయందు పరమేశ్వరుడు వివరించియున్నాడు. ఈయర్థమునే సమస్త ఋషులును వ్యాస శ్రీరామ శ్రీకృష్ణాద్యవతారపురుషులును విపులముగ జర్చించి లోకమునకు వెల్లడించియున్నారు. అయినను కలి కాలవశమున నల్పాయుష్కులై యల్పబుద్ధులుగలవారలగుటచే జనులు ధర్మసూక్ష్మముల మర్మమెఱుంగజాలక ధర్మమునకు వలసినట్లు ననేక వ్యాఖ్యానముల గావించి యాధేచ్ఛగా విహరించుచున్నారు. కాబట్టి సంగ్రహముగా నూర్ధ్వగతికి సాధనమగు ప్రతికార్యమును ధర్మమనియు నధోగతికి సాధనమగు ప్రతికార్యమును నధర్మమనియు తెలిసికొనుట యతి ముఖ్యము.

ఇట గొందరు కేవలము సత్యము, దయ, అహింస, పరోపకారము శౌచము మున్నగువానినే ధర్మములనియు నేసంఘమున మానవులకు నీగుణములు కలవో యా మానవులు ధర్మమార్గపరులనియు అసత్యము, నిర్దయ, హింస, అపకారము, అశౌచము మున్నగువానినే నధర్మములనియు నేసంఘమునమానవులకు నీగుణములు కలవో యామానవులు అధర్మమార్గపరులనియు వాదించుచున్నారు. ఇదియు చూపులకు గొప్ప యాదర్శమువలె గానుపించును గాని యంతమాత్రమున సంతుష్టి నొందుటకు వలనుపడదు ఈ విషయము నీదిగువ వివరణమువలన విశదపరుపబడుచున్నది.

మానవుడుగా మనుష్యలోకమున బుట్టినప్పుడు మానవలోకమున తనయభివృద్ధికై ధర్మార్థముక్తములగు సుఖములను బడయవలెను. తన మరణానంతరమైనను సుఖస్థితి నే గోరునుగాని దుఃఖము ప్రాప్తించవలయునని యేజీవియును గోరదుగదా! అందువలన నరకలోకముల దుఃఖమేయుండును గాన నాలోకములకు బోవుటను నేమానవుడును కోరడు. మానవలోకముకంటె మిక్కిలి సుఖదాయకములైన లోకములున్నవని గాని లేక పరమసుఖమగు మోక్షానందము కలదని గాని విశ్వసించినయెడల నరుడట్టిలోకములకు బోవలెనని కోరునుగదా! ఒకవేళ అట్టి లోకములు లేవని విశ్వసించినను తిరిగి మానవలోకముననే మానవులలోనే జన్మింపవలయునని తప్పక కోరునుగదా! దీనినిబట్టి యేమి తేలుచున్నదన మానవుడు మనుష్యలోక సుఖమును లేక స్వర్గాదిలోకసౌఖ్యమును లేక మోక్షానందమును గోరునని తెలియుచున్నది. దీనినిబట్టి సుఖములు మూడువిధములైనవి. 1 ఇహసుఖము, 2 పరసుఖము, 3 మోక్షసుఖము. ఈ మూడింటిలో సర్వోత్తమమైనది మోక్షసుఖము.

పైన తెలుపబడిన మూడు విధములగు నానందములలో దేనిని మానవుడు ముఖ్యముగ వాంఛించునో దానినిబట్టి ధర్మమేర్పడుచుండును. ధర్మమనగా సుఖసంపాదనమునకు సాధనమగు కార్యమని మున్ను తెలిపియుంటిని. ఇప్పుడు మానవునకు మనుష్యలోక సుఖమే ముఖ్యమని యెంచుదము. మనుష్యలోకసుఖమునకు మానవునకు భార్యయును, పుత్రులును, భూములును, ధనధాన్యాదులును, గృహములును, వాహనములును, విద్యయు నింక నిట్టివే యనేకము లవసరమైయున్నవి. వీనిని అవశ్యముగా ప్రతివాడును సంపాదించవలయునుగదా! సంపాదించినవానిని రక్షించుకొనవలయునుగదా! రక్షించుకొనినవానిని క్రమముగా వినియోగపరచుకొనవలెనుగదా! అప్పుడుగాని ప్రపంచమున సుఖము లభించదుగదా! ఇట్లు చేయుటలో మానవుడే పద్ధతులవలంబించవలెనో తొలుత విచారించవలసియున్నది. ఒకడు నీ భూములను ఆక్రమించుటకు ప్రయత్నించె ననుకొందము. అప్పుడు అహింసయే ధర్మమని యూరకుండవలసినదేనా? లేక హింసచే భూములను కాపాడుకొనవలయునా? ఒకడు నీభార్యనుగాని బిడ్డలనుగాని యపహరించుటకు సంసిద్ధుడయ్యెననుకొందము అప్పుడుఅహింసయేధర్మమని యూరకుందువా? లేకహింసచేవారలను రక్షించుకొందువా?ఒకడునీయొద్దయెంత ధనమున్నదని యడిగిన సత్యమేధర్మమని పైసలతో లెక్క చెప్పుదువా? లేకయసత్యమాడుదువా?ఒకడు నీగృహమందునిత్యము యేమిజరుగుచున్నదని ప్రశ్నించినచో

ఇక మానవుని లక్ష్యము స్వర్గాదిలోకసుఖముగాని పరమమైన మోక్ష సుఖముగాని సంపాదించుట యనుకొందము, అట్టి కల్పములో నట్టిమానవునకు ముందు నీలోకసుఖమున విరాగము కలుగవలెనుగదా ? లేనిది పరలోకసుఖ వాంఛకలుగదు. కాబట్టి యిహలోకమున విరాగముకలుగువరకు ధర్మయుక్తము లయిన సుఖములను విడువగూడదను విషయమును ప్రతివారును మరువగూడదు. ఇహలోకసుఖవిరాగము గలిగినవాడు లోకములో చరించుచుండ నతడు యేమైన జెప్పవలసివచ్చుచో సత్యమును జెప్పవలెనా? లేక యసత్యమును జెప్ప వలెనా ? యని విచారింప తనకు హానికలిగినను సత్యమునే చెప్పవలెను. గాని యసత్యమును చెప్పగూడదు. తానుహింసింపబడవలెనేగాని, పరులకు హింసచేయగూడదు. పరులు తనయెడ నపకారమొనర్చినను తిరిగి యుపకారమే చేయవలెనుగాని ప్రతిక్రియ యెంతమాత్రము చేయగూడదు. ఇట్లే తక్కినవాటి విషయములోగూడ నడువదగును. కాబట్టి కేవల సత్యదయాహింసాదికములు తన చిత్తమును పవిత్రపరచి యుత్తమలోకసుఖ సంపాదనమునకువలయు కర్మా నుష్ఠానమునకు దోడ్పడగలవు.

ప్రపంచ సుఖములయెడ నట్టి విరాగము కలుగకమునుపే కేవల సత్య దయాహింసాదికములే ధర్మములని నమ్మి యాప్రకారమే యాచరించినయెడల ప్రతివాడును తనయొక్క దారపుత్రాదులను గృహారామక్షేత్రవిత్తాదులను గోల్పోయి తుదకు బహుళములయిన దుఃఖములకు లోబడవలసివచ్చును. ఇందు లకు మన హరిశ్చంద్రాదులే నిదర్శనము. ఇట నొక ముఖ్యవిషయమును గమ నించవలెను. ఇన్ని దుఃఖముల ననుభవించుచు పైనచెప్పబడిన కేవల సత్య దయాదులనుష్ఠించినచో విరాగము కలుగుటకు ననేక జన్మముల నెత్తనవసరము లేక నొక్క జీవితములోనే పరిపూర్ణ విరాగము కలిగి ఉత్తమపదవికి బోనగాత్ర లభింపగలదు. పరికించినచో మనుష్యలోకములో ఉత్తమమైన యభ్యుదయ ములోనున్నవారలే యట్టి ధర్మములనుష్ఠించినట్లు చరిత్రములవలన విశదమగు చున్నది.

మనుష్యలోకములో మానవులు చాలవరకు నిహసుఖతత్పరులై పరలోక సుఖములును మోక్షసుఖములును కలవనిచెప్పుచూ వానిని సంపాదించుటకు వలయు కర్మానుష్ఠానమునకు పూర్వాంగములగు కేవల సత్యదయాహింసాదులే ధర్మములని నోటజెప్పుచుందురేకాని యాచరణలో దీనికి వ్యతిరేకముగా నడచు చున్నారు. అనగా సత్యము ధర్మమని చెప్పుచు నసత్యముల నాడుచున్నారు. అహింస ధర్మమని వచించుచు హింసల నాచరించుచున్నారు. పరోపకారము

ధర్మమని చెప్పుచు పరాపకారమొనరించుచున్నారు. దయను ధర్మమని పేర్కొనుచు నిర్దయులై ప్రవర్తించుచున్నారు. నోటఁ జెప్పునదొకటి, చేత చేయునది వేరొకటి. ఇట్లు జరుగుటకు కారణమేమనగా ఇహసుఖమునకు పైన నేను తెలిపినట్లు సత్యాసత్యములు హింసాహింసలు మొదలగునవి ధర్మములగుట వలన.

ధర్మయుగములయందు ధర్మయుక్తములగు సత్యాసత్యములు మొదలగునవి ధర్మములుగా నడచినట్లు పురాణములనుబట్టి నిర్ణయమగుచున్నది. ఇక్కలికాలమున కొందరు ధర్మయుక్తములగు సత్యాసత్యముల నవలంబించినను చాలవరకు నధర్మయుక్తములగు సత్యాసత్యములనుగూడ జీవికకు సాధనములనుగాఁ జేసికొని జీవించుచున్నారు.

అధర్మపూర్వకములగు సత్యాసత్యములు మొదలగువానిని నవలంబించువారికి నరిషడ్వర్గము అతిశయించుచుండును. అరిషడ్వర్గమనగా కామక్రోధలోభమోహమదమాత్సర్యములను నారుగుణములయొక్క సమూహము. ధర్మయుక్తములగు సత్యాసత్యములు మొదలగువాని నవలంబించువారికి నరిషడ్వర్గము తగ్గిపోవుచుండును, కేవల సత్యదయాహింసాదుల నవలంబించువారికి కామక్రోధాదులయందు పవిత్రలక్షణము లేర్పడును. అరిషడ్వర్గమతిశయించుటవల్ల మనుష్యత్వమునకే కొనకు హానికలుగుట నిశ్చయము. అరిషడ్వర్గము శమించుచుండుటలో చిత్తమునందు పవిత్రగుణము లేర్పడుటకు నవకాశము గలదు. అరిషడ్వర్గము పూర్ణముగ శమించుటవలన మానసక్షేత్రము సుక్షేత్రమై యందు భక్తిజ్ఞానవైరాగ్యములను మోక్షబీజములు మొలకెత్తి యవి పెరిగి శాఖోపశాఖలై నిరతిశయమైన బ్రహ్మానందఫలము లేక శివానందఫలము నొసంగుననుట నిక్కము.

పైన చెప్పబడిన యరిషడ్వర్గము పూర్ణముగ శమించుటకు వేదములయందు చెప్పబడినయసాధారణములైననిత్యనైమిత్తికకామ్యకర్మానుష్ఠానములవసరములు. అట్టి కర్మానుష్ఠానములకు నర్హతకలుగుటకై పూర్వాంగములగు సత్యదయాహింసాది సర్వజనసామాన్య ధర్మానుష్ఠానము మిక్కిలి యవసరము. ముందు సామాన్య ధర్మానుష్ఠానమున, చిత్తమును పవిత్రవంతముగా చేసికొని సంపూర్ణ చిత్తశుద్ధికై యసాధారణమైనట్టియు విశేషమైనట్టియు వర్ణాశ్రమధర్మానుష్ఠానమవలంబించుట మిక్కిలి యావసరము. అట్టి విశేషధర్మానుష్ఠానమున శుద్ధమైన మానసక్షేత్రమునందు భక్తిజ్ఞానవైరాగ్యములు ప్రభవించుటయంతట్టి యాటం

కేమునుండదు. అట్టి భక్తిజ్ఞానవైరాగ్యములవలన నిరతిశయ శివానందసిద్ధి జీవునకు కలుగుననియు అట్టి సిద్ధికలిగిన తరువాత తిరిగి జన్మింపడనియు నుపనిషత్తులు కంఠరవమున ఘోషించుచున్నవి.

ఇట నొక ముఖ్యవిషయము గమనింపతగియున్నది. మహామ్మదీయులును క్రైస్తవులునుగూడ భక్తిజ్ఞానములనుగూర్చి ప్రబోధించుచున్నారు. వేదమతస్థులును భక్తిజ్ఞానములనుగూర్చి ప్రబోధించుచున్నారు. ఈ రెంటి యాశయము లొక్కటియేనా యనునది విచారణీయము. ఒక్కటికాదనియే సమాధానము. ఎట్లన క్రైస్తవ మహామ్మదీయులు ధర్మయుక్తములైనను నధర్మయుక్తములయినను కేవల ప్రాపంచిక సుఖములను సంపాదించుటకై పాటుబడుచు జీవించుచుండుట యెల్లరకు దెల్లమే. అట్టివారియొక్క చిత్తములు నపవిత్రములగు కామక్రోధాదులచే ఘనీభవించి యుండుటవలన ప్రాపంచిక సుఖసంపాదనమే లక్ష్యమని తలంచుచు వాని సంపాదించు నవసరమున చేయు ప్రయత్నములు విఫలములుకాగా వానిని సాధించుటకు పరమేశ్వరుని వేడుటయే శరణ్యమని తలంచుదురు. అట్టి తలంపుతో కేవలము ప్రార్థనలు సల్పుచుందురు. ఆ ప్రార్థనల ద్వారా పరమేశ్వరునికొరకై సమర్పింపబడు చిత్తములయందు గలిగిన భావమునకు భక్తియని పేరు. దీనినే యవైదిక భక్తియని వైదికమతస్థులు వాడుచున్నారు. ఇట్టి యవైదిక భక్తినే సాధనముగాగొని కేవల ప్రాపంచిక సౌఖ్యములకొరకై పరమేశ్వరునితో మొరలిడునారు హిందువులలోనను గలరు. ఈ కాలమున భారతదేశమునందు చాలమంది జను లీయవైదికభక్తినే యాధారముగ జేసికొని కాలముగడుపుచున్నారు. విశేష జనులు భక్తిజ్ఞానవైరాగ్యములను వీడి కేవల నాస్తిక భావముతో మెలంగుచున్నారు.

వైదికభక్తియనగా మొదట యవైదికభక్తిచే కొంతకాలము ప్రాపంచిక సుఖములకై ప్రాకులాడినను జ్ఞానముచే ప్రాపంచిక సుఖములు అనిత్యములనియు దుఃఖకారణములనియు దెలిసి యటుపిమ్మట స్వర్గాదిలోకసౌఖ్యములుగూడ తరతమ భావముచే నతిశయతరములని గ్రహించినను నవియు ననిత్యములని గ్రహించి పునర్జన్మరాహిత్యమునకై పైన చెప్పబడిన సాధారణ విశేష ధర్మముల ననుష్ఠించి యందువలన గలిగిన పరిశుద్ధతతో నలంకరించబడిన చిత్తముతో పరమేశ్వరుని యుపాసించుట యేదికలదో దానికి వైదికభక్తియని పేరు. అట్టి భక్తిగలవారలు నీకలియుగమున నరుదుగా గన్పట్టుచున్నారు. పూర్వము యిట్టి జనులే విశేష

మూగా భరతఖండమునను న్నట్లు తెలియుచున్నది. అట్టి సత్ప్రవర్తకులచే పవిత్రమగు నీభరతఖండము నపవిత్రజనసంసర్గముచే కళావిహీనతనుబొందియుండుటలో నాశ్చర్యమేమియు లేదు.

కావున నింతవరకు వివరింపబడినదానినిబట్టి ప్రపంచమునందు మానవులందరు ఆస్తికులనియు నాస్తికులనియు రెండు తెగలనియు నాస్తికులకు ప్రాపంచికసుఖములే శరణ్యములనియు ఆస్తికులకు నాముష్మిక సుఖములుగాని మోక్షసుఖముగాని లక్ష్యమగుటవలన నందునను పరమసుఖమగు మోక్షమే వాంఛనీయమనియు దానికై ప్రయత్నించుట ఉత్తముడైన యాస్తికునకు కర్తవ్యమనియు దెలియుచున్నది. మరియు ఆస్తికమతస్థులుగా వ్యవహరింపబడునట్టియు వేదమతస్థులకంటె భిన్నులయిన క్రైస్తవ మహమ్మదీయాది మతస్థులకు ప్రపంచమున నున్నంతవరకు నాస్తికుల సౌఖ్యములనే కోరుచున్నారనియు మరణానంతరము స్వర్గసౌఖ్యములే వాంఛనీయములని చెప్పుటయేగాని యా సుఖసంపాదనమునకు తగిన ధర్మము వారి నడవడిలో లేదనియు అందువలన నాస్తికులవలెనే చరించుచున్నారనియు దానినిబట్టి నాస్తికవర్గములోని వారినిగానే భావించుట చాలవరకు సమంజసమని తెలియుచున్నది. మానవలోకసుఖములయందు విరాగము కలుగనిది, స్వర్గలోకసుఖములయందు వాంఛబొడముట యసంభావితము. ఒకేకాలమునందు ఇహపరసుఖములయందు వాంఛజనించుట చిత్తవృత్తికి విరుద్ధము. పరస్పర విరుద్ధములగు వాంఛలు ఏకకాలమున బొడసూపుట ప్రకృతివిరుద్ధము. అందువలన క్రైస్తవుడేగాని మహమ్మదీయుడేగాని వేదమతస్థుడేగాని లేక మరి యితర మతస్థుడుగాని ప్రత్యక్ష ప్రాపంచికసుఖములయందే లోలురై, ప్రార్థనామందిరములయందు భగవంతునిగూర్చి ప్రార్థనలు సల్పినను వారి చిత్తవృత్తినిబట్టి యా ప్రార్థనలు ఇహసుఖమునకే కారణములు కావచ్చునుగాని స్వర్గాదిలోకసుఖసంపాదనమునకు నాప్రార్థన లనుకూలించవని తెలియదగినది.

దీనినిబట్టి యా క్రైస్తవ మహమ్మదీయాదులును నాస్తికులవలె సుఖసంపాదనమునకు బ్రయత్నించినను నట్టి సుఖసంపాదనమునకు బరమేశ్వర సహాయమునుగూడ నపేక్షించుచున్నారుగాన వారల చిత్తములయందు నీశ్వరభావము జనించుచుండుటవలన నాస్తికులకంటె గొంచెము పై తరగతిలోనివారలనుగా భావించుటయందే దోషమును లేదు.

ఇక వేదమతస్థులయందైననో అట్టి యాస్తికభావము కలుగుటయేగాక పరిపూర్ణ విరాగమునకై ప్రయత్నించుటయు స్వర్గాదిలోకసుఖములకై యజ్ఞాదికములగు కర్మానుష్ఠానము చేయుటయు మోక్షప్రాప్తికై నిష్కామబుద్ధితో నసాధారణములైన వర్ణాశ్రమధర్మముల ననుష్ఠించుటయు తద్ద్వారా భక్తిజ్ఞానవైరాగ్యములను బడయుటయు ననునవి మన పూర్వులయొక్క నడవడిలో నున్నట్లు చరిత్రలనుబట్టి కాన్పించుచున్నవి రాను రాను నీ కలియుగమునను చాలకాలము క్రిందటివరకు నిట్టి యాదరణముతో మన పూర్వులు కొందరున్నట్లును తెలియుచున్నది. ఇప్పటికిని నక్కడక్కడ నరుదుగా నట్టి మహనీయులు స్వల్పముగానుండిన నుండవచ్చును.

ఇక నీ భరతఖండమును నొక్కసారి సింహావలోకనము చేసినచో ముప్పది యైదుకోట్ల జనసంఖ్యగాన్పించుచున్నది. ఇందు నేడుకోట్లు మహమ్మదీయులుగను మూడుకోట్లు సిక్కు జైన బౌద్ధ క్రైస్తవాది మతస్థులుగను తక్కినవారు వేదమతస్థులుగను గాన్పించుచున్నారు. అనగా షుమారు యిరువదియైదుకోట్ల జనులు వేదమతస్థులైయున్నారు. ఈ వేదమతస్థులలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు యుత్తమ వర్ణములును అనులోమజ ప్రతిలోమజులను నితరజాతులవారును అని రెండు ప్రధానములైన విభాగములు కలవు. వీరిలో బ్రాహ్మణవర్ణమువారికి వేదములయందు నసాధారణములయిన వర్ణాశ్రమధర్మములు చెప్పబడియున్నవి. తక్కిన క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములవారికి తత్తద్వర్ణోచితములగు వర్ణాశ్రమధర్మములు చెప్పబడియున్నవి. ప్రతిలోమజ అనులోమజ జాతులవారికి నాయాజాతికి తగినట్లు ధర్మములు చెప్పబడియున్నవి. ఈ యన్నివర్ణములవారి ధర్మములను పూర్ణముగ పరికించి యొక దానితో మరియొకదానిని పోల్చిచూచినయెడల బ్రాహ్మణజాతియొక్క ధర్మము అసాధారణమనియు తక్కిన జాతులయొక్క ధర్మములు సాధారణములై నిచ్చెన మెట్లవలె లేక మేడమెట్లవలె నమర్చబడి మోక్షసౌధమును జేరుటకు సాధనములై యున్నవనియు స్ఫురింపగలవు.

మోక్షసౌధమునకు నమర్చబడిన ధర్మసోపానమునకు నడుగుమెట్టు పంచమజాతి. మోక్షసౌధములో బ్రవేశించుటకు సాధనమగు కడపటి మెట్టు బ్రాహ్మణజాతియని యీ దిగువ విధమున నిరూపింపబడుచున్నది.

పంచమజాతివారు ఆహారవిషయమున నెట్టి నియమములేకను వివాహము విషయమున నెట్టి కట్టుబాటులేకను ప్రవర్తించుచున్నారు. మాంసాదులు మొదలుకొని యన్ని యాహారములను భుజింతురు. కల్లు సారా మున్నగు నన్ని పానీయములను విధినిషేధములు లేక త్రాగుదురు. రజస్వలానంతర వివాహములు విధవా వివాహములు స్త్రీ పునర్వివాహములు యిట్టివి వారి నడవడిలో నున్నవి. దీనినిబట్టిచూడగా నాస్తికులకు బలె కేవల ప్రాపంచికసుఖములైన యాహారనిద్రాభయమైథునములవలని సుఖములను మాత్రము అనుభవించుచున్నారు. మరియు నపరిశుభ్రముగనుండుటయు జంతువులను కోయుటయు మున్నగు కృత్యములను చేయుచున్నారు, విశేషమేమనగా వేదమునందు జెప్పబడిన దేవతలను పరమేశ్వరుని నమ్ముచూ కాలము గడపుటచూడ వీరియందు నాస్తిక ధర్మములున్నను నుత్తమగతికి దారిని చూపునట్టి యాస్తికభావము వీరియందున్నట్లు కన్పట్టును. అందువలన వీరును వేదమతస్థులుగానే పరిగణింపబడుచున్నారు. వేదమునందు జెప్పబడిన యైహికసుఖము ఆముష్మికసుఖము మోక్షసుఖములలో మొదటిదగునైహికసుఖమును నీశ్వరభావముతో ననుభవించుట ప్రాథమికదశ ఆముష్మికసుఖమును నీశ్వరభావముతో ననుభవించుట మధ్యమదశ. ఈ రెండు సుఖములను పూర్ణవిరాగమున విడనాడి మోక్షసుఖమును పొందుట ఉత్తమదశ.

ప్రతి మానవుడును నుత్తమ సుఖమును పొందుటకు నుత్తమదశకు రావలయును. ఉత్తమదశను పొందవలయునన్న ఉత్తమజాతికి రావలయును. ఉత్తమజాతికి రావలయునన్న ఉత్తమమయిన నంతఃకరణమును పొందవలయును. అంతఃకరణము పవిత్రముగ మారవలయునన్న ఉత్తమకర్మ ననుష్ఠించవలయును. ఉత్తమమైన కర్మను అనుష్ఠించుటకు ఉత్తమాధికారి కావలయును. ఉత్తమాధికారియగుటకు ఉత్తమజాతియందు జన్మించవలయును. ఉత్తమజాతియందు జన్మించుటకు నీశ్వరానుగ్రహము కావలయును. ఈశ్వరానుగ్రహమును పొందుటకు నీశ్వర సేవ చేయవలయును. ఈశ్వర సేవ చేయుటకు నీశ్వరునిచే చెప్పబడిన వేదార్థములను తెలిసికొని యందు జెప్పబడినట్లు వర్ణాశ్రమములకు తగిన ధర్మము లనుష్ఠించవలయును. ఆ ధర్మము లనుష్ఠించుటయే యీశ్వరసేవయగును. ఈశ్వరసేవ రెండు విధములు. ప్రపంచమున సంఘక్షేమమునకై ధర్మస్వరూపములయినట్టియు ద్వంద్వములయినట్టియు సత్యాసత్య హింసాహింసాది సర్వజనసామాన్య ధర్మముల ననుష్ఠించుట మొదటి సేవ. కేవల సత్య

దయాహింసాది ధర్మములు పూర్వాంగములుగ గలిగి మోక్షసామ్రాజ్యమునకై వర్ణాశ్రమధర్మము లనుష్ఠించుట యతీతమైన రెండవ సేవ.

ఉత్తమగతికి బోవుటకు కావలసిన జాతి, ఎప్పుడైనను యుత్తమగుణ కర్మలచే కలుగవలెనని యొక తెగవారును, కాదు పుట్టుకలోనే నుత్తమగుణకర్మలచే నుత్తమజాతి రావలెనని మరియొక తెగవారును వాదించుకొనుచున్నారు. నాయభిప్రాయము యేజాతిగాని అవాంతర జాతిగాని పుట్టుకనుబట్టి రావల యునేగాని కేవలము ఉత్తమగుణకర్మలనుబట్టిరాదని తలంచుచున్నాను, ఉత్తమ గుణకర్మలనుబట్టి యాయాజాతియందు శ్రేష్ఠుడని నడువజెల్లునేగాని యుత్తమ జాతి రానేరదు. ఈ విషయమునుగురించి జాతి, కులము మతము అను శీర్షిక క్రింద ముందు వేరొక వ్యాసమున విపులముగ వివరింతునుగాన పరికృతమును సరింతును, అపరికృతవిషయముతో శ్రోతలకు వృధాశ్రమయిచ్చినందులకు మన్నింతురుగాక.

పైన తెలుపబడినట్లు పంచములు వేదమతస్థులెట్లులయిరో తెలిపియుం టిని. ఇక నెరుకుల యానాది కోయ చెంచు మున్నగు జాతులవారు గలరు. వీరును పంచములవలెనే ప్రాపంచికసుఖలోలురై పైనచెప్పబడినట్లు నడచుచు గొడ్లను కోయుట చెప్పలు కుట్టుట మున్నగు నితరకర్మలను విడిచిపెట్టి యాస్తిక భావముతో మెలగుటవల్ల కొంతవరకు పంచములకంటె నున్నత తరగతివారుగా చెప్పబడుచున్నారు.

వీరి తరువాత చాకలి ఉప్పర గొల్ల మున్నగు కొన్ని జాతులు కలవు. వీరును పైజాతులవలెనే ప్రాపంచికసుఖములే ప్రధానములుగా గలిగి కొన్ని యుత్కృష్టకర్మలచే భేదించుటవలన వీరు అంతకంటె నుత్తమ తరగతివారుగా భావింపబడుచున్నారు.

వీరి తరువాత మంగలి కుమ్మరి మున్నగు జాతులవారు కలరు. ఇక్కడ నుండి కేవల ప్రాపంచిక సుఖములను క్రమముగా పరిత్యాగము చేయవలసినట్లు కనుపించుచున్నది. ఆహారనిద్రాభయమైధునాదులవల్ల కలుగు సుఖములలో మిధునసుఖము ముందు తగ్గించబడుచున్నది. వివాహమునకు వ్యవస్థ యేర్పడి యున్నది, అనగా భర్త సంతానము కొరకు వివాహమాడవలయునుగాని సుఖము కొరకు వివాహమాడగూడదు. తనకు సంతానము కలిగినతరువాత జన్మాంతము

వరకు బ్రహ్మచర్యము కలిగి తన కులధర్మము ననుష్ఠించుచు కాలము గడుపవల యును. ఈ తరగతి జాతివారెల్ల పైన బేర్కొనబడిన వారికన్న నుత్తమ తర గతిలో చేరుదురు.

ఇక నిట్టి వివాహవ్యవస్థయే కలిగి నిత్యనైమిత్తిక కామ్యకర్మములలో గొన్నిటి ననుష్ఠించుటకు నధికారము గలవారు మరికొందరు గలరు. వీరే శూద్ర వర్ణమువారు. వీరు వివాహవ్యవస్థచే మిధునసుఖమునున్ను ఉపవాసాదికములచే గొంతవరకు నాహారసుఖమునున్ను విడువదగినవారు.

వీరికి పైన వైశ్యవర్ణమువారు కలరు. వీరును పై వివాహవ్యవస్థకలిగి వేదోక్తములగు కర్మలనుష్ఠించుటకు గొంతవరకు నధికారులై యున్నారు.

క్షత్రియులు వీరును పైవారివలెనే వ్యవస్థ కలిగి యుత్తమ కర్మానుష్ఠాన మునకు నర్హులై యున్నారు.

ఇక బ్రాహ్మణులైనచో పై వివాహవ్యవస్థకలిగినను యాహారవిషయము నను మిధున విషయమునను ననేకములయిన కట్టుబాటులు కలిగి తమ యుత్తమ గతికి వలయు సత్సంతానము కలిగినతోడనే సంపూర్ణ విరాగము కలుగదగిన కర్మలనుష్ఠించి పూర్ణవిరాగిగామారి భక్తిజ్ఞానములను పొంది మోక్షసౌధమున బ్రవేశింపవలయును. ఇందువలన బ్రాహ్మణు డన్నివర్ణములలో సర్వోత్కృష్టు డని ప్రసిద్ధివహించినాడు. ఇట్టి బ్రాహ్మణులచే ననంత తేజోవంతముగ భాసించిన బ్రాహ్మణజాతి యిప్పుడెట్టి దీనదశను బొందినదో గుణజ్ఞులాలో చింతురుగాక.

మానవజాతియందు, పరమాభ్యుదయమగు మోక్షసౌధము నలంకరించుట ముఖ్యకార్యము గనుకనే మానవజాతిసోపానమునకు వరుసగా నేర్పరచిన మెట్లులాయుననట్లు పంచమజాతి మొదలుకొని బ్రాహ్మణజాతివరకు వర్ణోపవర్ణ ములు కలుగునట్లు సృష్టిలో చాతుర్వర్ణ్య విభాగము పరమేశ్వరునిచే రచియింప బడినది.

ఇప్పటికి షుమారు వెయ్యిసంవత్సరములనుండియు మహమ్మదీయాంగ్లే యుల పరిపాలనాసంపర్కమున భారతదేశమునందలి యన్ని కులములవారును యన్ని మతములవారును తమ తమ కులధర్మములను తమ తమ మతధర్మములను

మంటగలిపి మోక్షసోపానమగు జాతివ్యవస్థను పాడుచేసి కేవల ప్రాపంచిక సుఖైకలోలురై జీవయాత్రగడుపుచూ ప్రవర్తించుచున్నారు. జాతిసోపానము చెడినదిలగాయతు వర్ణవ్యవస్థ చెడిపోయి నామమాత్రముగ బ్రాహ్మణులనియు క్షత్రియులనియు వైశ్యులనియు శూద్రులనియు పంచములనియు పేర్లతోమాత్రము వర్ణవ్యవహారము కనుపించుచున్నది. ఇప్పటికి నన్నిజాతుల యందును రజస్వలానంతర వివాహములు విధవా వివాహములు స్త్రీ పునర్వివాహములు అక్కడక్కడ జరుగుచున్నను నామమాత్రముగనైనను జాతివ్యవహారము కనుపించుచున్నది. అక్కడక్కడ నిటీవల కొంతకాలమునుండి వర్ణాంతర వివాహములుగూడ జరుగుచున్నవి. దీనితో వర్ణవ్యవహారముకూడ పూర్తిగ నశించుటయు జరుగగలదని యూహించవచ్చును. ఈశ్వర నిర్ణయమెట్లున్నదో యట్లు జరుగుగాక.

ఇట్టి సంకీర్ణయుగములోకూడ ధర్మాసక్తచిత్తులయినవారు కొలదిగనైనను లేకపోలేదు. ఎవరనుష్ఠించిన ధర్మము వారినే రక్షించును. ఎవరనుష్ఠించిన యధర్మము వారినే భక్షించును. కావున వ్యాసమహర్షి ధర్మఏవహతో హంతి ధర్మోరక్షతి రక్షితః। అని నుడివియున్నాడు

కాబట్టి యోశైవసాంఘికులారా! లోకమున నధిక సంఖ్యాకులాచరించుచున్నవన్నియు ధర్మములని భ్రమజెందక వేదోక్తజ్ఞానమును సంపాదించి పైననే తెల్పినట్లు మానవ పరమాభ్యుదయమునకున్ను సమస్తజీవ పరమాభ్యుదయమునకున్ను లక్ష్యమైనట్టియు పునరావృత్తిరాహిత్యమునకు హేతువైనట్టియు మోక్షసుఖసంపాదనమునకు వలయు భక్తిజ్ఞానవైరాగ్యములను సంపాదించుటకు వలయు వర్ణాశ్రమధర్మములనున్ను వానికి పూర్వాంగములగు సత్యదయాహింసాది సాధారణ ధర్మములనున్ను అనుష్ఠించి జన్మసాఫల్యమునుగాంతురుగాక యని మిమ్ములను కోరుచూ యట్టి సన్మార్గముల బ్రవర్తించుటకు వలయు ధీవిశేషమును నొసంగుటకు పరమేశ్వరుని బ్రార్థించుచు నీవ్యాసమును ముగించుచున్నాడను.

చ॥ మతము లనేకముల్ గలవు మానవజాతికి వానియందువి।
శ్రుతమగు వైదికంబె, పాడనూడు భవాబ్ధినిదాటనావయై।
మతిజెడి కామినీ కనకమాన్యసముచ్చయతుచ్ఛభోగదు।
ర్మతముల, నమ్మి, పండితుడె రక్కసుడై కలికాలవేళలన్॥

ఇట్లు బుధజనవిధేయుడు,
ఇవటూరి సానందరావు,
పత్రికాసంపాదకుడు.

శ్రీ శివాయగురవేనమః.

# మనస్సును వశపఱచుకొనుట — దానివలని ప్రయోజనములు.

మనస్సు మహాచపలమైనది గనుకనే అది యెల్లప్పుడును మోహాటవిని సంచరించుచుండుననియు యువతీకుచద్వంద్వమూపయిన నాట్యమాడుచుండుననియు ఆశా శాఖలపైకిదూకుచు నానావిధములగు కొంటెపనులను చేయుచుండుటచేత మర్కటమును పోలుననియు ఆదిశంకరులు తమ శివానందలహరియందు నుదాహరించియున్నారు.

శ్లో॥ సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ నటత్యాశాశాఖాస్వటతి ఝటితి స్వైరమభితః॥

అటిదానిని వశపఱచుకొనిననేకాని మానవుడు తన్ను దానెఱుగజాలడు. అట్లయిననేకాని స్వస్వరూపజ్ఞానమును తద్వారా తానే పరబ్రహ్మమనువిజ్ఞానము కలుగదు. అట్టిదానిని గట్టిప్రయత్నముజేసిన మానవుడు వశపఱచుకొనగల్గును. కాబట్టి సాధకుడు ప్రతిదినము కొంచెముగనో గొప్పగనో ఆత్మవిచారణ (meditation) ను శ్రద్ధతో సలుపుచుండవలయును. మనస్సునకుచపలత కలిగినప్పుడెల్ల దానిని మరల్చి యేకస్థానమున నిల్పజేయు ప్రయత్నములను పట్టువీడక సల్పుచుదానికి బుద్ధిజెప్పుచు కోరినవస్తువుల నీయకవర్తించిన సాధకుడు రెండు మూడు సంవత్సరములలో దానిని వశపఱచుకొనగలడు. మనస్సుచెడు వస్తువులను కోరునపుడు దానికి శిక్ష యుపవాసమే. మనస్సులొంగిన సమస్తమును లొంగును. అది సంపూర్ణముగా వశపడిన సంపూర్ణజ్ఞానియైతీరును.

మనస్సు వశపడమికి సాధకుడు విచారపడరాదు. మనము నిశ్చయముగా దలంపమేకాని, సామాన్యముగా విద్యార్థి హూణవిద్యాపఠనకాలమున జరుగుచుండు పరీక్షాతరుణములందు పొందు మానసిక క్లేశముకంటె నీశ్వరకృప నందుటకై పడుపాటు ఎక్కువదికాదు. ఈశ్వరు డతి దయాళువు. నిరంతర ధ్యానానందము కల్మికిమెచ్చుపరిశుద్ధాంతఃకరణము గలవాడతడే. ఎవడాతనిపైభారమునుంచి సమస్తక్రియలాతనికొరకు చేసితినని తలంచి తత్ఫలమాతనికి

సమర్పణజేయునో యాతని కుటుంబపోషణముయొక్క భారమును వహించుచు నెల్లరయెడల నాతనికి తోడ్పడి వెన్నుజంటగానుండును.

ఆయప్రతిమానరక్షకుడు భక్తుని నిర్మలాంతఃకరణమును వీక్షించి నిశ్చల భక్తిప్రపత్తులగాంచి నిష్కాపట్యసాధువర్తనమునుచూచి పరోపకారచింతను పాటించి సత్యవాక్పరిపాలనాసక్తికి మెచ్చి ప్రత్యక్షమైవానికి వరముల నిచ్చుచుండుటకు ననేక నిదర్శనములు కానవచ్చుచున్నవి.

భగవత్సాక్షాత్కారము మనకు వలసినపుడు లభింపమికి చింతింపరాదు. దైవము నాపత్కాలమున నిందించుట మహాదోషము. కర్మవిధిదాట నెవరికిని సాధ్యముకాదుగదా! పగనైనను వగనైనను ప్రాణభీతినైనను భగవన్నామ సంకీర్తనము సలుపుట యవంత శుభప్రదము. కావున ప్రతిఫలము గోరక పరమేశ్వరుని శ్రద్ధాభక్తి విశ్వాసముల జూపుచు నేకపద్ధతిని నిత్యము కాలము దప్పక సేవించు పుణ్యమూర్తికి నీశ్వరానుగ్రహము కరతలామలకమగును. అతనికి చిత్తశాంతి అతీతముగనుండును. కష్టములు సుఖములగును. అవిచ్ఛిన్న తృప్తికలుగును. దానంజేసి యాతనికి నానందము దక్క వేఱొండు కావరాదు శరీరారోగ్యము కల్గును

గురూపదేశము చిత్తమునకే కాగ్రవృత్తిని కల్గించును. అట్టి సద్గురూపదేశము భువిగల సర్వమతస్థులు ఐకకంఠ్యముగా సాధకునకత్యవసరమని చెప్పుచున్నారు. అట్టి గురువే లేనిచో సాధకుడు దినమున కొకవిధముగా నొక్కొక్కచోటున దన యిష్టానుసారముగ లక్ష్యముంచుచుండును. అందువలన నీశ్వరానుగ్రహమందుటకు దృఢలక్ష్యసిద్ధి భక్తున కెట్లు లభించును? లభింప జాలదు అందుచేత సాధకుడు చేయు కృషికి ఫలము కలుగదు. భక్తికి మనమునకే కాగ్రవృత్తి కావలయును. ఆముష్మికమార్గము ద్రొక్కుటకు కంటక భూయిష్ఠమై నిమ్నోన్నతమై భయాకులితమైయున్నట్లుగా మొదట మొదట గన్పించినను నిశ్చలహృదయముతోడను దృఢమనోబలముతోడను గమనించి ప్రవర్తించిన భక్తునకు సర్వము సులభముగ నానందజనకముగ నుండుటయేగాక న్ను పరమేశ్వరుడు వెంబడించునని తోపజేయుగలదు. దృఢవిశ్వాసమే కార్యద్ధికిమూలము అందుచేత భక్తునకు నిష్టార్థసిద్ధికల్గును. ఇక భక్తుడు నిష్కామియై న్యానమును చేయవలయును. అతడు తన మనస్సులో ప్రారంభించిక ఛిద్రము

లకు చోటునీయక నిరంతరము ఈశ్వరనామోచ్చారణమును మూఢభక్తితో జేయుచు రానురాను ఏకాగ్రవృత్తి యతనికి లభించును.

కాబట్టి మనస్సునకు శుద్ధి ఏకాగ్రవృత్తి కలుగుటకు మూఢభక్తియోగ విద్యాభ్యాసము కావలయును. జీవాత్మ (Individual Soul) పరమాత్మ (Supreme Soul) ల సంయోగమే యోగము. ఈ గుప్తజ్ఞానమార్గమును బోధించునదియే యోగశాస్త్రము. ఇది హఠయోగము రాజయోగమునని రెండు విధములు. హఠయోగము స్థూలశరీరమును గూర్చియు శ్వాసానిరోధమునుగూర్చియు దెలుపును రాజయోగము మనస్సును గూర్చిన విషయముల బోధించును. రాజయోగము హఠయోగము ఒకదానిపై మరియొకటి ఆధారపడియున్నవి. రాజయోగ హఠయోగములు ఒకదానికొకటి ఆవశ్యకమగు పరిపూరకములు. ఈ రెంటిలోని పద్ధతుల నభ్యసించనియెడల సంపూర్ణయోగి కాడు. సంపూర్ణాభ్యాస్త హఠయోగమంతమగుచోట రాజయోగనారంభము గును. హ, ఠ యను నక్షరద్వంద్వము చేరి హఠయోగమగుచున్నది. హ యనగా చంద్రనాడి, ఇదియే ఇడ యనబడునది. ఠ యనగా సూర్యనాడి ఇదియే పింగళ యనబడునది, ఇవి వరుసగా ముక్కుయొక్క యెడమ కుడి రంధ్రములనుండి పాఱు శ్వాసలు. శ్వాసానిరోధమువలన సూర్యచంద్రనాడులను ప్రాణాపానవాయువులను కలుపుమార్గమును బోధించునది హఠయోగము ఆయు రారోగ్యసాధనముల దెల్పును. అందలి స్థానకలు ఆసనములు ముద్రలు బంధములు హృదయము యకృత్తు మస్తిష్కము వీని క్రియలక్రమపఱచును. జీర్ణశక్తిని రక్తవ్యాపనమును వృద్ధిజేయును. మూత్రపిండములు (Kidneys) అంత్రములు (Intestines) మున్నగాగల అభ్యంతరావయవములను బహుచక్కగా పని చేయించును. వేయేల సమస్త రోగముల నివారింపజేయును. సామాన్య వ్యాయామములు శరీరమందలి కండరములను మాత్రమే వికసింపజేయును. వీని వలన కలియుగ భీముడు కావచ్చును. అంత్రములు (Intestines) ప్లీహము (Spleen) తిలకము (Pancreas) యకృత్తు (Liver) హృదయము (Heart) శ్వాసకోశములు (Lungs) మస్తిష్కము (Brain) శరీరమునకు వృద్ధిని కండరములు మున్నగువానికి పోషణసామగ్రిములగూర్చు "ఎండోక్రైన్" గ్రంధులు లోనగు నభ్యంతరావయవములకు నెక్కువ పరిశ్రమల కల్పించి హఠయోగాసనాదులు చక్కగా పని చేయును. మన శరీరమును మనస్సును అన్యోన్యాశ్రయములగుచేత శరీరము చక్కబడిన మనస్సుకూడ బాగుగనుండును. అప్పుడది మాన

సిక విషయములను చక్కగా విచారింపజేసి సాధకునకు సంపూర్ణ జ్ఞానమును కలిగించును.

ఇక ప్రాణాయామమువలన గలుగు లాభములనుగూర్చి విచారింతము. ఈ సాధనము మెదడును శ్వాసావయవములను నాసికాద్వారములను పరిశుద్ధినంద జేయును. శ్లేష్మదోషముల బోగొట్టును; శ్వాసావయవములలోని దుడుకు నార్పును. అందువలన ఉబ్బసము హరించును. క్షయరోగమును రానీయదు. వచ్చినదానిని కుదుర్చును. రక్తమును శుభ్రపఱచి దానిని వృద్ధిగూర్చును. రక్తమునందలి విషపదార్థములను వెడలించును. బలబద్ధకము నివారింపజేయును. హృదయమును చక్కజేయును. రక్తవాహకావయవములు శ్వాసావయవములు జీర్ణింపజేయు నవయవములు బాగుపడును. బుద్ధికి స్థైర్యము కలుగజేయుటయే గాక తన్ను దానెఱుగజేసి పరమానందమును కల్గించును. అట్టి యనంత సుఖావహమగు ప్రాణాయామవిధానమును యోగులు సద్గురూపదేశమువలన నెఱింగి ఫలము ననుభవింప ప్రార్థితులు.

మరియు సాధకుని యోగసాధనకు బలిమికి మితాహారనిహారములు అత్యావశ్యకము. అతను తినగలిగిన భోజనములో సగము మాత్రమే తిని ఒకపాలు నీటిని త్రాగవలయును. నాల్గవవంతు ఆకాశములో ఖాళీయుంచవలయును. మన దృష్టికి చాలా పాపమును చేసితిమని మనమనుకొన్నను, పరమేశ్వరదృష్టికి భక్తునిపై ప్రేమచేత నది బహుస్వల్పముగానుండుటచేత నామహాప్రభుని దృష్టిలేశము చేతనే నది హరించి సాధకునకు నీశ్వరసన్నిధానమును నబ్బజేయును. సాధకుడు వెనుక తాజేసిన దుష్కృత్యములకు విచారపడక తాను పశ్చాత్తాపమునందుట వలన పాపముల నీశ్వరుడు నివారింపజేయును. దృఢభక్తితో నడిచిన నీశ్వరుడు విధిగా వానిని పోగొట్టి భక్తుని సంరక్షించును. మరియు భక్తిసాధకవశ్యము మనస్సున కబ్బజేయుటకు మహాభక్తుల చరిత్రములను పలుమారు పఠించుచు వారి ప్రవర్తనలను పరవడిగా బెట్టుకొని తద్విధానముల నవలంబింపు సమస్త విషయముల బాటుపడవలయును. మనస్సునకు భక్తిపై నాత్యైక్యమును కలిగించుటకు సాధుసంగమావశ్యకము. సాధకుడు మహాత్ములు చెప్పుకొను విషయములనుగ్రహించుటకు వారికి శుశ్రూషాపరిచర్యల సలుపుచుండవలయును. ఇట్లాచరించుటలో నత్యంత బ్రహ్మచర్యవ్రతము నూనుట యావశ్యకము. భక్తుడు కామినీధనకాంక్షల విడనాడవలయును. తుచ్ఛసుఖములకై తన మనసునొగ్గనీయక సాధకుడు

నిత్యసుఖానందమునకై పాటుపడుచుండవలయును. తుచ్ఛసుఖములపై ఆస ఈశ్వరజ్ఞానసంపత్తిని పట్టుబడనీయదు. మానవజన్మమెత్తుట కడు దుర్లభము. మోక్షానందము మానవజన్మముద్వారా పొందవలయును. దేవతలు కూడా వారు ప్రాగ్జన్మములందుజేసిన ఫలము ననుభవించినదనుక భూలోకమున నరులై పుట్టి భక్తి కలిగి సత్కర్మాచరణమును గావించి యీశ్వరానుగ్రహమును బొందవలయును; గాన నరజన్మ సర్వోత్కృష్టమైనది యని గ్రహింపనగును. సాధకునకు అభ్యాసపరిపక్వమైనదనుక ఏకాంతావాసము నిశ్చల జ్ఞానానందావాప్తికి మూలమగును గాని ముందుగా ఏకాంతావాసము సల్పిన మనస్సునకు స్థైర్యము కుదరకపోవుటయేగాక అతీతభయము కల్గును. గాన ప్రారంభమున భక్తుడాచరించు కర్మానుష్ఠానమునకు సాధుసంగము జ్ఞానక్షీరములబోసి పెంచి పెద్ద జేయును. అనేకులు మొట్టమొదటనే ఏకాంతావాసముజేసి భ్రష్టులై పిచ్చివారైరి. ఈ ప్రపంచమున యథార్థమగు ఏకాంతము లేనేలేదు. దేశము కాలము హేతువు ఏకాంత సుఖమునందనీయజాలనంత సూక్ష్మశక్తిగలది. అది మనస్సునకు నింద్రియజ్ఞానమునకు నతీతమైనది అదియే సమాధి.

పండిత మల్లంపల్లి భైరవమూర్తి,
ధన్వంతర్యాద్యనేకాయుర్వేద వైద్యగ్రంథకర్త, బందరు బచ్చుపేట.

## రుద్రాక్షమాహాత్మ్యం - కీర్తన.

శంకరాభరణం - ఆదితాళము.

పల్లవి॥ రుద్రాక్షల మాహాత్మ్యము । రూఢిగ వినుడీ।
భద్రముగను ధరియింపుడు । భక్తితో మీరు ॥రుద్రాక్ష॥
చ॥ అరుణాక్షుండను దైత్యుని । హరుడు మనమదలచి।
అరుణవీక్షణంబులచే । ననుకనిజూడ ॥రుద్రాక్ష॥
2 రౌద్రనేత్రజ్వాలయె । రుద్రాక్షయయ్యెను।
రుద్రకృపావీక్షణమే । రుద్రాక్షయనగను ॥రుద్రాక్ష॥
3 ఏకముఖిపంచముఖి । యనెడు తెఱగుల।
ఏకరూపునాజ్ఞ చేత । నేర్పడెనిటుల ॥రుద్రాక్ష॥
4 ఏకముఖి రుద్రాక్షయిచ్చు । నెల్ల సిరులను।
అఖిలపదవులందజేయు । నభవు పంచముఖి ॥రుద్రాక్ష॥
5 వరభీమవరమునందు । వాసమొనర్చు।
వరసదాశివుండు జెప్పెను । వరదుని దయను ॥రుద్రాక్ష॥

ఈశ్వరప్రగడ సదాశివశర్మ - భీమవరం.

# చందాల వివరము.



| | |
|---|---|
| ప్రధానపోషకులకు సంవత్సరమునకు | రు 5_0_0 |
| పోషకులకు సంవత్సరమునకు | 3_0_0 |
| ఉపపోషకులకు సంవత్సరమునకు | 2_0_0 |
| సభ్యత్వచందా సంవత్సరమునకు | 1_0_0 |
| పత్రికచందా సంవత్సరమునకు | 1_8_0 |
| విడిపత్రిక 1 కి | 0_6_0 |

ప్రధానపోషక, పోషక, ఉపపోషకులకు పత్రిక యుచితముగా పంపబడును. వీరికి ఓటింగు హక్కుగలదు.

సభ్యత్వచందాదారులకు సభయందు ఓటింగు హక్కుకలదు. వీరికి పత్రిక పంపబడదు.

పత్రిక చందాదారులకు పత్రిక పంపబడును గాని వీరికి ఓటింగు హక్కులేదు.

---



---


ప్రకటన :- పింగళి వీరయ్యపంతులుగారు, బందరు.

ముద్రణ :- మినర్వా ప్రెస్, బందరు.



శ్రీ శివాయగురవేనమః

# శైవమత ప్రకాశిక.

బహుధాన్యనామ సం॥
మాఘఫాల్గుణమాసములు.


| సంపుటము. | సంచిక. |
| --- | --- |
| 1 | 6 |


శ్లో॥ శ్రీ వేదశాస్త్రార్థ తతిప్రభాసికా ।
సందేహ సందోహ మహానిరాసికా ।
తత్వత్రయోద్బోధన సిద్ధదేశికా ।
జయత్వియం శైవమత ప్రకాశికా ॥

కు
మా
ర
లీ
ల


ఇవటూరి సానందరావు
పత్రికా సంపాదకుడు.



శైవమహాసభా కార్యాలయము,
బందరు.

ప్రకటన:-
పింగళి వీరయ్యాపంతులుగారు,
బందరు.

ముద్రణ:-
మినర్వాప్రెస్, బందరు.

శ్రీ శివాయగురవేనమః

శైవయువజన సభవారు చేసియున్న తీర్మానములను బట్టి శైవసాంఘికులయందు నాచరణరూపమున వారిచే ప్రవేశపెట్టబడిన

# ప్రథమ విధవా వివాహము.

---

కన్యాదాత:— మల్లంపల్లి వీరభద్రయ్యా అయ్యావారు (తండ్రి సుబ్బారాయుడుగారు) పమిడిముక్కల అగ్రహారం.

పూర్వాచార పరాయణులు.

ప్రతిగృహీత:— కాశీనాథుని ఈశ్వరరావుగారు (తండ్రి వీరమల్లయ్యా పంతులుగారు) యలకుర్రు అగ్రహారం.

నవీనాచార పరాయణులు.

శైవమహాజనులారా !

స్వస్తిశ్రీమచ్చాంద్రమాన ప్రమాధినామ సంవత్సర చైత్ర బ ౯ గురువాసరమున మధ్యాహ్నము గం 11-50 నిముషములకు కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా పమిడిముక్కల అగ్రహారం కాపురస్థులగు మల్లంపల్లి వీరభద్రయ్యా అయ్యావారి కుమార్తె చి॥ పూర్ణయ్యమ్మ అను కన్యను కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా యలకుర్రు అగ్రహారం కాపురస్థులగు కాశీనాథుని వీరమల్లయ్యా పంతులుగారి తృతీయ పుత్రుడు ఈశ్వరరావు అను పిల్లవానికిచ్చి బందరుపట్టణములో నూతనముగ నిర్మింపబడిన వేణుగోపాలపురమను పేటలోని శివలెంక భైరవానందంగారి గృహమున వధూవరుల తలిదండ్రులిరువురును యీ దిగువ పెద్దల సమక్షమున వివాహము జరిగించియున్నారు. ఇచ్చట వివాహమనగా కన్యకు ద్వితీయ వివాహమని తెలుసుకొనగోరెదను. ఇదియే వరునకు ప్రథమవివాహము.

ఈ కన్య ఆదిలో నొక సంవత్సరము క్రిందట రేపల్లె తాలూకా పెదపులివరు వాస్తవ్యులగు విశ్వాత్ముల సుబ్రహ్మణ్యం అను పిల్లవానికిచ్చి పాణిగ్రహణము చేయబడినది. ఆకుఱ్ఱవాడు యింటర్మీడియేటుక్లాసు చదువుచు నవాంతర మరణమునకు గురి యయ్యెను. ఆ కన్యకు బాల్యమునందే యకస్మాత్తుగ వైధవ్యము సంప్రాప్తించెను. ఆకన్య యిప్పటికిని రజస్వలయైయుండలేదు. ఈ కన్యకు దైవయోగమున సంప్రాప్తమగు దురవస్థకు నాపె తలిదండ్రులు శోకసాగరమున మునిగి యుండిరి. తలిదండ్రులకు గలిగిన శోకముసంగతి యెట్లున్నను, ఆకన్యకు కలిగిన దురవస్థకు నాబాల గోపాలము విచారగ్రస్తులైరి. ఇట్టి యదనుననిప్పటి కాలానుసారముగ సర్వసంఘములయందు రజస్వలానంతర విధవావివాహములు జరుగు నవకాశమునుదీసికొని, కన్యాదాత ప్రతిగృహీతలు తమ యభిప్రాయ మున కనుకూలురగు నీ దిగువ పెద్దల సమక్షమున వారిరువురకు పాణి గ్రహణమొనరించిరి?

ఈ విషయమును సర్వశైవసాంఘికులకు దెలియజేయుట శైవమత ప్రకాశికా పత్రికకు కృత్యముగాన నావిధిని నెరవేర్చు చున్నది. దీనిని గురించి విచారించవలసిన బాధ్యత యావన్మంది శైవ సాంఘికులపై నున్నది. నే నీ విషయమునుగురించి వరునితండ్రి యగు వీరమల్లయ్య పంతులుగారితోను, కన్య తండ్రియగు వీర భద్రయ్య అయ్యవారితోనుసంప్రదించియే వారి సమ్మతిమీదనే యీ పత్రికలో ప్రచురించడమైనది. నేనిట్లు వ్రాయుట వధూవరులకు నప్ర తిష్ఠను కలుగజేయవలెననిగాని, లేక నపకారమును కలుగజేయవలె ననిగాని యుద్దేశించి వ్రాయలేదు. ఇకనెందుకు వ్రాసితివని ప్రశ్నిం తురేని సమాధాన మాలింపుడు.

ఈ శైవమహాసభ పుట్టినదాది నేటివరకు శైవమతస్థుల యభివృద్ధికై పాటుపడు నుద్దేశముగలదగుట యెల్లరెఱింగిన విష యమే. కాని యెంత యభివృద్ధికలిగినదియు, నెల్లరకు దెలిసియే

యున్నది. శైవధర్మోద్ధరణమే యీసభయొక్క యుద్దేశమైనట్లు లోగడ సభా రిపోర్టులను బట్టి తెలియుచున్నది. సనాతన ధర్మోద్ధరణమే ముఖ్యమనియెంచి, ధర్మతత్వ ప్రబోధకములగు గ్రంథములను శ్రీ మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రిగారిచే రచియింపజేసి, యాగ్రంథ ముద్రణమునకు మనవారలనేకులు ద్రవ్యసహాయముచేసియున్నకతన, సనాతన ధర్మదృష్టి శైవసాంఘికులకు కలదని వ్యక్తీకరింపబడియున్నది. అదిగాక సనాతనధర్మ రక్షణోద్దేశముతోనే యఖిలభారత వర్ణాశ్రమధర్మసభకూడ యేర్పడి పనిచేయుచున్నది. అచ్చటచ్చట దానికి శాఖలుకూడ నేర్పడియున్నవి. దీనినిబట్టి యిట్టి సంకీర్ణయుగములోకూడ వైదికధర్మ తత్పరులున్నట్లు రూఢమగుచున్నది. ధర్మసాంకర్యముకలుగు కాలమందే ధర్మరక్షణమునకు ధర్మతత్పరులు పూనుకొనవలయునని, శాస్త్రము లుపదేశించుచున్నవి. మన శైవమహాసభలో చేరిన ప్రముఖులందరు, నాశాస్త్రోద్దేశముల పాటించు చిత్తవృత్తినే కలిగియుండిరని నేనింతవరకు తలపోసియుంటిని. అట్లుకానియెడ, ప్రతియేట నీశైవమహాసభ జరుపుట నిరర్థకమని నాయభిప్రాయము. శైవసాంఘికులలో నధికులకు ప్రస్తుత సంఘసంస్కారోద్దేశములే యున్నయెడల, నట్టి యుద్దేశముతోనే యీ మహాసభను జరుపుకొనవలయునేకాని, సనాతన ధర్మశాస్త్రముల మర్యాదను కాపాడజూచుట నిరర్థకకృత్యమని నాకు దోచుచున్నది. అట్టి సనాతనధర్మములయందు నిరూఢమైన నమ్మకమున్న ప్రతివారును వ్యక్తిగతముగా తద్ధర్మము నాచరించునని తరించుటయే సమంజసము. అందువల్ల రాబోవు కొత్తపల్లి మహాసభకు తామెల్లరు దయచేసిగాని, మహాసభవారికి మీ మీ యుద్దేశములను తెలిపిగాని, పైన చెప్పినట్లు జరుపబడిన వివాహమెంతవఱకు కామోదించతగినదో, నిర్ణయమొనరింతురుగాక.

ఇంతవఱకు నారాధ్యజనసంఘములో నెప్పుడును నిట్టి వితంతు వివాహము జరిగియుండలేదు. ఇదియే మొదటిది. తక్కిన స్మార్త, నియోగి, జనసంఘములలో నక్కడక్కడ కొన్ని కొన్ని జరిగియుండి

సను, వారలు ప్రత్యేకముగానే చరించుచుండిరిగాని, తక్కినవారితో భోజనసంబంధాది వ్యాపారములయందు నెట్టి కలయిక లేక ప్రవర్తించుచున్నట్లు వినవచ్చుచున్నది. అది యెంతవరకు నిజమో యను భవజ్ఞులకుగాని, తెలియదు.

ఈ దిగువను బేర్కొనబడినవారిలో కొందరు సంఘసంస్కారులు, కాలము మారినతరువాత దానినిబట్టి యాచారములుగూడ మారవలసినదనియే యని శెలవిచ్చియున్నారు. ఈ యభిప్రాయము సర్వ శైవసాంఘికులకు నుపాదేయమేమో కనుగొనవలసియున్నది.

మన శైవులలో గొందరికి శిష్యసంచారము, దేవాలయ ప్రతిష్ఠాకరణము యాజ్ఞికము మున్నగు సనుశ్రుతములగు వృత్తులు జీవనాధారములై యున్నవి. వితంతు దురవస్థను తొలగింపజేయు నీవిధమగు కార్యముచేత, తమ కుటుంబ జీవనమునకు నాధారములగు నా వృత్తులకు భంగము వాటిల్లునని పెక్కుమంది గగ్గోలు పెట్టుచున్నారు.

ఈ సంగతులను సదరు వీరమల్లయ్యపంతులుగారితో ముచ్చటించగా, తమకు శాస్త్రజ్ఞానములేదనియు, పండితులు చెప్పుమాటల యందు తమకు విశ్వాసము లేదనియు, చెప్పినారు. మఱియు, నతి బాల్యములో భర్త గతించినప్పుడు, కేవలము దోషరహితయైన బాలవితంతువును శాస్త్రనిర్బంధములకు లోబఱచి, యామెను పలు కష్టముల పాల్జేసి, యంధకారబంధురంబగు, యమకూపమున బడ ద్రోయుట కేవల రాక్షసకృత్యమగుటంజేసి, యట్టి కృత్యములు ఋషులచే నేర్పరుపబడినవైనను, లేక మానవులచే నిర్మింపబడినవైనను, లేక దైవముచే శాసించబడినవైనను, నవశ్యముగా నుల్లంఘించి, ఆత్మబుద్ధికి నేది న్యాయమనితోచునో, యామార్గమనుసరించుట శ్రేయమని తమకు దోచినట్లును, నింతవరకు నంధపరంపరగా వచ్చుచున్న వితంతు వివాహ నిషేధశాసనమును నిషేధించి, వితంతూద్వాహమొనరించుటకు భయపడుచున్న శైవసాంఘికులకు

మార్గదర్శికముగునట్లు తానీ వితంతు వివాహమును జరుపుచుంటి మనియు అందు తనకు తప్పిదము లేనట్లును తెలవిచ్చియున్నారు. శాస్త్రవిశ్వాసములేనియట్టివారితో సంభాషణము నిరర్థకమని యెంచి పై విషయముయొక్క ధర్మాధర్మనిర్ణయమును శైవసాంఘికులకే వదలివేయుచున్నాడను.

ఇక కన్యాదాతయగు వీరభద్రయ్యవారితో సంప్రదించగా, మన సంఘములో కొందరు పాలుఘాటు సంబంధముల నంగీకరించుచున్నారుగదా! మరియు రజస్వలానంతర వివాహములు ప్రస్తుతము జరుగుచున్నవిగదా! వానినిగూడ నంగీకరించుచున్నారుగదా! వాని వల్ల లేనిబాధ యీ వితంతూద్వాహమువలన నేమికలిగినదని ప్రత్యుత్తరమిచ్చినారు. అట్టి వారితో సంభాషణమనుచితమని యుపేక్షించితిని.

ముఖ్యముగ స్మార్తసంఘముతో మనకుగల పూర్వకర్మ సంబంధము తెగిపోవుచున్నదని కొందరు భయపడుచున్నారు. ఆ సంబంధమును త్రెంచివైచుకొనుటకు శైవసాంఘికులెల్లరు నామోదింతురా? కనుగొనవలసియున్నది.

ఈ దిగువ పేర్కొనబడినవారిలో కొందరు తత్కార్యనిర్వాహకులును, నామోదకులునునై యున్నవారు. తక్కినవారు కేవలము ప్రేక్షకులు మాత్రమేయైయున్నారు. నేనును ప్రేక్షకబుద్ధితో నచ్చటికి బోయితినేగాని, వారొనరించు వివాహమునకు సమ్మతిని దెలుపుటకు వెళ్ళియుండలేదు. నేను స్వయముగా నీసంగతులను గమనించి, గంజాం జిల్లా మొదలుకొని యన్ని జిల్లాలయందుగల యారాధ్యులకెల్లరకు నెఱుకపరచి శైవసంఘముయొక్క నిర్దిష్టమైన మెజారిటీ యాశయమేమో వెల్లడించుటకు ప్రతి గ్రామశైవులను కోరుచున్నాను. వ్యక్తిగతముగాగాని, మీమీగ్రామములయందు గ్రామ సభలు జరుపుకని సమష్టిగాగాని తమ యభిప్రాయములను రాబోవు మహాసభయందు వెల్లడింతురుగాక. సభకు రాజాలనివారు యీలోపుగ కార్యస్థానమునకు బంపవచ్చును.

ఒక్క విషయము. కన్యదురవస్థకు తలిదండ్రులును లోకులును గూడ యింతకు పూర్వము చాల విచారపడియుండిరి. వృద్ధమహర్షి ప్రణీతములగు నిర్ణయసింధుమున్నగు పూర్వధర్మశాస్త్రములు ప్రమాణముగా గలిగి తీవ్రపూర్వాచారపరాయణులును విశేషించినాకు బంధువులు నగు నీ కన్యాదాతలకు యువక మునిపుంగవులచే రచియింపబడిన, దుర్ణయసింధుమున్నగు నపూర్వ కర్మశాస్త్రములు ప్రమాణములు కావలసివచ్చినందులకు విచారపడుచున్నాను. కన్య దురవస్థను, కన్యాదాతల విచారమును శైవ యువజన సభవారు పోగొట్టినారు. నా విచారమును శైవమహాసభవారు పోగొట్టెదరా? పోగొట్టజాలనిచో శైవమహాసభకు నేజేయు సేవనిరర్థకమని నిర్ణయించుకొనువాడ. రథచక్రక్రమమున పరిక్రమించు కాలచక్రమున నెన్ని కళలు గలవోగదా!

పైన చెప్పబడిన వితంతూద్వాహమునకు నామోదకులును

కార్యనిర్వాహకులును

1. ఇవటూరి వీరేశ్వరుడుగారు, బ్రహ్మత్వమును వహించినవారు (కొట్టగుంటపాలెం.)
2 ఇవటూరి సుందరరావుగారు, పమిడిముక్కలఅగ్రహారం ముఖ్యకార్యదర్శి.
3. ఇవటూరి సుబ్రహ్మణ్యంగారు, పమిడిముక్కల అగ్రహారం
4. మల్లంపల్లి మృత్యుంజయఅయ్యవారు డిటో
5. మల్లంపల్లి దక్షిణామూర్తిగారు డిటో
6. ఇవటూరి కోట్లింగంగారు, గ్రామమునసబు డిటో
7. మల్లంపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు డిటో
8 బేతపూడి భైరవానందంగారు, యలకుర్రు
9. శివలెంక సుబ్బారాయుడుగారు డిటో
10. శివలెంక పూర్ణానందంగారు, తోట్లవల్లూరు

11. శైవాగమవిశారద శ్రీపతి పండితారాధ్యుల పట్టైసలింగారాధ్యులుగారు, డాక్టరు బెజవాడ.
12. తాడికొండ పూర్ణానందంగారు ఈవని
13. ములుగు మల్లికార్జునరావుగారు డిటో
14. ముదిగొండ లింగమూర్తిగారు డిటో
15. శ్రీపతి పండితారాధ్యుల కాళహస్తిలింగంగారు డిటో
16. విశ్వాత్ముల వీరశరభయ్యారాధ్యులగారు నేటివ్ డాక్టరు డిటో
17. విశ్వాత్ముల వీరేశలింగంపంతులుగారు డిటో
18. ముదిగొండ లింగమూర్తిగారు, తెనాలి
19. అయినంపూడి గుర్నాధరావుగారు, పెదసనగల్లు
20. కాశీనాథుని ప్రకాశంగారు, యీడుపుగల్లు
21. శివలెంక భైరవానందంగారు, యీడుపుగల్లు
22. తాడికొండ సుబ్బారావుగారు, గుడివాడ

## కేవల ప్రేక్షకులు మాత్రము.

23. మల్లంపల్లి భైరవమూర్తిగారు, బందరు
24. మల్లంపల్లి నాగేశ్వరరావుగారు డిటో
25. శివలెంక శంభులింగంగారు డిటో
26. సింగరాజు సోమసుందరంగారు డిటో
27. కాశీభట్ల సత్యనారాయణగారు డిటో
28. ఫిరాట్ల వెంకట సుబ్రహ్మణ్యంగారు డిటో
29. సింగరాజు మల్లికార్జునుడుగారు, మడక
30. ఇవటూరి రామయ్యగారు, బెజవాడ
31. కామరుసు సదాశివరావుగారు, దువ్వ
32. కందుకూరి పరబ్రహ్మంగారు, పైడిముక్కల
33. మొవ్వ నాగేశ్వరరావుగారు డిటో
34. చెరువు దక్షిణామూర్తిగారు డిటో

గీ॥ పురుషుడే, మున్ను నినువీడి, పోవ బిదప।
తరుణియే, నిన్ను తలదాల్చి, ధన్యయయ్యె।
అట్టి తరుణియె, నేడు నిన్నవల ద్రోయ ।
ధర్మదేవత ! నీకెద్దిస్థానమింక॥

ఉ॥ ఇంతకు శైవసంఘమున నెట్టి వితంతు వివాహ మెప్పుడో।
క్కింతయు బుట్టలేదు, మఱియిప్పుడు బుట్టెను, దీనిమీరు హా,
క్షింతురె? తొంటిద్రోవ సమయింతురె? పెంతురెమ్లేచ్ఛధర్మమా।
ద్యంతము, శైవులార ! నిజమారసి తెల్పుడు, సత్యబుద్ధితోన్॥

గీ॥ తెల్పినట్లైన సభలోన, స్థిరము జేసి।
యిహపరంబుల రెంటిలో, నెద్దిహితమొ।
యట్టిదాగినిబట్టగ, నౌనుగాని।
చేరి సభయంచు మూర్ఖులై, చెడుట తగునె ?

గీ॥ భస్మరుద్రాక్షలింగముల్, బడసి నవ్య।
యువకులట్టుల జరియించు, శివమతస్థు।
డరయ గోముఖశార్దూలమగునుగాని।
శైవుడన జెల్లునే వాని సరణిబూని॥

గీ॥ భస్మరుద్రాక్షలింగముల్, బడయకున్న।
శివపదాబ్జంబు హృదియందు, జేరియున్న।
శైవధర్మంబు వృద్ధిని, జాలగన్న
సరసుడగువాడె నిజమైన శైవుడెన్న॥

గీ॥ శైవసభయంచు నేటేట, సల్పనేమి।
ఫలము జేకూరె? నిజమైన బాటదప్పి।
మహిజరించెడు మనుజుల మనసు ద్రిప్ప।
శివుని కేలేదు, మనమేమి చేయగలము?॥

గీ॥ శైవధర్మంబులేకయే జరుపుసభను।
శైవసభయన్న ఫలమేమి? శైవులార।
నెయ్యిలేనట్టి కాయను నేతిబీర।
కాయయన్నట్లు మనసభ గ్రాలుగాని॥

గీ॥ అవసరంబైన శివధర్మమార్యులార।
యందుకై జేరి చర్చించుటవసరంబు।
భావమెల్లను బెడదారి బట్టెనేని।
శివునిగూర్చిన సభజేయ సిగ్గుగాదె॥

గీ॥ స్థాణురూపంబు నికనైన దాల్చకుండ।
స్థాణురూపంబు తత్వంబు పరిగ్రహించి।
స్థాణుబూజించి సరియైన ధర్మమెఱిగి।
స్థాణురూపంబు నొందుడో శైవులార॥

ఇట్లు,

ఇవటూరి సానందరావు,

పత్రికా సంపాదకుడు.

---

శ్రీ శివాయగురవేనమః

## శైవమహాజనులారా!

పత్రికాధిపతిగారు ప్రకటించిన వితంతు వివాహమునకు హాజరైన సభ్యులను బట్టిజూడ శైవమహాసభకు నుపసంఘముగానున్న యువజన సంఘమువారే యీ వివాహమునకు కారకులని స్పష్టమగుచున్నది. లోగడ 20 వ మహాసభ బెజవాడలో జరిగినప్పుడు, వీరు విధవావివాహమును గూర్చియు, మరికొన్ని యితర యంశములను

గూర్చియు తీర్మానములు చేసియున్నారు. అప్పట్లో సభకు వచ్చిన వారిలో కొందరు సదరు తీర్మానములను తీవ్రముగా ఖండించుటచేత యువజన సంఘమువారు చేయునది యేమియులేక నూరకుండిరి కాని యువజన సంఘములోని శిఖామణులు కొందరు పూర్తియైన యావేశముకలిగి శైవమహాసభయొక్క అంతుకనుగొనవలెనని శపథము చేసినట్లు తెలియవచ్చినది. అప్పటినుండి రహస్యముగా వారే తం టాలుపడుచుండిరేగాని, 21 వ మహాసభలోకూడా వారు తటస్థము గానే యూరకుండిరి. ఇంతకు పూర్వమువరకు కార్యరూపమునయెట్టి యవైదిక కార్యములను జరిపియుండలేదు.

ఇట్లుండగా దైవికముగా నొక బాలవితంతువేర్పడుట జరిగి నది. ఈ యవకాశమును వినియోగపర్చుకొనవలెనని నాటి యువకు లందరు వారిలో వారు తగు ప్రచారము జరుపుకొని వితంతువు నుద్ధ రింపవలెనను నెపముతో యీ వితంతు వివాహమును జరిగించినారు.

కామాదిబాధలకు లోనగుదురనిగాని, యితర మతములలో నున్న సంఘ సంస్కారుల సహవాసదోషమునగాని యిట్టిది మన సం ఘమునగూడ నేడు జరిగినది. ఈ సంఘమునే జరిగిన మొదటివివాహ మిదియే.

ఇతర సంఘములలో వితంతు వివాహములు జరిగించుకున్న వారు సంఘముయొక్క ఆమోదమును పొందజాలక, తాము వేరు గానే నుంటూవున్నారు. వారలాదోషమును సంఘమునందు కలుప ప్రయత్నించినను నది నేటివరకును కలియుటలేదు.

ఈ వితంతువివాహ నిర్వాహకులు, మనసాంఘికులెల్ల వారి కార్యమునకు నామోదమును జూపినట్లు, యితరమతస్థు లనుకొను లాగున పత్రికలలో ప్రకటనలనుగూడ చేసికొనినట్లు కనుబడుచున్నది.

ఈ యువజనసంఘమువారి కోరికపైన మహాసభకు నుపసం ఘముగా నంగీకరింపబడుట తటస్థించినదిగాని, యీ వివాహ విష యమై, మహాసభవారికి తెలియజేయుటగాని, మహాసభవారు ఆమో

దించుటగాని జరిగియుండలేదు. మహాసభవారు ఆమోదింపరనే నిశ్చయముతో అకస్మాత్తుగా యీ వివాహము జరిగించినారు.

శాస్త్రజ్ఞానములేని యువకులుతప్పుజేయుటలో వింతయేమియు లేదుగాని శివపూజాధురంధరులు, కర్షణాది ప్రతిష్ఠాంత యజనాధికారులగు, మల్లంపల్లి మృత్యుంజయుడు అయ్యావార్లగారు ఆగమ విశారద శ్రీపతి పండితారాధ్యుల పట్టసలింగారాధ్యులు మున్నగువారుగూడ బాల్గొనినట్లు పత్రికాధిపతిగారు వ్రాసిన వ్యాసమువల్ల తెలియుచున్నది. అది కడుంగడు శోచనీయము.

ఒకచోట అనలము కలిగినప్పుడు అది సర్వత్రవ్యాపించుటకు నవకాశముకలదు. అట్లే యీ యనలము, సంఘమునందు వ్యాపించకుండ సంఘమువారు పూర్వముకంటె కడుజాగరూకతతో మెలంగుదురుగాక. అప్పుడుగాని తప్పుజేసినవారు తమ తప్పును దెలిసికొని పశ్చాత్తాపపడరు. అప్పుడే సంఘమునకు కీడుతొలగిపోవును. గనుక పాపకార్యమునకు నేమాత్రము సందువదలినను సమస్త సాంఘిక మర్యాదలు నశించును. ప్రస్తుత వివాహము కొలదియువకులప్రోత్సాహమువల్ల జరిగియున్నదిగాని, సంఘామోదము నెంతమాత్రము బడసియుండలేదని ఘంటాఘోషముగ రుజువుచేయుటయే మహాసభవారి కర్తవ్యము.

మహాసభవారీ విషయమున జాగరూకత వహించనియెడల, శైవసాంఘికులు, పంచమ షష్టమజాతులకంటె క్రిందమెట్టులోబడి సప్తమజాతివారుగా పరిగణింపబడక తప్పదు.

ఇతరజాతులవారికి బ్రాహ్మణ ద్వేషమున్నదని మనమెంత యనుకొన్నను, వారివల్ల మనకు సాంఘికముగా కలిగిన ద్రోహమేమియులేదు. మనలోనివారే, మన సంఘమునకు అపకీర్తికరములగు నిట్టి సంస్కరణములను దెచ్చిపెట్టి ద్రోహమొనరించు చున్నారు. అనగా సంఘమునకు తీరరాని నష్టమును కలుగజేసి మూలచ్ఛేదమును జేయ తలపెట్టినారు. ఈ విషయమున శైవమహాసభవారు జాగరూకులై యుండవలెను.

తప్పుజేసినవారిని నిందించిన ప్రయోజనములేదు. తప్పులు జేయువారనేకులుందురు. వారలనుజూచి, తప్పుజేయ కూడదనెడు పాఠమును నేర్చుకొనుటయే బుద్ధిమంతుని లక్షణము.

N. B:— శైవమహాసభను నెప్పటియట్లు ధర్మపద్ధతిని నడిపించు టయో? అధర్మ పద్ధతిలో నడవవలసి వచ్చేయెడల అంత రింపజేయుటయో తేలవలసిన క్లిష్టపరిస్థితులేర్పడినవిగనుక శైవమహాజనులు తటస్థభావమును విడనాడి సభనాటికెన్ని పనులున్నను కట్టిబెట్టి ధర్మస్థాపనార్థమై తప్పక సభకు దయచేసి సభకు దిగ్విజయము గావించి శివకల్యాణము గావింతురని ప్రార్థన. దయచేసి యిందుకు తప్పవద్దు.

ఇట్లు,

శివలెంక లింగయ్య.

పరిచారక కార్యదర్శి.

---

# ఆ హ్వా న ము.

స్వస్తిశ్రీ చాంద్రమాన ప్రమాధి సం॥ వైశాఖ శు॥ ౧౩, ౧౪, ౧౫ లకు సరియైన, మే 1, 2, 3 తేదీలగు సోమ, మంగళ, బుధ వారములయందు 22 వ శైవమహాసభ తణుకు తాలూకా కొత్తపల్లి యందు జరుపుటకు, తిరిగి నిశ్చయింపబడినదిగాన, శైవమహాజను లెల్లరు దయచేసి సభను దిగ్విజయముగా జరుపగోరెదను.

ఇట్లు,

ప్రచారక కార్యదర్శి.

శ్రీ శివాయగురవేనమః.

# శైవమతప్రకాశిక.

## వేదవ్యాసునిమతము.

ముదిగొండ సుబ్రహ్మణ్యశాస్త్రి, తెనాలి.

శ్లో॥ ప్రభూతవిమతాంభోధి । కుంభసంభవవైభవాన్
శ్రీ శివాద్వైత సమయ । ప్రతిష్ఠార్థాప్తజన్మనః ॥౧॥
స్వమతఖ్యాపనోన్ముఖ్యా । ప్రఖ్యాతఖ్యాతి భూషితాన్
భరద్వాజర్షి గోత్రోద్భ । చోద్భటారాధ్య వంశజాన్ ॥౨॥
యోగనిష్ఠాగరిష్ఠాన్ శ్రీ । నాగలింగ సమాహ్వయాన్
మహాగురూన్నమస్యామి । సతతం సర్వవేదసః ॥3॥

ప్ర॥ లోకమునందు ప్రాచీనములు నవీనములు నగువనేకమతములు గలవుగదా! ప్రాచీనములగు మతములలో నేదిశ్రేష్ఠమైనది?

ఉ॥ శ్రీవేదవ్యాసమహర్షి యంగీకరించినదే సర్వోత్తమమైనది.

ప్ర॥ ఎందఱో మహామునులు, పురాణప్రసిద్ధు లుండగా వేదవ్యాసునిమతమే శ్రేష్ఠమనుట యెట్లు?

ఉ॥ మున్ను మునీశ్వరు లెందఱున్నను వేదములను విభాగించియు, పురాణములను సంగ్రహించియు, పంచమవేద మగు మహాభారతమునేగాక పరమపురుషార్థనిదాన మగు బ్రహ్మమీమాంసాశాస్త్రమును రచించి మానవులకు పరమోపకారమును గావించిన మహానుభావుఁ డొక్కఁడేగాన ఆయనయొప్పినదే సర్వమతోత్తమ మని యంగీకరింపకతీరదు,

ప్ర॥ అట్లైని శ్రీ వేదవ్యాసునిమత మేది?

ఉ॥ విశిష్టశివాద్వైతమే ఆయనమతము.

ప్ర॥ విశిష్టశివాద్వైత మాయనమతమని దేనినిబట్టి తెలియుచున్నది?

ఉ॥ శ్రీ నీలకంఠభాష్యమునుబట్టి తెలియును.

ప్ర॥ రామానుజ భాష్యమునుబట్టి విశిష్ట కేశవాద్వైతమే ఆయనమతమని తెలియుట లేదా?

ఉ॥ శివపారమ్యమునుమాత్రము వదలిపెట్టి, తక్కనీలకంఠ భాష్యార్థమునంతను తస్కరించి రచింపఁబడినదిగాన రామానుజ భాష్యములోని విశిష్ట కేశవాద్వైతము రామానుజుని మతమేగాని వేదవ్యాసునిమతమని యేర్పడదు.

ప్ర॥ రామానుజ భాష్యములోని విశిష్టాద్వైతము నీలకంఠ భాష్యమునుండి తస్కరింపఁబడినదనుట యెట్లు?

ఉ॥ రామానుజభాష్యమునందు నీలకంఠభాష్యములోని సిద్ధాన్తమంతయెగాక పెక్కనధికరణములలోని వాక్యార్థంబును నేకవిధముననే కనఁబడుచున్నకారణమున నాభాష్యకర్తలిద్దఱలోనొక్కఁడు విశిష్టాద్వైతసిద్ధాన్తకర్తయనియు వేరొక్కఁడు తస్కరణకర్తయనియు దెలియుచున్నది.

ప్ర॥ నీలకంఠుఁడే రామానుజభాష్యమునుండి సిద్ధాన్తము మొదలైన వానిని తస్కరించియుండఁగూడదా?

ఉ॥ నీలకంఠునికన్న రామానుజుఁడే ప్రాచీనుఁడై యుండెనేని అట్లే భావింపవలసియుండును. అట్లుగాక రామానుజాచార్యునికంటె ప్రాచీనుఁడైన శంకరాచార్యునికంటెను గూడ నీలకంఠుఁడు ప్రాచీనుడనుట ప్రమాణసిద్ధమైయుండగా అర్వాచీన మైనరామానుజభాష్యార్థమును రామానుజునికన్నపరమప్రాచీనుఁ డైనసీలకంఠుఁడు తస్కరించుట అసంభవముగాన నట్లుభావింపవలనుపడదు.

ప్ర॥ నీలకంఠుఁడు శంకరాచార్యునికంటెనుగూడ ప్రాచీనుఁడనుట యెట్లు?

ఉ॥ శంకరాచార్యుఁడు దిగ్విజయముసేయుకాలమునందు శైవభాష్యకర్త యగునీలకంఠునితో వివాదము జరిపినట్లు శంకర విజయమున నున్నకారణమున నీలకంఠుఁడు శంకరాచార్యునికన్న ప్రాచీనుఁడని యేర్పడుచున్నది.

ప్ర॥ దానింబట్టి నీలకంఠుఁడు శంకరాచార్యునకు సమకాలికుఁడనియేర్పడునుగాని ప్రాచీనుఁడని యెట్లు లేర్పడును?

ఉ॥ నీలకంఠుఁడు శంకరాచార్యునకు సమకాలికుఁడైనను రామానుజునికంటె ప్రాచీనుఁడనుట నిర్బాధముగాన నీలకంఠుఁడు రామానుజభాష్యార్థమును గ్రహించుట యసంభవమనియు రామానుజుఁడే తస్కరణకర్తయనుట నిజమనియు విశదమగుచున్నది.

ప్ర॥ నీలకంఠుఁడు శంకరాచార్యునకు సమకాలికుఁడా? ప్రాచీనుఁడా? ఇందు నిజమేమి?

ఉ॥ నీలకంఠుఁడు శంకరాచార్యునకు సమకాలికుఁడనియే శంకరవిజయముననున్నను భాష్యకర్త లిద్దఱు నొకప్పుడే యవతరించి యుండుట యసంభావితముగానను, శంకరాచార్యుని విజయము సమర్థించుటకై శంకరాచార్యునికంటె ప్రాచీనులగు భట్టభాస్కరాదుల ననేకులను శంకరునితో వాదించి పరాజయము నొందినట్లు లందు వ్రాయఁబడియున్నకారణమునను నీలకంఠభాష్యములోని "వ్యాస సూత్రమిదంనేత్రం" అను శ్లోకవ్యాఖ్యానమునందు శివార్కమణి దీపికయందు నీలకంఠుఁడు శంకరాచార్యాదులకంటె పరమప్రాచీనుడని శ్రీమదప్పయదీక్షితులవారు నిరూపించియున్నకారణమునను, శంకర భాష్యమునందు సవిశేషవాదనిరాకరణఘట్టములయందు పెక్కునధికరణములలో నీలకంఠభాష్యార్థ మనువాదింపఁబడియున్నకారణమునను నీలకంఠుఁడు శంకరాచార్యాదులకంటెను పరమప్రాచీనుఁడని నిర్ణయ మగుచున్నది.

ప్ర॥ వ్యాససూత్రమిదంనేత్రం అనుశ్లోకమునందు, 'పూర్వాచార్యైః కలుషితం' అనువాక్యమునుబట్టి శంకరాచార్యాదులే నీలకంఠునికన్న బూర్వికులని యేర్పడుటలేదా ?

ఉ॥ అచ్చట పూర్వాచార్యులనగా శంకరాచార్యాదులు గావించిన కేవలాద్వైతాదిసిద్ధాన్తములకు మూలభూతులగు బాదరి, విఖనసుఁడు మున్నగువారలేయని యర్థమని యప్పయదీక్షితులవారు శివార్కమణిదీపికయందు నిర్ణయించియున్నకారణమున శంకరాచార్యాదులకన్న నీలకంఠుఁడే పరమప్రాచీనుఁడని స్పష్టమగుచున్నది.

ప్ర॥ దుష్పథగ్రంథము 4 పేజీ 'యదిశంకరాచార్యాదకాలికః తదాశంకరవిజయాప్రామాణ్యాతా యదితత్కాలికోహిస్యాత్తదాఽస్మత్పక్షఏవ సమాశ్రయణీయోభవతీతి అనేనశంకరాచార్యాదతిప్రాచీనోఽయం నీలకంఠఇతివాదో నిరస్తః॥" నీలకంఠుఁడు శంకరాచార్యునికంటె ప్రాచీనుఁడగునేని అప్పుడు శంకరవిజయ మప్రమాణమగును. సమకాలికుఁడయ్యెనేని మాపక్షమే ఆశ్రయింపవలయు. దీనింబట్టి నీలకంఠుఁడు శంకరాచార్యునికంటె నతిప్రాచీనుఁడను వాదము నిరస్తమైనది యని దుష్పథప్రతిపేధమున గలదు ? దీనికేమి సమాధానము ?

ఉ॥ శంకరవిజయమునకు నప్రామాణ్యము వచ్చినచో నిష్టాపత్తియేగాన నీలకంఠుఁడు శంకరునికంటె బ్రాచీనుఁడనుట నిర్బాధమే యగు. గాని వంద్లికిలించుటయగాక తగుకారణ మేమియు నుడువజాలకయే ఎదిరివాదము నిరసింపఁబడియెనని మాత్రము వ్రాయసాహసించుటంబట్టి గ్రంథకరణము హాస్యావహమనియే యేర్పడుచున్నది.

నీలకంఠుఁడు శంకరాచార్యునికంటె ప్రాచీనుఁడనుటకు ననేక కారణములను దెలిపియుంటిమి. ప్రతిపక్షులీయంశమును నిరసింపకజాలకయు నంగీకరింపనోపకున్నఁబోనిందు వివుచుచుము. నీలకంఠుడు శంకరునికన్నప్రాచీనుఁడుగాక శంకరునకు సమకాలమువాఁడే యగుగాక

అట్లయిన నాయన రామానుజునికన్న ప్రాచీనుఁడగుట నిర్వివాదమే గదా? అట్లుగాకనీలకంఠుఁడు రామానుజునికన్న నర్వాచీనుఁడనుటకు గారణమేదైనజెప్పియుండిరా? లేదు. దీనింబట్టిప్రాచీనుడు సిద్ధాంతకర్తయు అర్వాచీనుఁడే తస్కరణకర్తయుగావలయుగాన అర్వాచీనుఁడగుతమ యాచార్యునితస్కరణకర్తృత్వమవార్యముగాన తమచే నంగీకృతమని సిద్ధాంతముగావింపనే దుష్పథగ్రంథకర్త పరివర్తించెనని యేర్పడినది

ప్ర॥ టంకద్రమిడాచార్యులున్నగువా రెండటో ప్రాచీనులు విశిష్టాద్వైతసిద్ధాంత స్థాపకులుండఁగా నీలకంఠుఁడే విశిష్టాద్వైత సిద్ధాంతమునకు మూలాచార్యుఁ డనుట యెట్లు?

ఉ॥ టంకద్రమిడనాథమునిప్రభృతులు ద్రావిడభాష్యకర్తలు మాత్ర మగుటను నీలకంఠుఁడుమాత్రమే బ్రహ్మసూత్రములకు విశిష్టాద్వైతపరభాష్యకర్తయైయుండుటంజేసి రామానుజకృతసూత్రభాష్యార్థము తత్ప్రాచీను డగునీలకంఠాచార్యునిభాష్యమునుండియే సంగృహీత మగుట నిస్సంశయము.

ప్ర॥ దుష్పథపరిశీపేథము 9 పుట 'యదిరామానుజాచార్యో నీలకంఠభాష్యస్థసవిశేషవాద మచోరయిష్యత్ తదా నీలకంఠభాష్యే సవిశేషవాదఏవ నాఽభవిష్యత్॥ రామానుజాచార్యుఁడు నీలకంఠ భాష్యములోనిసవిశేషవాదమును దొంగిలించియుండెనేని నీలకంఠ భాష్యమునందు సవిశేషవాదము లేకపోవలయు. అది యందుఁగన బడుచున్నదిగాన రామానుజాచార్యుఁడు చోరుఁడెట్లగును? అని రామానుజాచార్యుడు నీలకంఠభాష్యములోని సవిశేషవాదమును తస్కరింపలే దనుటకు గారణము చెప్పబడియెను. దీనికేమి సమాధానము?

ఉ॥ ఈ కాశయుక్తి గ్రంథకర్త దగు నవివేకమును వెల్లడింప జాలునుగాని రామానుజుని చౌర్యమును వారింపఁజాలదు.

ప్ర॥ అదియెట్లు.

ఉ॥ తస్కరింపఁబడు వస్తువు చెంబో తప్పెలో అగునేని అది దొంగిలింపఁబడినతరువాత సొంతకానివద్ద లేకపోవును. అట్టిదిగాక

యిది గ్రాంథికవిషయమగుటంజేసి పరులచే తస్కరింపబడియు పూర్వ గ్రంథమునఁ గన్పట్టకపోదని యెల్లరకుఁ దెలిసియుండగా నిట్టి యసంబద్ధప్రలాపములతో గ్రంథము నింపుట బలరామానుజ సేవాఫలమే యగును.

ప్ర॥ దుష్పథప్రతిషేధము 5 పుట, 'శ్రీకంఠీయ మహాహర న్నిత్యర్థోపి నసాధీయాన్ అనాఘ్రాతవ్యాకరణగంధవతాహ్యస్యపరోక్తార్థానుసంధానస్యాఽనముచితత్వాత్ ॥నచ॥ సూ॥ తేన ప్రోక్తమిత్యాదినా. సూ॥ వృద్ధాచ్ఛః॥ ఇతిసూత్రేణ శ్రీకంఠీయ మిత్యస్మదభిలషితోదయఇతివాచ్యం। తతశ్చ శ్రీకంఠాచార్యప్రోక్తం భాష్యమిత్యేవ లభ్యతే. నతు సవిశేషవాదః పాణినీయమిత్యాదా వ్యాకరణాదివత్ సవిశేషవాదస్య శ్రౌతవిషయత్వాత్॥ సవిశేషవాద ముఃశ్రుతిసిద్ధముగాన శ్రీకంఠీయము నీలకంఠభాష్యమేయగుగాని సవిశేషవాదము గానేరదని యధిక్షేపించియుండెను. దీనికేమి సమాధానము ?

ఉ॥ సవిశేషవాదము శ్రుతిసిద్ధమే యయినను నదియే శ్రుతిసమ్మతముగాని తక్కుమతములు గావని నిరూపించి మొదట శంకరాచార్యాదులకంటె బ్రహ్మసూత్రభాష్యము రచించిన ప్రథమాచార్యుఁడు శ్రీకంఠుఁడే యగుటంజేసి సవిశేషవాదము శ్రీకంఠీయ మగుటకు సందియము లేదు. వృద్ధాచ్ఛః అనుసూత్రములోని పదములు జాత్యైకవచనములుగాన నాగ్రంథకారునకు, నీవిధమగు దుష్ప్రలాపమూలమున ఛలు, బహుమానములుగా లభించియుండవలయును.

ప్ర॥ శ్రీకంఠీయమనుపద మెట్లుసాధువగును ?

ఉ॥ వానామధేయస్య వృద్ధసంజ్ఞా వక్తవ్యా అనువార్తికము వలన నాపదము సాధువేయగుట వైయాకరణులకే తెలియునుగాని శబ్దేందుశేఖరదర్శనము నోల్లమి సిద్ధాన్తకౌముదీపరిచయము లేక కేవల కృష్ణపక్షాన్ధకారవర్తి యగువానికి సాధ్వసాధువివేక మెట్లుగలుగు !

ప్ర॥ దుష్పదప్రతిషేధము 2 వ పుట, 'శంకరాచార్యేణ కృతవాదః స్వభాష్యత్యాగపూర్వకం పరాజిత ఇత్యస్య ప్రమాణం। "విసృజ్యచ స్వభాష్యం శరణంప్రతిపేదివా న్మహర్షిం!" ఇత్యాదికం॥ అనేనాపిప్రమాణేన శ్రీమచ్ఛంకరగురుఖండితం భాష్యం చోరయన్ సవిశేషవాదం రామానుజోయం స్వభాష్యే స్థాపయ దిత్యుక్తిస్తు సుతరాం నసంగచ్ఛతే॥ "నీలకంఠుఁడు శంకరాచార్యునితో వాదించి యోడిపోయి తనభాష్యమును వదిలిపెట్టి శంకరాచార్యుని శరణుజొచ్చెనని శంకరవిజయమునఁ గలదు. ఇట్లు శంకరాచార్యుని వలన పరాజయమునొంది నీలకంఠుఁడు తనభాష్యమును తానే వదిలి పెట్టియుండఁగా నట్టిభాష్యములోని సవిశేషవాదమును రామానుజుఁ డెట్లు తస్కరించునని వ్రాసినదాని కేమిసమాధానము ?

ఉ॥ అప్పయ దీక్షితునిచరిత్రమునందు, అప్పయదీక్షితుఁడు రామానుజశృంగభంగ మనుగ్రంథము చేసినట్లు గలదు. అట్లు అప్ప యదీక్షితునివలన శృంగభంగము నొందినరామానుజునిభాష్యమును మీరెట్లు స్వీకరించుచున్నారో ఆవిధముననే నీలకంఠభాష్యములోని సవిశేషవాదమును రామానుజుఁడు స్వీకరించెనని సమాధానము చెప్పుడు.

ప్ర॥ అప్పయదీక్షితునిచరిత్రమునం దాయనపాండిత్య విశే షము నుగ్గడించుటకే రామానుజశృంగభంగము గావించినట్లున్నను దానింబట్టి రామానుజుఁ డప్పయదీక్షితునికంటె ప్రాచీనుఁడని యేర్ప డునుగాని రామానుజుఁ డప్పదీక్షితునివలన శృంగభంగము నొంది నట్లు ధ్రువపడునా ?

ఉ॥ అని యడుగుదురేని శంకరవిజయములోని నీలకంఠపరా జయముచుబట్టి నీలకంఠుఁడు శంకరాచార్యునికంటె ప్రాచీనుఁడనియే యేర్పడుగాని నీలకంఠుఁడు శంకరాచార్యునివలన పరాజయము నొం దెననుట ధ్రువము గాదనిచెప్పి వాగ్బంధము గావింపుఁడు.

ప్ర॥ భగవద్బోధాయనకృతాం విస్తీర్ణాంవృత్తిం పూర్వాచార్యాస్సంచిక్షిపుః । తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాయన్తే॥ పూర్వాచార్య్యులు బోధాయనమునికృతమగు సూత్రవృత్తిని నిరాకరించిరిగాన మేము బోధాయన వృత్తినిబట్టి సూత్రములు వివరింతుమని రామానుజాచార్యుండు చెప్పియుండెను. దీనింబట్టి రామానుజుండు బోధాయనవృత్తినిబట్టియే భాష్యము రచించెగాని నీలకంఠ భాష్యమునుబట్టిగాదని తెలియుట లేదా?

ఉ॥ రామానుజుండు బోధాయనవృత్తినిబట్టియే భాష్యము రచించెనని యొప్పినపక్షమునను నాయనయందు తస్కరణకర్తృత్వము ధ్రువపడునేగాని నివారింపఁబడదు.

ప్ర॥ అది యెట్లు?

ఉ॥ బోధాయనుండు మహాన్యాసాదికృతులవలన మహాశైవుడనుట సుప్రసిద్ధమగుటంజేసి సవిశేషవాదప్రతిపాదకమగునాయన సూత్రవృత్తి శివపారమ్యపరముగానే యుండుట సంభావితముగాన తదీయమగు సూత్రవృత్తిలోనిశివపారమ్యమును వెలిబుచ్చక సవిశేషవాదమునుమాత్రము సంగ్రహించుటంబట్టి యప్పుడును నప్పురుషునియందు పూర్వగ్రంథములలోని శివపారమ్యమును మాటి సవిశేషవాదమును మాత్రము సంగ్రహించు దోషము స్థిరపడుచునే యున్నది.

ప్ర॥ బోధాయనమహర్షి మహాశైవుఁడనుటకు నేమినిదర్శనములు గలవు?

ఉ॥ మహాన్యాసాదులు చాలవా?

ప్ర॥ అంతకన్న నేమియు లేవా?

ఉ॥ లేకేమి రుద్రయాగమునకుఁ గల్పమునుగూడ రచించియున్నాఁడు. దీనింబట్టియు నామహాముని శైవుఁడనియే యేర్పడును.

ప్ర॥ బోధాయనుఁడు విష్ణుయాగమునకుఁ గల్పమురచింప లేదా ?

ఉ॥ లేదు.

ప్ర॥ మఱి యెవ్వరు వ్రాసిరి ?

ఉ॥ విఖనుఁడు వ్రాసెను.

ప్ర॥ బోధాయనుడేల వ్రాయలేదు ?

ఉ॥ విష్ణుపారమ్యము పాంచరాత్రముననేగాక వేదమునందు లేమింజేసి.

ప్ర॥ విష్ణుపారమ్యము వేదమున లేదనుట యెట్లు ?

ఉ॥ విష్ణుపారమ్యబోధకము లగుమంత్రములు వేదమునందు లేవుగాన.

ప్ర॥ అటులేని విఖననునకువిష్ణుయాగమును రచింప మంత్రము లెట్లు దొరకెను?

ఉ॥ వేదమునందు పారమ్యమును జెప్పునవి లేమిచే విష్ణునామముగలవానినిమాత్రిమే వెదకి యందుఁ జేర్చెను.

ప్ర॥ యీసంగతి దేనినిబట్టి తెలియుచున్నది?

ఉ॥ విష్ణుయాగకల్పమునందు శ్రు॥ కిమిత్తే విష్ణో సుమతింభజామహే యదన్యరూప స్సమిథే బభూవ॥ ఓ విష్ణూ! మారువేషముదాల్చి యుద్ధమున నిలిచితివిగాననీబుద్ధికౌశలమునేమనియెన్నుదుము అని యర్థము. ఈమంత్రిము వసిష్ఠునివాక్యము. ఇందొకయితిహాసము గలదు. ఏమనిన పూర్వకాలమున వసిష్ఠునిశిష్యుఁడు శివభక్తుఁడునగునొకరక్కసుడుండెను. మహావిష్ణువారక్కసునివలన బలుమారు పరాజయమునొంది నిజరూపమున వానినిజయింప నలవిగాదని నిశ్చయించి శివరూపముదాల్చి వానియొద్దకు యుద్ధమునకుంబోయెను. అంత బుద్ధిహీనుఁ డగునారక్కసుఁడు శివరూపధరుఁ డగువిష్ణుని గని

శివుఁడేయని భ్రమించి పరమేశ్వరుని గొట్టుట ద్రోహమని యప్పని కొల్లక తానంతన ప్రాణముల విడిచెను. ఆసంగతి తెలిసికొని విష్ణునొద్దకు వచ్చి వసిష్ఠముని నారాయణుని నీతీరున నెత్తిపొడిచెను. ఇట్లు నిందాస్తుతిరూప మగుమంత్రముమాత్రము గ్రహించుటనే విష్ణుపారమ్యప్రతిపాదకము లగుమంత్రములు వేదమునందు లేవని ధ్రువపడుచున్నది. ఆకారణముననే పాంచరాత్రములు, వైఖానసములు నగుతంత్రములయందు మహావిష్ణుని పూజాదిసంస్కారములయందు కిమిత్తేవిష్ణో అనుమంత్రముమాత్రమే గ్రహింపఁబడినది.

ప్ర॥ వ్యాసపథములోని రామానుజపథ ప్రతిషేధమునందు బోధాయనుఁడు మహాశైవుఁడనుటకు విఖనసుఁడే వైష్ణవుడనుటకును నీమంత్ర ముదాహరింపఁబడియెఁగదా? దుష్పథప్రతిషేధ గ్రంథకర్త దీనికేమిసమాధానము వ్రాసెను?

ఉ॥ కడమకొన్నియెడల నవ్యక్తముగా గొణిగెగాని యీవిషయముచూడగనె నోరాడక యూరకుండెను.

ప్ర॥ ఆతనికిఁదోపకున్నఁబోనిండు. ఆగ్రంథకర్తకు ప్రేరకుఁడగు గురువుగాని యాగ్రంథమునకు నామోదమును దెలిపినవారైన నేదేని వ్రాసిరా?

ఉ॥ వారందఱును తమకన్నులకు కనఁబడనట్లు నటించి యాంధ్యమునె సాటిరి.

ప్ర॥ రామానుజమతము వ్యాససమ్మతము గాదనుటకు నింకేదేనిఁ గారణము గలదా?

ఉ॥ బ్రహ్మసూత్రములు వేదవ్యాసకృతము లనుట నిర్వివాదముగాన రామానుజమతము బ్రహ్మసూత్రవిరుద్ధ మగుటకంటె నేమి కావలయు.

ప్ర॥ అది యెట్లు?

ఉ॥ సూ॥ శబ్దాదేవ ప్రమితః॥ ఈశానశబ్దమువల్లనే అంగుష్ఠమాత్రపురుషుఁడు పరంబ్రహ్మయని నిర్ణయ మగుచున్నదనియర్థము.

ఇట్లు పరబ్రహ్మ ఈశానశబ్దవాచ్యుఁడని యుండుటంబట్టి ఈశానశబ్ద వాచ్యుఁడు శివుఁడేగానశివుడేపరబ్రహ్మయని రాద్ధాన్తము చేయబడి యున్నది. దీనింబట్టి నారాయణుఁడే పరంబ్రహ్మ యనురామానుజుని మతము బ్రహ్మసూత్రవిరుద్ధ మనిసిద్ధము.

ప్ర॥ ఈశానపదము ఐశ్వర్యగుణయోగముచే నారాయణు నేలచెప్పఁజాలదు?

ఉ॥ యోగశక్తి రూఢశక్తి యనురెండిటిచే శివుని జెప్పు పద మును యోగశక్తియొక్కదానిచే నారాయణపరముగా గ్రహించు నెడ కమలమునుజెప్పునట్టి పంకజపదమును బురదలోఁబుట్టిన దనుయోగ శక్తిచే నత్తగుల్లపరముగా గ్రహించినట్లేగాన నాయర్థము శాస్త్ర మునకు లోకమునకునుగూడ సమ్మతము గానేరదు.

ప్ర॥ శబ్దాదేవ అను సూత్రావయవమునకు శ్రు॥ ఈశానో భూతభవ్యస్యేతిశబ్దాదేవ= ఈశానోభూతభవ్యస్యఅను శ్రుతివాక్యము వలన అనిరామానుజాచార్యుఁ డర్థము వ్రాసెను. ఇదియేల యుక్త ముగాదు?

ఉ॥ శబ్దాత్ అనుపదమునకు ఈశానశబ్దమునందే సూత్రకారుని తాత్పర్య ముండియున్నను నిజమైనయీయర్థమును గ్రహించునెడ శివుఁడే పరబ్రహ్మయని నిర్ణయ మగుటంజేసి నారాయణుఁడే పర బ్రహ్మయను తనకోరింపఁగూడదని గ్రహించి రామానుజుఁడు తప్పు నర్థమునే వ్రాసియుండెను.

ప్ర॥ శబ్దాత్ అనుపదమునకు రామానుజుఁడు వ్రాసినయర్థము తప్పనుట యెట్లు?

ఉ॥ శ్రుతిలింగవాక్య ప్రకరణస్థాన అనుజైమిని సూత్రము నందు శ్రుతి, లింగము, వాక్యము మున్నగువానిలో మొదటివే ముఖ్యములని నిర్ణయింపఁబడియున్నది. దీనింబట్టి యన్నిటిలో ప్రబల మైన యభిధానశ్రుతి యగు నీశానశబ్దమునుబట్టి యర్థనిర్ణయమున్యా య్యముఅట్లుండఁగా ఈశానోభూతభవ్యస్య అనుదుర్బలమైనవాక్యపర

ముగా గ్రహించుట యన్యాయముగాన శబ్దపదమును వాక్యపర ముగా గ్రహించుట తప్పేయని యొప్పక తప్పదు.

ప్ర॥ శబ్దాత్ అనుపదమును శ్రుతివాక్యపరముగా గ్రహించిన దాన నేమిలోపము?

ఉ॥ శ్రుతిలింగవాక్యములలో ప్రబలమైన యభిధాన శ్రుతి పరముగా గ్రహింపక జఘన్యమైనవాక్యపరముగా గ్రహించుటం బట్టి తమమతము జఘన్యమేయని యేర్పడును. అదివారికి సమ్మత మైనచోఁ బోనిండు.

ఇట్లు శబ్దాత్ అనుపదమేగాక యీ యధికరణములోని ఏవ అనుపదంబును రామానుజునిమతమునఁ గుదరనేరదు.

ప్ర॥ అదియేల?

ఉ॥ ఈశానోభూతభవ్యస్య అనువాక్యముచేఁ జెప్పఁబడుభూత భవ్యేశితృత్వరూప మగులింగమువలన అంగుష్ఠమాత్ర పురుషుఁడు జీవుఁడుగాఁడు. పరబ్రహ్మమేయని యేర్పడునని యేల గ్రహింపరా దని శంకించికొని వాక్యముదగునర్థము తెలిసినతరువాత నుపస్థితమగు లింగముదాక నిరీక్షింపనేల? శబ్దాదేవ=ఈశానయనుశబ్దము వినంబడ గనే అంగుష్ఠమాత్రపురుషుఁడు పరబ్రహ్మమేయని యేర్పడునని సూత్రకారుఁడు ఏవఅనుపదమును జేర్చెను. దీనింబట్టి సూ॥ నిరపేక్షో రవః శ్రుతిః అనుజైమిని సూత్రమునుబట్టి ప్రమితాధికరణములోని శబ్దాత్ అనుపదము అభిధాన శ్రుతిపరమే గావలయునుగాని శబ్ద ప్రమాణపరముగా గ్రహించి శ్రుతివాక్యమువలన ననిచెప్పినయర్థ మనర్థమే గాకమానదు. ఇట్లు ప్రకృతమున సూత్రకారుఁడు ప్రబ లమైన యీశానయనునభిధాన శ్రుతినిబట్టియే మంత్రార్థనిర్ణయ మగుగాన శ్రుతికన్న నధమమైనలింగమును గ్రహింపఁగూడదని ఏవ అనుపదముచే స్పష్టీకరించియుండఁగా లింగముకంటెఁగూడనధమమైన శ్రుతివాక్యపరముగా గ్రహించుటవలన రామానుజ మతమునందు

ప్రమితాధికరణములోని శబ్దాత్, ఏవ అను రెండుపదములు నసంగతములే యగునని బ్రహ్మపథగ్రంథకారులు రామానుజపథప్రతిషేధమునందు తెలిపియుండిరి. ఈవిమర్శనమువలన అభిధానశ్రుతి యన్నిటిలో ముఖ్యముగాన దానింబట్టి బ్రహ్మనిర్ణయము గావించిన శ్రీకంఠమతము ముఖ్యమనియు, శ్రుతికన్న నధమము లింగము. దానికంటెను నధమ మగుట నభిధానశ్రుతికన్న నధమాధమ మైనవాక్యమునుబట్టి నిర్ణయము గావించికొనిన రామానుజమతము అధమాధమమనియు నేర్పడెను.

ఇక్కడ శబ్దాత్ అనుపదమును అభిధానశ్రుతిపరముగా గ్రహించునెడ ఈశానపదము శివునియందే యోగరూఢముగాన న్యాయ్యమగుమార్గము వదలిపెట్టవలసివచ్చుటచే తప్పుదారినిబడి శబ్దాత్ అనుపదమును శబ్దప్రమాణపరముగా గ్రహించి ఏవ అనుపదమునకు సార్థక్యమును నిరూపింపజాలక తమ భాష్యకారుడు వ్యాఖ్యాతయగు శ్రుతప్రకాశికా కారుఁడునుకన్నములో తేలుకుట్టిన వారివలె నోరుమూసికొని దాటిపోయియుండగా ప్రమితాధికరణములోనిపదములు వైష్ణవ పక్షమునందు సార్థకములని నిరూపింప నెవ్వనికలవియగును.

ఇప్పుడుగాదు నూరేండ్లకు లేక వేయిజన్మములకైనను నిది తప్పుగాదని నిరూపింప దుష్పథగ్రంథకర్తకేగాక వానిగురువులకును శక్యముగాదనుట నిజము.

ప్ర॥ బ్రహ్మసూత్రములలో నింకొకచోట నారాయణనామము గలదిపరబ్రహ్మమని లేదా?

ఉ॥ అట్లుండునెడ నేమును శిరసావహింతుము. అట్లు వేరొకచోలేక ప్రమితాధికరణమునమాత్రమే విశేషనామమగు ఈశానయను శివాభిధానశ్రుతివలన బ్రహ్మనిర్ణయము గావించియున్నకతన శివుఁడే పరబ్రహ్మమని బ్రహ్మసూత్రమువలన శిలాశాసనమయినది.

ప్ర॥ దుష్పథగ్రంథకర్త ఈశానపదమును విష్ణుపరముగా సాధింపలేదా?

ఉ॥ అదిసాధింపనెంచి పలుపాట్లు పడియెఁగాని వీనిమతకర్తకే యలవిగానిపని వీని కెట్లుశక్య మగును.

ప్ర॥ అదియేల?

ఉ॥ ఈశానశబ్దమును విష్ణుపరముగావింప తనకు శక్యమైయున్నయెడల రామానుజడు శబ్దాత్ అనుపదము నభిధానశ్రుతిపరముగానె గ్రహింపవలసినరాజమార్గమును వదలిపెట్టి శబ్దాత్—ఏవఅనుపదములకు సార్థక్యమునునుడుఁవజాలక మానముదాల్చి శబ్దప్రమాణపర మనుడిడ్డిదారి నేలబారిపోవును.

ఇట్లు తనమూలాచార్యుఁడే వదలిపెట్టిన యశక్యార్థమును సాధింపబూనుమందమతులకు నగుబాటుదనముకన్న లాభముఁడదు.

ప్ర॥ శబ్దాత్=అనుపదమును శబ్దప్రమాణపరముగా గ్రహించిఈశానోభూతభవ్యస్య అనుశ్రుతివాక్యమువలన అనిరామానుజుడు చెప్పియుండెను. ఇందుదోషమేమి?

ఉ॥ శాస్త్రవిరోధమే దోషము.

ప్ర॥ అది యెట్లు?

ఉ॥ పూర్వమీమాంస. శ్రుతిలింగవాక్యప్రకరణఅనుసూత్రమునందు శృతి, లింగము వాక్యముమొదలైనవి తాత్పర్యనిర్ణాయకములుగా గ్రహింపబడియెను. వీనిలో శ్రుతిఅనునది అభిధానశృతియే యగుగాని వేదమని యర్థముగాదు.

ప్ర॥ అచ్చట శ్రుతిపదమునకు వేదమనియర్థము గ్రహించిననేమిః?

ఉ॥ వానిలోనివాక్యఅనుపదము వేదవాక్యమునే తెలుపును గాన శ్రుతిఅనుపదమునకు నాయర్థము గ్రహించునెడ పునరుక్తి దోష

ము ప్రాప్తించుగావున నాయర్థము గ్రహింపఁగూడదు. ఇట్లుపూర్వ మీమాంసయందు అభిధానశ్రుతిమొదలైనవానినే తాత్పర్యనిర్ణాయకములుగా గ్రహించియున్నకారణమున నిచ్చట అభిధానశ్రుతిని గ్రహింపకుండుటవలన పరమతము శాస్త్రవిరుద్ధమని యేర్పడినది.

ప్ర॥ దుష్పథగ్రంథము 16 వ పుట. అత్రశంకరాచార్యోపి "పరమాత్మైవాంగుష్ఠమాత్రపరిమితో భవతి. కస్మాత్ శబ్దాత్ ఈశానో భూతభవ్యస్యేతి నహ్యన్యః పరమేశ్వరా ద్భూతభవ్యస్య నిరంకుశ మీశితా॥" అని శబ్దాత్ అనుపదమును ఈశానో భూతభవ్యస్య అను వాక్యపరముగానే గ్రహించెనని తమయాచార్యుఁడు చెప్పినదానికిఁ దోడుచూపింపఁబడియున్నది గాదా?

ఉ॥ దుష్పథ గ్రంథకర్త శంకరాచార్యులవారిని తమకు సాక్షిగా దీసికొనుట తమమతము నిర్మూల మగుటకేయగు.

ప్ర॥ అది యెట్లు?

ఉ॥ శంకరాచార్యులవారు ఇట్టిమూఢులెవ్వరేని తమవాక్యమునకు నపార్థము గ్రహింతురేమో యనియెంచి శబ్దాదేవేత్యభిధానశ్రుతేరేవేశానఇతి పరమేశ్వరోయంగమ్యత ఇత్యర్థః శబ్దాదేవ=ఈశాన అనునభిధానశ్రుతివల్లనే అంగుష్ఠమాత్రుఁడగు పురుషుఁడు పరమేశ్వరుఁడని యేర్పడుచున్నదని స్పష్టము చేసియుండిరి. ఇట్లు శంకరాచార్యులవారు వివరించిన చివరవాక్యముచు నుదాహరించునెడ తమమతము నిహతమగునని యెంచి యాది డాచి పూర్వవాక్యమును మాత్రము తమకు సాధకముగా గలదని వ్రాయుటంబట్టి యీదుష్పథగ్రంథకర్తదగు యోగ్యతయే వ్యక్త మగుచున్నది.

ప్ర॥ తరువాతివాక్యమునుదాచి పూర్వవాక్యమును మాత్రముదాహరింప నేమికారణము?

ఉ॥ పూర్వవాక్యముమాత్రము తమకు ననుకూలములాగునఁ దోచుచు దానియర్థమును స్పష్టీకరించినతరువాతివాక్యము

తమమతమును హతముచేయుచుండుటయే యగు ఇట్లుగానిమెడ పై వాక్యమునొద్ద నాగ్రంధకర్తకు గన్నులుమూతపడుటనో లేనియెడ బాధకగ్రంధమునుమాటి సాధకగ్రంధమును మాత్రము గ్రహించుచౌర్యము తమయాచార్యునియొద్ద నుంచి వచ్చినదేగాన తమ మతాచారమనియో భావింపవలసియుండును. ఇట్లు విశేషశబ్దముచే బ్రహ్మనిర్ణయము చేయుప్రమితాధికరణమున నీశానశబ్దాభిధేయుండగుశివుడే పరబ్రహ్మమనినిర్ణయింపఁబడుటను నింకనెందును విశేషశబ్దముచే బ్రహ్మనిర్ణయములేమిని నారాయణుఁడే పరబ్రహ్మ యనురామానుజమతము బ్రహ్మసూత్రవిరుద్ధమని సిద్ధము.

ప్ర॥ లింగమువలనబ్రహ్మనిర్ణయము గావించినయధికరణముల వల్లనైన నారాయణుఁడు పరబ్రహ్మ మనియేర్పడదా?

ఉ॥ అదియుహుళక్కియే!

ప్ర॥ అది యెట్లు?

ఉ॥ సూ॥ లింగభూయస్త్వాత్ అనునధికరణమునందు నీలకంఠభాష్యమున నాయాలింగములకు సంబంధించినవాక్యబాహుళ్యమువలన సర్వవేదోపాస్యత్వము శివునకు సమర్థింపఁబడియెను. రామానుజభాష్యమునన్నైననో ఆవిధమున సమర్థింప నలవిగామింజేసి అత్రలింగశబ్ద శ్చిహ్న పర్యాయః॥ ఇచ్చట లింగశబ్దము చిహ్నపరము అనిచెప్పి తప్పకొని పోఁబడియెను. మీమాంసాశాస్త్రమునందు లింగమనగా సామర్థ్య మనికలదుగాని చిహ్నమని యెచ్చటను చెప్పబడియుండలేదు. రామానుజుఁడు నీలకంఠునికి బదులుగా బ్రహ్మసూత్రభాష్యము గావింప నారంభించి మీమాంసకమర్యాదను వదిలిపెట్టవలసివచ్చినకారణమున బ్రహ్మమీమాంసాశాస్త్రము విష్ణుపరముగా సమర్థింప నలవిగాదని యేర్పడుటంజేసిపులినిఁబోలనెంచి వాతలు బెట్టికొనిన నక్కసామెతమాత్రమే యాయాచార్యునకు సంభవించెను.

ప్ర॥ దుష్పృథక్ప్రతిషేధమునందు దీనికి సమాధానము లేదా?

ఉ॥ తమయాచార్యుఁడు మీమాంసకమర్యాదను విడువక లింగశబ్దమును సామర్థ్యపరముగానె గ్రహించి సమర్థించినట్లుగాని లింగశబ్దమును చిహ్నపరముగా తీసికొనలేదనిగాని మీమాంసాశాస్త్రమునందు లింగపదమునకు చిహ్నమే యర్థమని నిర్ణయించి యున్నట్లుగాని, యేదియు నుడువఁజాలక యసంగత ప్రసంగముమాత్రమే చేయఁబడియున్నది. ఇప్పుడు గాదు. ఎప్పటికైన దగు సమాధానము వ్రాయునెడ గ్రహింప సంసిద్ధులము. అట్లుగాక తమ యాచార్యుఁడు శాస్త్రసమ్మతమగుదారి తప్పుటయు అదియే యొప్పని యంధపరంపరఁగా వాదింప సమకట్టినంతన తప్పెన్నాటికిని నొప్పు గాదు. ఆయాచార్యుఁడు లింగ మనగా చిహ్నమనియెనేగాని అది తప్తచిహ్నమని నుడువఁడయ్యెను. కాని యట్లు చెప్పినను నదియే యొప్పని వారిశిష్యపరంపర సమర్థింపఁబూనియే యుండునేమో.

ప్ర॥ రామానుజమతము బ్రహ్మసూత్రవిరుద్ధ మగుటకు నింకనేదేని కారణము గలదా?

ఉ॥ ఉభయలింగాధికరణమునందు దోషము లెంతమాత్రము లేనిదియు, మంగల్యగుణములన్నియు గలదియు బ్రహ్మమని నిర్ణయింపఁబడియున్నది, ఈ రెండు లక్షణములు సర్థముగలది శివపదమే గాక వేరొకపదము లేదు.

దీనింబట్టి శివఅనుపదము నామధేయముగాఁగలవాఁడే పరబ్రహ్మమని నిర్ణయింపఁబడియెను.

ప్ర॥ శివపదమునకు నీరెండులక్షణములు సర్థ మనుటయెట్లు?

ఉ॥ శామ్య న్త్యస్మిన్దోషాః॥ ఈదేవునందు దోషములు శాంతించినవి అనుసర్థమున సూ॥ సర్వనిఘృష్వరిష్వలష్వశివపద్వప్రహ్వాః॥ అను ఔణాదికసూత్రముచేత శమిధాతువునకు వక్ప్రత్యయముతోను ఇత్వమలోపములతోను శివశబ్దము నిపాతింపఁబడినది. దోషము లెంతమాత్రము లేనిదని యర్థము. మఱియు శివాని=నిఖిలమాం

గల్యాగుణములు నీదేవునకు గలవనునర్థమునందు మత్వర్థీయమగు నచ్ప్రత్యయాంతమై సకలమాంగళ్యగుణ నిధిత్వమును దెలుపుచున్నది. కావుననే

శ్లో॥ అనాదిమలసంశ్లేషప్రాగభావా త్స్వభావతః। అత్యన్త పరిశుద్ధాత్మా శివఇత్యభిధీయతే! అథవానంతకల్యాణగుణైకనిధి రీశ్వరః శివఇత్యుచ్యతే సద్భి శ్శివతత్త్వార్థవేదిభిః॥

దోషములతో సంపర్కము మొదటినుండి లేనందున నత్యన్త నిర్మలస్వరూపుఁడుగాన శివుఁడని చెప్పబడుచున్నాఁడు. మఱియుఁ అనన్తములైన కల్యాణగుణములకును తానే స్థానమైనవాఁడుగానను శివుఁడని చెప్పఁబడుచున్నాఁడు. అని పురాణములయందు నుపబృంహణము గలదు.

ఉభయ లింగాధికరణమునందు బ్రహ్మలక్షణములుగా నిర్ణయింపఁబడిన నిరస్తసమస్తదోషత్వము, నిఖిలమాంగల్యగుణనిధిత్వము ననురెండును శివునియందేగాక తక్కు దేవతలయందు లేమింజేసి శివేతరుఁ డగునారాయణుఁడే పరతత్త్వ మనుసిద్ధాన్తము గలరామానుజ మతము బ్రహ్మసూత్రవిరుద్ధ మని యేర్పడియెను.

ప్ర॥ ఈరెండులక్షణములు నారాయణునందును గలవనియె రామానుజసిద్ధాన్తము. ఇఁక నది బ్రహ్మసూత్రవిరుద్ధ మనుటయెట్లు?

ఉ॥ ఈ రెండు లక్షణములు నారాయణునందును గలవని గాదు, నారాయణునందే గలవని రామానుజుఁ డభిమానపడుగాక. అంతమాత్రేన నవి యద్దేవునియం దెట్లుఁడును? ఈ రెండు లక్షణములు నద్దేవునందు గలవని ఋజువుచేయునందాఁక నామతముబ్రహ్మసూత్రవిరుద్ధమని యెన్నక తీరదు.

ప్ర॥ ఈరెండులక్షణములు శివునియందు గలవనుట యెట్లు?

ఉ॥ శాస్త్రకర్తలు సమస్తవస్తువులకును వానివాని లక్షణములను దెలుపు నభిధానములను వానివానికి నిబంధించియున్నారు. కావున నామధేయములనుబట్టియే వాని లక్షణములను మనము

గ్రహింపవలయు. నింతియెగాక ప్రత్యక్షములుగాని వస్తువుల గుణము లను గ్రహింప వేరొకమార్గము లేదు. శివునియందు నీ రెండులక్షణ ములు గలవని యీ రెండు లక్షణములు నర్థముగా గల శివనామ మునుబట్టి విశదమగుచున్నది.

ప్ర॥ ఈలక్షణములను దెలుపుపేరు నారాయణునకు లేదా?

ఉ॥ ఉండియున్నచో డాపనేల? వెల్లడింపవచ్చుగదా!

ప్ర॥ నారాయణునందు నీరెండులక్షణములు గలవని నారా యణోపనిషత్తు సుబాలోపనిషత్తు మొదలగువానివలన నేర్పడదా?

ఉ॥ ఈ యుపనిషత్తులున్నదియు, వీనిలో నారాయణునకు నీ రెండులక్షణములు దెలిపినదియు రామానుజీయులకుఁ దెలిసిన మా త్రము పూర్వపుమహర్షులకు దెలియునా లేదా? వారి కీజాడ దెలిసి యున్నయెడ వారు నారాయణునకు నీరెండులక్షణములను దెలుపు నభిధానము నేల వాడకుందురు. ఎందేని యేమర్షియేని నారాయణు నకు నీరెండులక్షణములను దెలుపునామమును పేర్కొనినట్లు కలదా? లేదుగదా. దీనింబట్టి శివేతరునియందు నీరెండులక్షణములు లేవనియు బ్రహ్మకు నీరెండులక్షణములను దెలుపు నుపనిషత్తుల కన్నిటికిని శివునియందే తాత్పర్య మనియు, సకలమహర్షిసిద్ధాంత మనియు, ఇద్దానికి విరుద్ధ మగురామానుజసమయము పాంచరాత్ర మాత్రా శయ మనియు సిద్ధము.

ప్ర॥ పూర్వపురుషులు బ్రహ్మలక్షణములు గలనామధేయ మును నారాయణునెడ వ్యవహరింపనంతన నద్దేవునందు నాలక్షణ ములు లేవని యెన్న నగునా?

ఉ॥ వేదములు, పురాణములు, భారతరామాయణాదీతిహాస ములుకొనకు పాంచరాత్రములు లేక ద్రావిడవేదము వీనిలో నెందేని యెవ్వరేని యెన్నడేని నారాయణునకు నీరెండు లక్షణములు గలిగి యున్న యర్థముగలనామమును వాడియున్నచో నాలసింపనేల? నేడు వీరి ప్రాణముల మీదికివచ్చెనని యేవాదును శాస్త్రకర్తలావాదిం

పని యర్థము గ్రాహ్యమగునా? దీనిఁబట్టి శివునియందేగాక నారాయణునందు నీలక్షణములు లేవని తెల్లమయ్యెఁగదా.

ప్ర॥ దుష్కృతగ్రంథము 5 పుట శివాస్తే పన్థాన స్సన్తు శివం భద్రం కల్యాణం।శివ శ్శివానామిత్యాదిబహ్వర్థద్యోతకత్వాదస్యపదస్య నభవదభిమతదేవతాన్తరే నిరూఢాలక్షణా॥ శివపదమునకుననేకార్థములుగలవుగాననొక్కదేవతయందు రూఢి లేదు, అని వ్రాసెను. ఇఁక నీపదములనుబట్టి శివునందు బ్రహ్మలక్షణములు గలవని సమర్థించుటెట్లు?

ఉ॥ హరి అనుపదము కోతిని- కప్పను మొదలగు వానినెన్నిటినో చెప్పును. అట్లయిన నాపదము నారాయణునకు నభిధాయక మగుటయు నీగ్రంథకర్త యెఱుఁగఁడేమో. ఈతడువ్రాసినయుదాహరణము లన్నియు శివపదము మంగళవాచక మనియె బోధించుచున్నవి. గాన దానింబట్టియు శివుడనంతమాంగల్యగుణాకరుఁడనునర్థమునె ధ్రువపఱచుచున్నవి. అదిగాక శివపదము నారాయణునకును నభిధాయక మగుననియో! లేక శివునకు నభిధాయకము గాదనియో వానిభావమేదో అడుగవలయు. ఇందు శివపదము నారాయణునకును నభిధాయక మని వానియాశయమేని తమ మతస్థులు నారాయణాదినామములతో బాటు శివనామముతో గూడశివాచార్యుల నియేల నామకరణముగావించుకొనరో, శివపంచాక్షరి నేల జపింపరో అడుగుడు. దీనింబట్టి నారాయణుఁడు శివేతరుడు, నశివాభిధానుడు ననుట తమసిద్ధాన్తమని స్పష్టమేగదా.

ఇఁక మంగళకర మగునీనామరత్నము తమదేవుఁ డగుహరికి లేనప్పుడు పరదైవత మగుహరునకుమాత్ర మెట్లుండవలయు నను నసూయాపిశాచిక ప్రేరేప శివునకు శివనామము లేదని చెప్ప సాహసించినను అది నాకు నాలుకలేదు, నాతల్లి గొడ్రాలు, నారాయణాచార్లుదాటేరుగాదు అనుమాటలవోలె వ్యాహత మగుగాన హాసాస హామే యగు.

మఱియుభవా నహో ద్వేష్టి శివం శివేతరః॥ అమంగళుండ వగునీవు శివుని ద్వేషించుచున్నాఁడవని శివద్వేషుల నమంగళులనుగా నిర్ణయించినశ్రీభాగవతమే శివపదముశివునకు నభిధాయకమని నిర్ణయించెనుగాన భాగవతమునుగూడ ప్రమాణముగాదని యంగీకరింపవలసివచ్చు నని చెప్పి వాగ్బంధము గావింపుము. దీనింబట్టి బ్రహ్మలక్షణము లగుననంతమంగళ్యగుణములు శివునందేగాక నారాయణునందు లేవని ధృవమయ్యెఁగదా?

ఒకఁడు వేరొకనిసువర్ణకవచము తస్కరించి దానిమీదనున్న పేరు తుడిచి తనపేరు చెక్కి యాకవచము తనదే యనిచెప్పసాగెను. అంత మధ్యస్థులు వచ్చి దానిని పరిశీలింపఁగా నాకవచము వానిగాత్రమును మించియుండెను. దానినిబట్టి యాతనిచౌర్యము వ్యక్తమయ్యెను.

అట్లే నీలకంఠాచార్యుడు శివపరముగా నిబంధించినవిశిష్టాద్వైతసిద్ధాన్తమును సంగ్రహించి రామానుజుఁడు దానిమీద నారాయణనామమును జేర్చెను. గాని యంతమాత్రమున నది దక్కునా! దక్కనేరదు.

ప్ర॥ ఏలదక్కదు?

ఉ॥ ప్రమితాధికరణమునఁ బ్రతిపాదింపబడినయీశానశబ్దాభిధేయత్వము ఉభయలింగాధికరణమున నిరూపింపఁబడినయుభయలింగవిశిష్టత్వముఅస్త్యార్యధికరణమున నిర్ణయింపఁబడినయష్టమూర్తిత్వము మొదలుగాగలబ్రహ్మలక్షణము లెన్నియున్నవో అవి యన్నియు నారాయణునందు గలిగియున్నట్లు ఋజువుచేయ నందాఁక నామతకర్తకు తస్కరత్వమే గాక విశిష్టాద్వైతస్థాపకత్వము దక్కదనుట నిక్కువము.

ప్ర॥ దుష్ప్రథగ్రంథకర్త ఋజువు చేసియుండలేదా?

ఉ॥ ఆగ్రంథకర్త లేనయజ్ఞానాస్థత్వమును మత్తోన్మత్తత్వమునుమాత్రమేబాగుగాఋజువుచేసికొనియెను. తహమతాచార్యుఁడే

వీనిలో నొక్కయంశమునైన నిరూపింపఁజాలక తప్పుదారినిబడి దాటిపోయియుండ నప్పని వీని కెట్టులోప్పు.

ప్ర॥ దుష్పథగ్రంథకర్త మహాభారతమునందు నారాయణ పారమ్యము గలదని చెప్పియుండెఁగదా?

ఉ॥ ఏమాత్రమైన లజ్జ గలిగియున్నచో భారతముపేరే తల పెట్టకుండును.

ప్ర॥ అదియేల?

ఉ॥ సర్వసమ్మతములైనతనగీతలలోనే శ్రీవాసుదేవుడు శ్లో॥ తమేవ శరణంగచ్ఛ సర్వభావేన భారత। యోలోకత్రయమా విశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః॥అర్జునా! అన్తరాత్మగాఁజేరి జగము నెల్ల పోషించుచున్నయీశ్వరునే శరణజొచ్చుము॥ శ్లో॥ తమేవ చాద్యం పురుషం ప్రపద్యే। యతఃప్రవృత్తిః ప్రసృతాపురాణీ॥ జగమునుసృజించినయప్పరమేశ్వరునే నేను శరణుజొచ్చియున్నాడను. అనికంఠరవమున, జెప్పియుండగనుఇట్టియనేకవచనములకు తమ మతిమున నన్వయము కుదరక తమపెద్దలు పలుపాట్లు పడియుం డఁగను ప్రక్షిప్తములైనయల్పవచనములలో రుద్రునికంటె నారా యణునుత్కర్షము సూచింపఁబడినంతన నేమిలాభము.

ద్రోణాదిపర్వములలోఁ బెక్కుచోట్ల మహావిష్ణువు శివునుద్దే శించి పెద్దకాలము ఘోరతపముచేసి సుప్రసన్నుఁ డగునద్దేవునివలన ననేకవరములఁ బొందెనని ఘంటారవముతో వినఁబడుచున్నదిగదా! మఱియు శ్రీ కృష్ణు డుపమన్యునివలన పాశుపతదీక్షవహించి మైనాక పర్వతమున శివునారాధించుచుఁ బంద్రెండేండ్లు తపముచేసినట్టులా నుశాసనికమునఁ గలదు గదా. భారతమున నెచ్చోనేని రుద్రుఁడు నారాయణు నారాధించినట్లు కలదా? కడమసంగతు లటుండుగాక,

శ్రీకృష్ణుఁడు శివానుగ్రహమువలన గుమారునిఁబడసి యెల్ల ప్పుడు శివనామస్మరణము తనకు లభించుటకై యాతనికి సాంబుఁడని నామకరణము చేసికొనినట్లు ప్రత్యక్షముగాఁ గనబడుచున్నదిగదా.

శ్రీకృష్ణునకు సాంబుఁడనుకుమారుఁ డుండియున్నట్లు భాగవతమునఁగూడఁ గలదుగదా? ఈనామధారులు తమ కొడుకులకు 'సాంబ' మొదలగుశివనామములతో పేరుపెట్టుదురుందురా? వీరికి భారతమునందుఁగాని శ్రీకృష్ణునందుఁగాని విశ్వాస మొంతమాత్రమైన నిజముగా నున్నయెడ వీరు శ్రీకృష్ణునివలె శివునేల యారాధింపకుందురు. కాఁబట్టి వంతునకు మాకును భారతము ప్రమాణమేయని నాలుక చివరమాటలతోఁ బలుకుదురేగాని అంతశ్శుద్ధిగా నంగీకరింప రనుట నిజము.

భారతముసంగతి యటుండుగాక. కొసకు శ్రీరామాయణమైన వీరికి బ్రమాణ మగునా?

ప్ర॥ వారి కదియేల ప్రమాణముగాదు?

ఉ॥ 'అత్ర పూర్వం మహాదేవః ప్రసాద మకరో ద్విభుః'॥ పూర్వమిక్కడ మహాదేవుఁ డనుగ్రహించెనని శ్రీరామచంద్రుఁడు బిగ్గరగాఁజెప్పియుండగా నెంతో సరసమగు వాల్మీకి కృతిని-అత్రపూర్వ అమ్మహాదేవః అని సర్వాసహ్యాకరముగా ఛేదించిననేగాని సదరని వారిమతమెట్లు పండితసమ్మతమో లోకు లెఱుంగనిది గాదు. ఇట్లు వేదములుమొదలైనవి తమకుఁ గుదరనికారణముననే వేదములతో బాటు భారతరామాయణాదులగూడ తుంగలో త్రొక్కి ద్రావిడ వేదముతోఁబాటుగా నపాత్రమగు పాంచరాత్రమునుమాత్రమే పరమ ప్రమాణముగా గ్రహించిన వీరి మతరహస్యము సకలలోక పరిహాస్యమనుట సుప్రసిద్ధము.

కావుననే రామానుజుఁడు బ్రహ్మసూత్రములను తమ మతమున నన్వయింపనెంచి వలనుపడక పడిన ప్రయాసమును గొంత బ్రహ్మపథకారులు వెల్లడించిరి. దానికై యభిమానమున్నచో నట్టి మతమునఁ బడద్రోసిన తమ పురాకృతమునకై విచారింపవలయునే గాని గ్రంథకారులను దూషించినదానివలన నేమిలాభము? తమకు చేతనగుచో సమర్థింపవలయు. తమయాచార్యునకే యలవిగానిపని

తమ కెట్లుశక్యమగునని తలంచియూరకుండక యావ్యక్తప్రసంగము గావించినికోలఁది తమవైగుణ్యముతోఁబాటు స్వమతముదగు నప్రామాణ్యంబును మఱింత సువ్యక్తమగునేగాని వేఱు ప్రయోజనముండదు.

ప్ర॥ దుష్పథగ్రంథము సంస్కృతమున వ్రాయఁబడియె గదా? మీరు తెలుగున వ్రాయనేల?

ఉ॥ ఆగ్రంథము సంస్కృతమే అయియున్నచో మేము నట్లే వ్రాసియుందుము.

ప్ర॥ అది సంస్కృతముగాక యేభాష?

ఉ॥ అది సంస్కృతాభాసమగుమ్లేచ్ఛము!

ప్ర॥ ఏల?

ఉ॥ మంగళశ్లోకముమొదటనే వజ్రామాస, నయనామాస అనియిట ఆమ్ యెట్లు వచ్చెనని జూచుసంతలో తరుణీమాస అని ఈమ్ గూడ గనవచ్చెను. పాణినిముని కొన్నిధాతువులకుమాత్రము ఆమ్ మట్టుకే విధింపఁజాలెను. ఈగిసి యన్ననో సుబంతములకును ఆమ్—ఈమ్—ఊమ్ గూడ విధింప నారంభించెను. మఱియు యద్యేశాన—తదప్యేశానమొదలుగా నవాచ్యములు నశ్రావ్యములు నగు నపభ్రంశములతో నిండియున్నది. మ్లేచ్ఛఅపశబ్దే అను ప్రమాణమునుబట్టి యపశబ్దభూయిష్ఠంబగు నీదుష్పథగ్రంథభాష మ్లేచ్ఛమేయగుదాననే కాఁబోలు. శ్లో॥ అపశబ్ద భయం నాస్తి హ్యాప్పళాచార్యసన్నిధౌ॥ అని యభియుక్తోక్తి జయించుచున్నది.

ప్ర॥ అపశబ్దభయమప్పళాచార్యునకు లేదనుటకేమికారణము?

ఉ॥ వ్యాకరణము వేదపురుషునకు ముఖమగుటంజేసి పాంచరాత్రమును ద్రావిడవేదమును మాత్రమె గౌరవించి వేదపురుషునిబహిష్కరించినప్పుడు వానిముఖము జూడఁగూడ దనుసదియే.

ప్ర॥ ఇదియేగాక వేఱుకారణములేదా?

ఉ॥ లేకయేమి ? వ్యాకరణకర్తయగు పాణినిముని శైవుడగుటయు.

ప్ర॥ అది యెట్లు ?

ఉ॥ పాణినిమహర్షి శ్రీచిదంబరక్షేత్రమునమహానటునుద్దేశించి తపము గావించి మహేశ్వరునివలన ఇతిమాహేశ్వరాణి సూత్రాణి॥ అను సూత్రముల గ్రహించి వానింబట్టి వ్యాకరణము రచించెననుట ప్రసిద్ధము. దీనింబట్టి వ్యాకరణ ప్రథమాచార్యుఁడు మహాశైవుఁడనియు, మాహేశ్వరసూత్రములవలననే వ్యాకరణశాస్త్రమును రచించెననియు స్పష్టమైనది.

ప్ర॥ దుష్పథగ్రంథములోని యపశబ్దములంబట్టి యాగ్రంథకర్త యశాస్త్రజ్ఞుఁడనియే యేర్పడుగాని వారిమతముననే వ్యాకరణము బహిష్కృతమని యెట్లు లేర్పడును.

ఉ॥ ఈ దుష్పథగ్రంథమునకు కావేరిమొదలుకొని గోదావరివఱకు గల యెందఱో రామానుజీయులు సదభిప్రాయముల నొసఁగియున్నారుగదా ! వారిలో గొందఱేని శబ్దవిదు లుందురేని వారీ బూతుపాత్రముగని యెట్లు మైమఱతురు. వారందఱు నశబ్దజ్ఞులని భావించుట యనుచితముగాన వారిమతముననే శబ్దశాస్త్రము బహిష్కృతమని దోచెడిని. కావున నాగ్రంథము దుష్పదమేయయినను దుష్పథఅని ప్రమాదమునఁబడిరెనేమో!పదములా! బూతులు,వాక్యములా, అనన్వితములు. న్యాయములా!అసంబద్ధములు. ఇట్టి గ్రంథములకు కర్తలెగాక ఆమోదకులు ధనప్రదాతలుగూడ గలిగియుంట వారిమతము దగు భాగ్యమునే వెల్లడించెడిని. ఇట్లు పరులకు నుపాదేయమగు మ్లేచ్ఛము మాకు హేయముగానను శ్రీ గురువరులు గీర్వాణమున వ్రాసినదానియర్థము దెలిసికొనజాలక వారలసంబద్ధప్రలాపము గావించిన కతనను తెలుఁగుననే వ్రాయునెడ దీని నిజము గ్రహించి యింతనైన గంతులువేయక శాంతించి సుఖింతురుగాత యని యెంచి యిట్లువ్రాయనయ్యెను.

ప్ర॥ దుష్పథగ్రంథమునఁ బెక్కు లౌకిక న్యాయము లుదాహరింపబడియెగదా ?

ఉ॥ వారి మతమునందుఁ బూర్వోత్తరమీమాంసాన్యాయములు కుదరమిచే నవి బహిష్కరింపబడుటనే కాఁబోలు వారిచే లౌకికన్యాయములు మాత్రము గ్రహింపబడియెను.

ప్ర॥ మయసభాదుర్యోధనన్యాయము వ్రాసెనుగదా. అది యెట్లు గుదురును.

ఉ॥ ప్రతిపక్షులమతాచార్యుడు బ్రహ్మమీమాంసను నారాయణపరముగా నన్వయింపఁబోయి యది గుదరమిచే నగుబాటు దనమును బెక్కునధికరణములలో పొందెనుగాన నాన్యాయము వారికే యన్వయించెను.

ప్ర॥ భస్మాసురన్యాయముదాహరింపఁబడియె గదా ! అది యెట్లు గుదురును ?

ఉ॥ తమరు ప్రమాణముగా గ్రహించిన భారతమే శ్రీకృష్ణాదులను శివారాధనపరులనుగా నిరూపించి తమ మతమును భస్మము చేసెనుగాన నాన్యాయము వారికె యన్వయించెను.

ప్ర॥ దుష్పథగ్రంథకారుడు బ్రహ్మపథగ్రంథకారులనే చోరులని వ్రాసెనుగదా?

ఉ॥ రామానుజుఁడు తస్కరణకర్తయని బ్రహ్మపథకారులు ఋజువుచేసినదానికి దిక్కుదోపక యాతఁడు కులటాప్రత్యుక్తి న్యాయము నవలంబించి తమ యాచార్యుని తస్కరత్వము స్థిరపరచెను.

ప్ర॥ దుష్పథగ్రంథము 37 పుట "ఏతేనవైష్ణవపథప్రతిషేధోపి పరాహతః। అని యున్నదిగదా? దీనికేమి సమాధానము?

ఉ॥ ఏతేన రామానుజపథప్రతిషేధము సమాధానము చెప్పనలవిగాకున్నదిగాన వైష్ణవపథము హతమైనదని భావము.

మఱియు, ఏతేన—వైష్ణవపథ ప్రతిషేధములోని యొక్క వాక్యమైన నలవిగాకున్నదిగాన వైష్ణవపథము హతమైనదని భావము. ఇట్లుగానిచో నీగ్రంథమున నవ్యక్తముగా గోరిగియే వైష్ణవపథ ప్రతిషేధమునందు గాయత్రి మొదలైన మంత్రములు వైష్ణవపక్షమున నేమాత్రము నన్వయింపవని వేయివిధముల సమర్థింపఁబడియుండగా నాగ్రంథములోనియొక్క యక్కరమునైనచూడకయే ఆ గ్రంథము ఖండింపఁబడెరొనని మాట మాత్రము వ్రాయసాహసించుటం బట్టి యిదియే వాని భావమని వ్యక్తమయ్యెడిని.

ప్ర॥ అసందర్భనిర్భరగర్భమగు నీగ్రంథము నచ్చుగూడ నేల వేయించిరి ?

ఉ॥ స్వీయులకు స్వమతమున విశ్వాసము గలిగింపను, తన్మూలమున నుదరమును పూరింపను మాత్రమే యనుట విశదమేగానఁ జెప్పపనిలేదు.

ప్ర॥ దుష్పథగ్రంథమునకు బ్రహ్మపథకారులేల ఖండనము వ్రాయలేదు.

ఉ॥ విమతనిరాకరణము నెపవలయు సకలశాస్త్రవిషయమును బ్రహ్మపథముననే విశదీకరించియుండిరిగానను, నహిరుతమనుకౌతి గ్రామసింహస్య సింహః, అను న్యాయముననుసు నుపేక్షించిరి.

ప్ర॥ ఈ యవ్యక్త గ్రంథమునకు మీరేల బదులుచెప్ప నుపక్రమించితిరి ?

ఉ॥ తన గ్రంథమునకు సమాధానము రాలేదని యీ గ్రంథకారుఁడు మిట్టిపడుననియు బ్రహ్మపథకారులు గీర్వాణమున వ్రాసిన విషయము దెలియక యుందగు నంశము వివరింపుఁడని పలువురు ప్రోత్సహించిన కతనను కొంచెము వ్రాయవలసివచ్చెను.

ఉ॥ తప్పును నొప్పునుందగు విధంబున వేర్పరుపంగఁజాలువాఁ।
డొప్పుగ పృథ్విఁనికి వెలసి యొప్పిదమున్ బ్రకటింపగల్గినన్।

గుప్పనెశాస్త్రసిద్ధనయగుంభనజృంభితవాఙ్మయూఖముల్।
తెప్పునవిచ్చిపోవ జడధీకహరాపహితాంధకారముల్॥

సీ॥ కాదంబరీముఖకావ్యసఙ్ఘటనలసహృదయసముదయ స్తవముగాంచి।
బ్రహ్మపథాదిప్రబన్ధప్రభావళివిమతాన్ధకారంబు విరియజేసి।
శైవరహస్యాదిపత్రికస్తవతావళి బ్రితివాగిముఖబిలవితతిమూసి।
ప్రౌఢసారస్వతపరిషన్ముఖంబున ననవద్యబిరుదాళిసధిగమించి।

గీ॥ నవ్యయశుఁడైన ముదిగొండనాగలింగ।
యోగివర్యాగ్రసుతుఁడు నయోపగతుఁడు।
నైన సుబ్రహ్మణ్యసమాఖ్యుఁడిట్లు।
వ్యాసముని వర్యుని మతంబు బ్రస్తుతించె॥

---

శ్రీ శివాయగురవేనమః

స్వస్తిశ్రీ మద్బహుధాన్యనామ సం॥ మాఘ శు॥ ౧౩ గురువారం ది 2-2-39 తేది మధ్యాహ్నము 2 గంటలకు బెజవాడపట్టణమున శ్రీ కాశీనాధుని నాగేశ్వరావుపంతులుగారి దుర్గావిలాస భవనమందు శ్రీ శైవమహాసభాకార్య నిర్వాహకవర్గమువారు బ్రి॥ శ్రీ॥ లోకారాధ్యులైన విద్వాన్ శిరోమణి ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారి అధ్యక్షతను సమావేశమై యీ క్రిందివ తీర్మానములు చేయబడినవి,

హాజరైన సభ్యులు.

1. అధ్యక్షులు:- బ్రహ్మశ్రీ లోకారాధ్యులైన విద్వాన్ శిరోమణి
ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

2. కార్యదర్శి:- బ్ర॥ శ్రీ॥ కందుకూరి వటుకభైరవమూర్తి పంతులుగారు

3. సహాయకార్యదర్శి:- బ్ర॥ శ్రీ॥ డాక్టరు శ్రీపతి పండితారాధ్యుల పట్టెసలింగారాధ్యులుగారు

4. పరిచారక కార్యదర్శి:- బ్ర॥ శ్రీ॥ శివలెంక లింగయ్యగారు

5. పత్రికా సంపాదకులు:- బ్ర॥ శ్రీ॥ ఇవటూరి సానందరావుగారు

సాధారణ సభ్యులు.

1. ఈశ్వరప్రగడ సదాశివశర్మగారు
2. ములుగు కుమారస్వామిగారు
3. బేతవూడి రామయ్యగారు
4. శ్రీపతి పండితారాధ్యుల రామలింగశాస్త్రిగారు

తీర్మానములు.

1. శైవమతమునకు శిరోమణియనదగినట్టియు, శైవమహాసభను నొకప్పుడధ్యక్షస్థానమలంకరించినట్టియు, వేదాంతబోధయందు నిపుణులైనట్టి తోట్లవల్లూరుగ్రామవాస్తవ్యులగు బ్ర॥ శ్రీ॥ లోకారాధ్యులైన శివలెంక అమృతలింగం అయ్యవార్లంగారు ఈ కార్య నిర్వాహకవర్గమునుండి వీడి, లింగైక్యమును చెందినందులకు వారి కుటుంబమునకు యీ సభవారు సానుభూతిని చూపుచున్నారు.

2. ఆదాయవ్యయనిరీక్షణము:- జమాఖర్చులు వ్రాయబడిన పుస్తకమును సభ్యులుచూచి లెక్క తేల్చుటకు తగిన అవకాశము లేనందున ది 9-5-34 తేదిలగాయతు ది 2-2-39 వ తేదివరకుగల జమాఖర్చు లెక్కలను బ్ర॥ శ్రీ॥ కాశీనాధుని పూర్ణమల్లికార్జునుడు గారున్నూ ఇవటూరి సానందరావుగారున్నూ సాధ్యమైనంత త్వరలో లెక్కచూచి నిల్వతేల్చి శెక్రటరీగారికి వప్పగించుటకు తీర్మానించడమైనది.

3. విద్యార్థుల దరఖాస్తులు:— నేటివరకు వచ్చిన విద్యార్థుల దరఖాస్తులు మొత్తం తొమ్మిది. యీ ఏనమండ్రుగురు విద్యార్థుల కన్నూ ఒక్కొక్కరికి అయిదేసి రూపాయల చొప్పున యిచ్చుటకు మంజూరుచేయుచూ, యీ మొత్తమును మహాసభాకోశాధికారి శివలెంక శంభూప్రసాదుగారివద్ద నిల్వయున్న మూలధనములోనుండి తెప్పించుటకున్నూ, లోగడ పత్రిక అచ్చునిమిత్తం వాడినటువంటి రు 46—0—0 లు శివలెంక లింగయ్యగారికి యివ్వవలసియున్నదిగాన సదరు మొత్తమునుగూడ మూలధనమునుండి తెప్పించి యిప్పించుట కున్నూ కార్యదర్శికి అధికారమీయడమైనది.

4. శివమేధప్రయోగము - ఈ గ్రంథమును ముద్రించుటకు గాను ద్రవ్యము అవసరముగాన భాష్యచందా బాకీదారులు తాము యివ్వవలసిన సొమ్ము వెంటనే దయచేయించి గ్రంథమును సత్వరముగా అచ్చువేయించుటకు తోడ్పడవలసినదిగా యీ సభవారిచే కోరబడుచున్నారు.

5. మతప్రచారం:— ప్రస్తుతం విజయనగరం ప్రాంతముల యందును, తూర్పు పశ్చిమగోదావరి జిల్లాలయందును శైవ మతప్రచారమొనర్చి మహాసభకు చందాదారులను చేర్పించి విరాళములుగాగూడ ధనమును సంపాదించుట అత్యవసరమని సభవారికి తోచినందున సదరు ప్రాంతములకు వెళ్ళినపుడు విజయనగరమునందు ఇవటూరి బుచ్చిసోమన్నయ్యవార్లగారి సహాయముతోను, గోదావరి జిల్లాలయందు చాగంటి మల్లికార్జునరావుగారి సహాయముతోనున్ను మతప్రచారము సల్పుటకు యీఫిబ్రవరి నెలలోనే బయలుదేరగలందుల కును, విజయవాడ కాపురస్థులును శ్రీశైవమహాసభా సహాయకార్యదర్శిగారగు డాక్టరు శైవాగమ విశారద శ్రీపతి పండితారాధ్యుల పట్టెసలింగారాధ్యులవారిని కోరడమైనది

6. శైవమహాపీఠము రిజిస్ట్రేషన్:— ఈమహాపీఠముయొక్క రిజిస్ట్రేషన్ ట్రస్టుగా రిజిష్టరీచేయుటకు సభ్యులు ఏకగ్రీవముగా అభి

ప్రాయములిచ్చినందున అట్టి రిజిస్ట్రేషనుకు అవసరమైన ట్రస్టుపత్రమును వ్రాయించుటకును, ఈ విషయమున శ్రీదేవిడీ జమీందారుగారితోను, సింగరాజు సుబ్రహ్మణ్యాంపంతులుగారితోను సంప్రదించి సరియగు ట్రస్టుడీడ్ వ్రాయించి సిద్ధపర్చుటకున్ను, అవసరమైనచో మహాసభ జరుగులోపల అవసరమహాసభ జరిపి పనిపూర్తి చేయగలందులకు సభాకార్యదర్శిగారగు కందుకూరి వటుకభైరవమూర్తిపంతులుగారికి అధికారమీయమైనది.

రాబోవుశైవమహాసభ:— సదరు విషయములో విశాఖపట్నం జిల్లాయందుగాని తణుకునందుగాని, కొత్తపల్లియందుగాని జరుపుట ఉచితమని సభవారు సూచించినందున అవిషయమై ఆప్రాంతమున విచారించి నిర్ణయమొనర్చి యీ పాల్గుణమాసాంతములోపల తెల్పుటకు శివలెంక లింగయ్యగారికి అధికారమీయడమైనది.

శైవమహాపీఠమునుగురించి ఈశ్వరప్రగడ సదాశివశర్మగారిచే వ్రాయబడిన పద్యములు చదువబడినవి. వారి ప్రచారమునందు గలిగిన అనుభవములను వెల్లడించిరి. తదుపరి స్వస్తివాచనములతో సభ ముగించబడినది.

(Sd.) మ. దిగొండ పీరేశలింగశాస్త్రి, అధ్యక్షుడు.

(Sd.) కందుకూరి వటుకభైరవమూర్తి, కార్యదర్శి.

ది 2—2—39.

శ్రీ శివాయగురవేనమః

ది 27—3—1939 సం॥రం కు సరియైన ప్రమాధినామ సం॥ర చైత్రశు ౭ సోమవారము రాత్రి 8 గంటలకు పశ్చిమగోదావరి జిల్లా తణుకు తాలూకా కొత్తపల్లి అగ్రహారములో సమావేశమైన శైవబ్రాహ్మణ సంఘములో యీదిగువ తీర్మానములు గావింపబడెను.

1. రాబోవు 22 వ శైవమహాజన సభ కొత్తపల్లి అగ్రహారములో జరుపుటకు తీర్మానింపబడినది.

2. ఈ సభ కొత్తపల్లి అగ్రహారములో వేంచేసియున్న శ్రీ ముక్తేశ్వరస్వామివారి కల్యాణోత్సవములలో అనగా వైశాఖ శు ౧౨ ౧౩, ౧౪ ఆది, సోమ, మంగళవారములకు సరియైన ఏప్రిల్ 30, మే 1, 2 తేదీలయందు జరుపుటకు తీర్మానింపబడినది.

1. ఇవటూరి వీరభద్రయ్యవార్లు,
గ్రామమునసబు, సా॥ కొత్తపల్లి అగ్రహారం.

2. చాగంటి సుబ్బరామశాస్త్రులువార్లు,
గ్రామకరణం, సా॥ కొత్తపల్లి అగ్రహారం.

3. ఇవటూరి సింగరామయ్య డిట్టో

4. ఇవటూరి నాగమల్లికార్జునరావువార్లు. డిట్టో

## వేదవ్యాసుని మతము అను వ్యాసములోని తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 10 | దృ్రమిడ | ద్రమిడ |
| 6 | 12 | శుతి | శ్రుతి |
| 12 | 15 | ఆ | ఆ |
| 14 | 19 | శృతి | శ్రుతి |
| 14 | 20 | అభీధాన | అభిధాన |
| 16 | 7 | నిర్ష | నిర్ణ |
| 16 | 23 | బ్రిహ్మ | బ్రహ్మ |
| 19 | 13 | మర్షి | మహర్షి |
| 20 | 7 | పదములను | పరమును |
| 20 | 26 | దా పేరు | నా పేరు |
| 21 | 6 | బ్రిహ | బ్రిహ్మ |
| 21 | 7 | ధృవ | ధ్రువ |
| 22 | 2 | లోప్పు | లొప్పు |
| 24 | 2 | గావించిని | గావించిన |
| 24 | 12 | మంగళశోకము | మంగలశ్లోకము |

## ఒక్క మనవి.

ఈ వితంతు వివాహ సమస్యను తేల్చుట కడు ముఖ్యముగాన వ్యయప్రయాసల కోర్చియైనను, తప్పక తామీ 22 వ మహాసభకు దయచేయ బ్రార్థితులు. అలసభావమును వహించి యూరకుండిన, సంఘమునకు తీరరాని నష్టము కలుగ గలదు. ఈ నష్టమునకు శైవ సాంఘికులెల్లరు బాధ్యులు.

ఇట్లు,

ప్రచారక కార్యదర్శి.



కుమారలీల

శ్రీ శివాయగురవేనమః

# శైవమత ప్రకాశిక.

ప్రమాథినామ సం॥
చైత్ర వైశాఖమాసములు.


| సంపుటము. | సంచిక. |
| --- | --- |
| 2 | 1 |


శ్లో॥ శ్రీ వేదశాస్త్రార్థ తతిప్రభాసికా।
సందేహ సందోహ మహానిరాసికా।
తత్వత్రయోద్బోధన సిద్ధదేశికా।
జయత్వియం శైవమత ప్రకాశికా।


ఇవటూరి సానందరావు
పత్రికా సంపాదకుడు



శైవమహాసభా కార్యాలయము,
బందరు.

ప్రకటన:-
పింగళి వీరయ్యాపంతులుగారు,

ముద్రణ:-
మినర్వాప్రెస్, బందరు.

# శైవమత ప్రకాశిక.

శ్రీ శివాయ గురవే నమః

## విజ్ఞప్తి.

—:o:—

భక్త మాహేశ్వరులారా!

శైవమత ప్రకాశికయను నీద్విమాసపత్రిక, యీశ్వర సంవత్సరమున, జననమొంది బహుధాన్యనామ సంవత్సరాంతము వరకు నిర్విఘ్నముగ సాగినది. దీనికి శ్రీ॥ లో॥ శివలెంకలింగయ్య (రిటైర్డు పోలీసు సబుయిన్‌స్పెక్టరు) గారి తీవ్రమైన కృషి కారణమని చెప్పకతప్పదు. వీరలు కృష్ణా, గుంటూరు, మండలములయందును, నైజాం ప్రాంతములయందును తొలుత సంచారముసల్పి, చందాదారులను చేర్పించి కొంతద్రవ్యమును వసూలు చేసినందున నీకార్యము నిర్విఘ్నముగ సాగినది. వారి ప్రోత్సాహముననే, నేనీద్విమాస పత్రికను నడుపుట కంగీకరించితిని, వారు బందరులో నివాసముండుటవలన, నేనును బందరులోనే కార్యస్థాన మేర్పర్చుకొని నాశక్తివంచనలేక నిష్కామబుద్ధితో నీపత్రిక విషయమై పాటుపడియున్నవాడనని తామెల్ల రెరింగిన విషయమే. మధ్యలో శ్రీవిజయనగరం వాస్తవ్యులగు శ్రీ॥ లో॥ ఇవటూరి బుచ్చిసోమన్నయ్యవారును, స్మార్తమతస్థులైనను, హృదయమున, శివునికంటె, వేరెదైవము లేడని నమ్మి పరమశైవులై శైవమత ప్రచారమునకు గడంగినటువంటి, నందిగామ తాలూకా భీమవరం వాస్తవ్యులైన బ్ర॥ శ్రీ॥ యీశ్వరప్రగడ సదాశివశర్మగారును నీపత్రికా నిర్వహణమునకు ద్రవ్యార్జన చేయుటలో తమశక్తి వంచనలేక పాటుపడి కొంత ద్రవ్యము సమార్చినందుకు వారుకూడ ప్రశంసనీయులు. ఇంతకంటె నీపత్రిక యెడల నభిమానముతో పనిచేసినవారెవరును నాకు కనుపించలేదు.

ఈపత్రికకు మధ్యమధ్య ద్రవ్యాభావము కలిగి యీపత్రిక యాగిపోవునంతటి దుస్థితి యేర్పడినప్పటికిని, పత్రిక పడిపోకుండ తమ స్వాంతద్రవ్యమునుగూడ ముందుగ వెచ్చించి, కార్యమును నిర్వహించిన, శ్రీ శివలెంక లింగయ్యగారి మతాభిమానమును మిక్కిలి కొనియాడతగియున్నది. ఇప్పటికి కొన్ని నెలలనుండియు వారు స్వగృహనిర్మాణ కార్యములయందు నిమగ్నులగుటయు, నాపని యిప్పటివరకు పూర్తిగాకపోవుటయు, జరుగుచున్నందున, ప్రచారమున వారు మరల దిగుటకు నవకాశము చిక్కినదికాదు. ఇంతలో వారికి కన్ను ఆపరేషన్ చేయించుకొనవలసివచ్చినది. ఆకారణములచే, నింతలో ప్రచారమున వారు మరల ప్రవేశించు నట్లు తోచదు. వారి ప్రచారములేనిది యీ పత్రికను నిర్వహించుట కష్టమని నాకును, కొన్ని నెలల క్రిందనే తోచినది. అయి నను అభిమానపరులున్నచో దీనిని నడుపవలెననే యనుకొంటి గాని యట్టివారు లేనట్లు నింతవరకు నాకు కలిగిన యనుభవము వలన విస్పష్టమైనది. ఎట్లనగా - పత్రికలను గంజాంజిల్లా మొద లుకొని మన మతస్థులగు శైవులు గల యన్నిప్రాంతములకు పత్రి కాప్రచారమునిమిత్తమై, చందాల నిచ్చినవారికిని, నివ్వనివారికిని గూడ పంపుచూవచ్చితిని. శాఖాసంఘములు యేర్పడినచోట్లకు బంగీలద్వారా పంపియుంటిని. అయిన నేమిలాభము. పంపిన పత్రికలను గ్రామమునందు యిచ్చుటలేదని తెలియవచ్చినది. కొన్ని చోట్లనుండి పత్రికలు నిరాకరింపబడి కార్యస్థానమునకు చేరినవి. అది యట్లుండనిండు. చందాల తొలుత నారంభశూరత్వమున నిచ్చిన వారలు మరల నిచ్చుట మానివేయుచున్నారు. ఇట్లున్నది మతాభిమానము. ఈసంగతులను నిదివరలోనే ప్రెసిడెంటు శక్రి టరీగార్లకు తెలియపర్చియుంటిని. మతస్థులకు మతాభిమానము లేనిది వారుమాత్ర మేమిచేయగలరు?

సంఘముయొక్క యభివృద్ధి చూతమా! పూర్వాచార పరాయణులగు పండితులు నీ మహాసభకు రాక తప్పించుకొను

చున్నారు. మతాభిమానమున్నను, ద్రవ్యాభిమానమును పోగొట్టుకొనజాలక, మూకీభావమును వహించుచున్నవారలు కొందరు మహనీయులు. మతగ్రంధములు మున్నగునవి యచ్చుపడక పోవుటవల్లను, తమ ద్రవ్యము వృధాగా వ్యయింపబడుచున్నదని హేయభావమును కలిగియున్నారు మరికొందరు మహనీయులు. ఇట్లొక్కొక్క కారణముచే, నీశైవమహాసభయందు నిరాదరణ బుద్ధి సాంఘికులకు కలిగినదని నాకు తోచెడిని.

ఇది యిట్లుండ నీమహాసభ ప్రారంభింపబడిన నాటిదినముల యందు గల శివపూజా ధురంధరులు క్రమముగ గతించుచుండిరి. తరువాతి వారికి పర విద్యాగ్రహణమున, స్వవిద్యయందుగాని, స్వమతమునందుగాని నభిమానము లేకపోవుటయు, జరుగుచూ వచ్చుచున్నది. అభిమానము లేకపోయిన పోవుగాక, కొంత కాలమువరకు సంఘమున పరదేశీయాచారముల ప్రవేశించ బెట్టుటకు సాహసము లేకపోవుటచే, నీమహాసభ కొంతవరకు సాగినది. కాలగతి యిప్పుడు స్వేచ్ఛగా పరాచారములను సాహసముగా సంఘమున బ్రవేశపెట్టు యువకబృంద మేర్పడినది. వారు సంఘ సంస్కారులైనందున, వేదధర్మమును నిర్మూలన మొనరించుట కేమాత్రమును జంకరు. దానికి సూచనగా, మన యారాధ్య జన సంఘమునందు బందరు నిజాంపేటలో నొకవిధవా వివాహము బహిరంగముగ జరుపబడినది. ఆసమాచారమును నేను సర్వశైవసాంఘికులకు నెఱుకపర్చి మతాభిమానులను నిద్రనుండి మేల్కొల్పితిని. దానితో యువకులును, యువకభావము గల వృద్ధులును నాపై కినుక వహించిరి. వారి కినుకను నేను తృణప్రాయముగ నెంచి వారికిని నాకును పరస్పర సంభాషణములు జరిగినప్పుడెల్ల వారు నావాదమును ఖండించుటయు, నేను వారి వాదమును ఖండించుటయు జరుగుచువచ్చినది.

నేను వితంతూద్వాహమును పత్రికలో ప్రకటించుటకు తొలుత వియ్యంకులు సమ్మతించిరి. కారణమేమన, వారు చేసిన

సంఘ సంస్కారము న్యాయమనియు, నికాలమున, రజ స్వలానంతర వివాహమువలె సాంఘిక మోదమును బడయుననియు వారు విశ్వసించిరి. అందువల్ల వారిద్రవ్య వ్యయము లేకుండా మహా సభాద్రవ్యముతోనే తమ ఘనకార్యము సాంఘికులకు తెలియ బడుచున్నదని సంతసించిరి. కాని తాము తలచినదొకటి, దైవము తలచినది వేరొకటి. శైవ సాంఘికులు వీరుచేసినపనిని నామోదింపకుండుటయు, పైన నిరసించుటయు కొత్తపల్లిగ్రామమున జరిగి యున్నందున పైకి వీరు భీకరముగ మాట్లాడుచున్నను లోలోన వీరి కేర్పడిన విచార సాగరమునుండి పైకుబుకు తరంగములు వారి చిత్తవృత్తిని నెలుకపరిచినవి. దానితో పత్రికను నాయాజ మాన్యమునుండి తప్పించవలెనని సంకల్పించి యువకసంఘమునకు నప్రతిష్ఠగూర్చు విషయములు నేను వ్రాసితిననియు, నట్లు వ్రాయుట పత్రికాధిపతి నిరంకుశత్వమనియు యువకులు మొరలిడసాగిరి. ఇదేటి న్యాయమో సాంఘికులు ఆలోచింతురుగాక.

వీరు చేసినది ప్రతిష్టావంతమగు కార్యమనిగదా! యువ కులు తలంచుచున్నారు. అప్రతిష్ఠనేగదా నేను పత్రికలో సౌమ్య మార్గమున ప్రకటించితిని. దానివలన తమకు నప్రతిష్ఠ కలిగిన దని వారు తలంచుటయు పైన వచించుటయు చూడ స్వవచన విరుద్ధముగాదా? నిజముగా నది నప్రతిష్ఠకు హేతుభూతమగు కార్యమని వారు తలంతురా? యువకులిప్పుడైనను, మించిపోయిన దేమున్నది? అట్లుచేయుట అక్రమమని యెందుకు ప్రకటింప గూడదు? ఊరక తమ యాశయములకు విరుద్ధముగ భాషించు సనాతనధర్మ పరాయణులను నిందించుటయా? వీరికి న్యాయమని తోచినది. భళిరా! వీరి యుదారస్వభావము, అహింసావ్రత ములను నేమని కొనియాడవలయు? వారేమనుకున్ననేమి? ధర్మ బుద్ధితో నేను న్యాయమనుకున్నదానిని నేనాచరించితిని

మహాసభయందు శెక్రిటరీ, ప్రెసిడెంటుగార్లు నన్నే పత్రికా నిర్వాహణమును చేయుమనికోరిరి. అంతకుపూర్వమే యాపత్రిక

యందు నాదరణభావము శైవసాంఘికులకు లేదని గ్రహించి నికార్యమునుండి నేను విరమించుటకు నుద్యమించియు పైవారి యందు గల గౌరవభావమునుబట్టి నేనంగీకరించితిని. అందుపై యువకులుమాత్రము మహాసభవారు అనుమతించిన విషయములుతప్ప యితరముల పత్రికలో ప్రకటింపగూడదను నియమమునకు లోబడి పత్రికను ప్రకటింపవలెనని కోరిరి. దానిపై శైవసాంఘికులెవరైనను వ్యాసములు పంపునెడ, వానిని మహాసభవారి యనుమతితో ప్రకటింతునుగాని, నా సంపాదకీయవ్యాసమును ప్రకటించుటకు మహాసభవారి యనుమతి పొందనవసరములేదని చెప్పితిని. సంపాదకీయవ్యాసమునుకూడ మహాసభవారి యనుమతితో ప్రకటింపవలెనని యువకులు కోరిరి. ఆ సంగతి మహాసభవారనే యెడల, పత్రికాసంపాదత్వమును వదలుకుందునేగాని, యానిబంధనకు లోబడనని దృఢముగా చెప్పితిని. పత్రికా సంపాదకత్వము సానందరావుగారియందుండేయడల నష్టమేమి? యని శెక్రిటరీగారు ప్రశ్నించగా యువకులు వారికి సమాధానము చెప్పజాలక వారినే సంపాదకులుగా నుండమని కోరిరి. పత్రికకు సర్వస్వాతంత్ర్యములు లేనిది నేను మాత్రమెట్లంగీకరింతునని శెక్రటరీగారు ప్రత్యుత్తరమిడిరి. మీకైతే సర్వస్వాతంత్ర్యములుండుటకు మాకు సమ్మతమేయని యువకులు వారిని ప్రార్థించిరి. అయినచో సానందరావుగారికే సర్వస్వాతంత్ర్యములుంచినచో మీకు నష్టమేమి? యని తిరిగి ప్రశ్నించిరి. అందుకు నసనసలాడుచు సరియగు సమాధానము యువకులు వారికొసంగలేదు.

తరువాత పత్రికను మాసపత్రికగా చేయుటకు సంకల్పించితిననియు, దానికి నన్ను సంపాదకునిగా నుండమని, శెక్రిటరీగారు నన్ను కోరినంతలో నేను యీదిగువ సమాధాన మిచ్చితిని. ఈ ద్విమాసపత్రిక నడుపుటకే, నేను స్వంతగృహ వ్యవహారములను నవరించుకొనుట మాని, బందరు మాటిమాటికి రావలసి వచ్చుచున్నది. అందువల్ల నాకార్యములు చెడిపోవుచున్నవి.

దీనిని ద్విమాసపత్రికగానే యుంచేయెడల, కొంతకాలము తంటాలు పడగలననిన్ని, మాసపత్రిక చేసేయెడల, మీరు స్వయముగా నిర్వహించవచ్చును, లేక మరి యితరులచే నిర్వహింపచేయ వచ్చుననిన్ని మాసపత్రికను నేను నడపుటకు వీలులేదనిన్ని సమాధాన మిచ్చితిని. అయినచో మాసపత్రికకు, వేరే డిక్లరేషణ్ పొందుపర్యంతము, ప్రస్తుతము డిక్లరేషణ్ పొందియున్న ద్విమాస పత్రిక నడుపవలెనని నన్ను కోరిరి. అందుకు నేను వాగ్దానంచితిని. నిజ మిట్లులుండ, కృష్ణామండలములో యువకులు, పత్రికాధికారము నానుండి లాగివేసినట్లును, నన్ను మహాసభవారు దూషించినట్లును మున్నగు నసత్యప్రచారములచే సాంఘికుల మనంబుల సంశయముల నొనగూర్చుచున్నారు. వారిది దుష్ప్రచారమని కృష్ణా గుంటూరు మండల వాస్తవ్యులు నిటీవల క్రమముగా గ్రహింపగలిగిరి. నిజము నిలుకడమీద గాని తెలియదని పెద్దలు చెప్పుదురు.

ఇప్పటికి శైవమహాసభ జరిగి, నేటికి దాదాపు రెండు మాసములైనను, మాసపత్రిక వెలువడి యుండలేదు. అదిగాక సెక్రటరీగారు గ్రామాంతరములో నున్నట్లు తెలియవచ్చినది. కాబట్టి చైత్ర వైశాఖ మాసముల సంచికకు నంతరాయము రాకుండ నీరెండవ సంపుటమున ప్రథమ సంచికను నేను వెలువరించితిని. ఇంకను నన్ను యీద్విమాస పత్రికను నడుపమని మహాసభవారు కోరేయెడల, సంఘమునందు బహిరంగముగ యువకులుగాని, వృద్ధులుగాని చేయునట్టి యకార్యములనుగూర్చి వ్రాయుట, సంఘమునందలి గుణాగుణములను, దోషాదోషములను న్యాయఫణితి విమర్శించుట మున్నగు కార్యములకు నిరంకుశాధికారమునాకున్ననేగాని నే నంగీకరింపనని ప్రత్యుత్తర మిడియెద.

మహాసభగాని, పత్రికగాని, సంఘమును బాగుచేయుటకు గదా యేర్పడినవి. సాంఘికులలో, కొందరి భీకరాదావములకు

జడిసి, నిష్పాక్షికముగా, సంఘమును బాగుచేయుటకు నుద్యమిం పని మహాసభగాని, సాంఘిక దురాచారములనుగాని సదాచారములనుగాని బహిరంగపరచి, సంఘశ్రేయముకై, న్యాయవిమర్శనము చేయజాలని, పత్రికగాని నిష్ప్రయోజన మగుటవలన, నట్టి నిరుపయోగమగు పత్రికకు నాధిపత్యము నేనెంతమాత్రము నంగీకరింపను. అట్టి సభలో సభ్యత్వమునుగూడ నేనెంతమాత్రమును హర్షించను.

ఈ 22 వ మహాసభకుగూడ విద్వాన్ శ్రీ ము॥ వీరేశలింగ శాస్త్రిగారినే మరల ప్రెసిడెంటుగా చేయవలెనని, చాలమంది యభిప్రాయమైయుండెను. ఈవితంతూద్వాహముయొక్క గడబిడలో, తమకెట్టి గౌరవలోపము కలుగునో యని యెంచి తొలి దినమున మహాసభకు హాజరుకాక, రెండవ దినమున హాజరైరి. అంతకు పూర్వమే వారు శ్రీ॥ లో॥ చాగంటి మల్లికార్జునరావు గారినిగాని, దేవిడీ జమీందారుగారినిగాని మహాసభాధ్యక్షులనుగా నుండమని, కోరి తంతిద్వారా తమ యభిప్రాయమొసంగిరి. దేవిడీ జమీందారుగారు శరీరస్వాస్థ్యములేమిచే, మహాసభకు రాజాలమని తంతినిచ్చిరి. అందుమీద మల్లికార్జునరావుగారే ప్రెసిడెంటుగా నామినేటు చేయబడిరి.

రెండవదినమున శ్రీవీరేశలింగ శాస్త్రిగారు మహాసభకు విచ్చేసిరి. వారెట్టులైనను మహాసభాకార్యవర్గమునుండి యుపాయయముగా తప్పించుకొన జూచిరిగాని, యుపాధ్యక్షపదవీ బంధముచే వారిని నెట్టకేలకు బంధించివైచిరి. సనాతన ధర్మ విద్యాపారంగతులగువారుకూడ సభలో లేనిచో నది నిరుపయోగమే కదా!

22 వ మహాసభా రిపోర్టు శెక్రిటరీగారు స్థాపించబోయే మాసపత్రికలో ప్రకటింతురో, లేక యీద్విమాస పత్రిక రెండవ సంచికకు బంపుదురో, లేక వేరుగా ప్రకటింతురో నేను చెప్ప

జాలను. ఈసంచికయొక్క ప్రింటింగు పేపరు వ్రాగిరాలకగు ఖర్చు శివలెంక లింగయ్యగారి స్వంత పాకెట్టునుండి వ్యయింప బడినది. నిల్వచందా ద్రవ్యమేమిన్ని లేదని కొత్తపల్లిలో తేల్చ బడినది.

ఇట్లు
ఇవటూరి సానందరావు,
పత్రికా సంపాదకుడు.

---

శ్రీ శివాయగురవేనమః

# ప్రబోధము.

—:o:—

శైవమహాజనులారా!

మన శైవమతము సనాతన ధర్మసంరక్షణమునకు బద్ధకంకణముహైన, వైదికమతము లన్నిటిలో నగ్రగణ్యమైనదని, వేదాది సమస్త ప్రమాణగ్రంధములను బట్టియేమి, మన ప్రాచీనులు ఘోరతపంబు లాచరించి సర్వలోకపూజ్యులై యారాధ్య బిరుదమున వన్నెకెక్కి ప్రభువులను సహితము మెప్పించి సంపాదించిన యగ్రహారాది సమస్త ధనసంచయమును బట్టియేమి, విస్పష్టముగ గన్పట్టుచున్నది. అట్టి మతము క్షీణగతినొందుచూ, వచ్చుచుండుట జూచి, మతోద్ధరణమునకై 1909 సం॥ మొదలుకొని 1939 సం॥ వరకు నిప్పటికి 22 మహాసభలు జరుపబడినవి.

ప్రారంభమున నీమహాసభాస్థాపనా సంకల్పము, ఏమహాత్మునిచే జేయబడినదో గాని, దీనికి కలుగుచువచ్చిన నంత

రాయముల వర్ణింప నలవిగాదు. ఈమహాసభా కల్పతరువు స్థాపింప బడిన, తొలిదినములలోనే, దీనికి దహనసాపిండ్య వివాదమను క్షయరోగ మంకురించినది. ఈకల్పతరువు ఆరోగముతోనే యంత రించవలసి యుండెడిదేగాని, ధన్వంతరి సదృశులగు నప్పటి శైవ మత పండితులు చిరకాలము తగిన చికిత్సచేసి యున్నందున నాజాడ్యము మూడువంతు లంతరించినది. క్షయవ్యాధి పుట్టనే కూడదుగాని, పుట్టినయెడల, జీవి తప్పక గిట్టుచుండుట లోకాను భవమునుబట్టి తెల్లమగుచున్నది. తరువాత నీమహాతరువునకు భాష్యసిద్ధాంత వివాదమను రెండవరోగ మంకురించినది. ఈ వ్యాధిచే కొంతకాలము గడచి, దానినుండి విముక్తిబొంది తిరిగి పుష్పించి నూతనశోభతో బ్రకాశింప మొదలిడినది. అయిన నేమి, తిరిగి యిప్పుడు వితంతూద్వాహవివాదమను మూడవ ఘోరజాడ్యము పొడసూపినది. ఈజాడ్యము పై రెండువ్యాధుల కంటె ఘోరవిపత్కరమైనది. ఎందువల్లనన, పై రెండువ్యాధులు కొన్నిధాతువులయందు కలిగినవేగాని, మూలమున బుట్టియుండ లేదు. అందువల్ల నవి చికిత్సకు సాధ్యములైనవి. ఈ మూడవ వ్యాధియో, తరువుయొక్క కుంకటివేరులో కలిగినదిగాన, దీని మాన్ప దుస్సాధ్యము. ఈ వ్యాధిని నివారించుటకు నిప్పటికాల మున, తగిన వైద్యులు లేరు. కాన దీని జీవితము పరమేశ్వరా ధీనమైయున్నదిగాని, మన యధీనమున లేదని నేను నిస్సంశయముగ నమ్ముచున్నాడ.

ఈ మహాసభా కల్పతరువు సనాతన ధర్మశాఖలచే నలరారి, మోక్షఫలమొసంగుటకు, సంఘక్షేత్రమున, తొలుత, నాటబడి యున్నదేగాని, యధర్మశాఖలచే విజృంభించి నితాంత నరక రోగ ప్రదములగు, పచ్చికాయల నొసంగుటకుగాదు. అయిననేమి యుద్దేశము తారుమారైనది. కారణము; కానికాలమున నీవృక్ష మును స్థాపించుటయని వివేకులు తలంచుచున్నారు. కానికాల

మనగా, కలికాలమని నా తాత్పర్యము. దానికి తగినట్లు, "కలౌ శైవమరోచకమ్మనియెడి" యభియుక్తి యుండనేయున్నదిగదా !

లోకమునగల సమస్తాస్తిక మతములలో వేదమతము సనాతనమైనదని, ప్రాచ్య పాశ్చాత్యపండితులందరు నంగీకరించి యున్నారు. ఈ మతగ్రంథములయందనంత లోకోపకారక విష యములు గలవని, పాశ్చాత్యపండితులభిప్రాయపడి వీని ప్రాశస్త్య మును పలువిధముల నగ్గించియున్నారు. అగ్గించుటయేగాక, యీ గ్రంథముల తత్వమును కనుగొనుటకై లక్షలాదిగ వెచ్చించి, రీసర్చి ( Research society ) సంఘములను స్థాపించి నేడు విశేషించి కృషిచేయుచున్నారు. మనవారైననో, నిరంతర ధనార్జనాసక్తులై, యందుకొరకు నీచసేవలకునుసహితము గడంగి మన పూర్వుల మహోన్నతాశయముల విడనాడి జ్ఞానదూరులై చెడిపోవుచున్నారు. అట్టి మనలను బాగుచేయువారెవరు ? ఏనాటికైనను లోకము బాగుపడవలయునన్న సనాతనధర్మమే స్థాపింపబడవలయునుగాని, యితరములవలనగాదు.

ఈ సనాతన ధర్మతత్వమునుగూర్చి తెలిసికొనుటకు పాశ్చాత్యులు నిరంతరకృషి చేయుటయు, నీధర్మమున నిరాదర ణముకలిగి మనవారు స్వేచ్ఛగ చరించుటయు జగుగుచున్నది. దీనిగూర్చి మనమేమి తలపోయవలయు ?

ఈ సనాతన ధర్మమునెడ మనవారలకు నింత నిరాదరణమేమి ?

సనాతనధర్మమనగ, సనాతన ధర్మ గ్రంథములగు వేద ములయందుగల ధర్మము. ఆధర్మము సామాన్యమనియు, విశేష మనియు, రెండువిధములు. ఈ రెండువిధములగు ధర్మములు మానవులకు నిహపరసాధనములైయున్నవి. అందువల్ల నిహపర సౌఖ్యముల గోరువారలు ధర్మస్వరూపములగు వైదిక నియమ ములకు గట్టుబడియుండవలయును. లేనిచో ఫలమును బడయ

జాలరు. అవైదికనియమములకు గట్టుబడినచో దుఃఖదాయకము లగు నల్పఫలములను బొందుదురు. అవైదిక నియమములనగా, వేదములయందు జెప్పబడక, యితర బైబిల్, ఖురాన్, జండ్, అవేస్తా మున్నగు నితర మత గ్రంథములయొక్క నియమములని యర్థము. లోకమున నన్నిఖండములయందు గల మానవులు వైదిక నియమములకో, లేక యవైదిక నియమములకో కట్టుబడి జీవయాత్ర గడపుచూ వచ్చుచున్నారు. కాని యిటీవల కొంత కాలమునుండియు నరులు యేనియమములకు గట్టుబడి యుండుటకు నిష్టములేక స్వేచ్ఛగా పశువులభంగి చరింప సంకల్పించి యామా దిరిగనే ప్రవర్తించుచున్నారు. అందువల్ల ధర్మస్వరూపమగు నరత్వము పోయి Darwins Evolution Theory (డార్విన్సు ఎవల్యూషన్ తియరీ) ప్రకారము పశుస్వరూపమగు వానరత్వము సంప్రాప్తమైనది. ఈస్వేచ్ఛయనునది, మండు వేసంగి వేళలయందు నెండమావులు తమయందు పిపాసార్తములగు మృగములకు నీటి భ్రాంతిని గల్పించి, నశయింపజేయు విధమున, నరపశువులకు నిహలోక విహారములయందు సుఖభ్రాంతిని గల్పించి నిర్ధనులను జేసి, దరిద్రదేవతా సాన్నిధ్యమున జేర్చి, బరిమార్చుచుండుట లోకానుభవమునుబట్టి వ్యక్తమగుచున్నది. కాన స్వేచ్ఛయనునది కొరవిదయ్యమువలె దేశమంతటను ద్రిప్పి మానవుని మోసపుచ్చి దుఃఖ సాగరమున బడద్రోయు క్రూరమృగము. నియమము, మానవునితగి నకట్టుబాటులోబెట్టి యతని యభివృద్ధికి సాధనమగు గంగగోవు, నియమములలో కొన్ని కేవలము ఇహసుఖసాధనములు, కొన్ని ఇహ పరసుఖ సాధనములు, కొన్ని మోక్షసామ్రాజ్య సాధనములు. మన వేదములయందు ఇహపరసుఖసాధనములగు నియమము లేగాక, మోక్ష సామ్రాజ్యమందుటకు వలయు నియమములు జెప్పబడి యున్నకతన, వేదములు సర్వప్రమాణ గ్రంధమూర్ధన్యములైనవి. అట్టిచో నిప్పటి మనవారలకు నీవైదిక నియమములయెడ నేల విముఖత్వము కలిగినది? అను ప్రశ్న విచారణీయము. దీనికి

కారణము, ఇప్పటి మానవులకు స్వేచ్ఛయందు బుద్ధి తగిలి యుండుట యని సమాధానము. స్వేచ్ఛగా చరించుట సులభ మగునుగాని, నియమమునకు కట్టుబడుట కష్టముగదా! చూడుడు వేదములు సత్యమును చెప్పుమని శాసించినవి. ఈ నియమమునకు కట్టుబడిన లోకమున చాలసంకటములు కలుగగలవు. అందువల్ల తనవీలు వెంట, తనకు నష్టమురాకున్నంతవరకు సత్యమునే చెప్పుచూ తక్కినచోట్ల అసత్యమాడుచు నరుడు చరించుచున్నాడు. అహింస ధర్మమని యాజ్ఞాపించినవి. అయినను, మానవుడు ఎన్నిహింసలు చేయుచుండ లేదు? కాబట్టి ధర్మము ధర్మము అని నోట చెప్పు దురే గాని, యాచరించుట కడుంగడుకష్టము. కష్టపడుటకు నిష్టములేక, సోమరిపోతులై, చరించువారలకు స్వేచ్ఛ ఉచ్ఛదశ యందున్నదని గ్రహింపవలయును. ఇప్పుడు వేదము లెందరికి విరోధకారణములైనవూ తెలుసుకొంటిరా?

1. సత్యము ధర్మమని బోధించియున్నకతన, అసత్యవాదు లకు విరోధములైనవి.

2. అహింస ధర్మమని బోధించియున్న కారణమున, హింసాపరులకు కంటకములైనవి.

3. పరోపకారము పరమధర్మమని నుడివిన హేతువుచే, అపకారపరులకు నింద్యములైనవి.

4. దయను ధర్మమని చేర్కొనుటచే, నిర్దయహృదయులకు అసహ్యకరములైనవి.

5. శౌచము ధర్మమని వక్కాణించుటచే, అశుచివంతు లకు నంటరానివైనవి.

6. త్యాగము ధర్మమని స్పష్టపరచినందున, పిసినిగొట్టు పీనాసులకు నప్రియములైనవి.

7. సత్కర్మానుష్ఠానమును, సంతరించినందున, దుష్కర్మ పరులకు దూరములైనవి.

8. చోరత్వమును నిరసించినందున దొంగలకయిష్టము లైనవి.

9. మాంసభక్షణమును నిరాకరించినందున, తదాచరణీయుల కనాదరణీయములయ్యెను.

10. దురన్నభక్షణమును వారించినందున, తప్పుడుకూళ్లు గుడుచువారి కసహ్యాములయ్యెను.

11. మద్యపానము గూడదని తెల్పినందున తదాచరణీయులకు మాన్యములు గావయ్యెను.

యింతవరకు సామాన్యధర్మములనుబట్టి వేదములు, విరోధకారణములైనవి. ఇక విశేష ధర్మములనుబట్టి యెట్లు పగదెచ్చుకొన్నవో నిరూపించెదను.

12. పాతివ్రత్యము పరమధర్మమని నుడువుటచే, కులటలకు నిందాస్థానీయములైనవి.

13. ఏకపత్నీవ్రతము ముఖ్యధర్మమని పలికినందున, బహుపత్నీవ్రతస్థులచే భంగపాటు నొందినవి.

14. కన్యాదానము ఉత్తమ ధర్మమని నుడివినందున, దుర్దాన కర్తలకు దురాప్తములైనవి.

15. రజస్వలానంతర వివాహములు దూష్యములని భాషించినందున, తదాచరణీయుల మన్ననలకు నపాత్రములైనవి.

16. విధవా వివాహముల నిందించియున్న కారణమున, తదాచరణీయులకు తగనివయ్యెను.

17. స్త్రీ పునర్వివాహమును చెడుదనిచెప్పినందున, తదాచరణీయులకు నసమ్మతములయ్యెను.

18. వర్ణాంతర వివాహమును గూడదని చెప్పినందున తదాచరణీయులకు వెగటుగదోచెను.

19. జన్మనుబట్టి జాతివ్యవస్థను నిరూపించియున్న హేతువుచే తద్వ్యతిరేకులకు దూరమున నుండవలసి వచ్చెను.

20. సర్వమానవులు సమానముగాదని నిజము వచించి నందున, తద్వ్యతిరేక భాషకులకు విరోధకారణములయ్యెను.

21. అస్పృశ్యత ఉత్తమధర్మమని ఘోషించినందున, తన్నివారకులకు నప్రాత్రములైనవి.

22. భక్తి జ్ఞాన వైరాగ్యములను బోధించియున్నందున, బ్రాహ్మణుని కపటవన్నాగములని విశేష కపట బ్రాహ్మణ బ్రాహ్మణేతరులచే నిందింపబడినవి.

ఇట్లొక్కొక్క కారణముచే, నిక్కాలపు స్త్రీ పురుషులకీ వేదధర్మములు పరమసంకటములై యున్నందున, మానవలోకమున నిప్పటి పరిస్థితులనుబట్టి వీనిని సన్మానించువార లగపడకున్నారు. అట్లని బొత్తిగా సన్మానించువారలును లేకపోలేదు. మరియొక విశేషము. ఈవేదములకు ప్రాచీనులు చెప్పిన సత్యార్థములను విడనాడి, యిప్పటి కాలపరిస్థితులనుబట్టి, వేదములకు తమకు తోచిన యర్థములను ముడిబెట్టి, వేదములు తమకును పరమ ప్రమాణములని వాదించు సాహసు లనేకులుగలరు. వీరి యున్మత్త ప్రలాపములతో మన కవసరము లేదు సర్వజ్ఞులగు ఋషిపుంగవులచే, నిర్ణయింపబడిన యర్థములే సార్థకములు. తక్కినవి నిరర్థకములు. నిరర్థకార్థములచే వేదములు తమకును ప్రమాణములని వాదించు సాహసులకంటె, నాస్తికులే సంస్తవనీయులు.

వేదములను త్రికరణశుద్ధిగా ప్రేమించువారలెవ్వరో, మీరు తెలుసుకొందురా? తెలిపెదను వినుండు.

1. వేదధర్మములను త్రికరణశుద్ధిగా నాచరణయందు బెట్టికొనువారలకు వేదములు ప్రేమపాత్రములయ్యెను.

2. వేదధర్మముల నాచరించుట కష్టమనితోచి, ఆకష్టములను సహించుటకు శక్తిలేక, తమ యసమర్థతను దెలుపుచును, వేదధర్మములు పరమపవిత్రములని నమ్మువారికి, వేదములు ప్రేమపాత్రములయ్యెను.

3. మహమ్మదీయాదీతర మతగ్రంథములను ప్రమాణము లని నమ్మజాలక, వేదములకు తమకుతోచిన యర్థములనే ముడి బెట్టి వ్యాఖ్యానమొనర్చు వారల కొకవిధముగా వేదములు ప్రేమ పాత్రములయ్యెను.

4. వేదములందేవ్వో మహోన్నత విషయములు కలవని నమ్మి వానితత్వమును గ్రహింప రీసర్చికమిటీలనుస్థాపించిన పాశ్చాత్య పండితవరేణ్యులకు వేదములు ప్రేమపాత్రములయ్యెను.

ఈ నలుగురికి వేదము లమృతతుల్యములుగను తక్కిన నరు లకు నవి విషతుల్యములుగా నున్నవని గ్రహింపవలసి యున్నది.

ఇప్పటివారలలో చాలమంది కసహ్యాకరము లైనట్టియు, మోక్షసామ్రాజ్యమునకు దారిజూపునట్టియు, పైన బేర్కొనబడి బట్టియు, ధర్మసంచయమే న్యాయమగు ధర్మసంచయము.

ఇక స్వర్గాదిలోక సుఖసాధనములగు యజ్ఞాది ధర్మసంచ యము మరికొంతకలదు.

ఇక మానవలోక సౌఖ్యమే సంపాదనీయమగునెడ, సంఘో పకారకములగు సత్యాసత్యములు, హింసా హింసాదులు ధర్మము లని, వైదిక మతాదర్శము అవైదికమతాదర్శము అను శీర్షికక్రింద నేనిదివరలో వ్రాసి పత్రికాముఖమున పాఠకులకు నందజేసిన వ్యాసమున నిరూపించి యుంటిని.

కావున, మానవుడు తాను పొందదలచిన, సౌఖ్యమునుబట్టి దానిని సాధించుటకు వలయు కర్మజాతము వాని వానికి ధర్మ మగుచుండును. మోక్షసామ్రాజ్యమును సాధించుటయే జీవపర మాభ్యుదయమని యేసంఘములవారు నముచున్నారో వారి కేర్ప డిన ధర్మజాతమునుబట్టి, తక్కిన సుఖముల సంపాదించువారి యొక్క ధర్మములు, యధర్మములని నిర్ణయింపబడుచున్నవి. పున రావృత్తి రహితమైనది మోక్షసామ్రాజ్యము. పునరావృత్తి సహితములైనవి, స్వర్గమానవ లోకాదిసౌఖ్యములు, అనిత్యము

లైన స్వర్గమానవలోకాది సౌఖ్యముల నాసించి, సంసారచక్రమున పరిభ్రమించవలదనిన్ని, నిత్యమగు మోక్షసామ్రాజ్యము నధిష్ఠించ వలసినదనిన్ని వేదము మన కుపదేశించుచున్నది. అందువల్ల వేదమునకు గొప్పదనము వచ్చినది. ఇటువంటి పవిత్రమైన వేద ధర్మమునకు దూరులైన మానవుల కేగతి పట్టనున్నదో గదా!

ధర్మము నెడ, నొక పూర్వాచారపరాయణునకును, నొక సంఘ సంస్కారికిని జరిగిన సంభాషణము, గ్రహింప తగినదై నందున, దాని నీక్రింద పొందుపరచు చున్నాడ.

పూర్వాచారపరాయణుడు :— సర్వమత ధర్మములలో, వేదధర్మ మత్యుత్తమమైనది. అదియే న్యాయమగు ధర్మము.

సంఘసంస్కారి:— వేదధర్మమే న్యాయమగు ధర్మమని దేనినిబట్టి గ్రహించితిరి?

పూర్వా :— వేదమునుబట్టియే గ్రహించితిని.

సంఘ :— ఇతరమతములకు ఖురాన్, బైబిల్ మున్నగు గ్రంథములుగలవుగదా! వానినిబట్టి ధర్మము నేల గ్రహింప గూడదు?

పూర్వా:— ఆగ్రంథములు, మానవకల్పితములగుటవలన, అట్లు గ్రహింపగూడదు. ఎందువల్లనన, మానవబుద్ధి భ్రాంతి ప్రమాదావస్థలు కలదియగుటవలన, ఒకప్పుడు సత్యమును గ్రహించుట వేరొకప్పుడు అసత్యమును గ్రహించుటయు జరుగు చుండును.

సంఘ :— ఆగ్రంధములు మానవకల్పితములని యెవరు వచించిరి.

పూర్వా :— ఆ యా మతస్థులే వచించిరి.

సంఘ :— ఆ యా మతస్థులు ధర్మములు దైవదత్తము లనియు, అవి ఏసుక్రీస్తు మహమ్మద్ మొదలగు ప్రవక్తలచే ప్రచారము చేయబడుచున్నవనియు చెప్పుచున్నారుగదా!

పూర్వా:— వారట్లు చెప్పుదురుగాక, ఆ రెండుగ్రంథము లలోని ధర్మములు పరస్పర విరుద్ధములైయున్నవి. విరుద్ధధర్మ ముల నీశ్వరుడుపదేశించునా ?

అదిగాక, యీశ్వరధర్మముల నీశ్వరభాషలో నుపదేశిం చునుగాని అన్యభాషలో నెట్లుండును. ఆధర్మములు అన్యభాషలో గనుపించినయెడల ఈశ్వరభాషలోనుండి గ్రహింపబడినవని తలం చుట న్యాయసమ్మతము.

సంఘ :— బైబిల్ ఖురానులనుబట్టి వేదధర్మములు విరు ద్ధములుగావా ? అవి యెట్లు ప్రమాణములగును ?

పూర్వా :— వేదధర్మములు, వేదభాషయందుగలవు. వేదభాష మానవభాషగాదని లోకమున నిరూఢమైనకీర్తి ప్రతిష్ఠలు కలవు. ఆధర్మములనే మానవులు గ్రహించి తమ భాషలలో ధర్మగ్రంథములను నిర్మించుకొనిరి.

సంఘ :— వేదములు దైవదత్తములని దేనినిబట్టి గ్రహిం పవలెను?

పూర్వా :— ఈశ్వరదత్తములని, లోకమున, నిరూఢ మైన, కీర్తి కలదుగాన, దానినిబట్టి గ్రహింపవలెను.

సంఘ :— ఈశ్వరదత్తములుకాని, గ్రంథములకుగూడ లోకమున నిరూఢమైన కీర్తి లేదా ?

పూర్వా :— ఈశ్వరదత్తములుకాని గ్రంధములకు, అట్లు కావనియు, ఈశ్వరదత్త గ్రంధములకు అట్లు అగుననియు అనెడు కీర్తిప్రతిష్ఠలు కలవు, గాని యిందుకు వ్యతిరేకముగా వాడుకలు లేవు.

సంఘ:— వేదములు మానవకల్పితములని ఎందుకు నెంచ గూడదు ?

పూర్వా :— మానవుడెప్పుడును, తన యనుభవములనే వ్రాయగలుగునుగాని, అంతకంటె వేరెద్దియు వ్రాయజాలడు. వేద ములందైననో, మానవానుభవములకు విరుద్ధములగు స్వర్గ నరకాది

లోకముల ప్రశంసయు, పునర్జన్మ విషయమును, పుణ్యాపాప విషయమును ఈశ్వరుడొకడు కలడనియు, ఆ యీశ్వరుడు సర్వాంతర్యామి యనియు నిత్యాదివిషయములు కలవుగాన, వేదములు మానవ కల్పితములు గావు.

సంఘు: — బైబిల్, ఖురాన్, మున్నగు గ్రంథములయందు యిటువంటి విషయములే కొన్ని కలవుగదా! అవి మానవకల్పితములనుటయెట్లు?

పూర్వా:— బైబిల్, ఖురాన్, ధర్మములు గల భాషలు, వేదభాషకంటె, చాల అర్వాచీనములగుటవలన, వేదమునుండియే అట్టి మానవానుభవమునకు విరుద్ధములగు నభిప్రాయములు గ్రహింపబడినవనుట సమంజసము.

సంఘు :— మానవానుభవమునకు విరుద్ధములగు వేదాభిప్రాయములనన్నిటిని బైబిల్, ఖురాను రచయితలు యేల గ్రహింపలేదు ?

పూర్వా:—ఆ యభిప్రాయములలో తమకు నచ్చినవానినే గ్రహించినారుగాని అన్యములను గ్రహింపలేదు. అన్నిటిని గ్రహించియున్నయెడల, నామతములు వేదవిరుద్ధములగుట యెట్లు ?

సంఘు :— ఆమతగ్రంథములుగూడ, సత్యదయాదులను ధర్మములని ప్రశంసించుచున్నవిగదా. వానిని గ్రహించిన దప్పేమి?

పూర్వా :— ఆసత్యదయాదులను వేదముమాత్రము చెప్పలేదా ? వేదముండగా తక్కిన మత గ్రంథములనుండి గ్రహింపవలసిన యవసరమేమి ?

సంఘు :— వేదమునుండియు గ్రహింపవచ్చును, తక్కిన మతగ్రంథములనుండియు గ్రహింపవచ్చును. వేదముండగా, తక్కిన మతగ్రంథములనుండి గ్రహింపగూడదనుటయెట్లు ?

పూర్వా :— తక్కిన మత గ్రంథములు ప్రమాణములని నమ్మినచో యాగ్రంథములయందన్ని విషయములను ప్రమాణములని గ్రహింపవలెను. వేదము ప్రమాణమని నమ్మినచో వేదమునం

దన్ని విషయములను ప్రమాణములని నమ్మవలెను. అట్లుగాక వేదము, బైబిల్, ఖురాను మున్నగు గ్రంథములనెల్ల ప్రమాణములనినమ్మినచో ఆగ్రంథములందు ఏకగ్రీవముగ చెప్పబడిన సామాన్యధర్మములను న్యాయమని గ్రహింతువుగాని, యాగ్రంథములందు పరస్పర విరుద్ధములగు విషయములను నెట్లు నమ్మ శక్యమగును ?

సంఘు :— పరస్పర విరుద్ధ విషయముల విడనాడి, యాగ్రంథములన్నిటియందు గల సామాన్య విషయముల గ్రహించినం దప్పేమి ?

పూర్వా :— అట్లు గ్రహించుటకు నీబుద్ధియే నీకు ప్రమాణమైనది. గానియామతగ్రంథము లెంతమాత్రమును గావు. సర్వమత గ్రంథములయందు గన్పట్టు, సత్యదయాది సామాన్య ధర్మములను, మతగ్రంథముల నమ్మని చార్వాకులుగూడ ప్రమాణముగా నమ్ముచున్నారుగదా ? వారినమ్మకమునకు నాయామత గ్రంథములు ప్రమాణములైనవా ? లేదు. వారి బుద్ధియే వారికి ప్రమాణమైనది.

సంఘు :— బుద్ధికి న్యాయమనితోచిన దానిని ప్రమాణమని విశ్వసించిన దప్పేమి ?

పూర్వా:—ఎవరిబుద్ధికి న్యాయమని తోచినదానిని ప్రమాణమని గ్రహింపవలెను?

సంఘు:— మానవులందరి బుద్ధికి న్యాయమని తోచినదానిని ప్రమాణమని యేల గ్రహింపగూడదు?

పూర్వా:— మానవులందు, సత్వగుణప్రధానులు కొందరు రజోగుణప్రధానులు కొందరు, తమోగుణప్రధానులు కొందరు గలరుగదా ? సత్వగుణప్రధానులకు సాత్విక భావములును, రజోగుణ ప్రధానులకు రాజసభావములును, తమోగుణప్రధానులకు తామస భావములు కలుగుగదా ? ఈ మూడువిధములగు భావములకు నేకత్వము స్వప్నమందైనను కలుగునా ? వీరిలో నెవరిభావములను ప్రమాణములనుగా దీసికొనవలెను ?

సంఘ :— సాత్వికుని భావములను ప్రమాణముగా దీసి కొనుట న్యాయము.

పూర్వా :—సాత్వికుని భావములు న్యాయమని సాత్వికుడు గ్రహించును గాని రాజస తామసులెట్లు గ్రహింపగలుగుదురు ? సాత్వికుడు సాత్వికభావములను నెట్లు ప్రమాణముగ గ్రహింపు చున్నాడో, రాజసుడు రాజసభావములను, తామసుడు తామస భావములను నట్లే ప్రమాణములుగ గ్రహించుచున్నారు.

సంఘ :— సాత్వికభావములు లోకకల్యాణమునకు హేతు వులని పెద్దలు చెప్పుచున్నారు గదా! అందువల్ల వానినే ప్రమాణ ముగా గ్రహింతుము దీనం దప్పేమి ?

పూర్వా :— ఇచ్చట పెద్దలనగా వయస్సుచేతనా? బుద్ధి చేతనా? లేక శాస్త్రజ్ఞానము చేతనా? వయస్సు చేతనందువా ? వయస్సుచే పెద్దలు సత్వరజస్తమోగుణములు కలవారెందరో యున్నారు. బుద్ధిచేతనందువా ? అందునను మూడుగుణములు కలవారనేకులున్నారు. శాస్త్రజ్ఞానముచేత నందువా ? అందునను నట్లే. అజ్ఞానమునార్జించు బుద్ధిగలవారినిబట్టి యాశాస్త్ర జ్ఞానము ప్రకాశింపగలదు.

సంఘ :— ఎవరి బుద్ధియందుగల శాస్త్రజ్ఞానము ప్రమా ణమగును ?

పూర్వా :— సాత్వికగుణము కలవాని బుద్ధియందుగల శాస్త్రజ్ఞానము ప్రమాణమగును.

సంఘ :— అట్లని దేనినిబట్టి తెలియుచున్నది.

పూర్వా :— శాస్త్రమునుబట్టియే తెలియుచున్నది. కాబట్టి శాస్త్రము ప్రమాణము. శాస్త్రమనగా శాసించునది.

సంఘ :— ఎవరా శాసించువారు ?

పూర్వా :— ఈశ్వరుడు.

సంఘ :— ఈశ్వర శాసనమున కేమని పేరు ?

పూర్వా :— శాస్త్రమని పేరు. దానినే వేదమందురు.

సంఘ :— వేదముగాక, మరియితర మానవ కల్పితము లగు వ్యాకరణాది శాస్త్రము లెట్లు ప్రమాణములగును?

పూర్వా :— ఆశాస్త్రముల కన్నిటికి వేదమే మూలమగుట వలన, నవియు శాస్త్రములనుపేర జగమున వెలయుచున్నవి. వేయేల, వేదార్థమును నెవ్వరు చెప్పినను వారివారి వాక్యములు మానవ నిర్మితములైనను ప్రమాణములే. వేదవిరుద్ధముగ నెంతటి మహామహుడు గ్రంథములు నిర్మించినను నవి యన్నియు నప్రమాణములే.

సంఘ:—మీయుక్తులు ప్రశంసనీయములే. అయినను, నా అంతరాత్మకు వేదమునందు స్థిరమైన నమ్మకము లేదు. ఇట్లుండుటకు కారణమేమి ?

పూర్వా :— నీవు చెప్పినదియు సత్యమే. ప్రతిజీవికిని వానివాని జన్మాంతర సంస్కారములనుబట్టి కొన్నికొన్ని విషయములందు స్థిరమైన నమ్మకము కలుగుచుండును. కొందరు వేనియందును స్థిరమైన నమ్మకములేక చపలచిత్తులై చరించుచుందురు. దానికి పరమేశ్వరుడు చికిత్స చేయవలయునేగాని, ఎంతవాడైనను మానవునిచేతగాదు. కొందరు దేవుడు కనబడకపోయినను, కలడని స్థిరముగా నమ్ముదురు. కొందరు దేవుడు లేడని స్థిరముగా నమ్ముదురు. ఈ విధముగ జీవులయొక్క స్థితిగతులు కనబట్టుచుండును.

సంఘ :— అయ్యా! నా అంతరాత్మకు తోచినట్లు ప్రవర్తించుటే నాకు తృప్తిగానున్నది, అంతకంటె నాకు వేరెద్దియు తృప్తి లేదు. ఆప్రకారం నేను నడచుకొనగూడదా ?

పూర్వా :— నీ అంతరాత్మప్రకారం నీవు నడుచుకొమ్ము. నీయంతరాత్మప్రకారం పరులను నడచుకొమ్మని నిర్బంధపరచకుము. కారణమేమనగా :— నీకెట్టి యంతరాత్మగలదో, ప్రపంచమునగల రెండువందల కోట్ల మానవులకు ప్రత్యేకప్రత్యేకముగా అంతరాత్మలు కలవుగదా! వారి యంతరాత్మలకంటె నీ యంతరాత్మ

గొప్పదని తలంతువా? అది నీయహంకారమును సూచించునుగాని వారియందరికంటె నీవెన్నడును గొప్పవాడవుగావు సర్వాంతర్యామియగు సర్వేశ్వరుడే అందరికంటె గొప్పవాడు. ఆయనమాటయే ప్రమాణము. ఆమాటలను స్మరించిన మహనీయులగు ఋషుల మాటలే మనకు ప్రమాణము. ఆఋషివాక్యముల స్మరించుచూ వచ్చిన, తపోధనులగు, మన పెద్దల వాక్యములే ప్రమాణములు. యివిగాక తక్కిన వాక్యజాతమంతయు నప్రమాణము.

వేయేల నొక్క సంగతి చెప్పుచున్నాను వినుము. నేను నీకు ప్రమాణమందువా? నామాటవినుము. లేక వేదము ప్రమాణమందువా? వేదము చెప్పినట్లు నడచుకొనుము. లేక బైబిల్ ప్రమాణమందువా? ఆమతస్థులతో చేరి చరింపుము. లేక ఖురాన్ ప్రమాణమందువా? మహమ్మదీయులతో కలసి మెలంగుము. కాదు దేవుడే వచ్చి చెప్పవలెనందువా? ఆయనవచ్చి చెప్పువరకును ఆగుము. నీకు నీవే ప్రమాణమందువా? నీయిష్టము వచ్చినట్లు నడచుకొనుము. నీయిష్టము శాస్త్ర విరుద్ధమైనను, లోక సమ్మతిని బొందవలయును సుమీ! లేనిచో నీకు కష్టములు తప్పవు. కావున హితమెఱింగి ప్రవర్తింపుము.

సంఘ:—ఆర్యా! ప్రమాణ సందర్భవిషయమున ననేక ప్రశ్నలచే మీకు శ్రమయిచ్చితిని. మరికొన్ని సంశయములు నాకు కలవు మరొకప్పుడు ప్రశ్నింప తలంచినాడ.

పూర్వా:— నాకేమియు శ్రమలేదు నీవంటి జిజ్ఞాస బుద్ధికలవానికి చెప్పుటకంటె నాకు కావలసినదేమి? ఇప్పుడే అడుగుము.

సంఘ:— చిత్తము. కొంచెముసేపు వేదము ప్రమాణమనినమ్మి అందుగల కొన్ని విషయములనుగూర్చి ప్రశ్నించువాడ.

పూర్వా:— అట్లే చేయుము.

సంఘ:— బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాల్గు జాతులందు స్త్రీలకు భర్తలు చనిపోయినప్పుడు తిరిగి యేల వివా

హము చేయగూడదు ?

పూర్వా:- వేదములు కూడదని చెప్పినందున చేయగూడదు.

సంఘు :— వేదములెందుకు కూడదని చెప్పినవి?

పూర్వా :— లోకమున స్త్రీలను పురుషులు వివాహమాడుట ధర్మము కొరకుగాని, భోగము కొరకుగాదనిన్ని అందువల్ల నాల్గువర్ణములవారికి వేదధర్మములు ఆచరణీయము లైనందున ధర్మము కొరకే వివాహమాడవలయును గాని, భోగముకొరకు వివాహము కూడదనిన్ని శాసించినవి. అందువల్ల వైదిక ధర్మాచరణమునకై నాల్గువర్ణముల యందెవరు, స్వజాతియందలి స్త్రీని ధర్మముకొరకు వివాహమాడుచున్నారో యా స్త్రీ ధర్మపత్నియనిన్ని యాపెయందు జనించిన సంతానము ధర్మాచరణమునకు యోగ్యమైన దగుటవలన ధర్మసంతానమనియు ఆర్యసంప్రదాయమున గలదు. ధర్మము ఊర్ధ్వగతికి సాధనమగుటవల్లను, భోగము అధోగతికి కారణమగుటవల్లను, ధర్మముకొరకే వివాహమాడవలయునని వేదము శాసించినది. మరియు స్త్రీలు, అధవలనియు, సధవలనియు, విధవలనియు మూడువిధములుగా నున్నారు. అధవలనగా పుట్టిన దాది పెండ్లికాని కన్యలని యర్థము. సధవలనగా వేదధర్మప్రకారము భర్తను గ్రహించిన స్త్రీ యని యర్థము. విధవ యనగా భర్త మృతినొందిన పిమ్మట జీవించియుండు స్త్రీ యని యర్థము. ఈమూడు విధములగు స్త్రీలలో, వేదధర్మప్రకారము దానయోగ్య, కన్యయేగాని, సధవ, విధవలు గారని పండితులు వచించుచున్నారు. అందువల్ల భర్త మృతినొందిన స్త్రీకి వివాహముపుట్టదు. భర్త బ్రతికియుండగనే వివాహము కూడదని బాలుడుకూడ గ్రహించునుగదా ?

సంఘు:—భర్తపోయిన స్త్రీకి ఉత్తమగతి యెట్లు చేకూరును?

పూర్వా !— విధవాధర్మము లనేకములు శాస్త్రములందు కలవు. వాని నాచరించి యుత్తమగతి నొందవచ్చును.

సంఘు:— భార్య గతించిన వెనుక పురుషుడు వివాహమాడ వచ్చునా ?

పూర్వా:— ధర్మసంతానము లేకపోయినయెడల, తిరిగి వివాహమాడ వచ్చును.

సంఘు:— ధర్మసంతానము కలిగిన, వెనుక వివాహమాడు పురుషుని చర్యను యేమని తలంతువు?

పూర్వా:— అధర్మవర్తనమని తలంతును.

సంఘు:— ధర్మసంతానమువలన ప్రయోజనమేమి ?

పూర్వా :— తలిదండ్రులు జీవించియుండగా, వారలకు సమస్తధర్మములయందు తోడ్పడుటయు వారలు మృతినొందిన తరువాత వారికుత్తమగతి కల్పించుటకై, ఉత్తరక్రియలు జరిగించుటకును, వంశాభివృద్ధికై ప్రత్యాబ్దికములు మున్నగువానిని జరుపుటకును నుపయోగపడుదురు ?

సంఘు :— సంతానములేక భర్త గతించినవెనుక, స్త్రీకి సంతానమెట్లు లేర్పడును?

పూర్వా :— దత్తతవలన నేర్పర్చుకొనవచ్చును.

సంఘు :— భార్యాభర్తలు జీవించియుండగా సంతానము కలుగనప్పుడు వారలేమి చేయవలెను?

పూర్వా :— అప్పుడును దత్తతవలననే సంతానమును నేర్పర్చుకొనవచ్చును.

సంఘు :— భార్యగతించి, భర్తజీవించియుండునెడ, దత్తత వలన, సంతానమేర్పర్చుకొనగూడదా ?

పూర్వా :— ఏర్పర్చుకొనవచ్చును కాని, దత్తసంతానము కంటె, ఔరససంతానము శ్రేష్టమని శాస్త్రము బోధించిన కతన, తత్ప్రాప్తికై, భర్త రెండవవివాహమును చేసికొనతగును.

సంఘు :— దానయోగ్యయగు కన్యకు వయస్సు ఎంత వుండ

పూర్వా :- యెనిమిది, తొమ్మిది, పదిసంవత్సరముల వయస్సునకు మించగూడదు.

సంఘ :- మించినట్టి కన్యకు నేమని పేరు.

పూర్వా :- రజస్వల యని పేరు.

సంఘ :- రజస్వలాదానము చేసినయెడల వచ్చు దోష మేమి ?

పూర్వా :-కన్యాదానమువలన వచ్చు ప్రయోజనము రాక పోవుటయును, రజస్వలాదానమొనర్చినవారు అధోగతి నొందు టయు మున్నగు దోషములు కలుగును.

సంఘ :— కన్యాదానము వలన వచ్చు ఫలమేమి ?

పూర్వా :— తమ పితరుల కుత్తమగతి కల్పించుటయు ధర్మసంతానముచేతను, తనకును అత్తింటివారికిని ఉత్తమగతిని వంశాభివృద్ధిని చేకూర్చుటయు మున్నగు ఫలములు గలుగును.

సంఘ:— సధవలకుగాని, విధవలకుగాని వివాహములు చేసిన సంతానము కలుగదా ?

పూర్వా:— కలుగదని యెవ్వరుచెప్పిరి ? సంతానము కొరకు వివాహమవసరములేదు. గర్భాదానము మాత్రము చాలును.

సంఘ :— ధర్మసంతానమునకు మాత్రము గర్భాదానము చాలదా ?

పూర్వా :— చాలదు. ఎందువల్లనన ముందు ధర్మము కొరకు, వేదోక్తవిధిని, ధర్మవివాహము నాడవలయును, ధర్మవిధిని నాడిన వివాహమువలన ధర్మసంతాన మేర్పడును. అందుకొరకై చేయబడు గర్భాదానము వేదోక్తవిధిని చేయవలెను.

సంఘ :— సధవ, విధవలకు మాత్రము వేదోక్తవిధిని గర్భాదానము చేయగూడదా ?

పూర్వా :— సధవ విధవలకు, వేదమునందు ధర్మవివాహములు చెప్పబడి యుండలేదు. అందువల్ల వేదోక్తరీతిని గర్భాదానమున్ను పుట్టదు. అందువల్ల ధర్మసంతానమున్ను కలుగదు.

సంఘు.— సధవ విధవలకు పునర్వివాహమువలన, కలుగు సంతానమువలన నెట్టి ప్రయోజనము లేదా ?

పూర్వా:— అట్టిసంతానము; తన్నుగన్న తలితండ్రులకు నిహలోకమున మాత్రము జీవయాత్ర గడుపుటలో, సహాయపడ వచ్చును.

సంఘు:— పరలోకగతికి సాధకులు గారా ?

పూర్వా:— కారు, కారణము ధర్మసంతానము కానందున,

సంఘు:— ధర్మసంతానము తలిదండ్రులకు నిహలోక జీవయాత్రలో, తప్పక సహాయపడుదురని, చెప్పగలరా ?

పూర్వా :— చెప్పుటకు వీలు లేదు. తలిదండ్రులయొక్క పురాకృతమునుబట్టి, ధర్మసంతానముగాని, యధర్మసంతానముగాని యిహలోక జీవయాత్రకు సహాయపడవచ్చును, పడక పోవచ్చును. కాని పరలోకగతికి, ధర్మసంతానమే యుపయోగపడునుగాని, యధర్మ సంతానమెంతమాత్రము పనికిరాదు.

సంఘు :— ఇట్లని దేనినిబట్టి చెప్పితిరి ?

పూర్వా :— శాస్త్రమునుబట్టి చెప్పితిమి ?

సంఘు :— ముక్కుపచ్చలారనటువంటిన్ని, ప్రపంచగోష్ఠి లేనటువంటిన్ని, కన్యకు భర్తపోయినాడే; అందాపె చేసిన నేరమేమి ? తిరిగి వివాహమేల చేయగూడదు ?

పూర్వా :— జన్మాంతరమున చేసిన దోషమే యీజన్మకు ఫలించినది అంతదూరము పోనేల, లోకమున, కుంటి, గ్రుడ్డి, చెవుడువారలకును, దరిద్రులు, రోగులు, మున్నగువారికిని, జన్మాంతరమున చేసిన దోషము లేగదా, యీజన్మయందు ఫలము నిచ్చుచున్నవి. వానిని అనుభవించి తీరవలసిన దేగాని, తప్పించుకొనుట కెవరని తరము.

సంఘు :— అట్టికన్యకు వివాహముచేసి ఆపె బాధనుతప్పించగూడదా ?

పూర్వా :— ఆపెను నీవే బాధనుండి తప్పించజూచితివి ?

సంఘు :— భర్త లేని లోపమునుండి తప్పించ లేదా ?

పూర్వా :— వైదికధర్మమునుబట్టియా ? లేక, అవైదిక ధర్మమును బట్టియా ? తప్పించినది.

సంఘు :— ఏధర్మమైతేనేమి, భర్తను గూర్చితిని.

పూర్వా:— వైదిక ధర్మప్రకారము భర్తదొరుకుటకు వీలు లేదని యంటినిగాని, యవైదిక ధర్మప్రకారము, ఒక్క భర్తయేమి? పెక్కుభర్తలనుగూడ గూర్చవచ్చునుగదా?

సంఘు :— భార్యగతించిన వెంటనే, పురుషుడు కామాది బాధలను సహించజాలక, తిరిగివివాహమాడుటలేదా ? అట్లే స్త్రీ మాత్రము, తిరిగియేల వివాహమాడగూడదు?

పూర్వ :— కామాదిబాధలకు సహించజాలక భోగార్థమై చేసికొను వివాహములు, ధర్మవివాహము లెంతమాత్రమునుకావు. వివాహమునకు కామాది బాధానివారణమే ఫలమగునెడ, పురుషుడెన్ని వివాహములు చేసికొనవచ్చునో, స్త్రీగూడ నన్ని వివాహములు చేసికొనవచ్చును.

సంఘు :— కన్యలకు వైధవ్యము వచ్చినవెంటనే తిరిగి వివాహము చేయకున్నచో, వయస్సు వచ్చి స్వేచ్ఛగా చరించినచో తలిదండ్రులకు అప్రతిష్ఠరాదా ?

పూర్వా :— అగ్నిహోత్రసాక్షిగ వివాహమాడిన స్త్రీల యందు సహితము భర్తకలిగియు, స్వేచ్ఛగా చరించువారు లేరా? వైధవ్యము వచ్చినను, జీవిత పర్యంతము ధర్మాచరణమునందున్న వితంతువు లెందరు లేరు ? కాబట్టి స్వేచ్ఛగా చరించుటయనునది, భర్తయుండుట, లేకపోవుటలతో లేదు. వారి వారి చిత్తవృత్తిని బట్టి జరుగుచుండును. తల్లిదండ్రులకు అప్రతిష్ఠ కుమార్తెయొక్క స్వైరవిహారము చేతనేగాదు; అసత్యమాడుట, దొంగతనము

చేయుట మున్నగు యితర చెడుపనులవల్లను కూడ కలుగగలదు. తలిదండ్రులకు ప్రతిష్ఠ రావలెనని కుమార్తె తలంచుచో, సత్య దయాది సామాన్యధర్మములయందును, పాతివ్రత్యము మున్నగు విశేష ధర్మములయందును జాగరూకతతో బ్రవర్తించవలెను.

సంఘు:— అంత శ్శక్తినిరోధము అత్యంత దుర్ఘటముగదా! ఎట్లు నిరోధించవలయు?

పూర్వా:— వేదమతమునకును, తక్కిన మతములకును, అక్కడనే భేదముకలదు. వేదమతము అంతశ్శక్తులను స్వేచ్ఛగా పోనీయక నిరోధించి లోకమునకు మాహాత్మ్యమును ప్రకటించినది. తక్కిన మతములలో స్వేచ్ఛగా చరించి చిత్తమునకు వశీభూతులగు చున్నారు. అంతియేగాని చిత్తము వారివశమందున లేదు.

సంఘు:— ఇప్పటి వేదమతస్థులకు అట్టి శక్తినిరోధము కలదా?

పూర్వా:— ఉన్నదని యెవరు చెప్పిరి. కొన్ని తరములనుండి క్రమముగా పోగొట్టుకొని యున్నారు.

సంఘు:— ఎందువలన పోగొట్టుకొన్నారు?

పూర్వ:— పరదేశీయుల సహవాసదోషముచే, పరవిద్యాభ్యసనము నాచరించి పరాచారములను గ్రహించుచూ వచ్చుచుండుటవలన.

సంఘు:— ఇంకొక్క సంశయముకలదు. అడిగెదను. పూర్వాచారపరాయణులని చెప్పువారిలో, కొందరు పాలఘాటు నుండి కన్యలను దెచ్చుకొనుచున్నారుగదా. వారందరు కన్యలేనా? అందులో రజస్వలలులేరా? విధవలు లేరా? వాటిని నిక్కడి పూర్వాచార పరాయణులెట్లు అంగీకరించిరి?

పూర్వా:— పాలఘాటునుండి కన్యలను తెచ్చుకొనువారలును, వారిబంధువులును, తాము విధవలను తెచ్చుకొనుచున్నామని చెప్పుచుండుటలేదు. పైపెచ్చు కన్యలనే దెచ్చుకొన్నామని చెప్పుచున్నారు. వారు కన్యలుకారు, విధవలని రుజువుచేయు

భారము, పత్రికక్షులయందే కలదుగాని పూర్వాచారపరాయణుల యందు లేదు. పూర్వాచారపరాయణులు ఆప్తవాక్యములను నిజమని నమ్మినారు. భార్య భర్తకు ఆప్తురాలు. ఆపెమాటను భర్త నమ్మవలదా? తల్లిదండ్రులు కుమారునికి ఆప్తులు వారి మాట కుమారుడు విశ్వసించవలదా? గురువు శిష్యునకు ఆప్తుడు, వారిమాట శిష్యులు సరకు సేయవలదా? ఆప్తవాక్యమును నమ్మని నాడు లోకములో నెవ్వరికిని జీవయాత్ర జరుగదని పామరుడుగూడ గ్రహించునుగదా!

సంఘు:— పాలఘాటునుండి తేబడిన కన్య విధవయని రుజువు చేయబడినదను కొందము. అప్పుడు విడనాడుదురా?

పూర్వా:—అట్లు విధవలని రుజువులయి విడనాడిన కేసులు అనంతములు కలవు.

సంఘు:— విడనాడని కేసులు మాత్రము లేవా?

పూర్వా:— అవియునుకలవు. కాని అట్లు విడనాడని కుటుంబములతో తక్కిన సాంఘికులు సంబంధము లేకనే చరించు చున్నారు.

సంఘు:— ఎట్టి సంబంధములేక చరించుచున్నారు?

పూర్వా:— నిత్యనైమిత్తిక కామ్యకర్మలయందు, ముత్తైదువులక్రింద పిలువరు. వారికి కలిగిన సంతానముతో సంబంధ బాంధవ్యములు కలుపుగొనరు. ఈవిధముగనే మరికొన్నియును గలవు.

సంఘు:— భోజన వ్యాపారములయందు వారితో సంబంధము కలిగియున్నవారు లేరా?

పూర్వా:— ఆచారమునం దేమాత్రము నమ్మకమున్న వారుగూడ అట్లుచేయరు. ఇప్పటి కాలపరిస్థితులనుబట్టి, కాస్మాపాలిటన్ డిన్నర్సు మున్నగు వాటియందు చరించు స్త్రీ పురుషులును, నిత్యనైమిత్తిక కామ్యకర్మాదికములందు నమ్మకములేని

స్త్రీ పురుషులును మాత్రము అట్టి భోజనసంబంధమును కొన్ని కొన్ని చోట్ల కలిగియున్నారు.

సంఘు:— అట్టి అంటుదోషము సంఘమున వ్యాపించదా ?

పూర్వా:— బాగుగా వ్యాపించును. కాని వానికి ధర్మమునందు నమ్మకమున్నచో ప్రాయశ్చిత్తవిధులు కలవు. వాటిని చేసుకొని స్త్రీ పురుషులు తరించవచ్చును.

సంఘు:— ఎన్నిసారులు ప్రాయశ్చిత్తము చేసికొందువు.

పూర్వా:— దోషము లెన్నిసారులు సోకిన నన్నిసారులు ప్రాయశ్చిత్తము చేసికొనవలెను. మనపెద్ద లట్లే కాలముగడపిరి. జ్వరము ఎన్నిసార్లువచ్చినను మందువాడక తప్పదు. తేలు ఎన్ని సార్లు కుట్టినను కుట్టినప్పుడెల్ల మందు వేయక తప్పదు.

సంఘు:— అట్లైన జీవితమంతయు, ఇక్కాలమున ప్రాయశ్చిత్తములతోనే గడపవలయునా ?

పూర్వా:— ధర్మమునందు నిరూఢమైన నమ్మకమున్నవాడు ఎన్నిసారులైనను ప్రాయశ్చిత్తము చేయించుకొనును. ఎన్నిసారులు అశుద్ధము తొక్కినను కాలుకడుగుకొనవలదా ? ఆకలి అయి నప్పుడెల్ల అన్నముతినవలదా ? దాహమైనప్పుడెల్ల నీరు త్రాగ వలదా ? ఇట్లే యనేకోదాహరణముల నీయవచ్చును.

సంఘు:— రజస్వలానంతర వివాహములని పూర్వాచార పరాయణులు సహితము ఎఱిగియుండియు, సంఘమున నెట్లు కలుపుకొన నంగీకరించుచున్నారు.

పూర్వా:— రజస్వలానంతర వివాహము దోషయుక్తమైన దని తెలిపియుంటిని. కాని రజస్వలానంతర వివాహ మనునది యొకటికలదనియు, అది క్షత్రియులకు యోగ్యమైనదనియు, తక్కిన త్రివర్ణములవారికి యోగ్యము కాదనియు శాస్త్రమే చెప్పుచున్నది. తక్కిన త్రివర్ణములవారును దోషమని తెలిసియుండినను, రజ

యందు భక్తిగలిగి పాతివ్రత్యధర్మము జరుపవచ్చుననియు, పాతివ్రత్యధర్మముచే స్త్రీకి కలుగదగిన, ఉత్తమగతికి నష్టమేమియు లేదనియు నామెకు కలుగు సంతానమునందు సాంకర్యము ఏర్పడదనియు, శాస్త్రజ్ఞులు వచించియున్నారు. కాని దోషమేమియన కన్యాదానమునెడ కలుగదగిన యుత్తమఫలము కలుగదనియు, ఉత్తమఫలము బొందుటకై కన్యాదాన పూర్వకమగు వివాహమునే చేయుమని యన్నివర్ణములవారికి నుపదేశింపబడినందున, అందునను అగ్రవర్ణమునందు జనించినవారలు సత్యదయాది సామాన్యధర్మానుష్ఠానమును, విశేషధర్మానుష్ఠానమును కలిగి ఉత్తమమైన కన్యాదానపూర్వకమగు వివాహమునే గ్రహించవలసినదని పెద్దలు నుడివియున్నారు. కాబట్టి సత్యదయాద్యుత్తమ ధర్మములు అనుష్ఠానమున నున్నంతవరకు నాల్గువర్ణములవారును నట్టి రజస్వలానంతర వివాహములు చేసియుండలేదు. ఇక్కాలమున, దోషములని తెలిసియుండియు నసత్యము నిర్దయము మున్నగు నధర్మములు సంఘమున వ్యాపించియున్నకతన, నా దోషముల పట్టికలో నీదోషమునుగూడ చేర్చి యంగీకరించుచూ వచ్చుచున్నారు. కాని రజస్వలానంతర వివాహము నిర్దోషమైనదని యెవ్వరును చెప్పసాహసింపరు. ఆవివాహమున, వర్ణసాంకర్యము కలుగకుండుటయు, పాతివ్రత్యధర్మమునకు లోపము లేకుండుటయు కలవు గాన నిక్కాలము నది సాంఘికామోదమును బడసినది.

సంఘ:— దోషముకలిగిన రజస్వలావివాహ మంగీకరింపబడినట్లే, దోషము కలిగినను విధవావివాహము నేల యంగీకరింపకూడదు?

పూర్వా:— దోష తారతమ్య ముండుటవలన నంగీకరింపకూడదు.

సంఘ:— దోషతారతమ్య మేమికలదు ?

పూర్వా:— రజస్వలానంతర వివాహములో, వర్ణసాంకర్యము, పాతివ్రత్యభంగమునను దోషములు లేవు. అవి విధవా వివాహమునకలవు. వేదమతమున స్త్రీయొక్క ఉత్తమగతికి పాతివ్రత్యమును, వర్ణాభివృద్ధికి సత్సంతానమును కనుటయు పురుషుని యుత్తమగతికి బ్రహ్మచర్యము వహించుటయు ననునవి ముఖ్యధర్మములు. అవినశించిన యెడల వేదమతమే లేదు.

సంఘు:— విధవావివాహమున మరియొక పతినిగూర్చుచుంటిమిగదా! వానియెడల పతివ్రతయై చరించగలదు. అందు పాతివ్రత్య భంగమేమికలదు ?

పూర్వా:—కన్యాదాన పూర్వకమగు, ప్రథమ వివాహమున నేర్పడియున్న భర్త జీవించినను, మృతినొందినను, నాతనినే దైవముగా పూజించవలెననిన్ని, వేరొకని స్వప్నమందైనను వరించగూడదనిన్ని అట్లుండుటయే పతివ్రతాలక్షణమని శాస్త్రమున నిరూపింపబడినది. విధవావివాహమున మృతినొందినాడని నెపముతో, వేరొక భర్తను గ్రహించుట శాస్త్రమున చెప్పబడిన ప్రతివ్రతాలక్షణముకాదు, మరేమియన వేదమతముకంటె, భిన్నములైన, యితరమతముల వారంగీకరించిన ప్రతివ్రతాలక్షణమగును. అదియే పతివ్రతాలక్షణమగునెడ, మొదటిభర్త గతించి రెండవ భర్తను స్వీకరించువరకును, నారెండవభర్త గతించి మూడవభర్తను స్వీకరించువరకును, ఇట్లే పరంపరగా భర్తల స్వీకరించు, మధ్యగల విరామకాలములయందే, వైధవ్యము ప్రాప్తించునుగాని, తక్కిన కాలములయందుకాదు. యిది వేద విరుద్ధమైన సిద్ధాంతము. వేదమతమునుబట్టి వేరొకభర్తను స్వీకరించుటవలననే పాతివ్రత్యభంగము కలిగినది.

సంఘు:— ఇక వర్ణసాంకర్యమెట్లు కలుగును ?

పూర్వా:— స్వజాతియందైనను, విధిపూర్వకముగ పాణిగ్రహణము చేయబడిన ప్రథమవివాహమువలన కలుగు సంతానమునకే సత్సంతానమనిపేరు. అందుకు విరుద్ధమైనది సత్సంతా

నముకాదు. బ్రాహ్మణాది వర్ణములుకలిగిన ఆర్యసంఘముననే, వర్ణసాంకర్యము కలుగుట కవకాశమున్నది గాని, వర్ణవిభాగము లేని యితర సంఘములలో దీని కవకాశములేదు. కాని సత్వ రజస్తమోగుణ ప్రధానులగు వ్యక్తులనుబట్టి వ్యక్తిసాంకర్యమునకు నవకాశముకలదు.

సంఘ:—— లోకమున కొందరు వనితలు, భర్తలు కలిగి యుండియు స్వేచ్ఛగా రహస్యముగ చరించుచున్నారు గదా? అందువల్ల దుష్టసంతాన మేర్పడదా?

పూర్వా:— ఏర్పడుట కవకాశము కలదు.

సంఘ:—— ఇంతవరకు సంఘమున నట్టి దుష్టసంతాన మేర్పడి యుండగూడదా?

పూర్వా:—— ఏర్పడియే యుండవచ్చును. ఏది దుష్టసంతానమో ఏది సత్సంతానమో నిర్ణయింప నలవికాదు.

సంఘ:—— ఏర్పడినయెడల నట్టిది వర్ణసాంకర్యముకాదా?

పూర్వా:—— వర్ణసాంకర్యమేయగును. అట్టి సాంకర్యము ఏకుటుంబమున కలిగినదో, యాకుటుంబమునకు నష్టము కలుగును. అట్టివారితో సంబంధబాంధవ్య మొనర్చువారి కుటుంబమునకు నది వ్యాపించును. అంతియేగాని యావత్తు సంఘమునకు నది వ్యాపించదు.

సంఘ: —వర్ణములయందు తెలియమిచే సాంకర్యము జరుగుచున్నదని యొప్పుకుంటిరిగదా. ఇప్పుడు బుద్ధిపూర్వకముగ సాంకర్యము నంగీకరించిన అంతకంటె నధికమైన దోషమేమి కలుగును?

పూర్వా:——ఆర్యసంఘమున, సర్వకర్మలు చిత్తశుద్ధికై యేర్పడినవి. ఆచిత్తశుద్ధి భక్తి జ్ఞానవైరాగ్యములకు కారణమైయున్నది. ఆభక్తిజ్ఞాన వైరాగ్యములు, మోక్షమునకు హేతువులైయున్నవి. వేదోక్తధర్మముల మనసు నిడికొనుటయు, వాని నాచరించుటయు ననువానివలన, చిత్తశుద్ధి యేర్పడును. ఇప్పుడు తెలియక జరి

గాదు సాంకర్యమువలన, చిత్తము చెడియుండ లేదు. తెలిసినప్పుడు సాంకర్యము నంగీకరించేయడల వేద విధియందుగల చిత్తమును దూరముచేసిన వారమగుదుము. వేదవిధికి దూరమైపోయిన చిత్తము, వైదికకర్మల నెట్లాచరించగలదు? ఆచరించనియెడల వేదమునందు చెప్పబడిన, చిత్తశుద్ధి యెట్లుప్రాప్తించును? చిత్తశుద్ధి ప్రాప్తించనియెడల, భక్తిజ్ఞాన వైరాగ్యములు ఎట్లు కలుగును? అవి కలుగకున్న మోక్షమెట్లు చేకూరును? కాబట్టి తెలిసి సాంకర్యమును ఎంతమాత్రమును నంగీకరింపకూడదు. సంఘమంతయు నిట్టి సాంకర్యము నంగీకరించునెడల, అవైదిక మతస్థులమగుట తప్పదు.

సంఘు:— సాంకర్య మెన్నివిధములు

పూర్వా:— రెండువిధములు. ఒకటి కర్మసాంకర్యము, రెండవది జన్మసాంకర్యము.

సంఘు :— కర్మసాంకర్యమన నేమి ?

పూర్వా :— వేదోక్తకర్మల నాచరించుపట్ల గలుగు దోషములు కలిగియుండుట, కర్మసాంకర్యమనంబడు.

సంఘు :— ఆ దోషము లెట్లుపోవును ?

పూర్వా :— కర్మచేత కలిగిన దోషము నిర్దుష్టమైన, కర్మచేతనే తొలగును. అందువలన, ప్రాయశ్చిత్త విధులు శాస్త్రమున చెప్పబడినవి. ఆవిధుల నాచరించి యాదోషముల పోగొట్టుకొనవచ్చును.

సంఘు :— జన్మసాంకర్యమన నేమి ?

పూర్వా:— నాల్గువర్ణములయందును శాస్త్రోక్తవిధిని వివాహములు జరిగి, వారివల్ల సత్సంతానమును బడయుటను విడనాడి అన్యమార్గముల సంతానము కలిగిన, నది జన్మసాంకర్యమనబడును

సంఘు :— ఆ సాంకర్య మెట్లుపోవును ?

పూర్వా :- జన్మతోడనే పోవలయును.

సంఘ :- దానికి ప్రాయశ్చిత్త విధి లేదా ?

పూర్వా :- దానికి ప్రాయచిత్త విధి శాస్త్రమున చెప్ప బడలేదు.

సంఘ :- అసత్యము, నిర్దయ, అపకారము, అశుచి, దొంగతనము దురన్న భక్షణము రజస్వలానంతర వివాహముల జరుపుట మున్నగు, దోషములనంతములు, సంఘమున కలవు గదా ! ఇన్నిదోషములచే నడంగు సంఘమునకు నీవిధవా వివాహము నేల యంటగట్టగూడదు?

పూర్వా:- మీయభిప్రాయమున నొకపొరపాటు కలదు. లోకమంతయు నసత్యము నిర్దయ మున్నగు నవలక్షణములతోనే లేదు. సత్యము, దయ, ఉపకారము, శుచి, అస్తేయము, యోగ్యాన్న భక్షణము, కన్యావివాహములు, మున్నగు గుణములుకూడ ననంతములుగా సంఘమున కలవుగదా? ఇన్నిగుణములచే నలరారు సంఘమునకు గుణములనే నేల యంటగట్టగూడదు ? దోషములచే నేల చెడగొట్టుటకు ప్రయత్నించవలెను ?

సంఘ :-ఇక్కాలమున గుణములకంటె, దోషములే మిక్కుటముగా కలవు గాన, దోషములే సులభముగా పరిసిపోగలవు. కాన సంఘమును బాగుచేయుటకు బ్రయత్నించుటకంటె, దోషములపాజ్లేయుటయే సులభముగ దోచెడిని.

పూర్వా :- నీవు చెప్పినది వాస్తవమే. దోషములు దుర్గతికి హేతువులని శాస్త్రములు నుడువుచున్నవి. కష్టమైనను, సంఘమును గుణములచే బాగుచేయజూచుటయే, యుత్తమజన లక్షణము. గుణములు సద్గతికి హేతువులగును.

సంఘ :- సద్గతియో, దుర్గతియో, ఎవరుచూచినారు, ప్రస్తుతం వుండేదాన్ని ఆలోచించుకోవాలిగాని,

పూర్వా :- ప్రస్తుతపుస్థితినిబట్టి చరించిన లాభము లేదు. రాబోవు గతికూడ నాలోచించుకొనవలెను. యవ్వనమందు స్వేచ్ఛగా చరించి, వార్ధక్యమున దుఃఖపడిన ప్రయోజనము లేదు.

సంఘు :- అయితే మఱి ఏమిచేయుమందురు ?

పూర్వా :- ధర్మమెఱిగి ప్రవర్తింపవలెనని చెప్పుదును.

సంఘు :- అయ్యా ! ఒక్కసంగతిని అడుగమరచితిని. లోకములో, నెవ్వరైనను, చెప్పినట్లుచేయవలెననియందురు. నోట చెప్పునదొకటి, చేత చేయునది వేరొకటియైన యెడల, నది సరియైనపనియా? సంఘ సంస్కారులు చెప్పినట్లు చేయుచున్నారు. అందు వారి తప్పిదమేమిటి ? సనాతన ధర్మపరాయణులు చెప్పునదొకటి చేయునది వేరొకటి ఇది తప్పుగాదా ?

పూర్వా :- సనాతన ధర్మపరాయణుడు చేసినను, సంఘ సంస్కర్త చేసినను, తప్పు ఏనాటికిని తప్పే, ఒప్పు ఎన్నటికినిగాదు. లోకములో ధర్మాధర్మములని, రెండువిధములగు కార్యములుగలవు. ఆ రెంటిలో, ధర్మము చేయతగినదనియు, నధర్మము చేయతగనిదనియు శాస్త్రములు వక్కాణించుచున్నవి. ఎవరైనను ధర్మమును చెప్పవలెను, దానినే యాచరించవలెను. అధర్మమును చెప్పకూడదు, దాని నాచరించకూడదు. ఇట్టిస్థితిలో, లోకమున నెవ్వడైనను, ధర్మమునుచెప్పి, ధర్మము నాచరించినచో, చెప్పినట్లు చేసినవాడని చెప్పతగునుగాని, యధర్మమునుచెప్పి యధర్మము నాచరించినంతమాత్రమున, చెప్పినట్లు చేసినవాడైనను, ధర్మపరుడెంతమాత్రమును గాడని, సామాన్యమానవుడుగూడ గ్రహించును గదా ! అధర్మమును చెప్పుచూ దాని నాచరించువాడుకూడ ఉత్తముడని చెప్పెయెడల, దొంగతనము మంచిదనిచెప్పుచూ, దాని నాచరించువాడును, వ్యభిచారము మంచిదని చెప్పుచూ దాని నాచరించువాడును, ఇట్లే తక్కిన పనులలోను చరించువారలును, ఉత్తములక్రిందకు వత్తురుగదా. ఈసిద్ధాంతము కొనకు మ్లేచ్ఛుడైనను అంగీకరింపడనుట ధృవము.

సంఘు:— ధర్మమునైనను, అధర్మమునైనను చెప్పినట్లు చేయువారలే, ధర్మమును చెప్పుచూ, అధర్మము నాచరించువారి కంటె శ్రేష్ఠులని యెందుకు నెంచగూడదు ?

పూర్వా:— ధర్మము ఊర్ధ్వగతికి సాధనమనియు, అధర్మము అధోగతికి సాధనమనియు, వేదమున జెప్పబడియున్నది. ఎవ రైనను ఊర్ధ్వగతిని కోరుదురుగాని, యధోగతి నొందవలెనని జూతురా? చూడరు. కాబట్టి ఎన్నటికైనను ధర్మమునుచెప్పుచూ, ధర్మము నాచరించువాడు ఉత్తముడు, ధర్మమును చెప్పుచూ, అధర్మము నాచరించువాడు మధ్యముడు, అధర్మమును జెప్పుచూ, అధర్మము నాచరించువాడు అధముడు.

సంఘు:— ఏమేమీ? ధర్మమును చెప్పుచూ, అధర్మము నాచరించువానికంటె, అధర్మమును చెప్పుచూ, అధర్మము నాచరించువాడేల ఉత్తముడుకాడు ?

పూర్వా:—(1) అధర్మమును చెప్పుట వాగ్దోషము. అధర్మ మునుచేయుట క్రియాదోషము. (2) ధర్మమునుచెప్పుట వాక్పవిత్రత అధర్మమును చేయుట క్రియాదోషము. యిందులో మొదటి దానిలోనివి రెండును దోషములే. రెండవదానిలో ఒకటి మాత్రమే దోషము. అందువలన అధర్మమును చెప్పుచూ, అధర్మము నాచరించువానికంటె ధర్మమును చెప్పుచూ, అధర్మము నాచరించువాడు శ్రేష్ఠతరుడని చెప్పకతప్పదు. ఇక ధర్మము చెప్పుచూ, ధర్మము నాచరించువాడు శ్రేష్ఠతముడని వేఱె జెప్ప వలెనా?

సంఘు:— విధవా వివాహమువలన సాంఘికముగ, మన సంఘమునకు లాభములేదా ?

పూర్వా:— లేదు.

సంఘు:— ఎందువలన ?

పూర్వా:— ప్రతిసంఘములోను పురుషుల సంఖ్యకన్న స్త్రీల సంఖ్య దాదాపు రెట్టింపుగలదు. అందుకన్నే స్త్రీకి ఒక

వివాహమును, పురుషునకునొకటికంటె నెక్కువవివాహములునుసనా తనధర్మసంఘములకు నున్నట్లు నాచారమువలన కన్పట్టుచున్నది. అదేవిధముగా శాస్త్రముకూడా కన్పట్టుచున్నది. ఇది వివాహము కావలసిన, కన్యలక్షేమమును కోరి పెట్టిన యాచారముగాని వేరు కాదు. విధవా వివాహములు జరుపుట సంభవించేయెడల, నెప్పు డును విధవలకు వివాహమగుచుండుట సంభవించునుగాని యభము శుభము నెఱుగని కన్యలను జూచువారుండరు. ఈహాంశము పాశ్చాత్యదేశ చరిత్రలను చదివినవారికి సుకరముగా బోధపడ గలదు. ఆకారణముచేత, వరకట్నముల బాధ ప్రస్తుతముకన్న ననేకరెట్లు పడవలసివచ్చును. కొంతమంది కన్యలకు వివాహము జరుగుట యసంభవము కావచ్చును. ఎంతటి శ్రీమంతుడైనను వరకట్నముల బాధచే, నాడపిల్లల పెండ్లిండ్లు జేయుటకు నవస్థపడి యున్నయైశ్వర్యమును గోలుపోయి గర్భదరిద్రుడగుట నిశ్చయము. ఎప్పుడీవిధముగా సంఘములో దరిద్రదేవత తాండవమాడునో, సనాతనధర్మ వినాశన మప్పుడే కలుగును. ఆదరిద్రమే విధవా వివాహములు చేసికొనుటకుగాని, తద్దినములు మానివేయుటకుగాని మరియేయితరములగు నధర్మములను జేయుటకుగాని, కులగోత్రము లను మరచుటకుగాని కారణమగును. ఇంతకంటె సంఘము యొక్క కట్టుబాట్లను చెడగొట్టేదిగాని, సంఘానికి నాశన హేతు వైనదిగాని మరియొక యపచారములేదు.

సంఘ:— ఆర్యా! ఇంకొకప్రశ్న. లోకమున ఎద్దులు, దున్నలు, గుర్రములు, గాడిదలు, పులులు మున్నగు ననేక జీవ రాసులు కలవుగదా! ఆజీవరాసులలో, మానవుడొక జీవరాశిలో చేరునుగదా! ఆ జీవులకంటె జీవుడగు మానవుని యాధిక్యమేమి?

పూర్వా:— మన్ అను ధాతువునుండి, మనుష్యమానవ శబ్దములు పుట్టినవి. మన్ అనగా, ఆలోచించుట యని యర్థము. అందువలన నాలోచనవలన జీవయాత్ర గడుపువాడుగాన మానవు డని గ్రహింపవలయును.

సంఘ:—తక్కినగోవులుమున్నగు పశువులు ఆలోచనవలన జీవయాత్ర గడపుటలేదా? వానిని మానవులని చెప్పగూడదా?

పూర్వా:— చెప్పకూడదు. ఎందువల్లనన, లోకమునబుట్టిన ప్రతిజీవరాశియందుగల యన్ని వ్యక్తులును, తమ బ్రతుకునకు నాధారభూతములగు, నాహారమును సంపాదించుకొనుట, తమ సుఖమునకు కారణమగు స్త్రీపురుష సంబంధమును కలిగియుండుట, నిద్రాసౌఖ్యమును గోరుట, తమకు లోకమున సంభవించు నాపత్తులకు, భయపడివానినుండి తప్పించుకొనుటకు ప్రయత్నించుట మున్నగు, వాని నవలంబించుచున్నవి. అనగా నీలోకమున, తమ బ్రతుకు తెఱవునకు సాధనములగు మార్గములనేఅన్వేషించుచున్నవి. ఇట్టి యాలోచనలు మాత్రము కలిగియున్నచో మానవుడును పశువులకిందకే వచ్చును. అప్పుడతడు నరపశువని చెప్పబడునుగాని మానవుడని చెప్పబడడు. ప్రపంచమున జీవించుటవరకే మానవుద్దేశమైనయెడల, పశువులవలెనే జీవించవచ్చును అట్టి జీవనమునకు, నీతిగానుండవలసినపని లేదు. అవినీతిగాగూడ జీవించవచ్చును. పుణ్యపాపములతో నిమిత్తము లేదు. బ్రాహ్మణుడై పుట్టనక్కర లేదు. క్షత్రియుడు కానక్కర లేదు. వైశ్యుడు కానక్కర లేదు. శూద్రుడు కానక్కర లేదు. మతముతో, అసలే పని లేదు. శాస్త్రీయ వివాహములతోగాని అశాస్త్రీయ వివాహములతోగాని, కట్టుబాట్లను కల్పించుకొన నవసరము లేదు. సేచ్ఛగా చచ్చువరకును కాలము గడుపవచ్చును. ఇప్పటి నరులలో చాలమందికిట్టి యభిప్రాయములుండుటవలన, నరత్వముపోయి, పశుత్వము దాపరించుచున్నదని గ్రహింపవలయు.

సంఘ :— ఏమీ, పశువులకు జ్ఞానము లేదు. మనుష్యుడైననో, పాఠశాలలయందును, కళాశాలలయందును, చదివి జ్ఞానమును సంపాదించి, ప్లీడరీ, డాక్టరీ మున్నగు పదవులను పొంది లోకమున ఘనముగ ప్రవర్తించుచున్నాడు. అందువల్ల పశువులకంటె, మానవుడు అధికుడుగాడా ?

పూర్వా :— కాదు. ఎందువల్లననగా మానవుడు పాఠశాలలయందును, కళాశాలలయందును ఎన్ని చదువులు చదివినను ఆ చదువులు, ప్రపంచములోని తనబ్రతుకు తెలివునకుమాత్రమే సాధములైయున్నవి. తక్కినపశువులు అట్టి చదువులు లేకయే, తమ బ్రతుకు తెలివును చూచుకొనుచున్నవి. ప్రపంచమున చచ్చువఱకును, బ్రతుకునట్టి మార్గముల నన్వేషించుటకొరకే, సాధనభేదములతో, పశువులుగాని, నరపశువులుగాని బ్రవర్తించుచున్నవి. ఇట్టి బ్రతుకు తెలివునకుమాత్రిమే యాలోచన అవసరమని తలచేయెడల, మానవత్వము స్థిరపడదు.

సంఘ :—ఎట్టి యాలోచనవలన మానవుడని చెప్పబడును?

పూర్వా :— జీవి పుట్టినదాది చచ్చువఱకును, చేయునాలోచనలు, బ్రతుకు తెలివువకు మాత్రిమే యన్నిజీవరాసులు చేయుచున్నవి. ఇక మానవుడైననో, అట్టి బ్రతుకు తెలివుగాక, చచ్చిన తరువాత తాను అను వస్తువు ఉండునా? ఉన్నయెడల అప్పటి బ్రతుకు తెలివు ఎట్లుండవలయు? అనునట్టి మహోన్నతమైన విచారణలచే, నాలోచనలను సలుపుటకు సర్వాత కలవాడుగనుక, మన్ అను ధాత్వర్థము సార్థకమై మానవుడని, శాస్త్రములచే జెర్కొనబడుచున్నాడు.

సంఘః— ఇప్పుడందరు మానవులు, అట్టి మరణానంతరమున గలుగు బ్రతుకు తెలివును నాలోచించుచున్నారా ?

పూర్వా.— లేదు. అందువల్లనే నరత్వముపోవుచు, పశుత్వమువచ్చుచున్నదని చెప్పవలసి వచ్చుచున్నది. మనపూర్వులట్టి మహోన్నతములైన జన్మాంతర విచారణ, పుణ్యాపాపవిచారణ కర్మవిచారణ, ధర్మవిచారణ బ్రాహ్మణాది జాతివ్యవస్థా విచారణ మొదలగు విచారణలతో కలిగిన యాలోచనలతో న్యాయసమ్మతమైన యిహజీవనమును, గడపుచు, జన్మాంతరాభ్యుదయమునకై పాటుబడుటవలన, మానవత్వము స్థిరమై మానవశబ్దముచే సార్థకమైన జీవితము కలవారైరి. పశుత్వము నశించుట

వలన మానవుడన్ని జీవరాసులకంటె సర్వోత్తముడని శాస్త్రమున నిరూపింపబడినది.

సంఘ:— సనాతనధర్మ స్వరూపము తెలిసికొనుట బహు దుర్ఘటముగదా!

పూర్వా:— అత్యంత దుర్ఘటము. అత్యంతదుర్ఘటమైన పదవికొరకే మనపూర్వులు, భక్తి జ్ఞాన వైరాగ్యములను సంపాదించి కృతార్థులైరి. నీకు వానియందు నమ్మకమున్నచో నామార్గమవలంబించుము. లేనిచో స్వేచ్ఛగా చరించి పశుత్వము స్థిరపరచుకొనుము. నీగతి కెవరేమి చేయగలరు.

సంఘ:— అయ్యా కృతార్థుడనైతిని. మిమ్ములను నింక ననేక ప్రశ్నలడుగవలసి యున్నది. మఱొకప్పుడు సమావేశమగుదము. మన యీసంభాషణమును పత్రికలో బ్రకటించిన ఎడల ధర్మమునెడ సంశయగ్రస్తులగువారికి చాల నుపయోగకరమని తలంచెదను.

పూర్వా:— నీవు చెప్పినది నిజమే అది సనాతన ధర్మ ప్రచారమునకు నేర్పడిన పత్రికలలోగదా ప్రకటింపబడవలసినది?

సంఘ:— మన సంవాదమును, వినుచున్న శైవమత ప్రకాశికా పత్రికాధిపతులగు నివటూరి సానందరావుగారు ఇక్కడనే యున్నారుగదా! వారిపత్రికలో వేయుమని కోరుదుముగాక.

పూరా, సంఘ :— ఏమండీ సానందరావుగారూ! మా సంభాషణ క్రమమును వింటిరిగదా! మీపత్రికలో ప్రకటింతురా?

సానంద :— సవిమర్శకమగు మీ సంవాదమును నేను పత్రికలో ప్రకటించుటకెట్టి యభ్యంతరము లేదు. కాని యీపత్రిక చదివేవారుండినగదా! మీశ్రమయు, నాశ్రమయు, సార్థకమగునది. లేనియెడల ఉభయుల శ్రమలును నిష్ప్రయోజనము లే. అయినను; మీరు కోరితిరిగనుక ప్రకటింతును.

(అందరు నిష్క్రమింతురు)

మహాశయులారా !

పైన తెలుపబడిన పూర్వాచారపరాయణసంఘ సంస్కారులమధ్య జరిగిన సంభాషణము బుద్ధిమంతులు కని గుణమును గ్రహింతురని యిందు పొందుపరచితిని. గుణగ్రహణపారీణులు, ధర్మాధర్మములను నిర్ణయించుకొని ధర్మమును చేపట్టి తరింతురుగాక. మరియొకసంగతి. యిది ప్రపంచము ఇది ద్వంద్వములచే ప్రకాశించునుగాని ఏకైకదేశముగా నెప్పుడును నుండదు. అనగా కృత, త్రేత, ద్వాపర, కలియుగములయందు, నీప్రపంచము సత్యాసత్యములతోను, హింసాహింసలతోను దయానిర్దయలతోను, యిట్లే తక్కిన విషయములలోను ద్వంద్వగతిని నడచునుగాని, కేవలము సత్యముచేతగాని అహింసచేతగాని లేక కేవలము అసత్యముచేతగాని, హింసచేతగాని యెన్నడును ప్రవర్తింపదు. కాబట్టి కృతయుగమందు ధర్మమునకు స్థానమెక్కువగను కలియుగమందు అధర్మమునకు స్థానమెక్కువగను గలదు. కృతయుగమునందు అధర్మమునకు స్థానము లేదనిగాని, కలియుగమునందు ధర్మమునకు స్థానము లేదనిగాని తలంచుట పొరపాటు. యేయుగమందైనను ధర్మము ఊర్ధ్వగతికిని అధర్మము అధోగతికిని, కారణములగుటవలన అధర్మమునువీడి ధర్మమునే చేపట్టజూచుట ఉత్తమ జన లక్షణమని మనవిచేయుచున్నాను. చివరను నొక్కసంగతి మనవి చేసి యీవ్యాసమును ముగించువాడ.

శైవమహాసభ పుట్టినదాది ప్రతిసంవత్సరమును శుష్కతీర్మానములతోను భోజన వ్యవహారములతోను వృధా కాలయాపన చేసినదిగాని, మతమునకు కార్యరూపమున యెట్టి మేలును చేకూర్చలేకపోయినది. కాని యిటీవల శ్రీముదిగొండ నాగలింగశాస్త్రులవారిచే శైవమతసిద్ధాంతమును తేటపరచు కొన్ని గ్రంధములు రచియింపజేసి ముద్రింపించి పలువురు పండితులకంపబడినవి. కాని కార్యరూపమున నింక ననేక ప్రయోజనములను గూర్చవలెనని 1936 వ సంవత్సరము నుండి పనిచేయుచు శైవమత ప్రకాశికయను ద్వైమాసపత్రికను దీక్షతో నడపుచున్నది. అయిననేమి యీపత్రికయందు శైవసాంఘికులకు నభిమానమున్నట్లు కనుపట్టదు. ఈపత్రిక, ప్రచారము నిమిత్తమై అన్ని జిల్లాలయందుగల మాదువంతుల శైవకుటుంబములకు చందాల నిచ్చినవారికిని యివ్వనివారికినిగూడ బంపబడినవి. అయిననేమి కొద్దిమంది తప్ప యీపత్రికకు చందాదారులు యేర్పడియుండలేదు. ఇది కడుంగడు శోచనీయము. అంత్యేష్టి మున్నగు కొన్ని గ్రంధములకు శుద్ధప్రతులు వ్రాయబడి ద్రవ్యాభావముచే ముద్రింపబడలేదు. నూతనముగ చందాదారులు చేరకపోవుటయేగాక, యిదివరకుచేరిన చందాదారులలో, కొందరు పలుసారులు త్రిప్పుచూ చందాలనీయక వృధాప్రయాసమును కలుగచేయుచున్నారు. కొన్నికొన్ని గ్రామములవారు పంపిన పత్రికలను తమ గ్రామములయందు శైవులకు పంచిపెట్టుటలేదని తెలియవచ్చుచున్నది. ఇట్లున్నది మహాభి

మానము. వీరికొఱకై సేయు సేవ నిరర్థకమని నాకు తోచుచున్నది. ఇకముందు కూడ నిట్టి సాంఘికులు మూకీభావము వహించువెడల నీయుద్యమమునుండి విరమించుట శ్రేయమని నాకు తోచుచున్నది. కాలమునుబట్టి సంఘము మలీమస వృత్తిమున నడచుచున్నట్టు గన్పట్టుచున్నది. దీనికి సూచకముగ యూతులీగువారు, సంఘమునందు విధవావివాహము మున్నగు పరదేశీయాచారములను బ్రవేశపెట్టుచున్నారు. ఇక వర్ణాంతర వివాహములనుగూడ బ్రవేశపెట్టుదురు. వర్ణాంతర భోజనములు, కాస్మాపాలిటన్ డిన్నర్సుయందు ఇదివరకే సాగినవి. ఇక నవి ప్రతిగృహమునందును బ్రవేశింపగలవు. ఇంకను ననేకములగు నపూర్వపద్ధతులు సంఘమున బొడసూపగలవు.

యూతులీగు అనునది యాంగ్లేయ భాషాపదము. దీనికి తెలుగులో, యువకసంఘము యువకమండలియువజనసభ యిత్యాదిపదములు సమానార్థములై యున్నవి. యువకమండలివారు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర సంఘములయందు యేర్పడినారు. వారాచరించుపను లెవ్వియన, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రాది జాతి విభాగమును నిర్మూలించుట, రజస్వలా వివాహములు, విధవావివాహములు, వర్ణాంతర వివాహము, పంచమదేవాలయ ప్రవేశము, వర్ణాంతరభోజనము మున్నగునవెన్నియో కలవు. వీటినే నవీనాచారములక్రింద వీరు నిశ్చయించుచున్నారు. ఈ కార్యములు వేదధర్మములకు విరుద్ధములగుటవలన, వేదమత నిర్మూలనమునకై వీరు బ్రయత్నించుటయేగాక, కార్యరూపమున వారు తలచినవానిని నాచరణలో బెట్టుచున్నారు, ఇట్లొనర్చువారలు సనాతన ధర్మపరాయణులగు వారియొక్క పుత్రులో, పౌత్రులో, బావలో, మరుదులో, సోదరులో, మరి బంధువులో అయియున్నారు గాని అన్యులుగారు వీరితో గల రక్తసంబంధము చేత. పూర్వాచారపరాయణులు మూకీభావము వహించుచున్నారు. వీరి మూకీభావమే మత ధర్మ వినాశనమునకు హేతువగుచున్నది. వీరు వారిని వారించరు సరిగదా! సనాతనధర్మ సంరక్షక మహాసభలకున్ను హాజరుకారు హిమాచలమువలె చలింపని వీరియోర్పును ధైర్యమును నేమని కొనియాడవలయును? ఇదివరకు యువక సంఘములలో, కొందరు యువకులు మాత్రమే పనిచేయుచున్నారు. ఇప్పుడు యువతులుకూడ కొందరు వారికి సహాయపడుచున్నారు. ఇక నాసంఘములు శివశక్తులతో ప్రకాశింపగలవని చెప్పవచ్చును

ఈ యువజన సభలు మన బ్రాహ్మణులలో వైదిక, నియోగిజన సంఘముల యందు చాలకాలము క్రిందటనే బయలుదేరినవి. కాని యీసంఘములు జన బాహుళ్యము కలవియగుట, యువకులు చేయు పనులు సముద్రములో కాకిరెట్ట వైచినట్లున్నది. మహయారాధ్య జనసంఘము; షుమారు 1500 కుటుంబములకంటె నెక్కువ పరిమితికలదికాదు. యింతకంటె చిన్నసంఘము వర్తించమునే

నెచ్చుటను లేదు. అయినను ఈసంఘము ఆంధ్రదేశమున గొప్ప పేరుప్రతిష్ఠలు సంపాదించి సనాతన ధర్మములకు నిలయమైనది. ఈసంఘమువారు (బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యమునకు గురుత్వము వహించిరి. ఇట్టి సంఘమునకు సహవాస దోషము వలన, శైవయువజనసంఘమను పేర, 18 వ శైవమహాజనసభా సందర్భమున కేర్పడినది ఆదియే ప్రథమ యువజనసభ. ఆసభకు శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు అధ్యక్షతవహించి యువకులయొక్క తొందరపాటును అణచివేసిరి. 19 వ శైవ మహాసభలో యువకుల ప్రోత్సాహముతో, శ్రీ శివలెంక శంభూ ప్రసాదుగారు మహాసభాధ్యక్షపదవి వహించిరి. కాని వారును నవీనాచారములను ప్రవేశపెట్టుటకు నెట్టి సాహసమును జూపలేదు. 20 వ సభ శ్రీ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారి అధ్యక్షత క్రింద సాగినది. ఆమహాసభయందు యువకులు కొంత గందరగోళము చేసినారుగాని, అధ్యక్షుడు సాగనీయలేదు. అందువల్ల రెండవ యువజనసభను ప్రత్యేకముగా జరుపుకుని రజస్వలానంతర, విధవావివాహములు చేయవచ్చు, ననుతీర్మానమును ఇంకను మరికొన్ని తీర్మానములు చేసికొనినారు. తరువాత రాజమండ్రిలో 21 మహాసభ జరిగినది. అక్కడికి యువకులు హాజరుకాలేదు. యువకసభను నామమాత్రము యిద్దరు ముగ్గురు యువకులు జరిపిరి. తరువాత 22 వ మహాసభకు పూర్వమే బందరు నిజాంపేటలో మన సంఘమున ప్రథమముగా వితంతువివాహమును యువకులు జరిగించినారు. ఆవిషయమును బహుధాన్య సం॥ మాఘఫాల్గుణ మాసముల శైవమత ప్రకాశికా పత్రికలో నేను ప్రకటించి సాంఘికుల కందజేసి యున్నాను దానితో శైవసంఘమున నొకవిధమగు కలవర మేర్పడినది. పెద్దపులి గ్రామముల మీద పడ్డప్పుడుగాని, పిచ్చికుక్క మనుష్యులను కరచునప్పుడుగాని, సంఘము శాంతియుతముగా నుండునా? ఉండదు. ఈ కలవరముగూడ దినక్రమమున నంతరించగలదు. కావున నెవ్వరును భయపడ నవసరములేదు. నేను కన్యాదాత ప్రతిగృహీతలతో సంప్రదించియే యాపత్రికయందు ప్రకటించితిని, అంతియేగాని వారి యుభయులకు నప్రతిష్ఠ గూర్చవలెననికాదు. వియ్యంకులలో కాశీనాధుని వీరమల్లయ్య పంతులుగారు నాకు మిత్రులును బంధువులును అయియున్నారు మల్లంపల్లి వీరభద్రయ్యగారు, నాకు వేలువిడిచిన మేనమామ కుమారుడున్నూ అత్యంత బంధువుడున్నూ అయియున్నారు. ఇట్టి వీరి కపకీర్తి కరమగునని నాచరింతునా? అయిన నెందుకు ప్రకటించితివని యడుగుదురేని, ఇది సాంఘిక సమస్య యగుట వలనను వేదధర్మమును మూలముతో సహా పెకలించివైచునది యగుటవల్లను సంఘమునందుగల సనాతన ధర్మపరాయణులను నిద్రనుండి మేల్కొలుపుటకై యట్లు ప్రకటించితిని. దీనితో మేల్కొందురో లేక కుంభకర్ణావతారులై నిద్రావస్థ యందుందురో, తెలుసుకొను కుతూహలుడనై యట్లు ప్రకటించితిని, యువజన సంఘమువారు యేది ధర్మమని నమ్మినారో దానినే సంఘమున నములు జరుపుటకు ప్రయత్నించుచుండ, సనాతన జన సంఘమువారు యేదిధర్మమని నమ్మినారో,

దానిపత్రికాలరం సాంఘిక ప్రచారము చేసికొనుట యేల ధర్మముకాదు? ఇట్లు ప్రచారము చేసికొనుటలో (ప్రిన్సిపల్) సిద్ధాంతముమీద నడచుకొనుట యుభయులకు క్షేమముగాని, వ్యక్తిదూషణ మొనరించుకొనుట కడుంగడు హేయము. సరియైన యువజన సాంఘికుడుగాని, సరియైన సనాతనిష్ఠుగాని వక్రమార్గమున నెన్నడును ప్రవర్తించడు. మూర్ఖులై నిందాలాపములతో ప్రవర్తించువారలు ఉభయవర్గములయందును గలరు. వారిని వారించుభారము ఉభయవర్గముల నాయకులయందును గలదు. అట్లుగాక యానాయకులుదౌష్ట్యమునే పురికొల్పు నెడల వారిని నాయకులనుటకంటె వినాయకులనుట యుత్తమము

ఈ వితంతూద్వాహము గత చైత్రమాసమున జరిగినది. 22 వ శైవమహాసభ గత వైశాఖమాసమున జరిగినది. ఆసభకు యీ వితంతూద్వాహముతాలూకు వియ్యంకులిరువురును మఱి ఆర్గురు యువకులతో విచ్చేసిరి వారి సంగతి యిదివరకే పత్రికాముఖమున తెలిసికొనియున్నవారు గావున ఉభయగోదావరి జిల్లాల నుండి మహాసభకు విచ్చేసిన మహేశ్వరులెల్లరు కడు జాగరూకులై ప్రవర్తించిరి. ఈ యువకులు వియ్యంకులతోసహా సాంఘికులతో భోజనవ్యాపారములయందు సహచరించుటకు ప్రయత్నించిరి గాని మాహేశ్వరజన మందుకంగీకరించలేదు. సభాప్రారంభదినమున నుదయము 11 గంటలు మొదలుకొని సాయంకాలము 3 గంటలవరకు మాహేశ్వరు లెవ్వరికిని భోజనములు లేవు. గ్రీష్మాతాతపములచే మాహేశ్వరులెల్ల క్షుత్పిపాసార్తులై వికలజీవులగుటకు సంసిద్ధులైరి. పాపము యీసంగతిని గమనించి, సమయజ్ఞులగు శ్రీ వీరమల్లయ్యా పంతులుగారు తమ వియ్యంకులతో ప్రత్యేకముగా భోజనమున కనుమతించినందున, సభ్యులయందు కలిగిన కలవరము చల్లారినది. తరువాత ఆహితాగ్నులకు వేరుపాకము యేర్పాటు చేయబడినది. తక్కిన మాహేశ్వరజనమునకు ప్రత్యేకపంక్తి గూర్చబడినది. తక్కిన యువకులకు వేరు సదుపాయము యేర్పాటు చేయబడినది. యీవిధముగ కొత్తపల్లి శైవ మహాశయులు సనాతన ధర్మమునకు కళంకము రాకుండ సభను దిగ్విజయముగా జరిగించినారు. తక్కిన యువకులను నేనంతగా ప్రశంసించను గాని వియ్యంకులిరువురు కొత్తపల్లి గ్రామస్థులకు సహాయపడి మహేశ్వర జనకంటకులుగాక మన్ననకు పాత్రులైరి. యీ కొత్తపల్లిగ్రామ శైవమహాసభా విషయములు యిదివరకే సాంఘికులకు తెలిసియున్నవి గాన నిందువిషయమై నేను వివరింప బనిలేదు.

వీరమల్లయ్యాపంతులుగారి స్వగ్రామమగు నాగులకుర్తి పురమున శ్రీభ్రమరాంబా మల్లేశ్వరస్వామివారి దేవాలయమందు, భైరవాది దేవతా ప్రతిష్ఠలును, లక్షపత్రి పూజయును, లక్షవత్తుల వ్రతమును జ్యేష్ఠ బ 11 లు లగాయతు అమావాస్యల వరకు 10 దినములు అవిచ్ఛిన్నముగ సాగినవి. ఆసందర్భమున బందరు

సైదేపూడి, గుడివాడ, మున్నగు గ్రామములనుండి పెక్కు మాహేశ్వరు లరుదెంచిరి. మాహేశ్వర జనులకు విందులున్నూ యేర్పాటుచేయబడినవి. ఆసందర్భమున ఆహితాగ్నిశాల యొకటి యేర్పాటుచేయబడినది. ఆశాలయందు ప్రవేశమును గోరువారు పంచగవ్య ప్రాశన చేయవలెననెడి నిబంధన మేర్పాటుచేయబడినది. ఆనిబంధనకు కట్టుబడని వారికి వంట బ్రాహ్మణులచే ప్రత్యేకము శాలము యేర్పాటుచేయబడినది. ఆవిందులకు శ్రీవీరమల్లయ్య పంతులుగారి కుటుంబము వారిని గూడా సాహ్వానించినారు. ఇందు జరిగిన విచిత్ర మేమియనగా:—

(1) శైవాచారముప్రకారం మంత్రతీర్థ గ్రహణము, పంచగవ్యప్రాశనము దూష్యముకాదని తలంచి యలకుర్తి గ్రామములో రెండు మూడు కుటుంబములవారు తప్ప తక్కినవారు పంచగవ్యప్రాశనముచేసి యాహితాగ్నిశాలయందు ప్రవేశించిరి. అట్లే కొందరు యితరగ్రామ మాహేశ్వరులును, కొందరు స్మార్తులును పంచగవ్యప్రాశనచేసి యాహితాగ్నిశాల ప్రవేశన మొనరించిరి. కొందరు యువకులును పంచగవ్య ప్రాశనము చేసిరి

(2) ఆహితాగ్ని శాలములో చేరుటకు తలంపుకలిగియు, పంచగవ్య ప్రాశనము చేయుటకు నిష్టపడనట్టియు బ్రాహ్మణశాలయందు కొప్పుకోనట్టియు కొందరు పరగ్రామ మాహేశ్వరులకు ప్రత్యేకముగా శాలములు యేర్పాటు చేయబడినవి. ఈమాహేశ్వరులు ఉదయము 10 గంటలు మొదలుకొని మధ్యాహ్నము 3 గంటలవరకు తెంపులు తెంపులుగా వచ్చుచుండుటచేత, ప్రత్యేక శాలములు యేర్పాటుచేయవలసిన యవసరము కలిగెను.

(3) వీరుభయులు పోను తక్కిన యువకులు రెండుతరగతులుగా కనుపించినారు. ఒక తరగతివారు సంధ్యావందనాద్యనుష్ఠానము లేకపోయినను, వారు సంపర్కదోషమున్న కొంచెము తటపటాయించువారు. రెండవ తరగతి వారు సంపర్కదోషమును పాటింపక స్వేచ్ఛగా ప్రవర్తించువారు. యీరెండవ తరగతివారు మాత్రమే వితంతూద్వాహమువారితో గూర్చొనుటకు సమ్మతించిరి. మొదటి తరగతివారు మాత్రము రెండవతరగతివారితో గూర్చుండుకు సమ్మతించిరి గాని వితంతూద్వాహమువారితో కూర్చొనుటకు కలవరపడిరి

(4) కొత్తపల్లిసభలో వియ్యంకులకు ప్రత్యేకముగా భోజనసదుపాయము చేయబడెను. యలకుర్తి యుత్సవసందర్భములో, 2 వ తరగతి యువకుల పంక్తి దొరకినది. అంతియే భేదము. తక్కినదంతయు సమానము.

(5) వంటబ్రాహ్మణులలో నొకరు, జనము అంతయు భుజించిన తరువాత వేరే స్వహస్తము చేసుకొనిరి. వీరును పంచగవ్య ప్రాశనము చేసినవారే.

(౮) యలకుర్తిగ్రామ పురోహితుడు సహితము దేవాలయము నందు నభిషేకమొనర్చి భోజనమునకు స్వగ్రామము వెళ్లుచుండువారు, వీలుతప్పితే స్వహస్తము చేసికొనేవారు. కారణము ఆహితాగ్నిపాకపు విందు పూర్తియగు లోపల వారికి నియమింపబడిన పనులు పూర్తికానందున అట్లు జరుగవలసివచ్చెను.

దైవసంబంధమగు యాక్రతువు జరుగుకాలమునందు మధ్యమధ్య హోమ గుండములవద్ద కొందరు యువకులును, యువకభావముగల వృద్ధులును, తమ మనుష్యత్వమునువీడి భైరవములభంగి మొఱుగుటయు, భల్లూకములమాదిరి నార్చుటయు నక్కలపగిది కూయుటయు, కాకులపగిది కాకాయనుటయు జరిపి, రణసంకులము వంటి సంకులమును బుట్టించిరి. మారీచసుబాహులపగిది, మనుష్యరూపధారులగు నిద్దరు సాక్షరులు యజ్ఞసందర్భమున గడబిడ జరిపి దైవోపహతులై యడంగిరి. ఇట్లెన్ని యంతరాయములు కలిగినను పెట్టిన సుముహూర్తము బలముకలది యగుట నిరాటంకముగ దైవకార్యము సమగ్రముగ నెరవేరినదని దెల్పుట కెంతయు సంతసించుచున్నాను. దుశ్శకునములు మనుష్యకార్యముల జెరచును గాని దైవకార్యములను చెడగొట్టకలవా? కల్ల. శుభాశుభకర్మలు రెండును దైవమునుగాని, నిస్త్రైగుణ్యపురుషులనుగాని యంటవనుట నిరాక్షేపణీయము. ఇంకొక విశేషము దేవాలయమునందు జరిగిన సహస్రదీపారాధన సందర్భమున వితంతూద్వాహసంఘమువారిని దీపముల సనాతన వర్గమువారు వెలిగించనీయలేదు. మంత్రపుష్పము నీయలేదు.

కావున నో శైవసాంఘికులారా! సంఘమున అసత్యము నిర్దయ అత్యాచారము మున్నగు దుర్గుణములు కలవారు జనించివారనిగాని, రజస్వలానంతర వివాహములు, విధవావివాహములు, వర్ణాంతరవివాహములు చేయువారు ఏర్పడివారనిగాని తహతహలాడవద్దు. అట్టివారిని దూషించవద్దు. వేదమతము ఎవ్వరిని దూషించుటకొప్పుకొనదు. హితబోధచేత బుద్ధులను మార్చుటకు బ్రయత్నింపుడు. చేతగానిచో నూరకుండుడు. పైన చెప్పబడినవి అధర్మములని మీకు తోచినచో, మీరు వాని ననుసరించవద్దు, ధర్మము నాచరించిన వారికి శ్రేయమును అధర్మము నాచరించిన వారికి అశ్రేయమును కలుగుననిగదా శాస్త్రములు చెప్పుచున్నవి. ఎవరాచరించిన ధర్మము వారినే రక్షించును. ఎవరాచరించిన యధర్మము వారినే శిక్షించును.

కొందరు అనలము ముట్టుకొనెనని విచారపడకుడు. మన 1500 కుటుంబముల వారము ఏకగ్రీవముగ తుపుక్కన నుమిసినచో త్వరితగతి చల్లారుట ధ్రువము.

మరియొకమాట ఎంతకలికాలమైనను ధర్మము పూర్తిగా సంహరించునని మాత్రము నమ్మకుడు. ఎట్టి కష్టకాలమునందైనను ధర్మమును మాత్రము విడువకుడు. అదియే మిమ్ము రక్షింపగలదు. ఆపైన మీచిత్తము.

తుదిమాట ఈవ్యాసమును జూచి సరియైన సనాతన ధర్మపరాయణుడుగాని, బుద్ధిమంతుడగు యువకుడుగాని సంశయములను వీడి నిర్మలమనస్కుడై వర్తించునని నమ్ముచున్నాను. అట్లుగాక కొంతమంది యువకులు ఆగ్రహపూరితులై దుర్భాషణములను చేయుదురుగాక, దానికై నేను చింతించను. ఈయారాధ్యజనసంఘమునందు ఉద్భటారాధ్య, వేమనారాధ్య శ్రీపతి పండిత మంచెన పండితమల్లికార్జునపండిత విశ్వారాధ్య రేవణాసిద్ధ మరుల సిద్ధ ఏకోరామసిద్ధాది మహనీయులచే సుప్రతిష్ఠితములగు పీఠములవారు ఇంకను సనాతనధర్మపరులగు తమప్రాచీనుల వైభవములను కొనియాడుచున్నారు. అట్లుండుటకు వారి రక్తనాళములయందు, వారి పైతామహమగు నిర్మలరక్త ప్రవాహమీనాటికిని పారుచుండుటయే కారణము. ఇక్కాలమున ధర్మాచరణము కష్టమనితోచినను ధర్మనింద సేయుటలేదు. అధర్మాచరణమునకు వెనుకాడుచున్నారు. కావున నో శైవమతోద్ధారకులారా! నిర్మలస్వభావులారా! హితాహితముల రెంటిలో హితముం గ్రహించి యహితమును నిరసించుచు ధర్మదీక్షా పరతంత్రులగుదురుగాక, అట్టి సత్సంకల్పములచే పరమేశ్వరుడు మీహృదయ క్షేత్రములను పవిత్రపఱచుగాక.

విధవా వివాహసంఘమువారుగాని మరి యితరయువకులుగాని వచ్చి సంఘమునందలి స్త్రీపురుషులను వికటప్రశ్నలచే మోహపెట్టునెడ, నామోహమునకు గురిగాక పైసంభాషణములలోని సమాధానములజెప్పి వారివాదములను తుత్తునియలు సేయుడు.

మన సంఘమువారు సనాతనధర్మశీలము చేపట్టి జీవించుచున్నారు. త్రికరణశుద్ధిగా సనాతన ధర్మమును వీడి సంచరించుసాహసికులు లేరు అయినను యిప్పుడేర్పడిన వితంతూద్వాహపు సంఘంవారు సనాతన కుటుంబములలోని వారలై వైదికధర్మముల సరిహద్దుల దాటినవారని చెప్పవచ్చును. వీరివలెనే సాంఘికులెల్లరు ప్రవర్తింతురనుట కల్ల. తక్కిన సంఘములనుజూచి మనమీవిషయమును గ్రహింపవచ్చును. సనాతనధర్మముతో వీరు పోట్లాడుట చూడ, గొఱ్ఱె కొండతో డీకొన్నట్లున్నది. వీరు ఎంతపట్టుబట్టినను, వీరివలెనే సంపూర్ణముగ మారిన చిత్తవృత్తి కలవారు మనసంఘమున వెయ్యికి ఒకరికంటె నెక్కువ యుండరు. దానినిబట్టి అల్పముగ నక్కడక్కడ మరి పది వివాహములకంటె నెక్కువ జరుగవని నమ్ముచున్నాను. ముఖ్యముగ సనాతనధర్మమును పాటించు స్త్రీయే యిందుకు కారణమని నమ్ముచున్నాను. స్త్రీయొక్క అపవిత్రతయే సంఘవినాశనమునకు హేతువని నమ్ముచున్నాను. ఆమెయొక్క పవిత్రతయే సంఘాభ్యుదయమునకు నిదానమని విశ్వసించుచున్నాను.

శైవ యువకులారా! యిటుగనుడు.

చ॥ తనువున లింగసూత్రిముల । దాల్చినవారలు గాన మిమ్ము నే
ననవలసెఁ యథార్థముగ, । నట్టులగాక తురుష్కరక్త సం
జనితుల చేష్టదప్పునుచు । జాటితినే? మతధర్మసూత్రి బం
ధనమె ధనంబుమీకు సత।తంబును నాకును, నింతమాత్రిముం
గనదగదే? మహోగ్రులయి।గంతులువేయగ న్యాయమానె? మీ
జనకులు వారితండ్రులును । సల్పినధర్మమె ధర్మమంచు నా
మనమునదోచి యట్టు లభి । మానముతో మనపత్రికం గదా
ఘనముగ వ్రాసినాడ సరి । గాదని తోచిన మీవిమర్శ ద
ర్పణమున దేటతెల్లముగ । బాగుగ జూపగజెల్లుగాని మీ
మనసునదోచినట్లు బెడ । మార్గము ద్రొక్కుచు దక్కువారి నె
మ్మనముల బాధుసేయుచును । మంత్రము దంత్రము జేసిచేసి మీ
పనులను జేసికొంటయది । బాడియె? కాదనువారి షుష్కహే
ళనములతో నెదుర్చుచు గ । ళంబులనార్చగ మీదువాదముల్
ఘనమగునే? సుయుక్తులను । గాక కుయుక్తులచేత నెవ్వరే
మనిన తరంబెగెల్వగ న । యంబగుదారిని శాస్త్రపద్ధతిం
గనుడు హితంబు మీకగును । గాన తలంపుడ, మిత్రరత్నముల్॥

ఇట్లు
బుధజనవిధేయుండు,
ఇవటూరి సానందరావు.
వ॥ సం॥

సం॥రచందా రు ~~1.8.0~~ 2-0 విడి పత్రిక రు 0.4.0

# శైవమతప్రకాశిక

[సచిత్రమాసపత్రిక]

సంపుటము ౨ { ప్రమాధి నామసంవత్సరము చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢములు. సెప్టెంబరు, 1939. } సంచికలు ౧,౨,౩,౪.



అష్టవిభూతిసంపన్నుడగు శ్రీసదాశివుడు

సంపాదకులు:

కందుకూరి వటుకభైరవమూర్తిగారు

మినర్వా ప్రెస్, బందరు

# విజ్ఞప్తి

శ్రీ శైవమహాపీఠమును క్రమవిధానముతో స్థాపించి ముందునుండి దాని కార్యక్రమమును తేజోవంతముగ నడుపుతలంపుతో గత మేనెలలో జరిగిన కొత్తపల్లి సమావేశమునందు ప్రధానములగు కొన్ని మార్పులును తీర్మానములును గావింపబడినవి. అందు శ్రీపీఠ స్థాపనమునకు వలయు ప్రణాళికా నిర్మాణము, రిజిస్ట్రేషను, మరియు శ్రీపీఠపత్రికా నిర్వహణము మున్నగు కృత్యములను కేంద్రీకరించి కార్యభారమంతయు ప్రధాన మంత్రిపై నిడుట ముఖ్యతమము.

కార్యస్థానమును బెజవాడలో నెలకొల్పు విషయమున నంతకు పూర్వము చాలకాలముక్రిందటనే తీర్మానము జరిగియున్నను గారణాంతరములచే నది క్రియారూపమును దాల్చియుండలేదు.

ఇప్పుడివి యన్నియు నొక్కసారిగ జరుగవలసి వచ్చినవి.

పత్రికా ముద్రణము బందరునుండి బెజవాడకు మార్చుటకును ప్రకటనమును ప్రధానమంత్రియే చేయుటకును, ప్రెస్సు ఆక్టుక్రింద క్రొత్త డిక్లరేషనులును ప్రభుత్వమువారి యంగీకారమును అవసరములైనవి. మరియు ప్రధానమంత్రి న్యాయవాదియగుటచే, శ్రీపీఠకార్య నిర్వహణము విషయములో హైకోర్టువారి యుత్తరువులును అగత్యమయ్యెను. ఈ యవశిష్టములన్నియు 15-9-1939 వ తేదితో తీరినవి. ఈలోపుగ శ్రీపీఠ కార్యస్థానముగూడ బెజవాడకు మార్చబడినది.

ఈ 'శైవమతప్రకాశిక' ద్విమాసపత్రికగనుండి బహుధాన్య సంవత్సరపు చివరసంచిక గతసభకు బూర్వము వెలువడినది. శ్రీపీఠసభ వైశాఖములో జరుగనున్నందున, సభారిపోర్టునుగూడ ఈ సంవత్సరపు వసంత సంచికలో బొందుపరచు నుద్దేశముతో ఆ సంచికను సభకు బూర్వము ప్రకటింపలేదు. సభయందలి తీర్మానములును వానికనుబంధములగు పై కృత్యములును గారణములుగ, వసంత గ్రీష్మములకు సంబంధించిన పత్రికను ఏకసంచికగ నిప్పటికి బ్రకటింపగలిగితిమి.

ఈయనివార్యవిలంబమును వాచకు లుదారహృదయులై సహింప బ్రార్థితులు.

శ్రావణ భాద్రపదముల పత్రిక సకాలములో నీభాద్రపదాంతములోపుగ వెలువడగలదు.

ఆశ్వయుజమునుండి పత్రిక ప్రతిమాసమును వెలువడుచుండును. ద్విమాసపత్రిక కిదివరలో సంవత్సరచందా రు 1-8-0 లు ఉండెను. మాస పత్రిక యయినను ప్రమాథిచైత్రమునుండి సంవత్సరచందా రు 2-0-0 లు మాత్రమే యుండును. శ్రీపీఠ సభ్యులకు రూ 1-0-0 మాత్రమే.

శ్రీలో॥ యివటూరి సానందరావుగారు పత్రికకు లోగడ సంపాదకులుగ నుండిరి. గతసభాతీర్మానమువలన వారి సంపాదకత్వము సభతేది 3-5-39 తో నివృత్తమై నాటినుండి సంపాదకత్వాది పత్రికాధికారములన్నియు శ్రీపీఠ ప్రధానమంత్రికే కలవు. ఇది యిట్లుండ బెజవాడలో పత్రికా ముద్రణమును గూర్చి ప్రధానమంత్రి చేయుచుండిన యేర్పాట్లను శ్రీ సానందరావుగారు స్వయముగ నెరిగియు, కారణాంతరములచే "శైవమతపత్రికాశిక" యను పేరుతో తామే సంపాదకులుగ, చైత్రవైశాఖముల సంచికగ, నొకసంచికను గత జులై నెలలో బ్రకటింపజేసి యున్నారు. అందును గురించి, ప్రధానమంత్రితో సంప్రదించి కాని, ఆయనయనుమతి బడసిగానియుండ లేదు. ఆసంచికను శ్రీపీఠ పక్షమున సాధికార ప్రకటనముగ గ్రహింపజనదు.

శ్రీపీఠ కార్యస్థానము
బెజవాడ
18—9—39

కందుకూరి వటుకభైరవమూర్తి,
పత్రికాధిపతి, ప్రధానమంత్రి.

---

ఆంధ్రగ్రంథాలయ ప్రెస్, బెజవాడ.

# శైవమతప్రకాశిక

సంపుటము ౨ { ప్రమాథి నామసంవత్సరము
చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢములు.
సెప్టెంబరు, 1939. } సంచికలు
౧,౨,౩,౪.

శ్రీ శివాయ గురవే నమః

## 22 వ శ్రీ శైవమహాపీఠసమావేశ కార్యక్రమము

స్వస్తిశ్రీ ప్రమాథినామ సంవత్సర వైశాఖ శుద్ధ ౧౩ లు (1-5-39) మొదలు మూడు దినములు అనగా మేనెల 1,2,3 తేదుల యందు పశ్చిమగోదావరిజిల్లా తణుకుతాలూకా కొత్తపల్లి అగ్రహార మున అచ్చటి శైవమహాబృందమువారిచే శ్రీ శైవమహాపీఠము ఆహ్వానింపబడినది.

1-5-39 ఉదయం 7 గంటలకు శైవమహాజను లెల్లరు అతివైభవ ముతో స్వస్తివాచనములతోను మంగళవాద్యములతోను నందిజెండాల తోను గ్రామమంతయు ఉత్సవము గావింపబడినపిమ్మట 8½ గంటలకు శ్రీముక్తేశ్వరస్వామివారి ఆలయము ముందర అమర్చబడిన విశాలమైన పందిరియందు సమావేశమయిరి. తరువాత గత సభాధ్యక్షులచే సూచించబడి మహాసభాసభ్యులచే ఆమోదింపబడి బ్ర॥ శ్రీ చాగంటి మల్లికార్జునరావు అయ్యవారుగారు అధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి. ఆహ్వానసంఘము తరఫున యివటూరి నాగభూషణంగారు ఉపన్యసించిరి. చాగంటి కామేశ్వరరావుగారును చాగంటి అన్నప్పశాస్త్రిగారును స్వాగతపద్యములు చదివిరి. తరువాత అధ్యక్షులవారు తమ అధ్యక్షో పన్యాసమును మృదుమధురముగా నొసంగిరి. అనంతరము మరికొంత మంది ఆహ్వాన సంఘసభ్యులు ఉపన్యసించిన పిదప 10½ గంటలకు సభ ముగింపుచేయబడెను.

# ఆహ్వానములు

శైవమహాజనులారా!

పూర్వము శైవమహాజనసభ 1913 వ సం॥మున యీ కొత్త పల్లి అగ్రహారములో మా పూర్వుల యాహ్వానమున జరిగియున్నది. తిరిగి యిప్పుడు మాకు శైవమహాపీఠమును ఆహ్వానించుభాగ్యము లభించి నందుకు మే మందరము నిర్భరానంద హృదయులమైతిమి. మా యాహ్వానము నంగీకరించి దూరభారమనిగాని వ్యయ ప్రయాసలనిగాని గాడ్పుదినము లనిగాని యెంచక విచ్చేసిన తమకెల్లరకు యీ సంఘము తరఫున నా హృదయపూర్వకస్వాగతానేకనందనము లర్పించుచున్నాను.

ఈ సభోద్దేశము మీ కెల్లరకు తెలిసియే యున్నది. ప్రస్తుతము మన శైవమతము ప్రజాబాహుళ్య దృష్టిలో తన పూర్వమహోన్నతస్థానమును గోల్పోయినది. ఇప్పటి పరిస్థితులలో శైవమత సిద్ధాంతములను మనమెల్లరము గుర్తించి మతాభివృద్ధికి వలయు అనుష్ఠానాదిసాధనముల వ్యాపింపజేయవలసియున్నది. అట్టివానిని ఆలోచించుటకే యీ 22 వ శైవమహాపీఠసమావేశము నేడిచటి కాహ్వానింపబడియున్నది. తామెల్లరు నీ యుద్యమమునకు తోడ్పడి సభ దిగ్విజయముగా జరిపింప బ్రార్థితులు.

ఇవటూరి వీరభద్రయ్య,
ఆహ్వాన సంఘాధ్యక్షులు.

శ్రీ లోకారాధ్యాద్యనేక బిరుదాంకితులును, రిటయిర్డు రక్షక శాఖ కార్యాలయాధికారులును కొత్తపల్లి అగ్రహారమునందు జరిగిన మహాసభాధ్యక్షులును అగు బ్ర॥ శ్రీ చాగంటి మల్లికార్జునరావు అయ్యవార్లంగారికి సమర్పించిన స్వాగత పద్యరత్నములు:—

అధ్యక్ష శిరోమణీ !

క. శ్రీకర శైవాభరణా
ప్రాకటసోద్యోగ విభవపాటవచరణా

# శైవమత ప్రకాశిక.

కైకొనుము మల్లికార్జున
నీ కిచ్చెడి స్వాగతంబు నిర్మలకరుణా.

ఉ. శైవమతాభిమానమును శాస్త్రములం దభిమాన పాండితీ
భావము ప్రేమభావము కృపాగుణభావము ఆశ్రితాళిస
ద్భావము మిత్రులందు సమభావము భోగములందు ప్రీతిమై
భావములాది వేయిగుణభావము లాశ్రయమొందె నీయెడన్.

శైవమహాజనులారా!

సీ. శ్రీ పరాత్పర జప శ్రీ పరాయణులార!
శివతత్త్వసార ప్రసిద్ధులార!
పంచాక్షరీ సుప్రభావ సాధకులార!
శైవరహస్య రసజ్ఞులార!
సతతశివార్చనాన్విత మనోధనులార!
ధృతిసత్య నిష్ఠాగరిష్ఠులార!
మహనీయ రుద్రాక్షమాలికా ధరులార!
భస్మధారణ యశోభరితులార!

తే. గీ. శ్రీ ఉమాపతి చరణ రాజీవసేవ
నిత్యపరితృప్తులార! సన్మిత్రులార!
నేడు మీకెల్లరకు ప్రేమ నియతితోడ
గరిమ నర్పించు మాదు స్వాగతము గొనుడు.

చ. కనుగొన బుణ్యమయ్యె గనకంబున దావన కొత్తపల్లికిన్
ఘనులగు మీదురాక చిరకాలతపఃఫల మిద్ది మాకు మి
మ్మనిశము దేవు డోముత దయంగని శైవమత ప్రకాశ వ
ర్తనపరులార! ధైర్యగుణ తత్పరులార! సుఖంబు లొందుడీ.

తే. గీ. పావనమ్ము ముక్తేశ్వర పాలితమ్ము
సుందరమ్ము విద్వాంస సంశోభితమ్ము..

ప్రేమతో కొత్తపల్లి పురీవరమ్ము
నల్పు నేడిదే మీకు సుస్వాగతమ్ము.

ఇట్లు,

తణుకు, 1—5—1939. (Sd) చాగంటి అన్నప్ప శాస్త్రి, జ్యోతిష హస్తసాముద్రిక వాస్తుశాస్త్రజ్ఞులు.

సాయంత్రం షుమారు నాల్గుగంటలకు సభ్యులకు శివభక్తిని వెల్లడించు ఉపన్యాసముల కవకాశము ఇవ్వబడెను.

1 ఈశ్వరపగడ సదాశివశర్మగారు శివుని ఐశ్వర్యమునుగూర్చి ఉపన్యసించిరి.

2 చాగంటి సుబ్రహ్మణ్యాం అయ్యావార్లంగారు (గుడివాడ) శివుడు, లింగము, గురువు, నాద బిందు కళావిధానమునుగూర్చి ఉపన్యసించిరి.

3 యివటూరి వీరదుర్గయ్యగారు (కొత్తపల్లి) శివభక్తినిగూర్చి చెప్పిరి.

4 యివటూరి సానందరావుగారు "జాతితత్వము"ను గూర్చిన వ్యాసమును చదివిరి. రాత్రి 7½ గంటలకు సభముగింపుచేయబడియెను.

## 2-5-39 ద్వితీయదినచర్య

ఉదయము గత సభాధ్యక్షులు విద్వాన్, విద్యాప్రవీణ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగా రరుదెంచిరి. 8గంటలకు సభాసమావేశమయినపిదప కత్తవపాడు వాస్తవ్యులు శ్రీ లో॥ రెంటాల సుబ్రహ్మణ్య కవిగారు ఇష్టదేవతా ప్రార్థనగావించి యీాదిగువ పద్యమును ఆశుధారగా జదివిరి:—

చ. ప్రశమ ప్రమాథినామ శుభవత్సర మాధవ శుద్ధసత్త్రయో
దశి శశివార హస్తఘనతారను గొత్తపలిన్ శుభంబుగన్
శశిధరుసత్కృపన్ వరలు శైవసభాశశితారకార్కమై
భృశముగ గాంచుతన్ జయము విశ్రుతకీర్తిరమాభిరామమై.

1. ఈశ్వరపగడ సదాశివశర్మగారు సనాతనమైన శైవమతమునుగూర్చియు శైవమతవ్యాప్తిని గూర్చియు విదేశములయందు గూడ శివ

లింగములు వ్యాప్తమయినట్లును చక్కని మృదుమధుర వచనములతో సభారంజకముగా ఉపన్యసించిరి.

2. గుడివాడ వాస్తవ్యులు చాగంటి వీరసుబ్రహ్మణ్యంగారు పై విషయముల బలపరచుచు నాదబిందు కళావిధానమునుగూర్చి సభారంజకముగా ఉపన్యసించిరి.

3. కత్తెపాడు వాస్తవ్యులు రెంటాల సుబ్రహ్మణ్య కవిగారు "పంచాక్షరీ మాహాత్మ్యము"ను గూర్చియు తమపూర్వులు వ్రాసిన ఏతన్మాత్మక గ్రంథమును గూర్చియు చక్కగా ఉపన్యసించిరి. ఆగ్రంథమును సభవారు అచ్చువేయించి ప్రకటన గావించుటకు కోరిరి. కాని, చాగంటి వీరసుబ్రహ్మణ్యంగారు తాముదానిని తమస్వంతఖర్చుతో ముద్రింపించి మహాపీఠమునకు సమర్పించుటకు స్వయముగా వాగ్దానము చేసిరి.

4. రెంటాల వీరభద్రశాస్త్రిగారు (ఏలేటిపాడు) సంధ్యావందనావశ్యకతనుగూర్చి యుపన్యసించిరి.

5. యువటూరి సుందరరావుగారు శివానుగ్రహమునుగూర్చి సర్వజనరంజకముగా ఉపన్యసించిరి. 11 గంటలకు సభ ముగింపుచేయబడినది.

సాయంత్రం 4 గంటలకు సభప్రారంభమాయెను.

1. ఈశ్వరప్రగడ సదాశివశర్మగారు హరదత్తాచార్యులవారిచే రచింపబడిన హరి హర తారతమ్యమునుగూర్చి చక్కని యుపన్యాసమిచ్చి సభారంజనము గలుగజేసిరి.

2. దువ్వ వాస్తవ్యులు శ్రీపతి పండితారాధ్యుల అంబన్నయ్యవార్లంగారు శివోపాసన, లింగధారణావశ్యకతను గూర్చి వేదసూత్రప్రమాణములతో చక్కని ఉపన్యాస మిచ్చిరి.

3. యువటూరి కోటిలింగంగారిచే రచింపబడిన శంకరశతకములోని కొన్ని పద్యములను వారి కుమారుడు సోమనాథశాస్త్రి చదివి ఆపుస్తకములోని పద్యములు శైవమత ప్రకాశికలో ప్రకటించుటకు కోరిరి.

4. పూర్వసభాధ్యక్షులును బ్ర॥ శ్రీ విద్వాన్, శిరోమణీత్యాది బిరుదాంకితులు నగు ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు శివతత్వము,

లింగశబ్దనిర్వచనము, శైవమహాపీఠస్థాపన మున్నగు విషయము లనుగూర్చి శ్రుతిస్మృతి ప్రమాణములతో సభికులందరకు మనో రంజకముగా గంభీరోపన్యాసము గావించిరి.

5. విజయవాడ వాస్తవ్యులును ఆంధ్రాయుర్వేదవైద్య విద్యావాచస్పతీత్యాది బిరుదాంకితులును, అగు డాక్టర్, శైవాగమవిశారద, శ్రీపతి పండితారాధ్యుల పట్టసలింగారాధ్యులుగారు శైవమహాపీఠము శైవమతాభివృద్ధికై ఎట్లు తోడ్పడవలయునో అను విషయమును గూర్చియు మతవిద్యల నభ్యసించవలెననియు మతచిహ్నముల ధరించవలెననియు మతాచారధర్మములు ఆచరణయందుంచవలెననియు మతమునకు ప్రధానవ్రతము అగు వీరభద్రపళ్లెమును ప్రతి శైవుడునుఆచరించవలెననియు సభారంజకమైన గంభీరోపన్యాసము నిచ్చిరి. అంతట సభ ముగిసెను.



## 3-5-39 తృతీయ దినచర్య

ఉదయం 8 గంటలకు సభ ప్రారంభమాయెను.

1. చాగంటి వీరమల్లికార్జునలింగం అయ్యావారుగారు శివభక్తి, రుద్రాక్ష వీనిని గూర్చియు,
2. ఇవటూరి బుచ్చిసోమన్నయ్యావారుగారు విజయనగర మండలమున వారుచేసిన మతప్రచారమును గూర్చియు,
3. ఇవటూరి వీరభద్రయ్యగారు భస్మ, రుద్రాక్ష, పంచాక్షరీ మహిమలను గూర్చియును ఉపన్యసించిరి.
4. శ్రీశైవమహాపీఠ ప్రధానమంత్రిగారగు కందుకూరి వటుకభైరవమూర్తి పంతులుగారు గతసంవత్సరము రిపోర్టు చదివిరి.
5. మల్లంపల్లి అచ్యుతలింగంగారు మండలసంఘములయొక్క ఏర్పాట్లు ఆశయములను గూర్చి చెప్పిరి.
6. శ్రీపతిపండితారాధ్యులపట్టసలింగారాధ్యులవారు శైవమహాపీఠమును గూర్చియు, మండలసంస్థలు చేయవలసిన ప్రచారమును గూర్చియు,

7. చాగంటి వీరసుబ్రహ్మణ్యంగారు మండలసభలు, పీఠము, వీనిసంబంధమును గూర్చియు,
8. ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు శైవమహాపీఠ మండల సభల ఏర్పాటులను గూర్చియు నెల్లరకు తెలియపరచిరి.

## తీర్మానములు

ఈ దిగువ తీర్మానములు శైవమహాపీఠ సమావేశమందు అంగీకరింప బడెను.

1. చాగంటి మల్లికార్జునరావుగారు, తణుకు, పీఠాధ్యక్షులు.
   ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు, వరంగల్, ఉపాధ్యక్షులు.
   కందుకూరి వటుకభైరవమూర్తి పంతులుగారు, బెజవాడ, ప్రధానమంత్రి, కోశాధిపతి, పత్రికాధిపతి;
   ఇవటూరి సంగమేశ్వరరావుగారు, తణుకు., సహాయమంత్రిగా నుండుటకు తీర్మానింప బడినది.
2. ఈశ్వరప్రగడ సదాశివశర్మగారిచే రచింపబడిన కోలాట భజనకీర్తనల పుస్తకములు 600 సభకు ఉచితముగా యిచ్చినందున వారికి శైవమతమందుగల విశేషాభిమానమునుగూర్చి సభవారు ప్రశంసించిరి.
3. ఆంధ్రదేశమునగల శైవమండలములో శైవమతాభివృద్ధి గలుగ జేయుటకు యీదిగువ మండలములు యేర్పాటుచేసి ఆయామండల నామముల కెదురుగా చూపినవారు ఆయా మండల పరిషత్తులకు అధ్యక్షులుగాను కార్యదర్శులుగాను ఎన్నుకొనబడిరి.

   (a) విశాఖపట్నం జిల్లా (విజయనగరము)

   అధ్యక్షులు:- ఇవటూరి బుచ్చిసోమన్నయ్యవారు గారు,
   కార్యదర్శి:-చాగంటి సన్యాసిరాజుగారు, విశాఖపట్నం

   (b) తూర్పుగోదావరిజిల్లా (రాజమండ్రి)

   అధ్యక్షులు:- శింగరాజు సుబ్రహ్మణ్యం పంతులుగారు.
   కార్యదర్శి:- ఇవటూరి వీరభద్రయ్యగారు.

(c) పశ్చిమగోదావరిజిల్లా (తణుకు)

అధ్యక్షులు:- యివటూరి దుర్గా వెంకటసుబ్బారావుగారు, ఆచంట వేమవరం.

కార్యదర్శి:- యివటూరి నాగభూషణంగారు, తణుకు.

(d) కృష్ణాజిల్లా సత్యనారాయణపురం బెజవాడ. } అధ్యక్షులు:-డాక్టర్, శైవాగమవిశారద, శ్రీపతి పండితారాధ్యుల పట్టెస లింగారాధ్యులవారు

కార్యదర్శి:-ఇవటూరి వీరభద్రరావుగారు

(e) గుంటూరుజిల్లా:

అధ్యక్షులు:- ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు

(సనాతన శైవసమావేశము) (ఈమని) కార్యదర్శి:-ముదిగొండ రామలింగశాస్త్రిగారు

(f) నైజాం (వరంగల్లు) అధ్యక్షులు:- ముదిగొండ శంకరశాస్త్రిగారు

కార్యదర్శి:-శివదేవుని వీరభద్రశాస్త్రిగారు

(g) నైజాం (సికింద్రాబాదు)

అధ్యక్షులు:- శ్రీపతి పండితారాధ్యుల మార్కండేయశాస్త్రిగారు

కార్యదర్శి:-ములుగు బుచ్చయ్యఅయ్యవార్లుగారు

నైజాం మండలపరిచారకులు:- పండితారాధ్యుల శరభయ్యఅయ్యవారుగారు

శివభక్తిపరిచారకులు:- ఈశ్వరపగడ సదాశివశర్మగారు

4. ఈపైన చెప్పబడిన అధ్యక్షులు ఉపాధ్యక్షులుప్రధానమంత్రి సహాయమంత్రిఅను 4 గు రున్నూ 7 గురు మండలాధ్యక్షులున్నూ మొత్తం 11 మంది పాలకవర్గముగానుండి సభా కార్యక్రమములన్నియు నెరవేర్చుటకు అధికార మివ్వడమైనది. కార్యక్రమము జరుపుటకు కోరము కనీసము 5 గురికి తక్కువకాకుండా యుండవలయును.

5. సభాద్రవ్యములో అవసరమగుఖర్చులకుగాను అధ్యక్షునివద్ద 5-0-0 ప్రధానమంత్రివద్ద 3-0-0, నిల్వయుంచి మిగతాధనము యావత్తు

బెజవాడ ఇంపీరియల్ బ్యాంకులో డిపాజిటుచేసి అధ్యక్షునిఅనుమతిపై ప్రధానమంత్రి తీసుకొనుటకు అధికారమివ్వడమయినది.

6. శైవమతమునకు మహోపకారమొనర్చి వేదాంతాచార్యాది బిరుదాంకితులును మహాసభకు కొంతకాలముక్రింద అధ్యక్షులుగా నుండిన శ్రీ శివలెంక అమృతలింగం అయ్యావార్లుగారు లింగైక్యము నొందినందులకు ఈ సభవారు వీరి కుటుంబమునకు సానుభూతిని తెలుపుచున్నారు.

7. శ్రీ శైవమహాపీఠ ద్రవ్యములోనుంచి శైవమతపత్రికాశిక నడుపుటకు 600 రూపాయిలున్నూ విద్యార్థి వేతనములక్రింద లోగడ వర్కింగు కమిటీలో శాంక్షన్ అయిన 40 రూపాయిలున్నూ ఈ సం॥రం రాబోవు దరఖాస్తుల విమర్శించి యిచ్చుటకు రూ60 లున్నూ ప్రచారము పోస్టేజి వగైరాలక్రింద రు 100-0-0 లున్నూ మొత్తం 800-0-0 లు వెచ్చించుటకు పాలకవర్గము వారికి అధికారమివ్వడమయినది.

8. నైజాం మండలమున వరంగల్లునందు శాస్త్రపాఠశాల నేర్పరచుటకున్నూ వరంగల్లుమండలములో వసూలయ్యే పత్రికచందాధనము పాఠశాలక్రింద వినియోగించుటకున్నూ ఈ పాఠశాల యీ సంవత్సరం వరకు మాత్రం నడుపుటకున్నూ తీర్మానించడమైనది.

9. ఈ పీఠమును ట్రస్టుగా రిజిష్ట్రేషన్ చేయుటకుగాను లోగడ బెజవాడలో 2-2-39 వ తేదీని జరిగిన పాలకవర్గ సమావేశములో జరిగిన తీర్మానము ప్రకారము సింగరాజు సుబ్రహ్మణ్యం పంతులు గారితో సంప్రదించడమైనది. ఇక దేవిడీజమీందారుగారితో కూడా సంప్రదించవలసియున్నది. వారు దూరములో నుండుటచేత వెంటనే వారిని కలసి సంప్రదించుటకవకాశము ప్రాప్తించనిచో యితర లీగల్ అడ్వైస్ ప్రధానమంత్రిగారు తీసుకుని సత్వరముగా రిజిష్ట్రేషన్ ప్రయత్నములుచేసి ట్రస్టుడీడ్‌ను తయారుచేయించి రిజిష్ట్రేషన్ చేయుటకు తీర్మానించడమైనది.

10. ఈ 22 వ శైవమహాపీఠ సమావేశములో కొత్తపల్లి అగ్రహారమున 2-5-39 వ తేదీ రాత్రి కత్తవపాడు వాస్తవ్యులు రెంటాల సుబ్రహ్మణ్య కవిగారు గేయ రూపకముగా సోమవారవ్రతోద్యాపన మాహాత్మ్యమును సీమంతినీకథనుచక్కగా వినిపించినందులకు వారి నభినందించుచు వారు హరికథలను హరదాసులను తయారు చేయుదురని యీసభవారు కోరుచున్నారు.

11. ఈశ్వరప్రగడ సదాశివశర్మగారిచే రచియింపబడిన అకారాది క్షకారాంతముగా శివభక్తి సనాతనత్వమును బోధించుకీర్తనను శైవ మత ప్రకాశికలో ప్రచురించుటయేగాక చిన్నపుస్తకములుగా వీలు వెంబడి సభాద్రవ్యముతో అచ్చువేయించుటకు తీర్మానించడ మైనది.

12. ఈ 22 వ శైవమహాపీఠ సమావేశమును కొత్తపల్లి అగ్రహారీకులు ఆహ్వానించి సభకు విచ్చేసిన మాహేశ్వర గణమునకు సర్వోపచార యుక్తముగ ఆతిథ్యమిచ్చినందులకు అగ్రహారీకులందరికి ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగుటకు బరమేశ్వరుని ప్రార్థించుచు, జయ జయధ్వానములతో సభముగింపబడెను.

అధ్యక్షులు:- చాగంటి మల్లికార్జునరావు అయ్యవారు.



## ప్రకటన రేట్లు

| | నెలకు | సంవత్సరమునకు |
|---|---|---|
| పూర్తిపేజీ | 3—0—0 | 24—0—0 |
| అరపేజీ | 1—12—0 | 15—0—0 |
| పావుపేజీ | 1—0—0 | 10—0—0 |

# శ్రీ వేదశాస్త్ర కళాశాల,

సత్యనారాయణపురం, బెజవాడ.

శ్రీ శైవమహాపీఠమువారిచే స్థాపించబడి విజయవాడ మహాజనులచే నడుపబడుచు క్రమాభివృద్ధినొందుచున్న వేదశాస్త్రకళాశాలను తిలకించిన సందర్భమున పండితాభిప్రాయము లిందు పొందుపరచితిని. ఇట్టిసంస్థల అభివృద్ధి నిమిత్తం మహోదారులగు వారి చేయూతకొరకు ఎదురుచూచు చున్నారము. తమబాలురను నేడే యీవిద్యాలయము నందు చేర్చి చదివింపుడు.

ఇట్లు,

వే॥ శా॥ పా॥ ప్రధానోపాధ్యాయులు,

శైవాగమవిశారద **శ్రీపతి పండితారాధ్యుల పట్టిస లింగారాధ్యులు**

సత్యనారాయణపురం, బెజవాడ.

వివరములకు:- ప్రధానోపాధ్యాయులవారిపేర వ్రాయుడు.

శ్రీ లక్ష్మీ హయగ్రీవో విజతేతరామ్.

శ్రీమద్విజయవాటికాంతర్గత సత్యనారాయణ పురే నూత్నతయా బ్ర॥ శ్రీ శైవమహాసభ్యైః స్థాపితా వేదశాస్త్ర పాఠశాలా మయా అస్మిన్ దినే వ్యలోకి. అత్రస్థితాః బాలకాః అత్యల్పకాల ఏవ స్వకీయ విద్యాకౌశలం ప్రదర్శయంతః మామతీవ సమతూతుషన్. ఏషా పాఠశాలా అచిరేణైవకాలేన వృద్ధిమేష్యతీతి మేనిశ్చయః. అస్యాః పాఠశాలాయాః శాశ్వతీంప్రతిష్ఠాం పరమేశ్వరః ప్రదద్యాదిత్యాశాసే॥

శ్లో॥ శ్రీసత్యనారాయణపూర్వ్యారాజ
త్ప్రపన్నవాతాత్మజ నిర్మితాంతః ।
శైవార్య సంస్థాపిత వేదశాస్త్ర
కళాలయస్యాభ్యుదయం ప్రదద్యాత్॥

శ్లో॥ విద్యార్థిన స్సంతునిరంతరాయాః
అధ్యాపకాః పుత్రితశిష్యబృందాః ।
శైవాః కలావర్ధన తత్పరాస్యు
ర్వేదాశ్చ శాస్త్రాణ్యభివృద్ధి మీయుః॥

కాశీ కృష్ణాచార్యః
శతావధానీ

శ్రీశివాయ గురవేనమః శ్రీ లలితాత్రిపుర సుందర్యైనమః

శ్రీమద్విజయవాడాంతస్థ సత్యనారాయణపురే, శ్రీ శైవమహాసభ్యానాం సాహనస్యేన నిర్మితాం వేదశాస్త్ర పాఠశాలాం అస్మిన్ దివసే ప్రాతఃకాలే ऽహ మద్రాక్షం। అత్రత్యానా మధ్యాపకానాం విద్యార్థి, నాంచ సంతత విద్యావ్యాసంగేనాతీవ పరితుష్టో ऽస్మి। వేదశాస్త్రాణాం అద్యకాలే ఉత్పన్నప్రాయాణాం అత్రబీజతయా పరమేశ్వరేణ స్థితిః కల్పితేత్యహం సాందానంద నిమగ్నహృదయో ऽభూవం। ఆస్తికమహాశయాః యద్యపి తేషాం వితరణవిషయే దేవాలయ నిర్మాణాదీతర విషయాబహవస్సంతి। తథాపి తేషామపి వేదశాస్త్ర మూలకత్వా దేతాదృశానాం స్థితిహేతుం సమ్యగాలోచ్య ఏతాదృశానేవ పోషయన్త్వితి మమ సమంజసం సుహృత్సమ్మిత వచనం। అత్రత్యౌ పండితవర్యావపి విద్యార్థినాం శిక్షణే విద్యాప్రదానే చాత్యంత పటుతరౌ। కుశలౌ మమహృదయ మాకర్షయతః। అస్మాక మిష్టదేవతా శ్రీమత్త్రిపురసుందరీసహిత శ్రీకాశీవిశ్వనాథః అత్రత్యాధ్యేతృధ్యాపకానాం దీర్ఘమాయు ర్వితరన్ అస్యాఃపాఠశాలాయాః పురోభివృద్ధయేऽగృహ్ణాంత్వితి సవినయం ప్రార్థయే ఇతిశివం.

వాసస్థానం
సత్యనారాయణపురం
బెజవాడ.

ఉభయభాషాప్రవీణః
భాగవతుల దక్షిణామూర్తిశాస్త్రీ.
సంస్కృతాంధ్ర సాహిత్యోపాధ్యాయః
సంస్కృతకళాశాలా, తెనాలి.

---

## వ్యాసకర్తల కొక మనవి

పత్రికకు వ్యాసములు పంపగోరువారు కంపోజింగుకు వీలుగా నుండునటుల పేజీకి ఒకవైపున విడిచ్రాతతోవ్రాసి ప్రతినెల ౧౦ లోపుగా పంపప్రార్థితులు.

## ప్రకటన కర్తలకు

ఈ పత్రిక అందినతోడనే తమ ప్రకటనలయందు మార్పుకోరినయెడల త్వరలో తెలిపిన ముందుపత్రికలో మార్చబడును.

పత్రికాధిపతి.

# శ్రీ శైవమహాపీఠ కార్యక్రమము

శైవమహాజనులారా!

ఈ నెల 1, 2, 3 తేదీలయందు 22 వ శైవమహాజనసభకు వివిధ ప్రాంతములనుండి శైవులనేకులువచ్చియుండిరి. సభ సర్వజనాదరణీయముగా దిగ్విజయముగా జరిగినది.

ఇటీవల ఆరాధ్యజనసంఘములో జరిగిన మొదటి వితంతువివాహ సందర్భమున కొందరి శైవుల యసమ్మతిని దెలుపు కాగితములుకొన్ని యీదిగువ ప్రాంతములనుండి మహాసభవారికి చేరినవి. ఈదిగువ గ్రామములపేర్లు వాటి కెదురుగా అసమ్మతుల సంఖ్య వేయబడినవి.

శోభనాద్రిపురము 6, గుడివాడ, 1 (శాఖాసంఘము తరఫున) బెజవాడ 16, కొత్తపేట 18, యలకుర్రు 22, బందరు 16, పెడన 23, తెనాలి 8, విజయనగరం, విశాఖపట్నం, పర్లాకిమిడి వగైరా 53, ఈమని 31, వరంగల్లు 25, కాని యలకుర్రులో 4 గురుమాత్రము సమ్మతిని దెలిపిరి.

ఇందును గురించి కొన్ని గ్రామములనుండి యిట్టి విషయమును, పవిత్రమైన మహాసభయందు చర్చించుటయు శైవమతప్రకాశికలో యిట్టి ప్రచురణచేయుటయు, వాదోపవాదముల కవకాశమొసంగుటయు, మతాభివృద్ధికి భంగకరము గావున యిట్టి క్లిష్ట సమస్యలకు మహాసభలో తావియరాదనియు మున్నగు విషయములతో కొన్ని అర్జీలు తమవద్దకు వచ్చినట్లు డాక్టరు శైవాగమవిశారద శ్రీపతి పండితారాధ్యుల పట్టెసలింగారాధ్యులుగారు చెప్పియుండిరి. కాని దాఖలు చేసి యుండలేదు.

తణుకు,
15—5—39.

చాగంటి మల్లిఖార్జునరావు,
శైవమహాపీఠాధ్యక్షులు.



# మండలపరిషత్ కార్యక్రమము

శ్రీశైవమహాపీఠ కృష్ణామండలపరిషత్,

సత్యనారాయణపురం – బెజవాడ.

ది 10-5-39 తేది బుధవారమురోజున బెజవాడలో మామండల నగరసంఘమువారు సాయంత్రం 5 గంటలకు రాజా మార్జ్లా కందు కూరి నాగమల్లికార్జునరావు పంతులుగారి అధ్యక్షతక్రింద, జయప్రద ముగా సభజరిపిరి. సభకు పలువురు శైవులు, శైవమతాభిమానులు విచ్చే సిరి. శైవమత ప్రకాశికకున్నూ, శ్రీశైవమహాపీఠస్థాపనకున్ను బెజ వాడ పౌరులు సహకారముచూపి వారివిరాళములు, పత్రిక చందాలు యివ్వగలందులకు కొన్ని ముఖ్యతీర్మానములు తీర్మానించి, సభరాత్రి 8½ గంటలకు జయజయ ధ్వానములతో ముగించిరి.

బెజవాడలోని శైవగృహముల సంఖ్య 40.

సత్యనారాయణపురం<br>బెజవాడ,<br>11-5-39

ఇట్లు<br>యివటూరి వీరభద్రరావు,<br>కార్యదర్శి.

శ్రీ శివాయ గురవేనమః

శ్రీశైవమహాపీఠ కృష్ణామండలపరిషత్

సత్యనారాయపురం–బెజవాడ.

శ్రీశైవమహాపీఠమువారిచే నియమింపబడిన మండలపరిషత్తులు ఆయా మండలకార్యక్రమమును చురుకుగా సాగించి రాబోవు ఆశ్వ యుజమాసములోపల మహాపీఠమువారి ఆజ్ఞప్రకారము ధనమును సంపా దించికార్యస్థానమున జమకట్టించిననే గాని, మహాపీఠ స్థాపనాదికములు సత్వరముగా ఫలప్రదము గానేరవు. కావున కృష్ణామండల వాసులగు మహోదారులారా! శ్రీ శైవమహాపీఠమునకు ప్రధాన కార్యస్థానము విజయవాడలో నేర్పాటుచేయుటయు అందు ఈ కృష్ణామండలమునకు మాయిుపురను మతసేవకు శ్రీ శైవమహాపీఠమువారు నియమించు

టయు జూడ మతసేవ చేయుటకు మాకవకాశము గల్గినందులకు ఉత్సాహపూరితులమై తమ అందరి ప్రోత్సాహమును గోరి కార్యము నందు పాల్గొనుచున్నారము. ఇదివరకు ద్వైమాసపత్రికగా నడపబడు చున్న శైవమతపత్రికాశిక మాసపత్రికగా మార్చబడినది. గాన ధనము ద్విగుణముగా ఖర్చగును.

రాబోవు ఆశ్వయుజ మాసమునందు శ్రీ శైవమహాపీఠమువారు జరుపబోవు ఏకాదశాహ్నిక మహారుద్రయాగమునకు తామెల్లరు ధన మపారముగా నొసగి ధన్యులగుదురని నమ్ముచున్నాము.

కృష్ణామండల పరిషత్ కార్యస్థానమున శైవులెల్లరకు ఉప యుక్తమగు అంత్యేష్టి, ఆరాధనవిధి, సోమవార వ్రతోద్యాపన విధా నము, చిన్మయదీక్ష మొదలగు మతగ్రంథములను ధారణకు లింగ మూర్తులను, యింకను అనేకములగు మతగ్రంథములను సిద్ధముచేయు చున్నారము గాన మీయొద్దనున్న మతగ్రంథములను కార్యస్థానము నకు పంప ప్రార్థితులు.

ఇట్లు,

బెజవాడ,
26—5—39.

(Sd.) డాక్టరు శైవాగమ విశారద,
శ్రీపతి పండితారాధ్యుల
పట్టెన లింగారాధ్యులు,
అధ్యక్షులు.
యివటూరి వీరభద్రరావు,
కార్యదర్శి.

**(2) శ్రీశైవ మహాపీఠ గుంటూరుమండల పరిషత్, ఈమని.**

కార్యదర్శి శ్రీలో॥ ముదిగొండ రామలింగశాస్త్రిగారు తాము గుంటూరుమండలమంతయు ప్రచారముచేసి అచ్చటచ్చట నగరసంఘ ములు స్థాపించినట్లున్ను, వారి మండలములోని శైవగ్రామములు, ఆయాగ్రామములలోని శైవగృహముల సంఖ్య ఈక్రింద పొందుపరచ బడిన ప్రకారము ఉన్నట్లు 24-5-39 తేదిన తెలిపియున్నారు.

తెనాలితాలూకా: ఈమని, 42. మున్నంగి, 6. దుగ్గిరాల, 1. కొల్లిపర, 1. ఇంటూరు, 1. తెనాలి, 26. ఒంగోలు తాలూకా, ఒంగోలు, 1. ఈతముక్కల, 11. అల్లూరు, 8. మన్నూరు, 1. కుంకుపాడు, 3. రాణంగివరం, 1. వలపర్ల, 2. పమిడిపాడు, 1. టంగుటూరు, రేపల్లెతాలూకా: 1. రేపల్లె, 2. బేతపూడి, 4. మైనేనివారిపాలెం, 1. పెదపులివఱ్ఱు, 10. బాపట్ల తాలూకా: బాపట్ల, 1. ఇనగల్లు, 5. పొన్నూరు, 1. తెల్లిపాడు, 3. శివపురం 9. గుంటూరు తాలూకా: గుంటూరు, 20. తాడికొండ 19. లాము 5. కొర్నిపాడు, 2. నర్సారావుపేట తాలూకా: నర్సారావుపేట, 1. సత్తెనపల్లి తాలూకా: సత్తెనపల్లి,4. మాదల, 12. తొండపి, 10. నందిగామ, 6. తక్కెళ్ళపాడు, 1. శిరంగిపాలెం, 1. కొమెరపూడి, 1. తాళ్ళూరు, 1. అచ్చమ్మపేట, 2. చింతపల్లి, 2. చామర్తి, 2. కస్తల, 7. ఊటుకూరు, 1. అత్తలూరు 4. అమరావతి, 1. మొత్తం 244 శైవగృహములు.

యీపై పట్టీనిబట్టి గుంటూరు మండలమునుండి శైవమతప్రకాశికకు చందాలున్నూ, శైవమహాపీఠ స్థాపనకు విరాళములున్నూ గుంటూరు మండల కార్యదర్శిగారు వసూలుచేసి త్వరలో పంపగలరని నమ్ముచున్నాము.

**కందుకూరి వటుకభైరవమూర్తి,**
ప్రధానమంత్రి.

**(3) శ్రీశైవమహాపీఠ పశ్చిమగోదావరి మండల పరిషత్,**

తణుకు.

శ్రీశైవమహాపీఠాధ్యక్షులు శ్రీ లో॥ చాగంటి మల్లికార్జునరావుగారు కొత్తపల్లి అగ్రహారంలో శైవసంఘము స్థాపించినట్లు ది 15-5-39 తేదీని తెలిపియున్నారు.

# శ్రీ శైవమహాపీఠముయొక్క
# పరిపాలన ప్రణాళిక

I సంస్థపేరు: శ్రీ శైవమహాపీఠము.

II కార్యస్థానము: బెజవాడ.

III సంకల్పములు: —

1. నిగమాగమాది ప్రమాణచోదితమగు శివతత్త్వజ్ఞానమును శివోపాసనము నభివృద్ధి చేయుట.

2. శాస్త్రీయములును శైవార్హములు నగు నిహపర శ్రేయః సాధనముల నిరూపించి వానియనుష్ఠానమును పెంపొందించుట.

3. శైవమతమునకును శైవ సంఘమునకును ఆశ్రయమును శరణ్యమునై యుండి సనాతన ధర్మరీతిని వాని యభ్యుదయమునకై కృషి సలుపుట.

4. పూర్వోక్త సంకల్పత్రయమునకు సంగతములును సాధకములు నగు అన్ని కార్యములను చేయుట.

ఈ నాలుగును శ్రీ శైవమహాపీఠముయొక్క సంకల్పములై యున్నవి.

IV నిబంధనలు: శ్రీ శైవమహాపీఠముయొక్క పరిపాలన విధానమంతయు ఈదిగువ నిబంధనల ప్రకారము జరుగవలెను.

1. ఈనిబంధనలలో విషయమునకుగాని ప్రకరణమునకుగాని విరుద్ధములు కానియెడల, "శ్రీ పీఠము" అను పదము "శ్రీ శైవమహాపీఠము" ను సూచించును.

పుంలింగము స్త్రీలింగమునకును, ఏకవచనము బహువచనమునకునుగూడ ద్యోతకమై యుండును.

సంవత్సరము, మాసము మున్నగు కాలవిభాగములను చాంద్రమానరీత్యా గ్రహింపవలెను.

"శైవుడు" అనగ ఈదిగువ 2వ నిబంధన ప్రకారము పూర్ణసభ్యత్వ లేక అర్ధసభ్యత్వ లక్షణములు కలిగియున్నట్టి యేవయస్సు వ్యక్తి అయినను అని యర్థము.

## శ్రీపీఠ సభ్యత్వము

(అ) నిగమాగమాది ప్రమాణములందాస్తిక్యముకలిగినట్టియు,

(ఆ) చాతుర్వర్ణ్యమునకు జెంది, స్వవర్ణాశ్రమోచిత ధర్మాచరణము గలిగినట్టియు,

(ఇ) శివాద్వైతమతావలంబులై, చిన్మయ శాంభవ పాశుపత శిరోవ్రతాది సంజ్ఞిత దీక్షాప్రయుక్త శివలింగధారణమున్ను అష్టావరణ పంచాచారపూర్వక విహితానుష్ఠానమున్ను గలిగినట్టియు

(ఈ) సత్ప్రవర్తనము గలిగినట్టియు

(ఉ) 18 సంవత్సరములకు మించినవయస్సు గలిగినట్టియు

స్త్రీలును పురుషులును శ్రీపీఠపూర్ణసభ్యత్వమున కర్హులై యుందురు.

తక్కిన సభ్యత్వ లక్షణములన్నియు గలిగి లింగధారణము మాత్రము లేనివారు అర్ధ సభ్యత్వమున కర్హులు.

దిగువ నిబంధనల ప్రకారము ఏర్పడినట్టియు తమకు సంబంధము కలిగినట్టియు ఆయా గ్రామ; లేక మండల; లేక మహాసంస్థల సమావేశములందు హాజరు అగుటకును; నిబంధనల ననుసరించి చర్చలందు పాల్గొనుటకును; తీర్మానముల నుపపాదించుటకును; తీర్మాన సమయములందు స్వాభిప్రాయ మొసంగుటకును; పూర్ణసభ్యుల కధికారము కలిగియుండును. తీర్మానసమయములందు స్వాభిప్రాయ మొసంగు నధికారము తప్ప; పూర్ణసభ్యుల తక్కిన యధికారము లన్నియు అర్ధ సభ్యులకును ఉండును.

ప్రతి సభ్యుడు శ్రీపీఠపత్రికకు చందాదారైయుండి నిర్ణీతమగు చందాను చెల్లింపవలెను. సభ్యులుచెల్లించు మొత్తములనుండి ముందు పత్రికచందాను జమకట్టి, శేషముండినచో నితరబాపతులకు గ్రహింపవలెను.

---

ఈ ప్రణాళికయొక్క ముద్రితప్రతియొకటి ప్రతిసభ్యునకు వినా మూల్యముగ నీయబడును. ఏకారణముచే నయినను సభ్యుడు మరియొక ప్రతిని కోరునెడల; దానికి పాలకసమితినిర్ణయించు మూల్యమును చెల్లింపవలెను.

ఇంకను ఈ నిబంధనలవలనగాని; వీని ననుసరించికాని తనకు గలుగజేయబడు అన్ని యితరాధికారములను ప్రతిపీఠసభ్యుడును గలిగి యుండును.

అర్హతకలిగియున్నటుల దమకుతోచినపవ్యక్తినైనను పూర్ణసభ్యత్వమునకుగాని యర్థ సభ్యత్వమునకుగాని పాలకసమితి యంగీకరింపవచ్చును. ఏ వ్యక్తినైనను పాలకసమితి నిరాకరించినచో హేతువులు జెప్పనవసరములేదు. పాలకసమితి యభిప్రాయమెట్లున్నను, ఏ వ్యక్తినైన శ్రీ పీఠసభ్యత్వ మొసంగుటకుగాని సభ్యత్వమునుండి తొలగించుటకుగాని గురుమండలికి సర్వాధికారము కలిగియుండును.

ప్రతి పూర్ణసభ్యుడును అర్ధ సభ్యుడును శ్రీ పీఠమునకు ప్రతి సంవత్సరమునకు పాలకసమితిచే నిర్ణయింపబడు దక్షిణను సమర్పించవలెను. సంవత్సరమధ్యములో దన సభ్యత్వమెపుడు ప్రారంభమయినను, అంతమయినను సంవత్సరదక్షిణను బూర్తిగ చెల్లించవలెను. శ్రీ పీఠమునకు సభ్యుడు చెల్లించవలసిన సంవత్సరదక్షిణ ప్రస్తుతము ఒక రూపాయిమాత్రము అయియున్నది. దీనిని పాలకసమితి మార్చవచ్చును. నియతదినమునకు మించి దక్షిణను చెల్లించక బాకీపెట్టు సభ్యుని యధికారములన్నియు మరుదినమునుండి తమయంతటనే నివర్తించును. కాని సభ్యత్వమున్ను దానికిచెందిన బాధ్యతలన్నియును నిలిచియేయుండును. పిమ్మట యెన్నడయినను, అప్పటివరకు చెల్లవలసిన బాకి నిశ్శేషముగా చెల్లించినచో, నాటినుండి తన సభ్యత్వాధికారములన్నిటిని సభ్యుడు తిరిగి కలిగియుండును. ఏ సభ్యుని విషయములోనైన లోగడ దక్షిణబాకీని రద్దుచేయుటకుగాని దానిని చెల్లించుట కింకను గడువిచ్చుటకుగాని పాలకసమితికధికారముకలదు. పాలకసమితి యామోదమునకు లోబడి ప్రధానమంత్రియే అట్టి గడువొసంగనగును. అట్లు బాకీ రద్దుఅయినప్పటినుండియు లేక అట్లు గడువీయబడిన కాలములోను సభ్యుడు తన సభ్యత్వాధికారములన్నియు కలిగియుండును.

శ్రీ పీఠముయొక్కయు, శ్రీ పీఠాంతర్గతములయి యీ నిబంధనల ప్రకారము నిర్మితములయిన ఆయా సభలయొక్కయు, వాటి ఉపసభలయొక్కయు, విశిష్ట సభలయొక్కయు, తాత్కాలిక సభల యొక్కయు, అధికారిక పురుషులయొక్కయు తీర్మానములకును శాసనములకును దండనములకును శ్రీ పీఠసభ్యు లందరు సర్వథాబద్ధులై యుందురు. కాని అట్టి యే తీర్మానమైనను, శాసనమైనను, దండనమయినను తన కసమ్మతమనికాని, దానివలన తన కేదయిన హాని, లేక నష్టము, లేక అవమానము కల్గినదనికాని, ఇతర యేః కారణముచేతకాని శ్రీపీఠముమీదను లేక ఆయాసభలు, ఉపసభలు, విశిష్టసభలు, తాత్కాలికసభలమీదను లేక ఆయాసభలందలి వ్యక్తులమీదను లేక అధికారిక పురుషులమీదను న్యాయస్థానములందు ఏవిధమయిన చర్యను తీసుకొనుటకు ఏసభ్యునికిని యెట్టి స్వాతంత్ర్యముకాని అధికారముకాని అవకాశముకాని ఉండదు. ఏవ్యక్తియైనను శ్రీపీఠసభ్యత్వము నపేక్షించుటవలనను లేక అంగీకరించుటవలనను ఈనిబంధనను పూర్తిగ గ్రహించి సమ్మతించిన ట్లెంచబడును.

ఏసభ్యుడయినను శ్రీపీఠప్రధానమంత్రికి దననివృత్తిపత్రము (Resignation) నర్పించి కాని వేరు విధముగ నందచేసి కాని రసీదు పొందుటవలన తనసభ్యత్వమును స్వేచ్ఛచే స్వయముగ నంతమొందించుకొనవచ్చును. కాని అట్లు చేయుటకు బూర్వము తాను శ్రీపీఠమునకు తన సభ్యత్వ సంబంధములో చెల్లింపవలసియుండు దక్షిణలను, అన్ని యితర మొత్తములను చెల్లించు బాధ్యత నిలిచియే యుండును. అంతకు పూర్వము జరిగియుండు అన్ని చర్యలకును బద్ధుడై యుండును.

3. ఈదిగువ బేర్కొనబడిన అయిదువర్గములు శ్రీపీఠాంతర్గతములయి యుండి స్వాధికారానుసారముగ శ్రీపీఠకార్యములను నెరవేర్చుచుండును.

అనగా:—

(i) మండల పరిషత్తు.

(ii) మహాపరిషత్తు.

(iii) పండితసభ.
(iv) గురుమండలి.
(v) పాలకసమితి.

## 4. మండల పరిషత్తులు

(అ) శైవులు నివసించు ప్రదేశములు తత్తత్కాలోచితరీతిని వేర్వేరు మండలములుగ విభజింపబడవలెను. అవి ప్రకృతమున,

| | |
|---|---|
| చెన్నపురి రాజధానిలోని రాజకీయమండలముల ననుసరించి | (1) విశాఖపట్టణము<br>(2) పూర్వగోదావరి<br>(3) పశ్చిమగోదావరి<br>(4) కృష్ణా<br>(5) గుంటూరు |
| నిజాం రాష్ట్రములో | (6) వరంగల్లు<br>(7) సికిందారాబాదు |

అని యేడు మండలములుగ నిర్ణయింపబడియున్నది. మండలములయొక్క స్థానమును, సంఖ్యయును, వ్యాప్తియును, అప్పటప్పటి విశేషములనుబట్టి గురుమండలిచే మార్చబడవచ్చును.

(ఆ) మండల వాస్తవ్యులగు శ్రీపీఠ సభ్యులందరును "మండల పరిషత్" సభ్యులుగ నుందురు.

(ఇ) ప్రతి మండల పరిషత్తునకు ఒక అధ్యక్షుడును, ఒక కార్యదర్శియు నుండవలెను. వీరు ఉభయులును యింకను ముగ్గురు పూర్ణ సభ్యులును కలసి మండల పరిషత్కార్యనిర్వాహక వర్గముగ నుందురు. మండలమందు యేబదికితగ్గకుండ పూర్ణసభ్యు లున్నచో, కార్య నిర్వాహకవర్గ సభ్యు లైదుగురని ప్రతిసంవత్సరము మాఘాంతములోపల వారు ఎన్నుకొనవలెను. పూర్ణసభ్యుల సంఖ్య అంతకు తగ్గియున్నచో శ్రీపీఠాధిపతియే వారిని యేర్పాటుచుండవలెను.

(ఈ) మండల పరిషదధ్యక్షుడుగాని, మండల పరిషత్కార్యదర్శిగాని, మండల పరిషత్సభ్యులలో పదునొకండుగురు ఏకీభవించిగాని, పరిషత్సమావేశము నాహ్వానింపవచ్చును.

(ఉ) ప్రతి ఆరుమాసముల కొక మండల పరిషత్సమావేశము సాధారణముగ జరుగవలెను.

(ఊ) ప్రతి సమావేశమునకును స్వాభిప్రాయ మొసంగు స్వార్తత కల పూర్ణసభ్యులు పదునొకండుగురు కనిష్ఠసంఖ్యగ నుండవలెను.

(ఋ) శైవమతమునకును శైవ సంఘమునకును సంబంధించినట్టియు, శ్రీపీఠ సంకల్పములకు సంగతములును సాధకములును అగునట్టియు, మండలస్థ శైవుల యోగ క్షేమములకు హేతుభూతములు కాదగినట్టియు, ఐహికాముష్మిక విషయము లన్నిటిని అవసరము వెంబడి చర్చించి తమ యభిప్రాయములను ఈప్సితములను విజ్ఞప్తి రూపంబులుగ శ్రీపీఠమునకు నివేదించుటకు మండల పరిషత్తునకు అధికారము కలిగియుండును. శ్రీపీఠవిధానములను శాసనములను శిరసావహించి మండలమందంతట ఆచరణలో బెట్టుటయును శైవమత ప్రచారము చేయుటయును మండల పరిషత్తునకు విధియై యుండును. మండలమందలి సభ్యులు శ్రీపీఠమునకు జెల్లించవలసిన అన్నివిధముల మొత్తములను మండల పరిషత్కార్యదర్శియే సక్రమముగ వసూలుచేసి; శ్రీపీఠకార్యస్థానమునకు బంపుటకుగాని; ప్రధానమంత్రి నిర్ణయించు విధముగ వ్యయపర్చుటగాని జరిగించవలెను. అన్యథా మొత్తమును వ్యయపరుపగూడదు. ఆదాయవ్యయము లన్నిటికిని క్రమమయిన లెక్కలను వ్రాయించి యుంచవలెను.

(ౠ) మండల పరిషత్తులకు సంబంధించిన పై నిబంధనలను గురుమండలి అప్పటప్పటి యవసరముల బట్టి మార్పు చేయుచుండవచ్చును.

## 5. మహాపరిషత్

(అ) శ్రీపీఠముయొక్క సర్వసభ్యుల సమష్టికి "మహాపరిషత్" అని పేరు. ఇయ్యది సాధారణ పరిస్థితులలో సమావేశముకాదు. తత్కాలమందు శ్రీపీఠమునకు వెయ్యిమంది దక్షిణచెల్లించిన సభ్యులుండిననేకాని మహాపరిషత్సమావేశము నాహ్వానింపరాదు.

(ఆ) శైవమతమునందుగాని శైవసంఘమునందుగాని క్లిష్టసమస్య లేర్పడి వాని విషయములో సర్వశైవాభిప్రాయమును పరిష్కారమును అవసరమగునెడ శ్రీపీఠాధిపతి యాజ్ఞానుసారము ప్రధానమంత్రి మహా పరిషత్సమావేశము నాహ్వానింపవలెను. అవేపరిస్థితులలో నూర్గురు శ్రీపీఠసభ్యు లేకీభవించి లిఖితమూలముగ ప్రధానమంత్రిని గోరినచో ఆయన అట్టి సమావేశము నాహ్వానింపవలెను. అట్లుకోరిన రెండుమాస ములలోపుగ ప్రధానమంత్రి యే కారణముచేసయిన సమావేశము నాహ్వానింపనియెడల ఆ సభ్యులే స్వయముగ సమావేశము నాహ్వా నింపవచ్చును.

(ఇ) తీర్మాన సమయమందు స్వాభిప్రాయ మొసంగు నర్హత గల పూర్ణసభ్యులు ప్రతి మండలము ఒక్కొకటికి పదునొకండుగురున్న అన్నిమండలములకు మొత్తముపైని అట్టిసభ్యులు నూటయేబదిమంది యున్న, మహాపరిషత్సమావేశమునకు కనిష్ఠసంఖ్యగనుండవలెను. శ్రీ పీఠాధిపతియే దీనికి అధ్యక్షుడుగ నుండవలెను.

పైసభ్యులాయామండల పరిషత్తులచే నియమింపబడిన ప్రతినిధులై యుండవలెను.

(ఈ) మహాపరిషత్తుయొక్క తీర్మానము శ్రీ పీఠాంతర్గత సకల వర్గములచే శిరసావహింపబడి, సర్వవిధముల నాచరణలో బెట్టవలసి యుండును. అట్టి తీర్మానమునకు గురుమండలి సభ్యులలో ముప్పాతిక మంది వ్యతిరేకాభిప్రాయు లయినచో, వెంటనే అనగా పూర్వ సమావేశమునకు ఆరునెలలలోపుగ శ్రీ పీఠాధిపతి మరియొక మహా పరిషత్సమావేశము నాహ్వానించి, లోగడ తీర్మానమును చర్చకు బెట్ట వలయును. ఈ రెండవ సమావేశమునందు గావింపబడు తీర్మానమే శ్రీ పీఠముయొక్క చరమపరిష్కారముగ నెంచబడి, దానికి శ్రీ పీఠ మండలి యన్నివర్గములును అందరును బద్ధులైయుందురు.

## 6. పండితసభ

(అ) (i) వేదములు, ఉపవేదములు, వేదాంగములు, షడ్దర్శన ములు, శైవాగమములు అనువానిలో నధమము ఏ ఒకటినైనను యథావిధిగ నధ్యయనము చేసినటువంటి, లేక

(ii) శిరోమణి, విద్వాన్, బి. ఏ. ఇత్యాది పట్టపరీక్షలందు ఉత్తీర్ణు లయినటువంటి, లేక

(iii) ఇతర వ్యక్తిగత విశేషములనుబట్టి పండిత సభాసభ్యత్వమున కర్హులని తనకు తోచినట్టి

శ్రీ పీఠ సభ్యుల నెవ్వరినైన పండిత సభాభిప్రాయమును గైకొని శ్రీ పీఠాధిపతి పండిత సభాసభ్యునిగ నియమింపవచ్చును.

పై (i), (ii) ఉపనిబంధనలను పాలకసమితిసూచనమీద గురుమండలి మార్పు చేయవచ్చును.

విషయ ప్రాధాన్యమును సమగ్రవిమర్శ నావశ్యకతనుబట్టి, తత్తచ్ఛాస్త్రాది విషయములందు బూర్ణ నిష్ణాతులగు మతాంతరులను గూడ బండిత సభాభిప్రాయమును గైకొని శ్రీ పీఠాధిపతి పండిత సభయందు అసాధారణ సభ్యులుగ నియమింపవచ్చును. కాని యీ అసాధారణ సభ్యుల యభిప్రాయములను తీర్మాన సమయములందు లెక్కింపరాదు.

సాహిత్య జ్ఞానము పూర్తిగ గలిగి సంస్కృతభాషయందు విషయ చర్చచేయగలవారు మాత్రమే సాధారణముగ బండిత సభాసభ్యత్వమునకర్హులై యుందురు. కావున, శ్రీ పీఠాధిపతి సాధ్యమయినంతవరకు అట్టివారినే నియమించుచుండనగును.

(ఆ) పీఠాధిపతి యామోదమునకులోబడి, పండిత సభాసభ్యులు తమలో నొకరిని బండిత సభకు నధ్యక్షునిగ నెన్నుకొనవలెను. శ్రీ పీఠ ప్రధానమంత్రియే పండితసభకు గార్యదర్శిగ నుండును. శ్రీ పీఠాధిపతియు ప్రధానమంత్రియు పండితసభా సమావేశమందలి చర్చలందు బాల్గొనవచ్చును గాని తీర్మాన సమయమున అభిప్రాయ మొసంగ రాదు.

(ఇ) శైవులలో సాహిత్యజ్ఞానము, వేదశాస్త్రపాండిత్యము, సంఘాభ్యుదయమున కవసరమగు నాధునిక విజ్ఞానము, కళాపరిచయము, వృత్తివిద్యలు, పరిశ్రమలు మున్నగువాని వ్యాప్తికిని, అభివృద్ధికిని వలయు సకల విషయములను అవసరమువెంబడి పరిశీలించి, విమర్శించి

తమ యభిప్రాయములను సూచనలను విజ్ఞప్తిరూపములుగ శ్రీ పీఠమునకు నివేదించుటయును

గురుమండలి, లేక పాలకసమితివారు కోరిన విషయములమీద తమ యభిప్రాయ మొసంగుటయును,

పండిత సభాకృత్యములై యుండును.

(ఈ) పండితసభ తన కృత్యముల నెరవేర్చుటకు సభకు అధమ పక్షము అయిదుగురు సభ్యులైన నుండవలెను - ఎన్నడయిన సభ్యుల సంఖ్య అంతకు తగ్గినచో వారు పండితసభ యనుపేరుతో నొక స్వతంత్ర వర్గముగ బనిచేయరాదు. అప్పుడు పండిత సభాకృత్యము లన్నియు పాలకసమితియే నెరవేర్చవలెను.

(ఉ) పండిత సభాధ్యక్షుడు కోరినచో ప్రధానమంత్రి పండిత సభా సమావేశము నాహ్వానింపవలెను. పండితసభా సమావేశములు సాధారణముగ ఆరునెలల కొకసారి జరుగవలెను. పండితసభా సమావేశములకు సభ్యుల కనిష్ఠసంఖ్య ముగ్గురు.

(ఊ) పండితసభా సభ్యులు శ్రీ పీఠమున కాస్థాన విద్వాంసులుగ నెన్నబడి, తదనురూపమగు గౌరవమును బడయుచుందురు.

7. గురుమండలి.

(అ) బ్రాహ్మణవర్ణమునకు జెంది నలుబది సంవత్సరములకు మించిన వయస్సు కలిగినట్టియు, మరియు,

గ్రంథ పరిశ్రమచేగాని విషయానుభవముచేగాని శ్రీ పీఠాధిపతి యభిప్రాయములో బండితులుగ నెన్నదగి, ముఖ్యముగ వేదాంత ప్రస్థానత్రయము నధ్యయనము చేసినట్టియు, మరియు,

శివపంచాక్షరీ మహామంత్ర పురశ్చరణము చేసినట్టియు, మరియు,

శైవాగమనిష్ఠులై శైవాచారపరాయణులై శాస్త్రోక్తశైవ చిహ్నములను లాంఛనములను ధరించునట్టియు, మరియు,

పూర్ణవైరాగ్యవంతులై పవిత్రవర్తనులయినట్టియు, మరియు,

4

పాలకసమితిచేత బేర్కొనబడి గురుమండలిచేత నంగీకరింపబడి నట్టియు,

శ్రీపీఠ పూర్ణసభ్యులలోనుండి గురుమండలి సభ్యుల నెన్నుకొనవలెను.

క్రమప్రకారము గురుమండలి యేర్పడువరకును ఈ యుప నిబంధనలోని గురుమండలి కృత్యమును శ్రీ పీఠాధిపతియే నెరవేర్చును.

(ఆ) గురుమండలి సభ్యత్వమున కర్హులైనవారి పేర్లను ముందుగ పాలకసమితి నిర్ణయానుసారముగ ప్రధానమంత్రి శ్రీ పీఠపత్రికలో ప్రకటించవలెను. అట్లు ప్రకటింపబడినవారిలో నెవ్వనినయిన శ్రీ పీఠముయొక్క తత్కాలపూర్ణసభ్యులలో సగమునకు మించిన సంఖ్య వారంగీకరించిరేని, ఆయన గురుమండలి సభ్యుడుగ గ్రమప్రకారము ఎన్నుకొనబడినట్లు ఎంచవలెను. శ్రీ పీఠముయొక్క తత్కాల పూర్ణ సభ్యులసంఖ్య మున్నూటికి మించియుండిననేగాని యీ యెన్నిక జరుగ కూడదు. తీర్మానములందు అభిప్రాయ మొసంగు నర్హత తత్కాలమందు గల పూర్ణసభ్యులు మాత్రమే ఈ యెన్నికయందు పాల్గొన నగును.

(ఇ) గురుమండలి సభ్యులసంఖ్య యెన్నడును పదునొకండుగురికి తగ్గకూడదు. ఈ సంఖ్యను అప్పటప్పటి సందర్భములనుబట్టి తమకు యుక్తమని తోచినప్రకారము ముప్పదిమూడువరకు హెచ్చించుటకున్ను పై కనిష్ఠసంఖ్యవరకు తగ్గించుటకును గురుమండలికి అధికారము కలిగియుండును.

(ఈ) గురుమండలి సభ్యులపేర్లను యెన్నికల వరుసను క్రమ సంఖ్యలతో నొక పుస్తకమున వ్రాసియుంచవలెను. ప్రతిసంవత్సరము కార్తికమాసాంతమున అప్పటికిగల గురుమండలి సభ్యులలో ముగ్గురు మండలి సభ్యత్వమునుండి తొలగెదరు. ఆ స్థానములకు తిరిగి మాఘాంతములోగా పై (అ) ఉపనిబంధన ప్రకారము ఎన్నికలు జరుగవలెను. కార్తికాంతమున తొలగునట్టి లోగడ సభ్యులుకూడ తిరిగి యెన్నుకొన నర్హులై యుందురు. ఈ యెన్నికల నిమిత్తము పాలకసమితిచే బేర్కొన బడువారి పేర్లు శ్రీపీఠ పత్రికయొక్క కార్తికసంచికలో ప్రకటింప

బడవలెను. లోగడ యుపనిబంధన పరికారమును ఈ యుపనిబంధన పరికారమును సభ్యులసంఖ్య తగ్గునప్పుడును, సభ్యత్వము తొలగునప్పుడును పుస్తకములో వ్రాసినవరుసను మొదటినుండి తగ్గవలసిన సంఖ్యకు సరిపోయినంతమంది పేర్లను కొట్టివేయవలెను. నూతనముగ నెన్నుకొనబడు వారి పేర్లను అప్పటివరకు నుండు పేర్లకు చివర చేర్చవలెను.

(ఉ) గురుమండలి సభ్యులు తమలో నుత్తములును తపస్సంపన్నులును సమాధినిష్ఠులును అగు నొకరిని అధ్యక్షులుగ నెన్నుకొనవలెను. ~~గురుమండలి యధ్యక్షుడే శ్రీ శైవమహాపీఠాధిపతి. ఈ పరికారము ఎన్నుకొనబడిన సంవత్సరము సహా అయిదవ సంవత్సరము [illegible] ఈయన పదవియం దుండును. ఈయన గురుమండలి~~ [illegible]

[(ఆ) ఉపనిబంధన శేషము]

తత్కాలపూర్ణ సభ్యులు నియత సంఖ్యకు తగ్గియున్నగాని, ఖాళీ స్థానములను గ్రమముగ నెన్నికచే బూర్ణసభ్యులు సకాలములో బూరింపకున్నగాని, గురుమండలికి నవసరమగు సభ్యులను బ్రకటిత నామములలోనుండి శ్రీ పీఠాధిపతియే పేర్కొనవలెను.

~~అయిదు [illegible]~~

సభ్యులు అవసంసమావేశమును గోరవచ్చును. ఏకభవించి స్వాం[illegible] నాహ్వానింపను వచ్చును.

(ఋ) గురుమండలి సమావేశములకు సభ్యుల కనిష్ఠ సంఖ్య అప్పటి కున్న మొత్తము సభ్యుల సంఖ్యలో సగముగ నుండవలెను. సమావేశములందు గురుమండల్యధ్యక్షుడే సాధారణముగ అధ్యక్షుడుగ నుండవలెను. అప్పు డాయన లేనియెడల వచ్చినవారిలో నెవరి పేరు పుస్తకములో మొదటిదిగ నుండునో ఆయన అధ్యక్షతవహింపవలెను.

(ౠ) శ్రీ పీఠాంతర్గతవర్గములన్నిటిలోను గురుమండలియే సర్వోత్కృష్టమును సర్వాధికారయుక్తమునయి యుండును. దీనితీర్మానములను శ్రీపీఠమండలి యన్నివర్గములు అందరు అధికారులు అందరు వ్యక్తులు శిరసావహించి ఆచరణలో బెట్టవలెను.



# మనవి



శైవమహాజనులారా!

ఈ పత్రిక వెలువడుటకు నూతనముగా కేంద్రస్థానము మార్చబడుటచే, డిక్లరేషనుకొరకు ఎదురుచూచుటయు, మొదలగు కారణములచే యింతవరకు వెలువడక పోవుట కెంతయు చింతిల్లుచున్నాము. ఇక నుంచి శైవులెల్లరు సరియగు ప్రోత్సాహమిచ్చిన యెడల సకాలములో పత్రిక నందచేయగలము.

శ్రీ శైవమహాపీఠమువారి యాజ్ఞానుసారము దీనియందు 17 వ పేజీనుంచి ప్రచురింపబడిన శ్రీపీఠ ప్రణాలిక ననుసరించి ప్రతిశైవుడును పీఠ సభ్యుడుగాచేరి యిందులో నియమింపబడిన సంవత్సరపీఠకట్నమును మీ మీ మండలకార్యదర్శులకుగాని, అధ్యక్షులకుగాని, శ్రీ ప్రధాన మంత్రికిగాని యిచ్చి సక్రమమైన రశీదును పొందవలెను. శ్రీపీఠకట్నమిచ్చిన వారిపేర్లు కట్నముతో మాకు చేరినవెంటనే ఆమాసపుపత్రికయందు ప్రచురింపబడును. శ్రీ పీఠకట్నమిచ్చిన, అనగా మాకు చేరిన ప్రతిపీఠసభ్యునికి పత్రిక నేరుగా పోష్టుద్వారా పంపబడును.

మరిన్ని శ్రీ శైవమతప్రకాశికయిప్పుడు మతాభివృద్ధి కొరకు మాసపత్రికగా మార్చబడినది. గాన మన శ్రీ శైవమహాపీఠమువారిచే, అనగా మన అందరి శైవులచే నడపబడు ఈశైవమతప్రకాశికను వృద్ధిచేయుట మనయందరి విధియై యున్నది.

'ఇంటగెలిచి రచ్చగెలువవలె నను నటుల' తనసంఘమును ముందు బాగుచేసికొనవలెను. తనసంఘమును బాగుచేసికొనుటయు తనసాంఘికుల నుత్తమస్థితిలోనికి దేగలుగుటయు ధీరునియొక్కయు విజ్ఞానియొక్కయు ఉత్తమోత్తమలక్షణములు. మతము తల్లివంటిది. 'వందేమాతరం' అను

నట్లు మాతకు కుమారుడు వందన మిడవలెను. మాతను కుమారుడే గౌరవించవలెను. తన జనని యభీష్టముల సంపూర్ణముగ నెరవేర్చి 'స్వధర్మే నిధనం శ్రేయః' అనులోకోక్తిని సార్థకపరచుటయే సుపుత్రుని యుత్తమధర్మము.

'సంఘీభావమేబలము' అనునార్యోక్తిరీతి నేకార్యమునైనను అందరు నభిమానముగలవారలై ప్రారంభించిన యెడల నది నిర్విఘ్నముగా సఫలముకాగలదు. మన శైవులందరు ప్రోత్సహించి మన మత సంస్థను మతప్రకాశికను అభివృద్ధి చేయునటుల తమ తమ యుదార విశాళముల నొసంగిన మన మతాభివృద్ధి కనువగు గ్రంథముల రచింప జేయుట, ముద్రింపించుట, మతప్రచారము చేయుట, శ్రీపీఠమును మహోన్నతస్థితికి దెచ్చుటయు మొదలగు నెన్నో కార్యములయందు పాల్గొనుట కవకాశము గలుగగలదు. శైవులెల్లరు దీని నామోదించి తగుచేయూత నిత్తురని యాశించుచున్నాము.

సంపాదకుడు.



# గమనిక

శ్రీశైవమహాపీఠ కార్యస్థానము బెజవాడకు మార్చబడినదిగాన యికనుండి ఉత్తరప్రత్యుత్తరములు, పత్రికచందాలు వ్యాసములు ప్రకటనలు మొదలగునవి ఈ దిగువ అడ్రసుకు వ్రాయవలెను.

శ్రీశైవమహాపీఠ కార్యస్థానము

~~సత్యనారాయణ~~పురం, బెజవాడ.

# మహానంద - శివలీల

జయా ఫిలిమ్సువారిచే తయారుకాబడిన 'మహానంద' తెలుగు టాకీని బెజవాడ శ్రీ మారుతి సినిమా హాలులో తిలకించు భాగ్యము లభించినది. ఇది ప్రతిమానవుడు చూచి శివలీలలను, శివమహిమను తెలుసుకొని ఆనందింపవలసినది.

ఈశ్వర శాపదగ్ధులై, పార్వతీగంగాదేవులు కాశీపురములోని వేశ్యయైన విశ్వమోహినికి మహానంద, సదానంద లను యిరువురు కుమార్తెలుగా జనియించిరి. భోగముకులమున పుట్టినను మహానంద ఈశ్వరభక్తిపరాయణురాలై వారి కులవృత్తియైన వ్యభిచారమున కిష్టపడక, తనతల్లి ఎంత నిర్బంధించినను మనోవాక్కర్మలలో మహాదేవుడే తన మగడని పరపురుషులు సోదరులని ప్రతిజ్ఞపట్టినది. మహానంద సౌందర్యాతిశయములు, త్రిలోకసంచారి యగు నారదునివలన విని, యింద్రు డామెను కలియుటకు భూలోకమునకు వచ్చును. దేవర్షి ఈశ్వరునివలన మహానంద పూర్వవృత్తాంత మెరిగి తుంబురుని సహాయముతో యింద్రుని పరిభవింప మారువేసములతో భూలోకమున కేతెంచును. విశ్వమోహిని మహానందకు మారు సదానందను ఇంద్రుని కేర్పరచును. సదానంద తుంబసలహాపై అంగీకరించి తుంబచే పొందబడిన వుంగర ప్రభావముచే యింద్రుని నిద్రాదేవత కప్పగించి తన మానము గాపాడుకొనును. మరునాడీ సంగతి తన సేవకుని రూపులోనున్న నారదునివలన విని మహానందను చూచుటకు ఇంద్రుడు బయలువెడలి ఇంటియందు, జలకమాడుచున్న మహానందను తొంగిచూచి యామెచే శపింపబడి అంధుడగును. నారదుడింద్రుని ఈశ్వరసాన్నిధ్యమునకు తీసుకొనిపోవును. ఇంద్రాణి ప్రార్థనలపై యీశ్వరుడు కరుణించి యింద్రునికి దృష్టినిచ్చును.

నారదుని ప్రార్థనపై పరమశివుడు, జగన్మాతలను పరిగ్రహింప పయనమగును. మహానంద చీకటి కొట్లోనుంచబడినను. ఈశ్వరధ్యాన తత్పరయై యుండును. తుంబవలన తెలుసుకొని మహానంద తాను రత్నకంకణము యిచ్చినవానిని చెట్టబట్టుదునని, తల్లితో చెప్పును. శంకరుడే యీకంకణముతేగా, యాతని పరిగ్రహించును. ఈశ్వరుడామె భక్తి ననేక రీతుల పరీక్షించును. మహానంద ఈశ్వరు డిచ్చిన లింగమును ఒక పెట్టెలో పెట్టి భద్రపరచును. ఆమె నిద్రించుచుండగా, ఈశ్వరజ్వాలచే ఆమందసము భస్మమగుచుండును. మహానంద లేచి మంటలుచూచి లింగమును కాపాడుటకై మంటలలో ప్రవేశించును. సదానంద సోదరిని రక్షింపబూనును. ఈశ్వరుడంత కరుణించి మంటలను చల్లార్చి వారి భక్తికి సంతసించి, వారిని కైలాసమునకు గొనిపోవును,

ఇట్టి మహోత్కృష్టమైన ఈశ్వరమహిమను ఫిల్ముగాతీసి ప్రపంచమునకు వెల్లడించిన శ్రీ శ్రీ శ్రీ మీర్జాపురం జమీందారువారు, శ్రీ నీలాద్రి రాజుగారెంతయు నభివందనీయులు. వారి కీశ్వరుడాయురారోగ్యైశ్వర్యాదులిచ్చి సుఖంబులొసంగుగాత.

యువటూరి వీరభద్రరావు.

శ్రీ శివాయ గురవే నమః.

అస్మద్గురుభ్యో నమః.

# శివభక్తినిష్ఠ, శైవపీఠ నిర్మాణమునున్నా

## తెలుపు పద్యావళి

ఉ. శంకర, శైలజావర, శశాంకధరా, యఖిలేశ పావనా
శంకర భక్తకల్పకుజమ, శాత్రవమారణ దేవమానితే
మంకర శుభ్రదేహ శివ, మన్మథసంహార భర్గ నాపున
శ్శంకలు దీర్చి నన్ను ననిశంబును బ్రోవుము ఫాలలోచనా॥ 1

మ. అరయన్ పంకజనాభుపై ధనదుపై నాగస్త్రీమానేంద్రుపై
సిరిపై పద్మజుపై సురేంద్రునిపయిన్ శేషాహిపై చంద్రుపై
విరివిన్ జెందిన నీ దయారసము నే వేగంబ గాంక్షించెదన్
కలకంఠా తవ పాదపద్మయుగము న్నాంతుం గృపన్ జూపవే. 2

మ. ఫణిభూషు న్నిభి సోమ వహ్నినయను న్బ్రహ్మాచ్యుత సంసేవితు
న్నణిమాద్యష్టవిభూతిదాయకు భవు న్నార్యాపతి న్శంకరు
న్గుణనాతీతు మదుష్యమంబు కొనసాగంగోరి ప్రార్థించెద
న్నణుమాత్రంబగు తత్కృపారసముకై యాచించెద న్దీనతన్. 3

సీ. ఆభీల సంసారదావాగ్ని యారునే యభవుభక్తి ప్రవాహంబులేక
అజ్ఞానతిమిరంబు హరియింపఁగానౌనె హరుమంత్రపఠన మావంత లేక
అరివర్గసమితిని నణఁచుట సులభమే యాద్యంతరహితుని నరయలేక
జననమరణదుఃఖ జాలంబుదొలఁగునే చంద్రికళావరుస్మరణలేక

గీ. గాన నూహించి తెలిపెద కాలమెల్లఁ గడచుచున్నది వెంటనే గనుఁడు మీరు
శైవపీఠము నెలకొల్పి శాశ్వతముగ శంభుభక్తిప్రచారంబు సలుపుఁడయ్య. 4

చ. శివకరుణాకటాక్షమునఁ జెప్పెద ధూర్జటి భక్తశ్రేణితో
భవుపదభక్తిజృంభణము బాగుగఁ జేయఁదలంచనెంచి యీ
భువి మహిమోన్నతంబునగు పూజిత శైవ సుపీఠమేర్పడ
న్నవిరళ కౌతుకంబలర నార్యులు మీరలు శ్రద్ధఁబూనుఁడీ. 5

మ. తరుణేందున్ ధరియించు శంకరుని పాదాబ్జాతముల్గొల్చువా
రరుదైయుండుట నీకలిన్విదితమై రాజిల్లుచుండంగ నీ
సరసంబే శివభక్తి వృద్ధిని వడిన్సాధింప నూహించుచు
న్బరమేశున్భజియించి శైవజనులీ భారంబు వేఁ బూనుఁడీ! 6

ఉ. సంతసమయ్యె నీవరకు సభ్యుల తీవ్రపుచర్చ లెంతయున్
ఎంతయు నాసయేర్పడఁగ నెట్టులొ కాలముఁ బుచ్చుచుంటి న
త్యంత విశాలశాంతమగు తాపసలోలుని భక్తిపీఠము
న్బంతముతోడ నేర్పరచఁ బ్రోధిగ శైవము వృద్ధినందెడిన్. 7

మ. శివపంచాక్షరమంత్ర నైష్ఠికతచేఁ జెల్వొందు నారాధ్యులే
భవుభక్తిం బ్రభవింపఁజేయుటకునై పంతంబుఁ బోనాడుచో

నెవరీ యుద్యమ వృద్ధిఁ బూనెదరు నే నీ చింతచే మిక్కిలిన్
పవలు రేయియుఁ బొక్కుచుంటి నిఁక నా భర్గుండె దిక్కయ్యెడిన్. 8

ఉ. ఒంటిగ నే ప్రచారమును నోపికతో నొనరింపఁ గష్టము
ల్గంటిని గానఁ దెల్పెదను కామవిరోధిని భక్తిఁ గొల్చి ము
క్కంటి యుదారగాథలను గట్టిగఁ జాటుట కుద్యమించి మీ
బంటుతనంబు నుర్విలయ భర్గప్రచారము నుద్ధరింపుఁడీ. 9

సీ. శివుఁ జిత్తమున నిల్పి సేవించువారలే, కడు సన్నుతులై వృద్ధిఁ గాంచఁగలరు
భవుమీఁది పద్యముల్ బల్కెడివారలే పరమేశు సత్కృపఁ బడయఁగలరు
శైవప్రచారంబు సల్పెడువారలే, జన్మసాఫల్యము చాలఁ గాంత్రు
భూతేశు సత్కీర్తిఁ బొగడెడువారలే, భవబంధముల నెల్లఁ బాయఁగలరు
గీ. భర్గపూజలఁ జేసెడి భక్తులార, చంద్రశేఖరు ధ్యానించు సరసులార
వేగ నిఁక నైన మేల్కాంచి వేదవేద్యు, శంభుకథలను శ్రద్ధతోఁ జాటరయ్య. 10

సీ. శ్రీ సదాశివుని నే స్థిరముగ స్తుతియించి, విశదీకరించెద విస్తరముగను
శైవపీఠంబు శాశ్వతముగ స్థాపించి, శివలింగమును బ్రతిష్ఠించి మిగుల
ముద్రణాగారంబు ముదమున నిర్మించి, నలుదెస ల్ప్రచురణ నమరఁజేసి
గద్యపద్యాత్మక గానరూపంబైన, సద్గ్రంథముల నచ్చు సరగ వేసి
గీ. పట్టణంబుల వీథుల పల్లెలందు, పట్టుదలచే ప్రచారకవర్గ మంపి
వారిచేతను వెలయించి వామదేవు, భక్తి పెంపును శీఘ్రంబె ప్రబలఁగనుఁడు. 11

శా. ఏలీల న్వివరింతు శైవజను లేయే ప్రొద్దు నీ యుద్యమం
బాలోచించియు మాసపత్రికల నత్యంతంబు వర్ధిల్ల నెం
తో లక్ష్యంబును నిల్పి వార్షికములన్ తోడ్తోల్త నిప్పించి యా
శూలిం దెల్పెడి పత్రిక ల్వెలువడ న్జోద్యంబుఁ జాలింపఁగన్. 12

మత్త. శ్రీ సదాశివుభక్తిమహిమ న్శేష భాషలనలున్
వీసమంత నుతింపఁజాలరు విన్నవింతును భవు కృపన్
గాసిఁజెందక భక్తితోడుత కామనాశకు నుద్యమం
బే సమస్తం బనుచు దానిని విస్తరింపఁగఁ జేయుఁడీ. 13

పంచచామరము. శంభుమహిమ వృద్ధినెంచి సంతసంబుతోడుతన్
శంబరారి హరుని నెన్ని సత్ప్రదప్రచారమున్
జృంభణంబుఁ జేయుచుండ జాగులేక మీరలున్
సంబరంబుమీర నిండు సద్విరాళముల్వడిన్. 14

కవిరాజవిరాజితము. పురహరు శంకరు భూతేశునిమది పూర్ణభక్తితోఁ దలఁచుచు నా
కైరవహితశేఖరుని ప్రచార మఖండముగా వెలుఁగొందఁగ మీ
రరయుచు నీశుని కర్పణమనుచును రమ్యవిరాళము లందరొగిన్
త్వరపడి యీయ్యుఁడు శంభునిపీఠము తత్క్షణమున స్థాపింపవలెన్. 15

నమః పార్వతీపతయే హరహర మహాదేవ

భీమవరం.
27-6-39.

ఈశ్వరప్రగడ సదాశివశర్మ.

## 1938 సం. 21 వ శ్రీ శైవమహాపీఠ మహాసభ, రాజమండ్రి.



పుష్పమాలాలంకృతులు: అధ్యక్షులు: విద్వాన్ శిరోమణి ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు. ఎడమనుంచి 2 శ్రీ లో. కం. వ. భైరవమూర్తిగారు, ప్రధానమంత్రి. నిలుచున్నవారు:—అధ్యక్షులవారివద్ద శ్రీపతి పం. పట్టైసలింగారాధ్యులుగారు. క్రింద కూర్చున్నవారిలో అధ్యక్షులవారి ఎడమప్రక్కన:— శింగరాజు సుబ్రహ్మణ్యం పంతులుగారు, యిటూరి సానందరావుగారు. శివలెంక లింగయ్యగారు, రిటైర్డు పోలీసు యినస్పెక్టరు. అధ్యక్షులవారికి చివర బ్రహ్మశ్రీ ఈశ్వరప్రగడ సదాశివశర్మగారు, శివభక్తిప్రచారకులు.

# శ్రీమదాంధ్రభాగవతము

బొమ్మెరపోతనామాత్యప్రణీతము

లఘుటీకా, చిత్రపటములతో, విడివిడిస్కంధములు

చక్కగాముద్రింపబడినవి. స్కంధము (సభ్యులకుమాత్రం)

టికిరు ౦-8-౦లుమాత్రము ప్రవేశరుసుమురు ౦-4-౦లు

# వాణీనికేతనము, బెజవాడ.

# శ్రీ శైవ మహా పీఠము.



## గుంటూరు మండల పరిషదాహ్వాన సంఘాధ్యక్షోపన్యాసము



శైవ మతాభిమానులారా!

శ్రీశైవ మతాభివృద్ధికొఱకును శైవ సంఘాభివృద్ధికొఱకును నిఖిల గ్రామ వాస్తవ్యులగు శైవ మహాజనులెల్లరు కలసి సుమారు 32సంవత్సరముల నుండియు శైవ మహాసభ యను నామముతో సంవత్సరమున కొకపర్యాయ మొకచో సమావేశమై శైవ మతమునకును సంఘమునకును ఉపయోగకరము లగుతీర్మానములను జర్చించి తీర్మానించి సాధ్యమగు నంతవఱ కాచరణములో పెట్టుచుండుట శైవ మహాజనుల కందరికి విశదమే.

శ్రీ శైవ మహాసభా తీర్మానముల ననుసరించి 1941 సంవత్సరము ఫిబ్రవరి నెలలో శైవ మహాసభయనుటకు బదులు శ్రీ శైవమహాపీఠము అను నామాంతరముతో, 1939 సం॥రము బెజవాడలో జరిగిన అవసర మహాసభలో ఆమోదింపబడిన నియమ ప్రణాళికతో రిజష్టరు కాబడిన విషయము శైవ మహాజనులలో చాలమందికి విశదమై యున్నది. కాని రిజష్టరికాబడిన నియమ ప్రణాళికలో కొన్ని నిబంధనలు సరికావనిన్ని కొంత మార్పు జరుగవలెనని కొందరి కభిప్రాయమున్నటుల దెలియుచున్నది. అట్టివిషయములు మహాపీఠ సభలో చర్చించి మార్పులు అవసరమని సభవారు తలంచుచో అట్టిమార్పులు చేయుట కెట్టి యభ్యంతరము లుండనేరవు. అట్టి తలంపుగల వారందరు శైవ పీఠములో సభ్యులుగచేరి తమ కోర్కెల కనుకూలముగ నుండు సవరణలు ప్రతిపాదించి సభాంగీకారమును పొంది మార్పుచేయుటకు తగినంత పట్టుదల కార్యదీక్ష వహించవలెనని కోరుచున్నాను.

శ్రీ శైవ మహాసభ యింతవరకు గుంటూరుజిల్లాకు ముఖ్యస్థానమైన గుంటూరులో జరుగుట తటస్థించి యుండనందున యీసంవత్సరము జరుగు

సభను గుంటూరులో జరుపవలసినదని పలువురు కోరుటవలన చాల అవ్యవధిగా నిచ్చట జరుపుటకు నిశ్చయింపబడినది. ఆ కారణముచే ఆహ్వాన సంఘమువారు సభకు విచ్చేసిన శైవమహాజనులకు జరుపవలసిన సౌకర్యములలో యేమైన లోపములు కలిగిన యెడల ఆహ్వాన సంఘమువారిని మన్నించ వేడుకొనుచున్నాను.

శైవ మహాసభ గడచిన 32 సంవత్సరముల పై కాలమునుండియు జరుగుచున్నను సదరు సభలవలన పొందతగినంత మేలు లాభము శైవ మహాజనులలో చాలామందికి కలుగలేదని వక్కాణించుటకు చాల విచారకరము. ఇట్టిలోపము శైవ మహాసభ లోపము యెంతమాత్రము కాదనియు చాలా మటుకు అట్టిలోపము శైవులదేననియు తలంచెద.

శైవ మతాభివృద్ధికిన్ని శైవ సంఘాభ్యుదయమునకున్నూ శైవమత ప్రచారము చాల అవసరము, మతప్రచారము పండితుల ఉపన్యాసములవల్లను శైవమత గ్రంథముల ప్రచురణవల్లను, జరుగవలయును, శైవ మతము క్రమేణ వృద్ధినొందుటకు మారుగ క్రమేణక్షీణించి సంఘ దౌర్బల్యము స్థిరపరుచు చుండుట కడుంగడు శోచనీయము.

శైవ సంఘము ఆర్థికముగాను, నైతికముగాను బాగుపడి వృద్ధిలోకి రావలయునన్న శైవ మహాసభలో మూడునాళ్ళ ముచ్చటలుగ జరుగు భోధనములతో తీర్మానములతో తనివిచెందక ఈ క్రింద సూచించిన విధానముల మహాసభవారు ఆలోచించి తీర్మానించి సాధ్యమయినంత త్వరలో అమలులో పెట్టి ఆచరణలోకి తెచ్చుట చాలా అవసరము. ఈ క్రింద విధానములు అమలులో పెట్టుట ప్రతివ్యక్తికి సాధ్యమగుట కష్టమగునేమోకాని శైవ మహాసంఘము అత్యుత్సాహముతో పట్టుదలతో విసుగు విరామము లేకుండా సంవత్సరమంతయు కృషిసలుపుచూ అతిసులభముగా శైవ మహాపీఠ ఆశయములను మనము నెరవేర్చగలమని ఆశించుచున్నాము.

1 శైవమతమునకు పునాదులగు ఉద్గ్రంథములను వెంటనేసులభ శైలిని యావన్మంది శైవులకు తెలియునటుల తెలుగులో అచ్చొత్తించి ప్రచురించుట

2 ప్రతిగ్రామములోను పట్టణములోను నివసించుచున్నట్టి శైవుల యొక్క వీలయినంత జాబితాను వెంటనే తయారుచేయించి 1 వ పేరాలో నుదహరించిన మతగ్రంథములను కనీసము కుటుంబమునకు నొకటియినను స్వల్పక్రయమునకు (వీలయినచో వుచితముగా) అందజేయుట,

3 మతప్రచారము చేయునిమిత్తము మతప్రవక్తను ప్రతిజిల్లాకు ఒకనిని నియమించి జిల్లాలో నివశించు శైవసంఘ జనాభానుసరించి వీలు వెంబడి సంవత్సరమునకు కనీసము రెండువర్యాయములకు తగ్గకుండా శైవులు నివసించుచున్న ప్రతిగ్రామములోను ఉపన్యాసముల పూర్వకముగా శైవమతోత్కర్షనుగురించియుపన్యసించుట 1వ పేరాలో నుదహరించిన శైవమత గ్రంథములను పఠించునట్లు ప్రోత్సహించుట.

4 శైవమత చిహ్నములగు భస్మరుద్రాక్ష లింగధారణలను గురించియుపన్యసించి తెలుపుట లింగధారణ చేసికొనుటకు యిష్టపడువారికి సులభముగా లింగధారణ చేయించువారు దొరుకునదుపాయములను గలిగించుట,

5 శైవమతమునకు సంబంధించిన అంత్యేష్టికర్మలు సక్రమముగా జరిగించునట్టి విద్యార్థులకు వేతనములిచ్చి సిద్ధపఱ్చుట. అట్టి విద్యార్థులు శైవులున్న ప్రతిపట్టణములోను గ్రామములోనుసులభముగా దొరకునట్లు నియమించుట.

6 శైవులకుసంబంధించిన షోడశకర్మలను చేయించగలిగినట్టి విద్యార్థులను తయారుచేయించుట. అట్టివారివలననే ప్రతి శైవ కుటుంబములో మామూలుగా జరుగు అన్నిషోడశ కర్మలు శైవులు చేయించుకొనుట.

7 కనీసము 30 మందిగాని అంతకంటె హెచ్చుగాగాని శైవులు నివసించు ప్రతిపట్టణములోను గ్రామములోను శైవమత గ్రంథముల పుస్తకభాండాగారమును నిర్మించుట.

8 వేదపాఠశాలలు నిర్మించి విద్యార్థులకు విద్యనొసగుట.

9 సభాకాలమందు ప్రతిసంవత్సరము శైవసంఘాభ్యుదయము నిమిత్తం మెంతకృషిసలిపినది సభలోనివేదించుట.

10 కృషిసలిపిన వారిని బహుమానముల ద్వారాగాని మరొక విధముగాగాని గౌరవించుట.

11 శైవపండితుల పరీక్షించి బహూమానించుట.

12 1 to 11 విధానములు జయప్రదముగా జరుపుటకు చాలాధనము అవసరమనే సంగతి పెద్దలెల్లరకును తెలిసినవిషయమే ధనమూలమిదంజగత్తు అను సామాన్యోక్తి సర్వజనవిదితము శైవసంఘాభివృద్ధి జయప్రదముగా నిర్విఘ్నముగాజరుగవలయునన్న శైవమహాసభలు అంతరాయము లేకుండా జరుగవలయునన్న శైవమహాపీఠమునకు మూలధనము చాలా అవసరం అందుకుగాను కార్యదీక్షను అవలంబించి ప్రతిజిల్లాలో నివసించు శైవులున్ను విధిగా ప్రతిసంవత్సరము తమశక్తి ననుసరించి తమ సంపాదనలోగాని ఆదాలోగాని కొంతభాగము శైవపీఠ కార్యక్రమము నిమిత్తము యిచ్చుట మూలముగాగాని లేదా ప్రతిశైవుడు తనఆదాయమునుబట్టియొకేపర్యాయము కొంతమొత్తముయిచ్చిగాని పీఠమునకు సహాయముచేసి మూలధనమును యేర్పరచవలయును, పై విధముగా ఒకలక్ష రూపాయలు మూలధనమును సమకూర్చినచో యేఅంతరాయములు లేకుండా శైవమహాపీఠసంకల్పములు నెరవేరుననియు, శైవసంఘాభివృద్ధికి అనువగు సాధనములను కల్పించి సంఘాభివృద్ధి చేయుట వీలగుననియు మనవిపూర్వకముగా విశదీకరించుచున్నాను.

గుంటూరు,
4—6—1941

అత్తలూరి వెంకటసుబ్బారావు,
రిసెప్షను కమిటి ప్రెసిడెంటు.

కుమారీ ప్రెస్, గుంటూరు.

# శైవమతప్రకాశిక

శ్రీ శైవమహాపీఠ పక్షమున బ్రకటింపబడు

సచిత్ర మాస పత్రిక


| సంపుటము | వికర్మసంవత్సర మాఘమాసము | సంచిక |
| --- | --- | --- |
| 3 | 1941 ఫిబ్రవరి | 1 |




ॐ नमः शिवाय

# ఇందలి విషయములు

1. శ్రీ శైవమహాపీఠము యొక్క పూర్వవృత్తము, రిజిస్ట్రేషన్.
2. పీఠసంకల్పములు, నిబంధనలు.

## వ్యావహారికములు

లేఖలు :— ఈ పత్రికకుగాని, శ్రీ శైవమహాపీఠమునకు గాని వ్రాయు లేఖలను "శ్రీశైవమహాపీఠ కార్యస్థానము, గవర్నరుపేట, బెజవాడ" అను చిరునామాకు వ్రాయవలెను.

వ్యాసములు :— పత్రికలో బ్రకటనకై పంపబడు వ్యాసములను, ఇతర విషయములను, కాగితమునకు ఒకప్రక్కను మాత్రమే స్పష్టాక్షరములతో సంగ్రహముగ వ్రాసి పంప వలెను. పీఠసంకల్పములందు సానుభూతిగల పెద్దలందరును ప్రకటనార్హము లగు తమ ప్రౌఢ వ్యాసములను, విమర్శనములను బంపి పత్రికను శోభావంతముగను సర్వజనోపయోగముగను జేయ ప్రార్థితులు.

ప్రకటనరేట్లు :— వ్యాపారాది స్వవిషయముల నీ పత్రికయందు బ్రకటింప కోరువారు చెల్లింపవలసిన రేట్లు:—

| | నెలకు | సంవత్సరమునకు |
|---|---|---|
| నిండు పేజీ | రు 3—0—0 | రు 30—0—0 |
| అర పేజీ | 2—0—0 | 20—0—0 |
| పావు పేజీ కాని తక్కువ కాని | 1—4—0 | 12—0—0 |

| పత్రిక చందాలు:— | సంవత్సరమునకు (పోస్టేజిసహా) |
|---|---|
| మహారాజ పోషకులు | (అనుగ్రహాధీనము) |
| రాజ పోషకులు | రు 50—0—0 |
| ప్రధాన పోషకులు | రు 25—0—0 |
| పోషకులు | రు 10—0—0 |
| చందాదార్లు | రు 2—0—0 |
| పీఠసభ్యులు | రు 1—0—0 |

విడిసంచిక మూల్యము రు 0—4—0.

4. షరా:— పై మొత్తములు బ్రిటీషు నాణెములలో తెలుపబడినవి. నైజాంరాష్ట్రీయులు హాలీలో రు 1-0-0కి రు 0-3-0 చొప్పున హెచ్చుగా చెల్లింప వలెను.

ఓం॥ ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మాశివో మే అస్తు సదా శివోం॥

# సంపాదకీయములు

## శ్రీ శైవమహాపీఠము - పూర్వవృత్తము

శ్రీ శైవమహాసభ యిప్పటికి దాదాపు 34సంవత్సరముల క్రిందట జనించి, శైవులయొక్కయు శైవమతముయొక్కయు పురోవృద్ధి నభిలషించి శక్తికొలది పాటుపడుచుండిన సంగతి పాఠకులకు విదితమే. ఇప్పటివరకు 23 మహాసభలు ఆంధ్రదేశ నానాప్రాంతములందు జరిగినవి. సామాన్యులు, సంపన్నులు, నానాశాస్త్ర పండితులు, పాశ్చాత్య విద్యాధురీణులు, ఉన్నతోద్యోగులు, సంస్థానాధీశ్వరులు మున్నగు శైవప్రముఖు లనేకులు సభాకార్యములందు జయప్రదముగ బాల్గొనుటయేకాక, మతమునకు సంబంధించు పెక్కు ప్రధాన విషయములు ప్రౌఢముగ విమర్శించి సిద్ధాంతీకరింపబడినవి. మతధర్మ ప్రచారమొనర్చుటతోపాటుగ, బ్రహ్మపథాదియుద్గ్రంథముల యొక్కయు, తదితరమగు కొన్ని సామాన్య గ్రంథములయొక్కయు ముద్రణ ప్రచురణములును గావింపబడినవి. అనుకూల ప్రదేశములం దప్పు డప్పుడు వేదశాస్త్ర పాఠకాలలు నెలకొల్పబడి, విద్యార్థుల కుచితముగ నధ్యయనావకాశము లభించుట మాత్రమే కాక, హూణ విద్యాభ్యాసము చేయు విద్యార్థులకు విద్యార్థి వేతనములు గూడ యొసంగబడినవి. కడచిన 34 సంవత్సరములలో ననేక విద్యార్థు లిట్టి సహాయముల బొంది కృతార్థులయిరి. మహాపండిత సత్కారములుగూడ కావింపబడినవి. ఆర్థిక, నైతిక, వైజ్ఞానిక, సాంఘికాభివృద్ధికి గారణములై, సకల విధముల సంఘౌన్నత్యమునకు నిదానములనదగు గ్రామసంఘములు గూడ పెక్కు చోట్ల స్థాపింపబడినవి. కొలది కాలమునుండి శైవమత ప్రకాశికయను నన్వర్థనామము కలయీపత్రికకూడ నిర్వహింప బడు

చున్నది. సాభిమానులగు భక్తమాహేశ్వరులవలన లభించిన పెక్కువేల రూప్యముల ద్రవ్యము పై సద్వినియోగములకై వ్యయింపబడినది. ఇట్ల నేకవిధములుగ నీసంస్థ శైవుల సర్వతోముఖాభివృద్ధికై యింత కాలము నిరంతర కృషిచేయుచున్నను, ఇతోధికముగ నెంతయో యింకను జేయవలసియే యున్నది.

కాని, సంస్థ పుట్టి యిప్పటికి దాదాపు మూడు పుష్కరములు కావచ్చినను, ఎచ్చటనైన స్థిరమగు భవనము కాని, ఏవిధమైన స్థిర చరాస్తులు కాని, ఉద్గ్రంథ సంచయము కాని, విద్యార్థులకును సాధకులకు నవసరమగు మతవిద్యాలయాది స్థిరసంస్థలు కాని, మూలధనము కాని, లేశమైన నేర్పడియుండలేదు. తలపెట్టిన మహోత్కృష్ట కార్యక్రమము నిర్విఘ్నముగను జయప్రదముగను గొనసాగించుటకు బ్రాణతుల్యములగు స్థిరవసతులును అర్థసంపదయు నేర్పడకుండుటకు ముఖ్యహేతువెద్ది? సాంఘికుల లోపమనుట కెంతమాత్రమును వీలులేదు. విద్యాధికులు, ఉద్యోగస్థులు, శ్రీమంతులు, భూస్వాములు, జమీందారులు సంఘమున నెందరో కలరు. సంస్థయెడ సాంఘికులందరికి దృఢమగు భక్తివిశ్వాసములును గలవు. సహజమగు దాతృత్వౌదార్యములును కలవు. సంస్థయొక్క కార్యక్రమమెల్లరకు నుత్సాహజనకమే. ఇన్నియుపపత్తులుండియును, దాదాపు మూడుపుష్కరముల కాలములో, లేశమైనను స్థిరవసతులు కాని మూలధనముకాని లేక, స్థిరస్థాయిగనుండి యభిలషిత కార్యక్రమమును శక్తిసామర్థ్యములతో నిర్వహింపవీలులేని నిత్యదారిద్ర్యమందును బరాధీనతయందును సంస్థ పడియుండుటకు ముఖ్యకారణము కార్యకర్తలయొక్కయు సంఘముయొక్కయు దృష్టి యటు ప్రసరింపకుండుటయే కాని వేరుకాదు. మరియును సంస్థయొక్క యాశయములును సంకల్పములును స్పష్టముగ సమగ్రముగ నిర్వచింపబడక పోవుటయు, సంస్థయొక్క యంగనిర్మాణమును గూర్చియు గార్యనిర్వహణమును గూర్చియు నిర్దిష్టమగు నిబంధనావళి లేకపోవుటయు, ఇయ్యది కారణముగ, బాధ్యతాయుత సభ్యత్వముగాని యట్టి యాధికారికవర్గముగాని

లేకపోవుటయుగూడ కారణములు కానోపును. ఇంతియకాక, ప్రభుత్వ శాసనమును బురస్కరించుకొని సంస్థ రిజిస్టరుకాక యుండుట కూడ యర్థసంపన్నిర్మాణ విషయమున నొక పెద్దలోపముగనె జూపట్టెను.

ఈ పరిస్థితుల నన్నిటిని మహాసభవారు సింహావలోకనము చేసి, శైవసభా పాలనవిధానమును సవరించి నిర్ణయించుటకు ఉప సంఘమును కార్యనిర్వాహకవర్గమువారు నియమింప వలసినదిగ 1936 సంవత్సరములో యేలకురుపాలో జరిగిన మహాసభా సమావేశము నందు తీర్మానించిరి. తదనుసారముగ 11-8-37 తేదిని కార్యనిర్వా హక వర్గమువారు సభాపరిపాలన విధానము తయారు చేయుటకు ఉపసంఘమును నియమించిరి. తయారు కాబడిన పరిపాలన ప్రణా ళికను 1938 సంవత్సరములో రాజమహేంద్రవరమున జరిగిన సమావేశములో మహాసభవారు విమర్శించి సవరించుటయే కాక, పెక్కు హేతువులచేత నీ సంస్థను "సభ"యనుట కంటె "పీఠ"మను టలో నౌచిత్య మెక్కుడుగ నుండుట వలన, యింతటి నుండి సంస్థ పేరును 'శ్రీ శైవ మహాసభ' యనుటకు బదులుగ "శ్రీ శైవమహా పీఠము" అని మార్చి, సాధ్యమయినంత వరకు త్వరలో ప్రణాళికతో సహా రిజిస్ట్రేషను చేయుటకు తగిన యేర్పాట్లు కావించుటకును తీర్మా నించిరి. అనంతరము కార్యనిర్వాహక వర్గమువారి చేతను, పిఠాపురం, 1939 సంవత్సరములో కొత్తపల్లిలో జరిగిన మహాసభయందును ప్రణాళిక విమర్శించి సవరింపబడి, పిఠాపురం దేవిడీ జమీందారుగారు మున్నగు ముఖ్యుల సంప్రతింపుతో కొన్ని మార్పులు జెంది, తుట్టతుదకు 8-10-39 తేదిని బెజవాడలో జరిగిన యవసర మహాసభలో నామో దింప బడినది. ఆ ప్రకారము ప్రణాళికతో పీఠమును రిజిస్టరు చేయు టకును, శ్రీ పీఠ దేవతా ప్రతిష్ఠాపనముగూడ ఆగమరీత్యా మహా వైభవముతో ప్రమాధి వత్సర కార్తిక మాసములో జరిగించుటకును నిశ్చయింప బడి యాహ్వానములు సహితము పంపబడినవి. కాని, యని వార్యకారణములచేత తలపెట్టిన కార్యక్రమము అప్పుడు పూర్తి కాలేదు.

# 1940 వరంగల్లు మహాసభ

కడపటి మహాసభ, అనగ సంస్థయొక్క 23వ సమావేశము వరంగల్లు నగరమున నీ విక్రమ సంవత్సర శ్రావణ బ ౧౨, ౧౩, ౧౪ లకు సరియగు 1940 సంవత్సరపు ఆగష్టు 30, 31, సెప్టెంబరు 1 తేదీ లలో బ్రి॥ లో॥ పులిపాక మహానందిశాస్త్రిగారి యధ్యక్షత క్రింద మూడుదినములు మహా వైభవముతో మహారాజశ్రీ పోలా వెంకట పాపయ్యగారి గోడాం (Godowns)లో జరిగినది. దేవిడీ సంస్థానా ధీశ్వరులగు శ్రీ శ్రీ శ్రీ ఇజ్జతాసార్ కందుకూరి బాలసూర్య ప్రసాదరావు పంతులుగారు, స్వదేహ మెంత యస్వస్థముగ నుండినను, శైవమతము నందును పీఠస్థాపనము నందును దమకుగల పరాకాష్ఠచే, బరంపురము నుండి సభకు స్వయముగ విచ్చేయుట యెంతయు శుభసూచకము. తెనాలినుండి బ్రి॥ లో॥ మహామహోపాధ్యాయ శివయోగి ముదిగొండ నాగలింగశాస్త్రిగారును, వేరువేరు మండలములనుండి యితర భక్త మాహేశ్వర బృందమును విచ్చేసియుండిరి. సమస్తోప న్యాసములును మజ్జనభోజనాది సకలేతర వ్యవహారములును సనాతన ధర్మానుకూలముగ నుత్సాహయుతముగ వాద ప్రతివాదములు లేక ప్రశాంతముగనే జరిగినవి. స్థానీయులగు భక్తమాహేశ్వరుల యొక్కయు, ఉదారులును శివభక్తాగ్రేసరులు నగు వైశ్యశ్రేష్ఠుల యొక్కయు, ముఖ్యముగ నుత్సాహవంతులును మాహేశ్వర పూజాపరాయణులును విశాలహృదయులును ఆహ్వానసంఘకార్యదర్శియు నగు బ్రి॥ లో॥ భండారు రాజేశ్వరరావుపంతులుగారి యొక్కయు, ఆదరాతిథ్యోపచారా దుల వలన సభకు విచ్చేసిన భక్త మాహేశ్వరగణమున కన్ని వసతుల నేర్పరచి సర్వాంగసౌష్ఠవోపేతముగ సభాకార్య క్రమమును పూర్తి కావించి నందులకు వారికి శ్రీ పరమ శివుడు నిరంతర వర్ధమానాయు రారోగ్యైశ్వర్యాదికము లొసంగుగాక. సమావేశ కార్యక్రమము యొక్కయు ఉపన్యస్త విషయములయొక్కయు తీర్మానముల యొక్కయు పూర్తివివరములను గ్రంథవిస్తర భీతిచే నీ సంచికయందు ముద్రించలేదు. రాగల సంచికలో సమగ్ర నివేదిక ప్రకటింపబడును.

అధ్యక్ష నిర్ణయానుసారము ప్రస్తుత పాలక సమితి

1. బ్రహ్మశ్రీ లోకారాధ్యులగు పులిపాక మహానంది శాస్త్రిగారు, పీఠాధ్యక్షులు, వరంగల్లు.
2. బ్ర॥ లో॥ విద్యాప్రవీణ, విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రి గారు, ఉపాధ్యక్షులు, వరంగల్లు.
3. బ్ర॥ లో॥ కందుకూరి వటుకభైరవమూర్తి పంతులుగారు, బి. ఏ., ప్రధానమంత్రి, బెజవాడ.
4. బ్ర॥లో॥ భండారు రాజేశ్వరరావుగారు, సంయుక్తమంత్రి, వరంగల్లు,
5. బ్ర॥ లో॥ కందుకూరి వీరేశలింగముపంతులుగారు, గంజాంమండలాధ్యక్షులు, బరంపురము.
6. బ్ర॥ లో॥ ఇవటూరి బుచ్చిసోమన్న అయ్యవార్లంగారు, విశాఖపట్టణ మండలాధ్యక్షులు, విజయనగరం.
7. బ్ర॥ లో॥ మల్లంపల్లి అచ్యుతలింగంగారు, బి.ఏ., ఎల్.టి., పూర్వగోదావరీ మండలాధ్యక్షులు, తణుకు.
8. బ్ర॥ లో॥ ఇవటూరి దుర్గావెంకటసుబ్బారావుగారు, పశ్చిమ గోదావరీ మండలాధ్యక్షులు, ఆచంట వేమవరము.
9. బ్ర॥ లో॥ శ్రీపతి పండితారాధ్యుల పట్టైన లింగారాధ్యులుగారు, కృష్ణామండలాధ్యక్షులు, బెజవాడ.
10. బ్ర॥ లో॥ ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు, గుంటూరుమండలాధ్యక్షులు, ఈమని.
11. బ్ర॥ లో॥ ముదిగొండ శంకరశాస్త్రిగారు, వరంగల్లుమండలాధ్యక్షులు, పాపయ్యపేట, వరంగల్లు.
12. బ్ర॥ లో॥ శ్రీపతిపండితారాధ్యుల మార్కండేశ్వరశాస్త్రిగారు, సికిందాబాదు మండలాధ్యక్షులు, సికిందాబాదు.
13. బ్ర॥ లో॥ బీపేట విశ్వనాథశాస్త్రిగారు, మెదక్ మండలాధ్యక్షులు, సిద్ధిపేట, మెదక్ జిల్లా, నైజాం.
14. బ్ర॥ లో॥ నిర్మల అంబయ్య సిద్ధాంతిగారు, నిజామాబాద్ మండలాధ్యక్షులు, నిర్మల, నిజామాబాద్ జిల్లా, నైజాం.
15. బ్ర॥ లో॥ డాక్టరు ముదిగొండ మల్లికార్జునరావుగారు, L. I. M., మదాసుమండలాధ్యక్షులు, మదాసు.

వరంగల్లు సమావేశములో జరిగిన తీర్మానములలో రెండు ప్రధానములు.

మొదటి తీర్మానము:—శ్రీ దేవిడీ జమీందారుగారు తాము స్వయముగ పీఠమునకు విపులమగు మూలధనాదికమును స్వదత్త పరదత్తములద్వారా సమకూర్చెదమని సభాముఖమున వాగ్దానముచేసి పీఠనిర్మాతగ నుండెదమని చెప్పినందున వారు ఆ ప్రకారము పీఠనిర్మాతగ నుండుటకు తీర్మానింపబడెను.

రెండవతీర్మానము:—పూర్వమహాసభల తీర్మానముల ప్రకారము వెంటనే పీఠమును రిజిష్టరు చేయవలసినదిగ తీర్మానింపబడినది.

కడపటిదినము సాయంకాలము ఛాయాపటముగూడ దీయబడినది.

## పీఠము రిజిస్ట్రేషను

క్రమప్రకారము పీఠముయొక్క మిమోరాండం ఆఫ్ అసోసియేషన్ (Memorandum of Association) తయారుచేయబడి నిబంధనావళితోసహా ది. 14—2—1941 తేదీన ఏలూరులో శ్రీ కృష్ణా పశ్చిమగోదావరి జిల్లాల జాయింటుస్టాకు కంపెనీల ఆసిస్టెంటు రిజిస్ట్రారు (Assistant Registrar of Joint Stock Companies, Kistna-West Godavari Districts)వారి ఆఫీసులో 19/1940-41 నంబరుగ శ్రీశైవ మహాపీఠము రిజిష్టరు కాబడినదని శైవమహాజనుల కెల్లరకు విన్నవించుటకెంతేయు సంతసించుచున్నాము. పీఠసంకల్పములను, నిబంధనలను బొందుపరచి పై అసిస్టెంటు రిజిష్ట్రారువారియొద్ద దాఖలు చేయబడిన ప్రణాళిక యెల్లరకు దెలియు నిమిత్త మీ సంచికలో బ్రకటింపబడినది.

## ఆదాయవ్యయపట్టిక

గత ప్రకటన మొదలుకొని పీఠముయొక్క రిజిస్ట్రేషను చివరవరకు అయిన ఆదాయ వ్యయముల వివరణము ముందు సంచికలో బ్రకటింపబడును.

## పీ ఠ ప త్రి క

పీఠపత్రికయగు "శైవమత ప్రకాశిక", ద్రవ్యాభావము మున్నగు ననివార్య కారణములచే నిటీవల కొంతకాల మాగిపోయి, యీ సంచికతో తిరిగి వెలువడుచున్నది. అది యికముందు నిర్విఘ్నముగనే బ్రకటితముకాగల యేర్పాట్లు చేయబడుచున్నవి. మాస పత్రికగనే ప్రకటింతుము. పత్రికాప్రకటనము ద్రవ్యైకసాధ్యమగుట చేతను, ఇటీవల కాగితముధర, అచ్చుఛార్జీలు పెరుగుట చేతను, అధమ పక్షము 600 చందాదారులైనలేనిది పత్రికానిర్వహణము సుకరము కాదు. పత్రికాభావమన సంఘమునకు మూకీభావమే కావున, దానితో సకలకార్యక్రమమును స్తంభించును. అట్టి సంఘటనము రాకుండ, అభిమానులెల్లరును వెంటనే చందాదార్లుగజేరి సహాయ మొనర్ప బ్రార్థితులు.

ముందు సంచికనుండి పత్రిక యథాప్రకారము పండిత లిఖిత నానావిషయిక వ్యాసములతోడను, వార్తలతోడను, విమర్శనాదికము తోడను, చిత్రపటములతోడను రాజిల్లుచుండును.

## ము ం దు కా ర్య క్ర మ ము

ఇకముందు పీఠకార్యక్రమ మంతయు రిజిస్టర్డు నిబంధనల ప్రకారమే జరుగగలదు. నిఖిలమండలముల భక్తమాహేశ్వరు లెల్లరును నిబంధనల ప్రకారము పీఠసభ్యులుగజేరి, పీఠసంకల్పముల సమగ్ర సిద్ధికై తమ యమూల్యసహకారము నొసంగి, శైవసంఘముయొక్క పరమాభ్యుదయమునకై శక్తికొలది యత్నింతురుగాక.

—సంపాదకుడు, ప్రధానమంత్రి.



# నిఖిలమండల వాసులగు శైవమహాజనులకు.

## విజ్ఞప్తి



భక్త మాహేశ్వరులారా !

శైవాభ్యుదయమునే లక్ష్యముగ నిడుకొని, యీ సంస్థ "శ్రీ శైవమహాసభ" యను పేరుతో నీ 34 సంవత్సరముల కాలము సంఘమునకు జేసిన సేవ మీరెల్ల రెరింగినదే. హృద్గత లక్ష్యము నచిరకాలములో సమగ్రముగ నధిగమింప దీక్షవహించి, ఇతోధిక తేజోవంతముగ కార్యక్రమ మొనర్ప నూతన నియమావళిని స్వీకరించి, "పీఠ" మను నామాంతరముతో ప్రభుత్వ చట్టబద్ధమగు స్వరూపము దాల్చి యిదే సంస్థ యికముందు నిర్వహించు కార్యపరంపరలో, ప్రతిశైవునియొక్క సానుభూతియు సహకారము నత్యవసరము. కావున, శైవులెల్లరు నీ దిగువ ముద్రితమైన పీఠప్రణాళికను సావధానముగ బఠించి, అవసరమగుచో పీఠ కార్యస్థానమునకు వ్రాసి యందుండి బడయు సమాధానములచే సర్వసంశయముల దీర్చుకొని, తమకు తోచిన కార్యవిధానముల నాధికారికవర్గములకు సూచించుచు, పీఠసభ్యులుగ జేరి చందా లిచ్చుట దక్షిణ లర్పించుట మాత్రమేకాక, వీలువెంబడి పీఠముయొక్క కేంద్రవర్గములందును, మండలవర్గములందును, స్థానికవర్గములందును, వీరు వారనక నెల్లరు సభ్యులుగ జేరి, ఏకకుటుంబ మనదగు విధమున సంపూర్ణాభిమానముతో శక్తివంచన లేక తోడ్పడుట, మన సంఘము గమ్యస్థానము జేరుట కత్యవసరము. స్వస్థాన స్వజనాది సంకుచిత భావములవీడి, శైవైకత్వ మవలంబించి దీక్షైక శరణులమైనగాని శివానుగ్రహముచే లక్ష్యసిద్ధిని బడయజాలము. కావున నిఖిల శైవప్రపంచము పీఠముయొక్క శివసంకల్పమునకు దప్పక తోడ్పడునని పీఠముయొక్క యాశయమై యున్నది.

కం. వ. భైరవమూర్తి,
పీఠ ప్రధానమంత్రి.

# Memorandum of Association of
# SRI SAIVA MAHAPEETHAM.

*Head Office:* **BEZWADA.**

# శ్రీ శైవమహాపీఠము

కార్యస్థానము: బెజవాడ.

1. సంఘము పేరు.

ఈ సంఘముయొక్క పేరు "శ్రీ శైవమహాపీఠము."

2. సంఘముయొక్క సంకల్పములు.

1. నిగమాగమాది ప్రమాణచోదితమగు శివతత్త్వజ్ఞానమును, శివోపాసనము నభివృద్ధి చేయుట.

2. శాస్త్రీయములును, శైవార్హములు నగు నిహపరశ్రేయఃసాధనముల నిరూపించి వాని యనుష్ఠానమును బెంపొందించుట.

3. శైవమతమునకును, శైవసంఘమునకును ఆశ్రయమును శరణ్యమునై యుండి సనాతన ధర్మరీతిని వాని యభ్యుదయమునకై కృషిసలుపుట.

4. పూర్వోక్త సంకల్పత్రయమునకు సంగతములును, సాధకములు నగు అన్ని కార్యములను చేయుట. అనగ,

(అ) నిగమాగమతంత్రస్మృతిపురాణేతిహాసాది వాఙ్మయమునకు జెందినట్టియు, ఇతరము లయినట్టియు పుస్తకములతో గ్రంథాలయములను, పఠన మందిరములను నెలకొల్పుట.

(ఆ) తత్త్వయాథాత్మ్య నిశ్చయసాధన మగు దర్శనజ్ఞానమును అందుకు వలయు భాషాదిజ్ఞానమును గలుగజేయుటకై సాహిత్య వేదశాస్త్రాది పాఠశాలలను స్థాపించి ప్రాచీనాధునిక విద్యల గఱపుట.

(ఇ) యథోక్త తపోమంత్రయోగాదిసాధనానుష్ఠానముచే సర్వాభ్యుదయహేతు వగు తేజస్సంపాదనమును, నిశ్శ్రేయసహేతు వగు పరతత్త్వానుభవమును సమకూర్చుటకొరకు యోగ్యములగు నాశ్రమములను, మఠాదులను నెలకొల్పి వివిధములగు శాస్త్రీయ సాధనములను బ్రోత్సహించుట.

(ఈ) గ్రంథాదుల ముద్రణ ప్రకటన మూలమునను, ఉపన్యాసాదులమూలమునను, ఇతర ప్రచారప్రక్రియలచేతను, శివతత్త్వజ్ఞానమును, శివోపాసనమును విస్తరింపజేసి శైవమతవృద్ధికిని, వ్యాప్తికిని కృషిసలుపుట.

(ఉ) స్వస్వవర్ణాశ్రమోచిత ధర్మకర్మానుష్ఠానమును బెంపొందజేసి, వృత్తి విద్యల నేర్పి, కళలను, బరిశ్రమలను బోత్సహించుటమూలమున శైవసంఘముయొక్క ఆర్థికాదిపరిస్థితుల నభివృద్ధిచేసి సంఘాభ్యుదయమునకు దోడ్పడుట.
మున్నగునవి.

పైన నుదహరించిన నాలుగును శ్రీ శైవమహాపీఠముయొక్క సంకల్పములై యున్నవి.

## 3. సంఘముయొక్క నిబంధనలు - I ఉపోద్ఘాతము.

1. ఈ నిబంధనలు శ్రీశైవ మహాపీఠముయొక్క నిబంధనలై యుండి, పీఠముయొక్క పరిపాలన విధాన మంతయును, పీఠాంతర్గత సకలవర్గముల యొక్కయు అధికారిక వ్యక్తులయొక్కయు చర్యలును, పీఠముయొక్క సమస్త కార్యక్రమములును ఈ నిబంధనల ప్రకారమే జరుగవలెను.

2. విషయమునకుగాని, ప్రకరణమునకుగాని విరుద్ధము కానియెడల, ఈ నిబంధనలలోని

(అ) "పీఠము" అను పదము "శ్రీశైవ మహాపీఠము"ను సూచించును.

(ఆ) "సంవత్సరము" "మాసము" మున్నగు కాలవిభాగములను చాంద్రమాన రీత్యా గ్రహింపవలెను.

(ఇ) "శైవుడు" అను పదమునకు ఈ దిగువ 5వ నిబంధన ప్రకారము పూర్ణ సభ్యత్వ లేక, అర్ధ సభ్యత్వ లక్షణములు కలిగియున్న యే వయస్సుగల వ్యక్తి అయినను అని యర్థము.

(ఈ) "పీఠాధిపతి" యను పదము ఈ దిగువ 108వ నిబంధనప్రకారము ఎన్నుకొనబడిన ప్రథమ పీఠాధిపతికిని, ఆయన స్థానమున నీ నిబంధనల ప్రకారము పిమ్మట వచ్చు పీఠాధిపతులకును మాత్రమే వర్తించును.

(ఉ) "సంయుక్తవర్గము" అనగ ఈ నిబంధనలందు బేర్కొనబడిన కొన్ని విశిష్ట కార్యములకై పాలకసమితి సభ్యులును, గురుమండలి సభ్యులును ఏకత్ర చేరి యేర్పడిన మహావర్గము.

(ఊ) పుంలింగ స్త్రీ లింగములును, ఏకవచన బహువచనములును అన్యోన్య ద్యోతకములై యుండును.

(ఋ) నిబంధనల ప్రకారము ఆయా వర్గసమావేశములకును, ప్రత్యేక తీర్మానములకును వలయు సభ్యులసంఖ్య లెక్కించుటలో భిన్నాంకములను బూర్ణాంకములుగ గ్రహింపవలెను.

(ౠ) "గురుమండలి సభ్యులు" అనుపదము, క్రమమైన గురుమండలి తత్కాల మందున్నను లేకున్నను, గురుమండలికి సభ్యులుగ నెన్నుకొనబడిన వారిని సూచించును.

(ఌ) "నిబంధనలు" అనగా ఈ ప్రణాళికయందలి నిబంధనలు.

(ఇా) "సభ్యుడు" అనగ పీఠసభ్యుడు.

3. (అ) ఈ ప్రణాళికయందలి 1 నుండి 13 వరకు, 34 నుండి 41 వరకు, 66 నుండి 80 వరకు, 86,87,101 నుండి 108 వరకుగల నిబంధనలు పీఠము రిజిస్టరు అయిన వెంటనే ఆచరణము లోనికి వచ్చును.

(ఆ) ఈ దిగువ 108 వ నిబంధన ప్రకారము ప్రథమపీఠాధిపతియొక్క యెన్నికయును,వర్గముల నిర్మాణములును పూర్తి అయినతోడనే తక్కిన నిబంధనలన్ని యును గూడ ఆచరణములోనికి వచ్చును.

4. పై 3 వ నిబంధన ప్రకారము ఆయా నిబంధనలు ఆచరణము లోనికి వచ్చి నప్పటినుండియు, ఆ నిబంధనలకు అసంగతముగగాని, వ్యతిరేకముగగాని యున్న ట్టియు, అంతకుపూర్వము ఆమోదింపబడినట్టి లేక ఆచరణములో నున్నట్టియు, అన్ని యితర ప్రణాళికలును, వర్గ నిర్మాణవిధానములును, వర్గములయొక్క లేక వ్యక్తుల యొక్క అధికారములును ఇందు మూలముగ నుపసంహరింప బడినవి. కావున,పిమ్మట నాచరణమునం దుండవు.

## II పీఠ సభ్యత్వము

5. (అ) నిగమాగమాది ప్రమాణములం దాస్తిక్యము కలిగినట్టియు,

(ఆ) చాతుర్వర్ణ్యమునకు జెంది, స్వవర్ణాశ్రమోచిత ధర్మాచరణము కలిగినట్టియు,

(ఇ) శివాద్వైత మతావలంబులై చిన్మయశాంభవపాశుపత శిరో వ్రతాది సంజ్ఞిత దీక్షాప్రయుక్త శివలింగధారణమును, అష్టావరణ పంచాచార పూర్వక విహి తానుష్ఠానమును గలిగినట్టియు.

(ఈ) సత్ప్రవర్తనము గలిగినట్టియు,

(ఉ) 18 సంవత్సరములకు మించిన వయస్సు గలిగినట్టియు,

స్త్రీలును, పురుషులును పీఠపూర్ణ సభ్యత్వమున కర్హులై యుందురు.

తక్కిన సభ్యత్వ లక్షణము లన్నియు గలిగి లింగధారణము మాత్రము లేని వారు అర్ధ సభ్యత్వమున కర్హులు.

6. నిబంధనల ప్రకార మేర్పడినట్టియు, తమకు చెందినట్టియు ఆయా గ్రామ లేక మండల లేక మహాసంస్థల సమావేశములందు హాజరు అగుటకును, నిబంధనల ననుసరించి చర్చలందు పాల్గొనుటకును, తీర్మానముల నుపపాదించుటకును, తీర్మాన సమయములందు స్వాభిప్రాయ మొసంగుటకును, పూర్ణ సభ్యుల కధికారము కలిగి యుండును. తీర్మాన సమయములందు స్వాభిప్రాయ మొసంగు నధికారము తప్ప, పూర్ణ సభ్యుల తక్కిన యధికారము లన్నియు అర్ధ సభ్యులకును ఉండును.

7. నిబంధనల ముద్రితప్రతి యొక్కటి ప్రతి సభ్యునకు వినామూల్యముగ నీయబడును. ఏ కారణముచే నయినను సభ్యుడు మరియొక ప్రతిని కోరువెడల దానికి పాలక సమితి నిర్ణయించు మూల్యమును చెల్లింపవలెను.

8. ఇంకను ఈ నిబంధనలవలనగాని, వీని ననుసరించికాని తనకు గలుగజేయబడు అన్ని యితరాధికారములను ప్రతిసభ్యుడును గలిగియుండును.

9. అర్హత కలిగియున్నటుల తమకు తోచిన యే వ్యక్తినైనను పూర్ణసభ్యత్వమునకుగాని, అర్ధ సభ్యత్వమునకుగాని పాలకసమితి యంగీకరింపవచ్చును. ఏవ్యక్తి నైనను పాలకసమితి నిరాకరించినచో హేతువులు చెప్పనవసరము లేదు. పాలకసమితి యభిప్రాయ మెట్లున్నను ఏ వ్యక్తికైన పీఠసభ్యత్వ మొసంగుటకుగాని, సభ్యత్వమునుండి తొలగించుటకుగాని గురుమండలి సర్వాధికారము కలిగియుండును.

10. ప్రతి పూర్ణసభ్యుడును, అర్ధసభ్యుడును పీఠమునకు ప్రతి సంవత్సరమునను పాలకసమితిచే నిర్ణయింపబడు దక్షిణను సమర్పింపవలెను. సంవత్సర మధ్యములో దన సభ్యత్వమెప్పుడు ప్రారంభించినను, అంతమొందినను సంవత్సరదక్షిణను బూర్తిగ జెల్లింపవలెను. పీఠమునకు సభ్యుడు చెల్లింపవలసిన సంవత్సరదక్షిణ ప్రస్తుతము ఒక రూపాయి మాత్రము అయి యున్నది. దీనిని పాలక సమితి మార్చవచ్చును. నియత దినమునకు మించి దక్షిణను చెల్లింపక బాకీపెట్టు సభ్యుని యధికారము లన్నియు మరు దినమునుండి తమ యంతటనే నివర్తించును. కాని సభ్యత్వమును, దానికి చెందిన బాధ్యత లన్నియును నిలిచియే యుండును. పిమ్మట యెన్నడయినను, అప్పటివరకు చెల్లవలసిన బాకీ నిశ్శేషముగా చెల్లించినచో, నాటినుండి తన సభ్యత్వాధికారము లన్నిటిని సభ్యుడు తిరిగి కలిగియుండును. ఏ సభ్యుని విషయములోనైన లోగడి దక్షిణ బాకీని రద్దుచేయుటకుగాని, దానిని చెల్లించుట కింకను గడు విచ్చుటకుగాని పాలక సమితి కధికారము కలదు. పాలకసమితి యామోదమునకు లోబడి ప్రధాన మంత్రియే అట్టి గడు వొసంగ నగును. అట్లు బాకీ రద్దు అయినప్పటినుండియు లేక, అట్లు గడు వీయబడిన కాలములోను, సభ్యుడు తన సభ్యత్వాధికారము లన్నియు కలిగియుండును.

11. పీఠపత్రికయున్నచో బ్రతిసభ్యుడు దానికి చందాదారుగ నుండి నిర్ణీతమగు చందాను చెల్లింపవలెను. దక్షిణ విషయమున 10 వ నిబంధనలోని విధు లన్నియు సభ్యుడు చెల్లింపవలసిన పత్రిక చందాకుగూడ వర్తించును.

12. పీఠముయొక్కయు, పీఠాంతర్గతము లయి యీ నిబంధనల ప్రకారము నిర్మితము లయిన ఆయా వర్గములయొక్కయు, వాటి ఉపవర్గములయొక్కయు, విశిష్ట వర్గములయొక్కయు, తాత్కాలిక వర్గములయొక్కయు, అధికారిక పురుషుల యొక్కయు తీర్మానములకును, శాసనములకును, దండనములకును పీఠ సభ్యు లందరు సర్వథా బద్ధులై యుందురు. కాని అట్టి యే తీర్మానమైనను, శాసనమైనను, దండనమైనను తన కసమ్మత మనికాని, దానివలన తన కేదయిన హాని, లేక నష్టము, లేక అవమానము కలిగినదనికాని, ఇతర యే కారణముచేతగాని పీఠముమీదను, లేక ఆయా వర్గములు, ఉపవర్గములు, విశిష్టవర్గములు, తాత్కాలిక వర్గములమీదను, లేక ఆయావర్గములందలి వ్యక్తులమీదను, లేక అధికారిక పురుషులమీదను, న్యాయస్థానము

లందు ఏ విధమైన చర్యను గైకొనుటకు ఏ సభ్యునిని యెట్టి స్వాతంత్ర్యముకాని అధికారముకాని, అవకాశముకాని ఉండదు. ఏ వ్యక్తియైనను పీఠసభ్యత్వమును అపేక్షించుటవలనను, లేక అంగీకరించుటవలనను ఈ నిబంధనను పూర్తిగ గ్రహించి సమ్మతించిన ట్లెంచబడును.

13. ఏ సభ్యు డయినను ప్రధానమంత్రికి దన నివృత్తిపత్రము(Resignation) నర్పించి కాని, వేరువిధముగ నందజేసి కాని రసీదు పొందుటవలన తన సభ్యత్వమును స్వేచ్ఛచే స్వయముగ నంత్యమొందించుకొనవచ్చును. కాని అట్లుచేయుటకు బూర్వము తాను పీఠమునకు తన సభ్యత్వసంబంధములో చెల్లింపవలసియుండు దక్షిణలను, అన్ని యితరమొత్తములను, చెల్లించు బాధ్యత నిలిచియే యుండును. అంతకు పూర్వము జరిగియుండు అన్నిచర్యలకును బద్ధుడై యుండును.

## III పీఠాంతర్గతవర్గములు

14. ఈ దిగువ బేర్కొనబడిన అయిదువర్గములు పీఠాంతర్గతములై యుండి స్వాధికారానుసారముగ పీఠకార్యములను నెరవేర్చుచుండును. అనగా:—

(i) మహాపరిషత్తు, (ii) మండలపరిషత్తు, (iii) పాలకసమితి, (iv) గురుమండలి, (v) పండితసభ.

## IV మహాపరిషత్తు

15. పీఠముయొక్క సర్వసభ్యుల సమష్టికి "మహాపరిషత్" అని పేరు. ఇయ్యది సాధారణ పరిస్థితులలో సమావేశము కాదు. తత్కాలమందు పీఠమునకు వెయ్యిమంది దక్షిణ చెల్లించిన సభ్యు లుండినసే కాని మహాపరిషత్సమావేశము నాహ్వానింపరాదు.

16. శైవమతమునందుగాని, శైవసంఘమునందుగాని క్లిష్ట సమస్య లేర్పడి వాని విషయములో సర్వశైవాభిప్రాయమును, బరిష్కారమును అవసర మగు నెడ, పీఠాధిపతి యాజ్ఞానుసారము ప్రధానమంత్రి మహాపరిషత్సమావేశము నాహ్వానింపవలెను. అటే పరిస్థితులలో నూర్గురు పీఠసభ్యు లేకీభవించి లిఖితమూలముగ ప్రధానమంత్రిని గోరినచో, ఆయన అట్టి సమావేశము నాహ్వానింపవలెను. అట్లు కోరిన రెండుమాసములలోపుగ బ్రధానమంత్రి యే కారణముచే నయిన సమావేశము నాహ్వానింపని యెడల, ఆ సభ్యులే స్వయముగ సమావేశము నాహ్వానింపవచ్చును.

17. తీర్మానసమయమందు స్వాభిప్రాయమొసంగు నర్హత కల పూర్ణసభ్యులు ప్రతిమండలము ఒక్కొకటికి పదునొకండుగురున్ను, అన్ని మండలములకు మొత్తముపైని అట్టి సభ్యులు నూటయేబదియున్ను, మహాపరిషత్సమావేశమునకు కనిష్ఠసంఖ్యాగ నుండవలెను. పీఠాధిపతియే దీనికి అధ్యక్షుడుగ నుండవలెను.

పై సభ్యు లా యా మండలపరిషత్తులచే నియమింపబడిన ప్రతినిధులై యుండవలెను.

18. మహాపరిషత్తుయొక్క తీర్మానము పీఠాంతర్గత సకలవర్గములచే శిరసా వహింపబడి సర్వవిధముల నాచరణములో బెట్టవలసియుండును. అట్టి తీర్మానము గురుమండలికి (అందలి తత్కాలసభ్యులలో మువ్వాతికను మించిన సభ్యులకు) అసమ్మత మగునేని, వెంటనే, అనగ పూర్వసమావేశమునకు ఆరునెలలలోపుగ, పీఠాధిపతి మరియొక మహాపరిషత్సమావేశము నాహ్వానించి, లోగడ తీర్మానమును చర్చకు బెట్టవలయును. ఈ రెండవ సమావేశమునందు గావింపబడు తీర్మానమే పీఠముయొక్క చరమపరిష్కారముగ నెంచబడి దానికి పీఠమందలి యన్నివర్గములును, అందరును బద్ధులై యుందురు.

## V మండల పరిషత్తులు

19. శైవులు నివసించు ప్రదేశములు తత్తత్కాలోచిత రీతిని వేర్వేరు మండలములుగ విభజింపబడవలెను.

అవి ప్రకృతమున,

ఒరిస్సా రాజధానిలోని, 1. బరంపురము

చెన్నపురి రాజధానిలోని రాజకీయ మండలముల ననుసరించి
2. విశాఖపట్టణము
3. పూర్వగోదావరి
4. పశ్చిమగోదావరి
5. కృష్ణా
6. గుంటూరు
7. మద్రాసు

నిజాం రాష్ట్రములో
8. వరంగల్లు
9. సికిందరాబాదు
10. మెదక్
11. నిజామాబాదు

3

అని పదునొకండు మండలములుగ నిర్ణయింపబడి యున్నవి. మండలముల యొక్క స్థానమును, సంఖ్యయును, వ్యాప్తియును, అప్పటప్పటి విశేషములను బట్టి గురు మండలిచే మార్చబడవచ్చును.

20. మండల వాస్తవ్యు లగు పీఠసభ్యు లందరును మండల పరిషత్తునకు సభ్యులుగ నుందురు.

21. ప్రతి మండల పరిషత్తునకు ఒక అధ్యక్షుడును, ఒక కార్యదర్శియు నుండవలెను. అధ్యక్షుడు బ్రాహ్మణ వర్ణమునకు జెంది నలుబది వత్సరములకు మించిన వయస్సు కలిగి యుండవలెను. అధ్యక్ష కార్యదర్శులు ఉభయులును, ఇంకను ముగ్గురు పూర్ణ సభ్యులును కలిసి మండల పరిషత్కార్య నిర్వాహకవర్గముగ నుందురు. మండలమందు యేబదికి తగ్గకుండ పూర్ణసభ్యు లున్నచో, కార్య నిర్వాహకవర్గసభ్యులైదుగురిని ప్రతిసంవత్సరము భాద్రపదాంతము లోపల వారు ఎన్నుకొనవలెను.

పూర్ణ సభ్యుల సంఖ్య అంతకు తగ్గియున్నచో పీఠాధిపతియే వారిని చేర్చుకొనుచుండ వలెను.

22. మండల పరిషదధ్యక్షుడు కాని, మండల పరిషత్కార్యదర్శి కాని, మండల పరిషత్సభ్యులలో పదునొకండుగురు ఏకీభవించి కాని పరిషత్సమావేశము నాహ్వానింప వచ్చును.

23. ప్రతి మూడుమాసముల కొక మండల పరిషత్సమావేశము సాధారణముగ జరుగవలెను.

24. ప్రతిసమావేశమునకును స్వాభిప్రాయ మొసంగు నర్హత కల పూర్ణ సభ్యులు పదునొకండుగురు కనిష్ఠ సంఖ్యగ నుండవలెను.

25. శైవమతమునకును, శైవ సంఘమునకును సంబంధించినట్టియు, పీఠసంకల్ప ములకు సంగతములును, సాధకములును అగునట్టియు, మండలస్థ శైవుల యోగక్షేమ ములకు హేతుభూతములు కాదగినట్టియు, ఐహికాముష్మిక విషయము లన్నిటిని అవసరము వెంబడి చర్చించి తమ యభిప్రాయములను, ఈప్సితములను విజ్ఞప్తి రూపం బులుగ పీఠమునకు నివేదించుటకు మండల పరిషత్తునకు అధికారము కలిగియుండును. పీఠవిధానములను,శాసనములను శిరసావహించి మండలమందంతట ఆచరణములో బెట్టుట యును, శైవ మత ప్రచారము చేయుటయును మండల పరిషత్తునకు విధియై యుం డును. మండల మండలి సభ్యులు పీఠమునకు చెల్లించవలసిన అన్ని విధముల మొత్తము లను మండల పరిషత్కార్యదర్శియే సక్రమముగ వసూలుచేసి పీఠకార్యస్థానమునకు బంపుట కాని, ప్రధాన మంత్రి నిర్ణయించు విధముగ వ్యయపరచుట కాని జరిగించ వలెను. అన్యథా యే మొత్తమును వ్యయపరుప గూడదు. ఆదాయ వ్యయము లన్నిటి కిని క్రమ మయిన లెక్కలను వ్రాయించి యుంచవలెను.

26. మండల పరిషత్తులకు సంబంధించిన పై నిబంధనలను గురుమండలి అప్ప టప్పటి యవసరములను బట్టి మార్పు చేయుచుండవచ్చును.

## VI పాలకసమితి

27. ప్రధాన మంత్రియు, మండలాధ్యక్షులును పాలకసమితికి సభ్యులుగ నుందురు.

28. పై నిబంధనలోని సభ్యులతోపాటుగ, గురుమండలికి అవసర మని తోచిన సమయము లందు. (1) అధిష్ఠాన కార్యదర్శి, (2) సంచార కార్యదర్శి, (3) కోశాధ్య క్షుడు, (4) పత్రికా సంపాదకుడు, అను నధికార స్థానములలో నొకటిగాని, కొన్ని గాని, అన్నియుగాని గురుమండలి సృజించి, కృత్యములను నిర్వచించుటయే కాక, యుక్తమని తోచిన యెడల, వాటికి నియమింపబడు వ్యక్తులను పాలకసమితియందు Ex-Officio సభ్యులుగ నుండునట్లు కూడ తీర్మానింపవచ్చును. తిరిగి యుక్తమని తోచినప్పు డట్టి తీర్మానమును మార్చుటగాని, రద్దుగాని చేయవచ్చును. కోశాధ్యక్ష స్థానమునకు వ్యక్తిని గురుమండలియే నియమింపవలెను. యుక్తమని తోచినప్పు

డట్టి వ్యక్తిని స్థానమునుండి తొలగించుటకును గురుమండలి యధికారము కలిగి యుండును. తక్కిన మూడుస్థానములకు వ్యక్తులను పీఠాధిపతి యామోదముతో ప్రధాన మంత్రియే నియమించును. అవసరమగుచో వీరికి జీతములనుగూడ పాలకసమితి యేర్పాటు చేయవచ్చును. ప్రధానమంత్రికి యుక్తమని తోచినప్పుడీ ముగ్గురు వ్యక్తులలో నెవరి నైన ప్రధానమంత్రియే తొలగింపవచ్చును. ఈ మూడు స్థానములకు నియమింపబడువారు బ్రాహ్మణ వర్ణమునకు జెంది ముప్పది సంవత్సరములకు మించిన వయస్సుగల పూర్ణసభ్యులై యుండవలెను. అందరును ప్రధానమంత్రికి వశులై ఆయన నిర్ణయించురీతిని పీఠకృత్యముల నెరవేర్చుచుండవలెను.

29. అధిష్ఠాన కార్యదర్శి:—ఈ యుద్యోగినే "సహాయమంత్రి"యని కూడ వాడవచ్చును. ఈయన పీఠముయొక్క ప్రధానకార్యస్థాన గ్రామమున నివసించుచు ప్రధాన కార్యస్థాన కృత్యములను స్వయముగను, ఇతరులవలనను నిర్వహించుచుండును. పీఠాధిపతి యనుమతిని బొంది ప్రధానమంత్రి తన సాధారణ కృత్యములలో గొన్నిటిని ఈయన కొసంగవచ్చును. 87 వ నిబంధనలోని తనయొక్క ప్రత్యేకాధికారముల నొసంగ రాదు.

30. సంచార కార్యదర్శి:—ఈయన ప్రచారము ముఖ్య కృత్యముగ గలిగి గ్రామ,నగర, మండలాదిస్థానిక సంస్థలయొక్కయు, వర్గములయొక్కయు కృత్యములు సక్రమముగ నడచుచున్నది, లేనిది పరిశీలించుచు, సలహాల నిచ్చుచు వాటిని సరియగు మార్గమున వర్తింమనట్లు ప్రోత్సహించుచుండును.

31. కోశాధ్యక్షుడు:—ఈ నిబంధనలకును, ఆయా వర్గముల నిర్ణయములకును లోబడి పీఠమునకు సంబంధించిన ఆస్తులను గురించిన పత్రములను దస్తావేజులను, అన్ని బాపతుల పీఠధనమును, విలువగల యితర వస్తువులను, లిఖితములను బ్యాంకులు మున్నగువానిలో భద్రపరచుచు, అధికృతుల నిర్ణయానుసారముగ ధనమును తెచ్చించుచు, అన్నిటికి గ్రమమున లెక్కలు వ్రాయించి యుంచుచు, తన కృత్యములన్నిటికి గురుమండలికి ఉత్తరవాదిగ నుండును.

32. పత్రికాసంపాదకుడు:—ఈయన పీఠపత్రికకు సంపాదకుడుగ నుండి ప్రధానమంత్రి నిర్ణయించురీతిని పత్రికా నిర్వహణము చేయుచుండును.

33. పై 29, 30, 31, 32 నిబంధనలలో వివరింపబడిన నాలుగు స్థానములలో నేది యైన గురుమండలిచే సృజింపబడి, దానియం దితరవ్యక్తి నియమింపబడి పని చేయు వరకును, లేక యెన్నడయిన వ్యక్తి నియమింపబడక స్థానము ఖాళీగ నుండు నప్పుడును, లేక యేకారణముచేత నయిన నియమింపబడిన వ్యక్తి పనిచేయనప్పుడును, ఆ స్థానముయొక్క అధికారములు, నుకృత్యములును ప్రధానమంత్రియందే యుండును. ఆయనకూ స్వయముగగాని క్రమముగ నియమింపబడిన యితరుల మూలమునగాని కృత్యము లన్నిటిని నిర్వర్తించుచు నన్నిటను బాధ్యత కలిగి యుండును.

34. పాలకసమితి సమావేశములను ప్రధానమంత్రి యావాహ్వానింపవలెను. ముగ్గురికి తగ్గకుండ సమితియొక్క తత్కాలసభ్యులలో మూడవవంతు సభ్యులు అసాధారణ సమావేశమును గోరవచ్చును.

35. సంవత్సరమునకు నాలుగుసారులు, అనగ, చైత్రాషాఢాశ్వయుజపుష్య మాసములలో పాలకసమితి సమావేశములు సాధారణముగ జరుగవలెను.

36. పాలకసమితికి ప్రధానమంత్రి యధ్యక్షుడై యుండును.

37. పాలకసమితి సమావేశములకు అప్పటికి గల సభ్యుల మొత్తపుసంఖ్యలో (నలుగురికి తగ్గకుండ) మూడవవంతు సభ్యులు కనిష్ఠసంఖ్యగ నుండవలెను. అన్ని సమావేశములందు ప్రధానమంత్రియే సాధారణముగ నధ్యక్షత వహింపవలెను. అప్పుడాయన లేనియెడల ఆయనచే నియమితుడగు మరియొకసభ్యుడు అధ్యక్షత వహింపవచ్చును.

38. పీఠాధిపతియు, గురుమండల్యాధ్యక్షుడును పాలకసమితి సమావేశములందు ఉపస్థితులై యుండి తమకు తోచిన సలహాల నిచ్చుచు, ఇష్ట మగుచో చర్చలందుగూడ పాల్గొనవచ్చును. కాని, తీర్మాన సమయములందు స్వాభిప్రాయ మొసంగరాదు. వీరిని పాలకసమితిసమావేశ కనిష్ఠసంఖ్యలో లెక్కింప రాదు.

39. గురుమండలియొక్క నిర్ణయములకు లోబడి

(అ) పీఠసంకల్పములను సక్రమముగ నెరవేర్చుటయును,

(ఆ) పీఠముయొక్క స్థిరచరాదిరూప యావద్విశిష్ట ధన ద్రవ్యసత్వములందు పీఠపక్షమున స్వాధీనము కలిగి, క్రమప్రకారము రక్షించి, వ్యవహరించి యథాశక్తి వృద్ధిచేయుటయును,

(ఇ) పీఠాంతర్గత సకలవర్గములయొక్క తీర్మానములను క్రమప్రకారము ఆచరణములో బెట్టించుచు, అవసర మగు వ్యక్తులను ప్రధానమంత్రిద్వారా సక్రమముగ నియమించి పనుల చేయించుచు, పీఠ కార్యక్రమములను యథావిధిగ నడిపించుటయును,

పాలకసమితి కృత్యములై యుండును.

40. పాలక సమితి యందలి తత్కాల సభ్యులలో ముప్పాతిక మందికి తగ్గని సంఖ్య వారిచే జేయబడి, పిమ్మట పీఠాధిపతిచే నంగీకరింపబడిన తీర్మాన రూపముగ, పాలకసమితి తన యధికారమునకును, నిర్ణయమునకును లోబడిన యేవిషయమును గురించి యైన స్థాయినిర్దేశముల (Standing Orders) ను జేసి యాచరణములో బెట్టింపవచ్చును.

41. పాలకసమితికి యుక్తమని తోచెనేని, అప్పుడప్పుడు పరిమిత నిర్దిష్ట కాలములకుగాని, పీఠాధిపతి యనుజ్ఞతో ననిర్దిష్టముగగాని, తన యధికారములలో నేనినైన ప్రధానమంత్రికి నొసంగవచ్చును. తిరిగి యెన్నడయిన యట్టి యధికారములను రద్దుపరచి, యంతటినుండి పాలకసమతి వాటిని స్వయముగనే నిర్వహింపవచ్చును.

## VII గురుమండలి

42. (అ) (i) బ్రాహ్మణ వర్ణమునకు జెంది నలుబది సంవత్సరములకు మించిన వయస్సు కలిగిన పురుషులై నట్టియు, మరియు,

(ii) గ్రంథపరిశ్రమచే గాని, విషయానుభవముచే గాని పీఠాధిపతి యభిప్రాయములో పండితులుగ నెన్నదగి, ముఖ్యముగ వేదాంత ప్రస్థాన త్రయము నధ్యయనముచేసి నట్టియు, మరియు,

(iii) శివ పంచాక్షరీ మహామంత్ర పురశ్చరణము చేసినట్టియు, మరియు,

(iv) శైవాగమనిష్ఠులై శైవాచారపరాయణులై శాస్త్రోక్తశైవ చిహ్నములను, లాంఛనములను ధరించునట్టియు, మరియు,

(v) పూర్ణవైరాగ్యవంతులై, పవిత్రవర్తనులై నట్టియు, మరియు,

(vi) పాలక సమితిచే పేర్కొనబడి గురుమండలిచే నంగీకరింపబడినట్టియు, పీఠ పూర్ణసభ్యులలోనుండి గురుమండలిసభ్యుల నెన్నుకొనవలెను.

(ఆ) క్రమప్రకారము గురుమండలి యేర్పడు వరకును పై యుపనిబంధనలోని గురుమండలి కృత్యమును పీఠాధిపతియే నెరవేర్చును.

43. గురుమండలి నిర్ణయానుసారముగ గురుమండలి సభ్యత్వమున కర్హులైన వారి పేర్లను ముందుగ ప్రధానమంత్రి పీఠపత్రికలో ప్రకటించవలెను. అట్లు ప్రకటింపబడిన వారిలో నెవ్వనినయిన పీఠముయొక్క తత్కాల పూర్ణసభ్యులలో సగమునకు మించిన సంఖ్యవా రంగీకరించి రేని, ఆయన గురుమండలి సభ్యుడుగ క్రమప్రకారము ఎన్నుకొనబడి న ట్లెంచవలెను. పీఠముయొక్క తత్కాలపూర్ణ సభ్యుల సంఖ్య మున్నూటికి మించియుండిననే కాని యీ యెన్నిక జరుగగూడదు. తీర్మానమందు స్వాభిప్రాయ మొసంగు నర్హతను తత్కాలమందుగలిగియుండు పూర్ణసభ్యులు మాత్రమే ఈ యెన్నికయందు పాల్గొన నగును.

44. తత్కాల పూర్ణసభ్యులు నియత సంఖ్యకు తగ్గియున్న గాని, ఖాళీస్థానములను క్రమమగు నెన్నికచే పూర్ణసభ్యులు సకాలములో పూరింపకున్న గాని, గురుమండలికి నవసర మగు సభ్యులను ప్రకటిత నామములలోనుండి పీఠాధిపతియే పేర్కొనవలెను.

45. గురుమండలి సభ్యుల సంఖ్య యెన్నడును పదునొకండుగురికి తగ్గకూడదు. ఈ సంఖ్యను అప్పటప్పటి సందర్భములనుబట్టి తమకు యుక్తమని తోచిన ప్రకారము ముప్పది మూడువరకు హెచ్చించుటకును, పై కనిష్ఠసంఖ్య వరకు తగ్గించుటకును గురుమండలి అధికారము కలిగియుండును.

46. ఎన్నడయిన గురుమండలి సభ్యుల సంఖ్య పదునొకండుగురికి తగ్గినచో వారు "గురుమండలి" యను పేరుతో నొక స్వతంత్రవర్గముగ పని చేయరాదు. అట్టి కాలములోను, గురుమండలికి సభ్యులే లేని కాలములోను, గురుమండలి కృత్యము

లన్నియు పీఠాధిపతియే నెరవేర్చును. తత్కాలమందు గురుమండలి సభ్యు లెవరయిన యున్నచో వారు తమ యభిప్రాయములను సలహారూపముగ పీఠాధిపతికి నొసగ వచ్చును. అవి తనకు గ్రాహ్యములుగ దోచెనేని పీఠాధిపతి గ్రహింపవచ్చును.

ఈ విధి యభావవిధి కావున, గురుమండలి సభ్యులసంఖ్య యిట్లు కొరబడి యుండు తరి, పీఠాధిపతి జాగరూకు డయి సాధ్యమయినంత త్వరలో నవసర మగు గురుమండలి సభ్యుల యెన్నికకు బ్రయత్నించి క్రమ మయిన గురుమండలిని నిర్మించు చుండవలెను.

47. గురుమండలి సభ్యుల పేర్లను ఎన్నికల వరుసను క్రమసంఖ్యలతో నొక పుస్తకమున వ్రాసియుంచవలెను. ప్రతిసంవత్సరము జ్యేష్ఠ మాసాంతమున అప్పటికి గల గురుమండలి సభ్యులలో ముగ్గురు మండలి సభ్యత్వమునుండి తొలగెదరు. ఆ స్థానము లకు తిరిగి భాద్రపదాంతములోగా, 42,43 నిబంధనల ప్రకారము ఎన్నికలు జరుగ వలెను. జ్యేష్ఠాంతమున తొలగునట్టి లోగడి సభ్యులుగూడ తిరిగి యెన్నుకొన నర్హులై యుందురు. ఎన్నికల నిమిత్తము చేర్కొనబడు వారి పేర్లు పీఠపత్రికయొక్క ఆషాఢ సంచికలో ప్రకటింపబడవలెను.

45, 47 నిబంధనల ప్రకారము సభ్యులసంఖ్య తగ్గు నప్పుడును, సభ్యత్వము తొలగు నప్పుడును, తగ్గవలసిన సంఖ్యకు సరిపోయినంత మందియొక్క పేర్లను పుస్తక ములో వ్రాసిన వరుసను మొదటినుండి కొట్టి వేయవలెను. నూతనముగ నెన్నుకొన బడు వారిపేర్లను అప్పటివరకు నుండు పేర్లకు చివర చేర్చవలెను.

48. గురుమండలి సభ్యులు తమలోనుత్తముడును, శాస్త్రజ్ఞుడును, తపఃసంపన్ను డును అగు నొకనిని మండలికి అధ్యక్షునిగ నెన్నుకొనవలెను.

49. సంవత్సరమునకు రెండుసారులు, అనగ, చైత్రమాసమునందును ఆశ్వయుజ మాసమునందును, గురుమండలి సమావేశములు సాధారణముగ జరుగవలెను. ప్రధాన మంత్రి స్వయముగను, గురుమండల్యధ్యక్షుని యాజ్ఞానుసారముగను, గురుమండలి సమావేశముల నాహ్వానింపవచ్చును. అయిదుగురికి తగ్గకుండ తత్కాల సభ్యుల సంఖ్యలో మూడవవంతు సభ్యులు అసాధారణ సమావేశమును గోరవచ్చును. వారలు ఏకీభవించి స్వయముగ నాహ్వానింపను వచ్చును.

50. గురుమండలి సమావేశములకు సభ్యుల కనిష్ఠసంఖ్య అప్పటికిగల మొత్తపు సభ్యుల సంఖ్యలో సగముగ నుండవలెను. సమావేశములందు గురుమండల్యధ్యక్షుడే సాధారణముగ అధ్యక్షుడుగ నుండవలెను. అప్పు డాయన లేని యెడల వచ్చినవారిలో నెవరి పేరు పుస్తకములో మొదటిదిగ నుండునో ఆయన అధ్యక్షత వహింపవలెను.

51. పీఠాంతర్గతవర్గము లన్నిటిలోను గురుమండలియే సర్వోత్కృష్టమును, సర్వాధికారయుక్తము నయి యుండును. దీని తీర్మానములను పీఠమండలి యన్నివర్గ ములు, అందరు అధికారులు, అందరు వ్యక్తులు శిరసావహించి ఆచరణలో బెట్టవలెను

52. సకల విషయములందు దన కధికారము న్నను, అర్థికాది వ్యవహారములను సంఘాభివృద్ధికర లౌకిక విధానములను దనపరిశీలనమునకు లోబడి యీ నిబంధనల ప్రకారము నిర్వహించుటకు సాధారణముగ పాలకసమితికి వదలి, గురుమండలి తాను శాస్త్రపరిశీలన మందును, కృత్యాకృత్య నిర్ణయమందును, విద్యావ్యాపనమందును, అనుష్ఠానాభివృద్ధి యందును, మత ప్రచారమునందును, శాస్త్రీయ ధర్మకర్మ ప్రవర్తన మందును బ్రత్యేక శ్రద్ధ వహింపవలెను.

53. గురుమండలి విశేషాధికారములు. ఈ నిబంధనలం దితరత్ర పేర్కొన బడిన యధికారములు కాక గురుమండలికి నీ దిగువ విషయములలో విశేషాధికారము కలిగియుండును. అనగా:—

(అ) పీఠసంకల్పముల యొక్కయు ఈ నిబంధనల యొక్కయు అర్థమును గురించి కాని సమన్వయమును గురించి కాని భావమును గురించి కాని సంశయము లేక వివాదము కలిగినప్పుడు దానిని నిర్ధారణ చేయుట.

(ఆ) పీఠ సభ్యత్వమునకును, పీఠాంతర్గతములగు నాయా వర్గముల సభ్యత్వము నకును, అధికారిక స్థానములకును, అర్హతగ నీ నిబంధన లందు నిర్వచింపబడిన లక్షణ సంపత్తికి అర్థము చెప్పుట; విశేషములను నిర్ణయించుట; కరణీయములను విధించుట.

(ఇ) పై యుప నిబంధనలో వివరింపబడిన సభ్యులు, అధికారిక వ్యక్తులు, ఇత రులు, పీఠ సంబంధములోగాని, పీఠ కృత్య నిర్వహణము విషయములోగాని, చేయ వలసిన ప్రతిజ్ఞ (ప్రమాణము) లను నిర్ణయించి, ప్రతిజ్ఞా వాక్యములను నిర్వచించుట.

(ఈ) పాలక సమితితో చేరి సంయుక్తవర్గముగ నేర్పడి సంయుక్త వర్గసభ్యుల యేకగ్రీవామోదముతో పీఠ ప్రయోజనములకై ధనము నుత్పాదించుకొరకు పీఠసభ్యు లందరు చెల్లింపవలసినదిగ విశేష దక్షిణలను అప్పుడప్పుడు విధించుచుండుట.

(ఉ) పాలక సమితియొక్క సలహాతో, గురుమండలియందలి తత్కాల సభ్యు లలో ముప్పాతిక మందికి తగ్గని సంఖ్య వారి తీర్మానరూపముగ, పీఠ సంకల్పము లకును ఈ నిబంధనలకును అవిరుద్ధము లగు శాసనముల (Byelaws) ను చేయుట.

శాసనము చేయ దగిన విషయములు.—(1) అపరాధముల నిర్వచించి దండ నముల విధించుట; (2) గ్రామ, నగర, మండల సంస్థల స్వరూపమును, నిర్మాణమును, అధికారములను, కృత్యములను పాలనమును నిర్వచించుట; (3) పీఠ కార్యవిధాన మును నిర్ణయించి వివరములను విధించుట; (4) మరియు, పీఠాధిపతి సమ్మతించు నితర విషయములు.

54. పీఠాధిపతి నెన్నుకొను నధికారము తప్ప, తక్కిన తన యధికారములలో నేటినైనను, అప్పటప్పటి సందర్భములను బట్టి పరిమిత నిర్దిష్టకాలములకు గురుమండలి పీఠాధిపతికి నొసంగవచ్చును.

55. ప్రధానమంత్రి గురుమండలికి కార్యదర్శిగ నుండును.

56. గురుమండలి సభ్యుడు తానట్టి సభ్యుడుగ నుండు కాలములో పీఠమున కెట్టి దక్షిణను జెల్లింప నక్కరలేదు.

57. పీఠాధిపతియు గురుమండ లధ్యక్షుడును బ్రధానమంత్రియు జేరి "నిర్ణయ సంసత్" అను పేరుతో గురుమండలియందు ఉపవర్గముగ నుందురు. గురు మండలికి బ్రధాన కృత్యములుగ 52 వ నిబంధనలో చేర్కొనబడిన విషయములను ముఖ్యముగ దృష్టియం దిడుకొని యవసరములగు విధానములను కార్య క్రమములను ఉపపాదించుటయు, పీఠమండలి సంస్థలు, అధికారులు, ఇతర వ్యక్తులు, తమ తమ కృత్యములను గ్రమముగ నొనర్చుచున్నది, లేనిది పరిశీలించుచు అవసరములగు సూచ నలను చేయుటయును, ఇంకను గురుమండలిచే విధింపబడు నితర కార్యము లొనర్చుట యును, ఈ యుపవర్గముయొక్క కృత్యములై యుండును.

## VIII పండిత సభ

58. (అ) (i) వేదములు, ఉపవేదములు, వేదాంగములు, షడ్దర్శనములు, శైవా గమములు అనువానిలో నధమము ఏ యొకటియైనను యథావిధిగ నధ్యయనము చేసి నటువంటి, లేక

(ii) శిరోమణి, విద్వాన్, బి. ఏ., ఇత్యాదిపట్టపరీక్షలందు ఉత్తీర్ణులై నటు వంటి, లేక

(iii) ఇతర వ్యక్తిగత విశేషములను బట్టి పండిత సభాసభ్యత్వమున కర్హులని తనకు తోచినటువంటి,

పీఠసభ్యుల నెవ్వరినైన పండితసభాభిప్రాయమును గైకొని పీఠాధిపతి పండిత సభాసభ్యులుగ నియమింపవచ్చును. అట్లు నియమింపబడిన ప్రతిసభ్యుడు రెండు సంవత్సరములు పదవి యందుండును.

(ఆ) దోషారోపణ మూలమున కాక కాలపరివర్తన మాత్రముచేతనే పదవుల నుండి తొలగిన ప్రధానమంత్రులును, అట్టి గురుమండలి సభ్యులును పండిత సభకు యావజ్జీవ సభ్యులుగ నుందురు.

59. విషయప్రాధాన్యమును సమగ్రవిమర్శనావశ్యకతనుబట్టి, తత్త్వశాస్త్రాది విషయములందు బూర్ణనిష్ణాతులగు మతాంతరులను గూడ పండితసభాభిప్రాయమును గైకొని పీఠాధిపతి పరిమితనిర్దిష్టకాలములకు పండిత సభయందు అసాధారణసభ్యులుగ నియమింపవచ్చును. కాని యీ అసాధారణసభ్యుల అభిప్రాయములను తీర్మానసమ యములందు లెక్కింపరాదు.

60. సాహిత్యజ్ఞానము పూర్తిగ గలిగి సంస్కృతభాషయందు విషయచర్చ చేయగలవారు మాత్రమే సాధారణముగ బండిత సభాసభ్యత్వమున కర్హులై యుందురు. కావున, పీఠాధిపతి సాధ్యమయినంతవరకు అట్టి వారినే నియమించుచుండ నగును.

61. పీఠాధిపతి యామోదమునకు లోబడి, పండితసభాసభ్యులు తమలో నొకరిని బండితసభకు నధ్యక్షునిగ నెన్నుకొనవలెను. పీఠప్రధానమంత్రి పండితసభకు గార్యదర్శిగ నుండును. పీఠాధిపతియు గురుమండల్యధ్యక్షుడును ప్రధానమంత్రియు పండితసభాసమావేశములందు ఉపస్థితులైయుండి యిష్టమగుచో చర్చలందు గూడ పాల్గొనవచ్చును. కాని తీర్మానసమయమున స్వాభిప్రాయ మొసంగరాదు.

62. శైవులలో సాహిత్యజ్ఞానము, వేదశాస్త్రపాండిత్యము, సంఘాభ్యుదయమున కవసరమగు నాధునిక విజ్ఞానము, కళాపరిచయము, వృత్తివిద్యలు, పరిశ్రమలు మున్నగు వాని వ్యాప్తికిని, అభివృద్ధికిని వలయు సకల విషయములను అవసరము వెంబడి పరిశీలించి, విమర్శించి తమ యభిప్రాయములను సూచనలను విజ్ఞప్తిరూపములుగ పీఠమునకు నివేదించుటయును,

గురుమండలి లేక పాలకసమితి కోరిన విషయముల మీద తమ యభిప్రాయ మొసంగుటయును, పండితసభాకృత్యములై యుండును.

63. పండితసభ తన కృత్యముల నెరవేర్చుటకు సభకు అధమపక్షము ఆయిదు గురుసభ్యులైన నుండవలెను. ఎన్నడయిన సభ్యులసంఖ్య అంతకు తగ్గినచో వారు పండిత సభ యనుపేరుతో నొక స్వతంత్రవర్గముగ బనిచేయరాదు. అప్పుడు పండిత సభాకృత్యములన్నియు పాలకసమితియే నెరవేర్చవలెను.

64. పండితసభాధ్యక్షుడు కోరినచో ప్రధానమంత్రి పండిత సభాసమావేశము నాహ్వానింపవలెను. పండితసభాసమావేశములు సాధారణముగ ఆరునెలల కొకసారి జరుగవలెను. పండిత సభాసమావేశములకు సభ్యుల కనిష్ఠసంఖ్య ముగ్గురు.

65. పండిత సభాసభ్యులు పీఠమున కాస్థాన విద్వాంసులుగ నెన్నబడి తదనురూపమగు గౌరవమును బడయుచుందురు. పండితసభకు సంబంధించిన పై నిబంధనలను గురుమండలి తనకు యుక్తముగ తోచినరీతిని మార్పు చేయుచుండవచ్చును.

## IX వర్గముల సమావేశములకు సంబంధించిన సామాన్య నియమములు

66. దిగువ (67 నుండి 80 వరకు) నిబంధనలు పీఠమండలి కేంద్రవర్గములగు మహాపరిషత్, పాలకసమితి, గురుమండలి, పండితసభ యను నాలుగింటికి మాత్రమే వర్తించును. గ్రామ, నగర, మండల సంబంధములగు స్థానిక వర్గములకును సంస్థలకును వర్తింపవు.

67. సమావేశముగురించిన యాహ్వానమును ప్రధానమంత్రియే చేయవలెను. ఏదేని వర్గముయొక్క అసాధారణ సమావేశ మా వర్గసభ్యులచే క్రమప్రకారము కోరబడినను, అట్లుకోరిన మాసము కాక, తర్వాత రెండుమాసములు గతించువరకు ప్రధానమంత్రిచే నాహ్వానింపబడనియెడల ఆ సభ్యులందరు నేకీభవించి తామే యాహ్వానము చేయవచ్చును.

68. ఆహ్వానమును వర్గసభ్యులకు ప్రత్యేకలేఖల మూలమునగాని, పీఠపత్రిక యున్నచో దానియందును లేనిచో వర్గసభ్యులు నివసించు ప్రాంతములందు ప్రచారములోనున్న యేదైన పత్రికయందును ఒకసారి ప్రకటించుటమూలమునగాని చెంద జేయవలెను.

69. ఆహ్వానమును బంపు లేక ప్రకటించు దినమునకును సమావేశ దినమువకును నడుమ సాధారణముగ నొకనెలకు తగ్గని వ్యవధి యుండవలెను. కాని అత్యవసర సందర్భములలో వర్గాధ్యక్షుఁడనుమతించినట్టి తక్కువ వ్యవధికూడ యుండవచ్చును.

70. నిర్ధార్య విషయములను గురించియు సమావేశకార్యక్రమమును గురించియు సాధ్యమగువరకు పూర్తివివరముల నాహ్వానమందు దెలుపవలెను. కాని వర్గాధ్యక్షుఁడనుమతించినచో నాత్యయికములగు విషయములను ఆహ్వానమునందు దెలుపకపోయినను సమావేశమునందు జర్చించి తీర్మానింపవచ్చును.

71. సాధ్యమగుచో వర్గముల సాధారణ సమావేశము లీ నిబంధనలందు విధించిన కాలములందు దప్పక జరుగుచుండవలెను. వర్గాధ్యక్షుఁడనుమతించినచో గాలమును మార్చవచ్చును; లేక, ఏదేని సాధారణసమావేశమునకు నిర్ధార్య విషయములు లేనిచో సమావేశమును మానవచ్చును.

72. ఆత్యయిక విషయనిర్ణయమునకై యవసర సమావేశములు పూర్వోక్త 67, 68, 69, 70 నిబంధనలందలి నియమములకు లోబడి యెన్నడయిన జరుగవచ్చును.

73. వర్గముయొక్క ప్రతి సమావేశమునకును ప్రతి తీర్మానమునకును నియత కనిష్ఠ సంఖ్యసభ్యు లుండితీరవలెను. అట్లులేని తీర్మానములు క్రమహీనములును అనాచరణీయములునై యుండును.

74. ఏ వర్గమునకునైన తత్కాలమందు నియమితమైయుండు సభ్యస్థానము లందెవ్వియేని ఖాళీగనున్నమాత్రమున వర్గచర్య లక్రమములు కానేరవు. నియత కనిష్ఠ సంఖ్య సభ్యులుండిన చాలును.

75. (అ) (i) సాధారణసమావేశములు, (ii) అవసరసమావేశములు, (iii) అసాధారణ సమావేశములు, అని వర్గసమావేశములు మూడువిధములుగ నుండును. ఈ నిబంధనలందు విధింపబడిన నిర్ణీత సమావేశములు సాధారణ సమావేశములు. ఆత్యయిక విషయ నిర్ధారణమునకై వర్గాధ్యక్షునియొక్క లేక పీఠాధిపతియొక్క యాజ్ఞప్రకారము జరుగునవి యవసరసమావేశములు. వర్గసభ్యులు కోరిన ప్రత్యేక సమావేశములసాధారణ సమావేశములు.

(ఆ) (i) సాధారణ సమావేశములందలి నిర్ధార్య విషయములను వర్గాధ్యక్షుఁడే నిర్ణయింపవలెను. వర్గసభ్యు లెవరయిన విషయము లధ్యక్షునికి సూచింపవచ్చును. యుక్తములుగ తోచినచో నధ్యక్షుఁ డంగీకరించి సమావేశముయొక్క నిర్ధార్య విషయములలో జేర్చవచ్చును. (ii) అవసర సమావేశములందలి నిర్ధార్య విషయములను వర్గా

ధ్యక్షుడు లేక పీఠాధిపతి మాత్రమే నిర్ణయింపవలెను. (iii) అసాధారణ సమావేశము లందలి నిర్ధార్య విషయములను ఆ సమావేశమును గోరు వర్గసభ్యులే నిర్ణయింపవలెను.

76. స్వాభిప్రాయము నొసంగు నర్హతకల ప్రతివర్గసభ్యుడు తీర్మాన సమయమున దనయభిప్రాయము నొసంగవచ్చును. అట్టి యభిప్రాయమునకు 'వృత్తి' లేక 'వరణము' (Vote) అని యీ నిబంధనలలో సంకేతనామము. సమావేశమందలి సభ్యులు భిన్నాభిప్రాయులగుచో నధికతరవరణముల ప్రకారము విషయము పరిష్కృతమై నడ్లించవలెను. ఇతరసభ్యులకంటె సమావేశమందలి యగ్రాసనాధిపతికి తన కిష్టమగుచో నధికముగ మరియొకవరణము(దీనికి విశిష్టవరణమని పేరు)నిచ్చు నధికారముండును. అట్టి వరణమును గూడ చేర్చి లెక్కింపగ భిన్నాభిప్రాయముల సంఖ్యలు సమమగునేని, సమావేశమందలి యగ్రాసనాధిపతి ప్రధానమంత్రిగాని పీఠాధిపతిగాని యగుచో నధికముగ మరియొక రెండవ వరణము (దీనికి బరిష్కారవరణమని పేరు) నిచ్చి విషయమును బరిష్కరించు నధికారముండును.

77. (అ) గురుమండలి శాసనముల ప్రకారము లిఖితతీర్మానార్హమగునట్టి, లేక యిందులకై వర్గాధ్యక్షుని సూచనపై పీఠాధిపతి యనుమతించినట్టి, లేక పీఠాధిపతి స్వయముగ వాజ్ఞాపించినట్టి, యే విషయమును గురించియైన తీర్మానము సంపూర్ణముగ లిఖించి, వర్గాధ్యక్షునియొక్కయు ప్రధానమంత్రియొక్కయు సంతకములు గల లేఖతో తత్కాలవర్గసభ్యులందరికిని బంపి, వారిలో నర్ధాధికసంఖ్యవారి యనుకూలాభిప్రాయమును బడయుట మూలమున, గురుమండలి కాని పాలకసమితి కాని సభ్యుల సమావేశము లేకయే తీర్మానము చేయవచ్చును. ఇట్టి తీర్మానమున కీ నిబంధనలలో "లిఖిత తీర్మానము" అని పేరు.

(ఆ) పీఠాధిపతి తన యనుజ్ఞనొసంగు సందర్భమున విషయముస్వల్పము, అక్లిష్టము, నిర్వివాదము, ఆత్యయికము, లాంఛనమాత్రము అను సంగతికాని, వ్యయప్రయాసలకులోనై సభ్యులు స్వయముగ సమావేశమునకు రావలసినంత యవసరము లేదను సంగతికాని యాలోచింపదగును.

78. వర్గ సమావేశములందలి కార్యక్రమములును వర్గములచే జేయబడిన సకల తీర్మానములును పీఠపత్రిక యున్నచో దానియందు బ్రకటింపబడవలెను.

79. ఏదైన విషయమునుగురించి యే వర్గముచేనైన సక్రమముగ నొకానొక తీర్మానము చేయబడెనేని, అట్లు చేయబడినప్పటినుండి పండ్రెండుమాసములు పూర్తి యగులోపల తిరిగి యావిషయ మా వర్గమందు చర్చించుటగాని వ్యతిరేకముగ తీర్మానించుటగాని కూడదు. ఈ విధి 97 (2) (ఇ) నిబంధనకు లోబడియుండును.

80. పీఠసంకల్పములకును ఈ నిబంధనలకును వ్యతిరేకములగు తీర్మానముల నే వర్గమైనను చేయగూడదు. అవి చెల్లవు. ఆచరణీయములు కారనేవు.

# X ప్రధానమంత్రి

81. (అ) గురు మండలి సభ్యత్వమునకు వలయు నర్హతల కలిగినట్టియు, లోకానుభవము కలిగి వ్యవహార దక్షుడై కార్య తత్పరుడై నట్టియు,

ఏ పూర్ణ సభ్యుడైన ప్రధాన మంత్రిత్వమున కర్హుడని సంయుక్తవర్గము, వర్గ మండలి తత్కాల సభ్యులలో సగమునకు తగ్గని వారి యేకగ్రీవాభిప్రాయముతో, తీర్మానించి పీఠాధిపతికి నివేదింపవచ్చును.

(ఆ) పీఠాధి పతికి యుక్తమని తోచినయెడల నా వ్యక్తిని బ్రధాన మంత్రిగ నియమింప వచ్చును. లేనిచో నర్హుడగు మరియొక వ్యక్తిని సూచింపుడని సంయుక్త వర్గమును పీఠాధిపతి కోరవచ్చును. కాని సంయుక్త వర్గసభ్యులలో ముప్పాతికమందికి తగ్గకుండ యేకాభిప్రాయులై తీర్మానించి నివేదించిన వ్యక్తిని పీఠాధిపతి ప్రధాన మంత్రిగ నియమింపవలెను.

(ఇ) ప్రధానమంత్రిగ నుండి దిగువ 88 (అ) నిబంధన ప్రకారముదోషారోపి తుడు కాక కాలాతివర్తన మాత్రముచే బదవినుండి తొలగుచున్న వ్యక్తిని, తనకు సమ్మతమగునెడల, సంయుక్త వర్గముతో నిమిత్తము లేకయే, పీఠాధిపతి మరల బ్రధా నమంత్రిగ నియమింపవచ్చును.

82. పై 81 నిబంధన ప్రకారము ప్రధానమంత్రిగ నియమింప బడిన వ్యక్తి అట్లు నియమింపబడిన సంవత్సరపు శేషము కాక, తర్వాత మూడు సంవత్సరములు ముగియు వరకు సాధారణముగ బదవియం దుండును.

83. క్రమమయిన పాలకసమితి కాని గురుమండలి కాని లేక పోవుటచే సంయుక్తవర్గమున కభావము కలిగినప్పుడును, సంయుక్తవర్గ సభ్యులు భిన్న భిన్నాభి ప్రాయులై సకాలములో బ్రధాన మంత్రిత్వమున కొక వ్యక్తిని పై 81 (అ) (ఆ) నిబంధనల ప్రకారము సూచింప జాలని యెడలను, సూచించిన వ్యక్తి 81 (ఆ) నిబంధనప్రకారము పీఠాధిపతిచే నిరాకరింపబడినను, 81 (ఇ) నిబంధనప్రకారము గూడ బ్రధానమంత్రి నియమింపబడనియెడలను, పీఠాధిపతియే, తనకు 81 (అ) నిబం ధనలోని యర్హత కలిగినట్లు తోచిన యే పూర్ణసభ్యుడైన తాత్కాలిక ప్రధాన మంత్రిగ నియమింపవచ్చును. ఇట్లు నియమింపబడిన పండ్రెండుమాసముల లోపల 81 నిబంధనప్రకారము సక్రమముగ వేరొక ప్రధానమంత్రి నియమింపబడనిచో నీ తాత్కాలిక ప్రధానమంత్రియే 82 నిబంధనలో నుదహరించిన సంపూర్ణకాలము పదవియందుండును.

84. ఏ వ్యక్తియు వరుసగ రెండుసారులకు మించి ప్రధానమంత్రిగ నియమింప బడరాదు.

85 ఏ యితర నిబంధనయొక్క నిర్ణయ మెట్లున్నను, క్రమప్రకారము మరియొక

3

ట

వ్యక్తి ప్రధానమంత్రిగ నియమింపబడి పదవిని స్వీకరించువరకు బూర్వవ్యక్తి పద యందుండి తీరవలెను. బాధ్యతలును నివర్తింపవు.

86. (అ) గురుమండలియొక్కయు పాలకసమితియొక్కయు నిర్ణయములకు లోబడి పీఠముయొక్క సంకల్పములు ఫలించురీతిని దాని కార్యపద్ధతిని నడిపించునట్టియు,

(ఆ) పీఠాంతర్గత సకల వర్గములయొక్క తీర్మానములను యథావిధిగ నాచరణములో బెట్టించునట్టియు,

(ఇ) పీఠముయొక్క యుక్తపరిపాలనము విషయములో పీఠాధిపతికి నుత్తరవాదిగ నుండునట్టియు, ముఖ్యపాలకుడై ప్రధానమంత్రి యుండవలెను.

87. ప్రధానమంత్రికి నీ దిగువ ప్రత్యేకాధికారములుండును. అనగ:—

(అ) ఈ నిబంధనలకును పాలక సమితియొక్క పరిశీలనము నకును లోబడి, పీఠమునకు జెందిన స్థిర చరాస్తులు, ధనము, పత్రములు, ఇతర లిఖితములు, లెక్క పుస్తకములు, ముద్ర (Seal) మున్నగు సకలమును తన స్వాధీనమం దుంచుకొని విధుల మేరకు వ్యవహరించుటయు;

(ఆ) పాలక సమితి నిర్ణయించునట్టి ఆయా కృత్యములు, వేతనములు, నియమములు మున్నగు వానితోగూడినట్టి ఆ యా యుద్యోగ స్థానములకు గాని భృత్యస్థానములకు కాని తన కర్హులుగ తోచిన వ్యక్తులను నియమించుటయు, వారిని తనవశమం దుంచుకొని యథావిధిగ బనులు చేయించుటయు; ఆయా స్థానములందున్న వ్యక్తులను, అవసరము వెంబడి తనకు యుక్తముగ తోచిన రీతిని మార్చుటయు, తొలగించుటయు, తాత్కాలికముగ నిలుపు చేయుటయు;

(ఇ) పీఠమునకు చెందిన సమస్త వ్యవహారములను, న్యాయస్థానాదులందలి చర్యలను, ఉత్తర ప్రత్యుత్తరములను, పీఠపక్షమున తన (పదవి) పేరటనే జరుపుచుండుటయు;

(ఈ) పీఠమున కితరు లీయవలసిన, లేక ఇచ్చునట్టి అన్ని బాపతుల పైకములను పీఠపక్షమున వసూలు పరచుటయు;

(ఉ) పీఠ ధన సంబంధములో బ్యాంకులు, ప్రభుత్వ కార్యస్థానములు, స్థానిక పాలన సంస్థలు, వ్యాపారవర్గములు, ఇతర వ్యక్తులు మున్నగు వానితో జరుపబడు సకల వ్యవహారములను; మరియు, ధనమును బ్యాంకులు మున్నగువానిలో వేయుట మార్చుట, తీయుట, వడ్డీని వసూలుచేయుట మొదలగు కార్యములను, పీఠ పక్షమున తన (పదవి) పేరటనే జరుపుటయు;

(ఊ) అన్ని బాపతుల బిల్లుల (Bills) ను పరిశీలించి యంగీకరించుటయు, వ్యవహార సాధారణముగ పీఠమువలన చెల్లింప దగునట్టియు, లేక పాలక సమితిచే నంగీకరింప బడినట్టియు, అన్ని మొత్తములను పీఠపక్షమున చెల్లించుటయు.

88. (అ) ప్రధాన మంత్రిగ నుండు వ్యక్తి యెన్నడయిన దన నివృత్తిపత్రము

(resignation ) ను పీఠాధిపతికి స్వయముగ నర్పించి లేక వేరువిధముగ నందజేసి, పీఠాధిపతియొక్క యనుజ్ఞ నొంది పదవినుండి విరమించుకొన వచ్చును.

(ఆ) ప్రధాన మంత్రిగ నుండు వ్యక్తి, పీఠ వ్యవహార సంబంధములలో దురుద్దేశముతో పీఠమునకు నష్టకరము లేక హానికరమగు విధమున

(i) దుష్పరిపాలనము (Mismanagement) గాని, (ii) మోసము (Fraud) గాని, పీఠద్రవ్య విషయములో, (iii) దుర్వినియోగము (Misappropriation) గాని, (iv) తాను అక్రమలబ్ధి నొందుట గాని,

పీఠమునెడ జరిగించినట్లు గురుమండలి దోషారోపణచేసి తీర్మానించెనేని, పీఠాధిపతి యట్టి వ్యక్తిని ప్రధానమంత్రిత్వమునుండి తొలగింపవచ్చును. అట్టి తీర్మానమును గురుమండలి సభ్యులలో ముప్పాతిక మందికి తగ్గకుండ యేకగ్రీవముగ జేసిరేని, పీఠాధిపతి తప్పక తొలగింపవలెను.

(ఇ) ఇతర నిర్దిష్ట కారణముల చేత నట్టి వ్యక్తి ప్రధానమంత్రిత్వమున కనర్హుడని గురుమండలి యేకగ్రీవముగ తీర్మానించినను, గురుమండలి సభ్యులలో ముప్పాతిక మంది యేకగ్రీవముగ తీర్మానింప దానిని పీఠాధిపతి యంగీకరించినను, అది మొదలుకొని యా వ్యక్తియొక్క ప్రధానమంత్రిత్వము నివర్తించును.

89. గురుమండలి కాని పాలకసమితి కాని తనకట్టి యధికార మిచ్చిన యెడల నా వర్గముచే నిర్ణయింపబడిన ప్రకారము, ప్రధానమంత్రి ఆయా వర్గములకు గాని అధికారిక వ్యక్తులకుగాని యితరులకుగాని ఆయా పరిమిత కాలములకు తన యొక్క ఆయా యధికారముల నొసంగ (Delegate చేయ) వచ్చును. ఈ నిబంధన 29 నిబంధనను బాధింపదు.

90. (అ) మరణాది కారణముల చేతగాని ఇతరహేతువులచేతగాని ప్రధాన మంత్రి కాకస్మికాభావము కలుగునెడల, గురుమండల్యాధ్యక్షుడున్న యెడల ఆయనయు, లేనిచో పీఠాధిపతిచే నియమితుడగు నొకానొక పాలకసమితి సభ్యుడును, లేక పీఠాధిపతి యనుజ్ఞ నొంది సహాయమంత్రియును, సక్రమముగ మరియొక ప్రధానమంత్రి యేర్పడి పదవిని స్వీకరించువరకు లేక పీఠాధిపతి నిర్ణయించు తక్కువకాలము వరకు ప్రధానమంత్రియొక్క కృత్యములను నెరవేర్చుచుండవలెను.

(ఆ) ప్రధానమంత్రి యేకారణముచేత నైన కొలది కాలము వరకు ప్రధాన మంత్రియొక్క కృత్యములనుండి విరమించుకొనదలచి సెలవుగోరునెడల, పీఠాధిపతి సెల వొసంగవచ్చును. ప్రధానమంత్రి లేనికాలములో కృత్య నిర్వహణమునకై పై 90 (అ) ఉపనిబంధనలో వలెనే యేర్పాటు చేయవచ్చును.

## XI పీఠాధిపతి

91. సనాతనధర్మరతియు శమదమాద్యుత్తమ గుణసమృద్ధియు జ్ఞాన వైరాగ్య భక్తి దార్ఢ్యంబును గలిగి, మంత్రతపో యోగాద్యనుష్ఠానముచే సిద్ధుడై మహిమాన్వితుడై సర్వదత్తుడగు శివయోగి శ్రీ శైవ మహాపీఠము నధిష్ఠింప నర్హుడై యుండును.

## XVI పీఠధనము, లెక్కలు, పుస్తకములు మున్నగునవి.

105. (అ) పీఠమున కితరులచే వ్రాసియివ్వబడు పత్రము ( Deeds and Instruments ) లన్నియు పీఠము పేరనే వ్రాయబడవలెను.

(ఆ) పీఠముచే నితరులకు వ్రాయించి యివ్వబడు పత్రములపై పీఠపక్షమున పీఠాధిపతియు ప్రధానమంత్రియు సంతకములు చేయవలెను.

(ఇ) గురుమండలియనుజ్ఞ లేనిదే పీఠము యొక్క స్థిరచరాస్తుల నెవ్విధముగను దానాదమనవినిమయవిక్రియాది రూపమగు నన్యాక్రాంతము చేయరాదు.

(ఈ) సంయుక్తవర్గ మనుమతించిన వార్షికవ్యయమునకు మించి యేసంవత్సరమునందును పీఠధనమును వెచ్చింపరాదు. కాని, పాలకసమితికి యుక్తముగ దోచినచో, సంవత్సరము మొత్తముమీద వెచ్చింపదగు మొత్తమునకు మించకుండ, ఆయా విషయములకు వెచ్చింపదగు మొత్తములందు మార్పుచేసి, యొక విషయమున కుద్దేశింపబడిన మొత్తములో నంతయు గాని, కొంతగాని మరియొక విషయమునకై వెచ్చింపవచ్చును.

(ఉ) పీఠమునకు చెందిన సకల చర స్థిర రూప ధన ద్రవ్య సత్వములను గూర్చినట్టియు, ఆర్థికాది వ్యవహారములను గూర్చినట్టియు, పీఠాంతర్గతవర్గముల సమావేశములను చర్యలను గూర్చినట్టియు, పీఠసంకల్పములకును గార్యవిధానమునకును జెందినట్టియు, ఇంకను పాలకసమితికి యుక్తమని తోచిన యితర విషయములకు సంబంధించినట్టియు, పూర్తి వివరములు తెలియునట్లు లెక్కలను, పుస్తకములను పాలకసమితి వ్రాయించియుంచవలెను. వ్రాయవలసిన నమూనాలను వివరములను పాలకసమితి నిర్ణయించవలెను.

(ఊ) లెక్కలన్నియు గురుమండలి నిర్ణయించు ప్రకారము, గురుమండలిచే నియమింపబడు పరీక్షకుని (Auditor) వలన ప్రతి సంవత్సరము పాలకసమితి పరిశీలింపజేసి, పరీక్షకుని నివేదికను వార్షికసమావేశమునందు గురుమండలికి నర్పింపవలెను.

(ఋ) గురుమండలియొక్క ప్రతి వార్షికసమావేశమునందును ఆ సంవత్సరములో జరిగిన కార్యక్రమముల గురించియు, అభివృద్ధిని గురించియు నొక నివేదికను పాలకసమితి గురుమండలికి నర్పింపవలెను. ఆ సంవత్సరపు ఆదాయవ్యయములను వివరించుచు నిలువధనమును దెలుపునట్టియు, రాగల సంవత్సరపు ఆదాయమును వ్యయమును సాధ్యమగు వరకు మదింపువేసి పాలకసమితి యభిప్రాయము ప్రకారము రాగల సంవత్సరమునందు వెచ్చింపదగు మొత్తము నుదాహరించుచు దాని వివరముల దెలుపునట్టియు, రెండు పట్టికలను పాలకసమితి పైనివేదికకు జతపరచవలెను.

(ౠ) గురుమండలియొక్క వార్షిక సమావేశ సందర్భములో, సంయుక్తవర్గసమావేశము జరిగి, పై (ఋ)ఉపనిబంధనలో నుదాహరింపబడిన పాలకసమితి నివేదికయు పట్టికలును విమర్శింపబడి, రాగల సంవత్సరమున కనుమతింప నగు నాదాయ

వ్యయములు సంయుక్తవర్గముచేత నిర్ధారణ చేయబడవలెను. ఏకారణముచే నయినను, వైశాఖాంతములోపుగ సంయుక్తవర్గ మట్లు నిర్ధారణ చేయనియెడల, పీఠాధిపతియే విమర్శించి నిర్ధారణ చేయుటకు సంపూర్ణాధికారము కలిగియుండును,

(ఋ) గురుమండలివ్యక్తులే సంయుక్తవర్గమున కధ్యక్షుడు. సమావేశము లన్నిటియందును 50 నిబంధనలో విధింపబడిన వ్యక్తియే యధ్యక్షత వహింపవలెను. గురుమండలికిని పాలకసమితికిని వేరువేరుగ నియతకనిష్ఠ సంఖ్య సభ్యులు తత్కాల మందున్నచో, సంయుక్తవర్గసమావేశమునకు కనిష్ఠసంఖ్యయగును. 67 నుండి 80 వరకు గల నిబంధనలు సంయుక్తవర్గమునకును వర్తించును.

(ౠ) అన్ని వర్గముల యొక్కయు, చైత్రమాసములో విధింపబడిన సాధారణ సమావేశములు, గతవత్సరముయొక్క వార్షిక సామావేశములుగ నెన్నవలెను.

## XVII పీఠోత్థాపనము (Dissolution of Peetham)

106. 1860 సంవత్సరపు 21 వ చట్టము ననుసరించియు, ఈ నిబంధనల ననుసరించియు, "శ్రీ శైవమహాపీఠము" అను నీ సంస్థయొక్క నామమందు గాని, సంకల్పములందు గాని, కార్యవిధానములందు గాని, ఈ నిబంధనలందు గాని మార్పులు గలుగుట మాత్రమే గాక పీఠమే యెత్తివేయబడి సంస్థకు నభావము కలుగునెడల, పీఠముయొక్క స్థిరచరరూప ధన ద్రవ్య సత్త్వములన్నియు,

(అ) ఈ శ్రీశైవమహాపీఠము యొక్క సంకల్పములనే దానియొక్క సంకల్పములుగ గలిగి, శైవమతము యొక్కయు శైవసంఘముయొక్కయు నభివృద్ధికొరకేర్పడిన మరియొక రిజిస్టర్డు (Registered) సంఘము (Society)నకును; లేక (2) ట్రస్టు (Trust) నకును; లేక (3) ఇతర రూపముకల సంస్థకును; అట్టి సంఘము కాని ట్రస్టు కాని యితర సంస్థ కాని లేని యెడల,

(ఆ) సనాతనధర్మపురస్సరముగ నిగమాగమాద్యార్ష విద్యా సంప్రదాయముల రక్షణ వ్యాపనముల కొరకేర్పడిన మరియొక రిజిస్టర్డుసంస్థ (Registered institution) కును, చెందజేయ బడవలెను. కాని పీఠసభ్యులు వాటిని స్వార్థమునకు వినియోగించుకొనుట కాని, తమలో పంచుకొనుట కాని కూడదు.

## XVIII నిబంధనల సవరణ

## Amendment of these Regulations

107. (అ) పీఠముయొక్క నామమందును, సంకల్పము లందును, పై 5,6,14, 15 నుండి 18 వరకు, 27, 36, 42 నుండి 47 వరకు, 50 నుండి 53 వరకు, 81 నుండి 88 వరకు, 91 నుండి 100 వరకు, 101, 104, 106 నిబంధనలందును, ఈ నిబంధన యందును, 108 నిబంధనయందును గాక, తక్కిన యీ నిబంధనలందు మార్పులేవైన వలయు నెడల, వానిని యీ దిగువ ప్రకారము మాత్రమే చేయనగును. వేరు విధముగ నెంతమాత్రము చేయగూడదు.

(ఆ) అవసరమయిన మార్పులను ముందుగ పాలకసమితి యాలోచించి, స్వాభిప్రాయముతో సహా పీఠాధిపతికి నివేదింపవలెను. పీఠాధిపతి యనుమతించిన సవరణలను పీఠాధిపతి యాజ్ఞ ప్రకారము ప్రధానమంత్రి గురుమండలి సమావేశమునందు ఉపపాదింపవలెను. గురుమండలి వానిని చర్చించి, మార్పులేవైన యుక్తమని తోచినచో వానిని గూడ బొందుపరచి, గురుమండలి యొక్క తత్కాల సభ్యులలో ముప్పాతికకుతక్కువలేని సభ్యులామోదించిన ప్రకారము గురుమండలి తీర్మానించి యాతీర్మానమును తిరిగి పీఠాధిపతికి నివేదింపవలెను. ఆతీర్మానమునకు పీఠాధిపతి సమ్మతించినచో నాప్రకారము యీ నిబంధనలను మార్పుచేయవలెను.

(ఇ) పీఠాధిపతికి యుక్తమని తోచినయెడల, పాలకసమితియొక్క సంబంధము లేకయే, పీఠాధిపతి తన కవసరమని తోచిన కొన్ని సవరణలను చేర్కొని, వానిని గురుమండలియం దుపపాదింపుమని ప్రధానమంత్రి నాజ్ఞాపింపవచ్చును. అట్టి సవరణలను ప్రధానమంత్రి గురుమండలి సమావేశమునం దుపపాదింపవలెను. తర్వాత చర్చ యంతయు పై యుపనిబంధన ప్రకారమే జరుగవలెను.

(ఈ) నిబంధనల సవరణ విషయములో లిఖిత తీర్మానము చాలదు. గురుమండలి సమావేశము జరిగి తీరవలెను.

(ఉ) (1) సవరణ చేయు విషయములో, పీఠముయొక్క నామమును, పై 5,6, 14,15 నుండి 18 వరకు, 27,36, 42 నుండి 47 వరకు, 50 నుండి 53 వరకు, 81 నుండి 88 వరకు, 91 నుండి 100 వరకు, 101,104, 106 నిబంధనలను, యీ 107 నిబంధనను, దిగువ 108 నిబంధనను పీఠసంకల్పములతో దుల్యములుగ నెంచి, వానియందుగాని సంకల్పములందుగాని యేవైన సవరణ లవసరమగు నెడ, వానిని సవరించు నిమిత్తము, 1860 సంవత్సరపు 21 వ చట్టముయొక్క 12 వ సెక్షనులో సంఘ సంకల్పముల సవరణ విషయమున విధింపబడిన విధానమును దప్పక యనుసరింప వలెను.

(2) పై యుపనిబంధనలో చేర్కొనిన చట్టముయొక్క ఆ సెక్షను ప్రకారము పాలకసమితిచే నుపపాదింపబడు సవరణలుగాని ఆ సెక్షనులో చేర్కొన బడిన యితరోపపాదనలు కాని, ముందుగ గురుమండలిచే ముప్పాతికకు తగ్గని సంఖ్య సభ్యుల యభిప్రాయానుసారము తీర్మానింపబడి పీఠాధిపతిచే ననుమతింపబడి యుండవలెను. అట్లు కాని యేమార్పులనైన నుపపాదించుటకు పాలకసమితి కెట్టి యధికారమును లేదు.

(3) మున్నూటికి తగ్గకుండ స్వాభిప్రాయము నొసంగు నర్హత కల పూర్ణ సభ్యులు పీఠమునకు తత్కాలమున నుండిననే కాని, పై (ఉ) (1) ఉపనిబంధనలో చేర్కొనబడిన సవరణలు జరుగరాదు.

## XIX తాత్కాలిక పరివర్తన విధి.

## Special Provision - Transitory and Transitional

108. (అ) (1) "శ్రీ శైవమహాసభ"యను సంస్థయొక్క నామమందును, రూపమందును, నిర్మాణమందును మార్పు కలిగి యున్నతాశయ ప్రేరితమగు కార్యదీక్షతో నియమావళి సంస్కరింపబడి, యీ నూతన నిబంధనలతో సంస్థ రిజిస్టరు అగుటచే సంస్థయొక్క చరిత్రమం దొక నూతన కల్ప మారంభమగు చున్నది. పూర్వవిధానము మారి యీ నిబంధనలచే నుపక్రమింపబడు నూతనవిధానము ఆచరణములోనికి వచ్చు సంధిఘట్టములో నీ తాత్కాలిక నిబంధన యాచరణములో నుండి దీని ప్రకారము పరివర్తనము జరుగవలెను. పూర్వరూపమగు "శ్రీ శైవమహాసభ"కు చెందియుండిన యావద్విశిష్ట హక్కులు, బాధ్యతలు, ఆస్తులు మున్నగునవి దాని రూపాంతరమగు "శ్రీ శైవమహాపఠము"నకే కలిగి యుండును,

(2) పీఠముయొక్క రిజిస్టర్డు మెమోరాండములో చేరి సంతకములు చేసియుండని పూర్వసభ్యు లందరు మరల నీ నిబంధనల ప్రకారము పీఠమునందు సభ్యులుగ చేరవలెను.

(3) పీఠము రిజిస్టరు అయినతోడనే పాలకసమితి సభ్యులు స్వస్వమండలస్థ శైవులలో బహుజనాభిప్రాయమును వీలువెంబడి గ్రహించి, అధ్యక్షుడు నిర్ణయించు కాలపరిమితి లోపుగ తమలో నధికతరసంఖ్య వారి యభిప్రాయానుసారముగ శ్రీ శైవమహాపీఠముయొక్క ప్రథమ పీఠాధిపతిని యెన్నుకొనవలెను. కారణాంతరములచే నా సమయమునకు స్వయముగ రాజాలని పాలకసమితి సభ్యులు పీఠాధిపతి యెన్నిక విషయములో తమ తమ వరణముల (Votes) ను లిఖితరూపముగ నెన్నికదినమునకు పూర్వము జేరునట్లుగ ప్రధానమంత్రికి బంపవచ్చును. అట్టి లిఖితవరణములను గూడ స్వయముగ వచ్చియుండు పాలకసమితి సభ్యుల వరణములతో చేర్చి లెక్కించి యధికతరవరణానుసారముగ నెన్నిక యొక్క పర్యవసానమును నిర్ణయింపవలెను. సమావేశమున కవసరమగు కనిష్ఠసంఖ్యను లెక్కించుటలో లిఖితవరణముల బంపిన వారిని గూడ చేర్చి లెక్కింపవలెను.

(4) ఇట్లు ప్రథమపీఠాధిపతి యెన్నుకొనబడిన క్షణమునుండి అంతవరకు గల పాలకసమితి నివృత్తమై అందలి వ్యక్తులందరు తమ తమ పదవులనుండి తొలగెదరు.

(5) అంతట పీఠాధిపతి యీ నిబంధనలలో నిర్ణీతమైన ఆయా మండలములకు నధ్యక్షులను చేర్కొని నియమింపవలెను. ఈ సమయమున మండల సభ్యులచేత నెట్టి యెన్నికలు జరుగగూడదు.

(6) అంతట పీఠాధిపతి ప్రధాన మంత్రిని చేర్కొని నియమింపవలెను.

(7) ఇవ్విధముగ రిజిస్టరు పీఠముయొక్క నూతన ప్రథమపాలకసమితి నిర్మితము కావలెను.

(8) అంతట పీఠాధిపతి తన కర్తవ్యముగ తోచిన వారిని గురుమండలి సభ్యత్వమునకు చేర్చుకొనవలెను. ఇట్లు చేర్చుకొనబడిన వారు గురుమండలికి ప్రథమ సభ్యులుగ నుందురు. సాధ్యమగునెడల పదునొకండుగురిని పూర్తిచేసి సమగ్రమగు గురుమండలిని నిర్మింపవలెను.

(9) అంతట పీఠాధిపతి సాధ్యమగుచో నయిదుగురికి తగ్గకుండ పండితసభా సభ్యులను చేర్చుకొని, పండితసభాధ్యక్షుని గూడ చేర్చుకొని నియమింపవలెను.

(10) అంతటినుండి 3 వ నిబంధన ప్రకారము ఈ నూతన నిబంధనావళి యంతయు నాచరణములోనికి వచ్చును.

(అ) ఎన్నడైనను పీఠాధిపతిగాని యితరాధికారికవ్యక్తిగాని లేకపోవుట చేతను, పీఠమునకుగాని పీఠాంతర్గతమగు నేదైన వర్గమునకుగాని నియత సంఖ్య సభ్యులు లేకపోవుటచేతను, నిబంధనల ప్రకారము పీఠసభ్యులను చేర్చుటకుగాని, వర్గ సభ్యులను లేక యాధికారికవ్యక్తులను నియమించుటకుగాని యవకాశము లేక పీఠ కార్యక్రమము స్తంభించిన క్లిష్టపరిస్థితులలో నీదిగువ విశిష్టవిధు లాచరణములో నుండవలెను. అనగ,

(1) పాలకసమితి స్తంభించియుండు కాలములో, ప్రధానమంత్రియే పాలక సమితి యధికారములను కలిగియుండును.

(2) గురుమండలిసభ్యులనుగాని పాలకసమితిసభ్యులనుగాని ప్రధానమంత్రినిగాని, పీఠాధిపతి తాను స్వయముగనే చేర్చుకొని నియమించు నధికారము కలిగి యుండును.

(3) పీఠాధిపతి లేనిచో, తత్కాల పూర్ణసభ్యులలో పదిమంది కలిసి మహా పరిషత్సమావేశము నాహ్వానింప వచ్చును. సమావేశమునకు సభ్యుల కనిష్ఠ సంఖ్య యిఱువది. పూర్ణసభ్యు లందరికి, 10,11 నిబంధనలవలన యెట్టినిరోధము లేకుండ, సభ్యాధికారములన్నియు నుండును. ఈ సమావేశమునకు వచ్చిన సభ్యుల యధికతరవరణానుసారముగ పీఠాధిపతిని యెన్నుకొనవచ్చును. అట్లెన్నుకొనిన పీఠాధిపతికి, అవసరమగు నన్ని వర్గముల సభ్యులను, ప్రధానమంత్రిని, చేర్చుకొని నియమించు నధికారముండును. ఈ పీఠాధిపతి 92 నిబంధన ప్రకారము నియమింపబడినట్లుగనే సర్వవిధముల నెంచవలెను.

(ఇ) ఏదేని యాధికారిక స్థానమునకు గాని వర్గసభ్యత్వమునకుగాని నియమింపబడు వ్యక్తులకు వలయు నర్హతలను గూర్చియు, వారిని నియమించు వర్గములను వ్యక్తులను లేక విధానములను గూర్చియు,వర్గసమావేశ నియమములను గూర్చియు,పూర్వోక్త (1 మొదలుకొని 107 వరకు గల) నిబంధనలలో నున్నట్టి లేక సంస్థయొక్క రిజిస్ట్రేషనుకు పూర్వ మున్నట్టి విధులుకాని యాచారముగాని యెట్లున్నను, యీ 108

నిబంధనలోని పై (అ) (ఆ) ఉప నిబంధనల ప్రకారము చేయబడు పూర్వోక్తములగు యెన్నికలు, నియామకములు, మున్నగు చర్య లన్నియు సక్రమములుగ నెంచబడి, పీఠసంబంధములో సర్వవిధముల నాచరణీయములును, పీఠమునకు జెందినట్టియు లేక పీఠముతో వ్యవహరించు నట్టియు సకల వ్యక్తులను, అధికారులను వర్గములను సర్వథా బంధించునవియునై యుండును.

( స మా ప్త ము )



# శ్రీశైవమహాపీఠ గ్రంథాలయము

శ్రీశైవమహాపీఠము ప్రభుత్వచట్టప్రకారము రిజిష్టరు అయిన మతసంస్థ. పీఠగ్రంథాలయమునకు యుక్తమగు గ్రంథములను సమకూర్చుట ప్రథమ కర్తవ్యము. కావున, అభిమాను లెల్లరు నిగమాగమస్మృతిపురాణేతిహాసాది సంబంధములయి నట్టియు, ఇతరములయినట్టియు, తమకు తోచిన గ్రంథములను పీఠమునకు విరాళ మొసంగ ప్రార్థితులు.

దాతలయొక్కయు వారిచ్చిన గ్రంథములయొక్కయు పేర్లు ఈ పత్రికలో ప్రకటింపబడును.

బెజవాడ
15-2-41

ప్రధాన మంత్రి,
శ్రీశైవమహాపీఠము.

---

# ఉపాసన వస్తు భాండారము. బెజవాడ.

(~~వృష చైత్రమునుండి ప్రారంభింప బడును~~)

వేదోక్తకర్మానుష్ఠానమునకును, మంత్రతపోయోగాద్యనుష్ఠానములకును, ఉపయుక్తములగు దర్భాసనములు, చిత్రాసనములు, కృష్ణాజినములు, జపమాలలు, గోముఖములు, కలశములు ఉద్ధరణులు పళ్లెములు మున్నగు పూజాసామగ్రి, విభూతిపండ్లు, శివలింగములు, దీపవత్తులు, హోమద్రవ్యములు మున్నగునవి శాస్త్రీయముగ తయారు చేయించి సంగ్రహించినవి సరసమైనధరలకు మావద్ద దొరకును

21/140 రాజరాజేశ్వరమ్మ రోడ్డు
గవర్నరుపేట, బెజవాడ.

ఇ. వీరభద్రరావు,
మేనేజరు

Printed at the A. G. Press, Bezwada, and published at Bezwada by Sri K. W, Bhairavamurty, B. A., Bezwada, Editor

# శైవమత ప్రకాశిక

శ్రీ శైవమహాపీఠ పక్షమున ప్రకటింపబడు

సచిత్ర మాస పత్రిక

సంపుటము 3 ❖ విక్రమ ఫాల్గుణ, వృష చైత్ర వైశాఖములు ❖ 1941 మార్చి, ఏప్రిల్ ❖ సంచిక 2

ఇందలి విషయములు

# వ్యావహారికములు

లేఖలు:—ఈ పత్రికకుగాని, శ్రీ శైవమహాపీఠమునకుగాని వ్రాయు లేఖలను "శ్రీ శైవమహాపీఠ కార్యస్థానము గవర్నరుపేట బెజవాడ" అను చిరునామాకు వ్రాయవలెను.

వ్యాసములు:—పత్రికలో ప్రకటనకై పంపబడు వ్యాసములను, ఇతర విషయములను కాగితమునకు ఒకప్రక్కను మాత్రమే స్పష్టాక్షరములతో సంగ్రహముగవ్రాసి ప్రతినెల 15 వ తేది లోపుగ పంపవలెను. ప్రకటింపబడని వ్యాసములనుగాని, మరుగ జవాబులనుగాని బడయగోరువారు 0-1-3 స్టాంపును పంపవలెను. 10 వ తేదీలోపుగ పత్రిక చందాదారులకు రానిచో కార్యస్థానమునకు తెలుపవలెను.

శ్రీ శైవమహాపీఠ పరిపాలన ప్రణాళిక

( Rules & Regulations )

వలయువారు 0—3—0 స్టాంపులు పంపవలెను.

## ప్రకటన రేట్లు

వ్యాపారాది స్వవిషయముల నీ పత్రికయందు ప్రకటింప కోరువారు చెల్లించవలసిన రేట్లు.

| | నెలకు | సంవత్సరమునకు |
|---|---|---|
| నిండుపేజీ | రు 3-0-0 | రు 30-0-0 |
| అరపేజీ | రు 2-0-0 | రు 20-0-0 |
| పావుపేజీకాని, తక్కువ కాని | రు 1-4-0 | రు 12-0-0 |

## పత్రికచందా వివరములు

| | సంవత్సరమునకు పోస్టేజీతో |
|---|---|
| మహారాజపోషకులు | అనుగ్రహాధీనము |
| రాజపోషకులు | రు 50-0-0 |
| ప్రధానపోషకులు | రు 25-0-0 |
| పోషకులు | రు 10-0-0 |
| ఉపపోషకులు | రు 5-0-0 |
| అభిమానులు | రు 3-0-0 |
| చందాదార్లు | రు 2-0-0 |
| విడిసంచిక | రు 0-4-0 |

## సభ్యత్వము చందా

| | |
|---|---|
| పీఠ సభ్యులకు (సంవత్సరమునకు) | 1-0-0 |
| ,, ,, పత్రికచందా | 1-0-0 |

(పోస్టేజితోసహా)

షరా:—పై మొత్తములు బ్రిటీషు నాణెములలో తెలుపబడినవి. నిజాం రాష్ట్రీయులు హాలీలో 1-0-0 కి 0-3-0 చొ॥న హెచ్చుగా చెల్లించవలెను.

# శైవమత ప్రకాశిక

శ్రీ శైవమహాపీఠ పక్షమున ప్రకటింపబడు

సచిత్ర మాస పత్రిక

| సంపుటము 3 | విక్రమ ఫాల్గుణ, వృష, చైత్ర - వైశాఖములు 1941 మార్చి - ఏప్రిల్. | సంచిక 2 |
| --- | --- | --- |


## విశ్వేశ్వరా!


విశ్వనాధ సత్యనారాయణగారు


శా. శ్రీమంజూషిక భక్తరక్షణ కళా శ్రీచుంచు వానంద వ
ల్లీమంజు ప్రసవంబు చిద్గగన ప్రాలేయాంశువుఁ మోక్షల
క్ష్మీశ్రీ మాణిక్య వినూత్న మేఖల కటాక్షీభూత నీహారరుక్
శ్రీమంతంబయి పొల్చువెల్గు నొకడే సేవింతు విశ్వేశ్వరా. ౧

శా. కైలాసాచల సానువాసము వృషస్కంధాగ్రసంస్థాయి త
త్ప్రాలేయాచల కన్యకా కుచతటీ పర్యంక నిద్రాగతం
బాలోలాగ్ర జటావనీఘటిత నాకౌకస్సరిత్కంబు దే
హాలంకారిత లేలిహానము వెలుం గర్పింతు విశ్వేశ్వరా. ౨

శా. నీవిన్నాణము చిత్రమే మకుట రత్నీభూత జైవాతృకా
గ్రైవేయీకృత కాద్రవేయ గళ రుద్రాక్షీ భవత్ బాడబా
సేవా స్వీకృత భూతరాక్షస పిశాచీ ప్రేత నేత్ర ప్రభా
శ్రీవిన్యస్త కృశాను! పార్వత మృగాక్షీదార! విశ్వేశ్వరా. ౩

శా. పాటింతుఁ నిను సర్వ దైవత శిరో భాగస్థ రత్నంబుగాఁ
బాటింతుఁ సకలాఘముల్ సురధునీ పాథస్తరంగాగ్ర భా
గాట చ్ఛీతల మందమారుత తరంగాధూతముల్ గాగ నై
శాట ప్రాణ మనుష్మహాభుజగవంశస్వామి! విశ్వేశ్వరా. ౪

శా. దిగ్వ్యోమాఖిల పూర్ణ! నీ యెడల భక్తిం బొల్చి నీమూర్తి స
మ్యగ్వ్యాఖ్యానము చేసెబో! అఘము లెల్లానిల్చు నయ్యా సుధా
రుగ్వ్యాబద్ధకిరీట! దైవత జగద్ధ్రీ శ్రీప్రసూనప్రభా
స్రగ్వ్యత్యస్తుల నీ జటాలతలు తక్షాదక్ష! విశ్వేశ్వరా. ౫

# సంపాదకీయము

ప్రత్యక్ష శంకరులగు శ్రీ శంకరారాధ్యుల వారిచే శ్రీ శైవ మహా సంస్థ 34 సంవత్సరముల క్రిందట స్థాపింపబడి తదాది సర్వ మండల శైవుల సంపూర్ణాభిమాన సహాకారములతో నిఖిల శైవ ప్రపంచముయొక్క కల్యాణము నభిలషించి శక్తికొలది పలువిధము లగు కార్యక్రమముల నిర్వహించుచు, సంఘ సమిష్టి కృత ప్రబల ప్రయత్నముతో త్వరితముగ గమ్యస్థానమును బొందుకోరికచే యుత్తమమును సాంగోపాంగమును ఆదర్శప్రాయము నగు నిబంధ నావళితో "శ్రీ శైవ మహాపీఠము" అను పేరుతో సంస్థ ది 14-2-1941 వ తేదీన చట్టప్రకారము రిజిస్టరు అయిన సంగతి గత సంచికలో ప్రక టింపబడి పాఠకులకు విదితమే.

—• ప్రథమ పీఠాధిపతి యెన్నిక •—

రిజిస్టరు అయిన వెనుక పీఠ కార్యక్రమమంతయు రిజిస్టర్డు నిబంధనావళి ప్రకారమే జరుగవలసి యుండుటవలనను, అందుకు వలయు నాధికారిక వర్గముల నిర్మించుటకు బూర్వము నిబంధనల ప్రకారము ప్రథమ పీఠాధిపతిని యప్పటికిగల పాలక సమితి యెన్ను కొనవలసియుండుట వలనను, గత వరంగల్లు మహాసభనుండి యప్పటివరకు నధ్యక్షులుగానున్న బ్ర॥ లో॥ పులిపాక మహానందిశాస్త్రిగారు 108 (అ॥ (3) నిబంధన ప్రకారము ప్రథమ పీఠాధిపతి యెన్నికనిమిత్తము నియమించిన దినముగు ది 1-3-1941 తేది నాటికి సదరు నిబంధన ప్రకారము ప్రథమ పీఠాధిపతిని యెన్నుకొనవలసినదిగ ప్రధాన మంత్రిగారిచే నాయా పాలక సమితి సభ్యుల కాహ్వానము లంపబడి, తదనుసారముగ వారొసగిన వరణముల (వోటుల) ఫలితముగా తెనాలి వాస్తవ్యులగు బ్ర॥ లో॥ మహోపాధ్యాయ శివయోగి ముదిగొండ నాగ లింగశాస్త్రి అయ్యవార్లంగారే యెన్నిక దినముగు సదరు ది 1-3-41 తేది నుండి "శ్రీ శైవ మహాపీఠము"న కధిపతులయిరి. పూర్వాధ్యక్షు లగు బ్ర॥ లో॥ పులిపాక మహానందిశాస్త్రిగారుకూడ బ్ర॥ లో॥ నాగ లింగశాస్త్రిగారే పీఠాధిపతిగ నుండవలెనని యెన్నికలో తమ స్వంత

వోటును సహితము ఇచ్చియున్నారు. నిగమాగమ తంత్ర స్మృతి పురాణేతిహాసాది సర్వ ప్రమాణములం దసమాన ప్రజ్ఞా ధురీణులును, భాష్య సిద్ధాంత కర్తలును, శతాధిక మత విషయి కోద్గ్రంథ రచయితలును, స్వకీయ షష్టిపూర్త్యుత్సవ మహోత్సవ సమయమున నితః పూర్వము శ్రీశైవ మహాసభచే సుపూజితులును, ఉద్భటారాధ్య మహా పవిత్ర వంశ దుగ్ధాంబుధి పూర్ణశశియు, మహనీయమూర్తియు లోకైక వంద్యులునగు శ్రీ నాగలింగశాస్త్రిగారు ప్రథమ పీఠాధిపతి యగుట శ్రీ శైవ మహాపీఠమున కెంతయు శోభావహము. సర్వ శైవ మునకు నత్యంత శుభావహ మనుటకును, అభ్యుదయ పరంపరా జనక మనుటకు నెట్టి సందియమును లేదు. ఈ యెన్నిక విషయములో పాలక సమితి సభ్యులను మిక్కిలి యభినందించు చున్నాము.

—♦ పీఠాంతర్గత వర్గముల నిర్మాణము ♦—

బ్ర॥ లో॥ నాగలింగశాస్త్రిగారికి పై యెన్నిక విషయము దెలుపబడిన పిమ్మట ది 18-3-41 తేదీన వారు పీఠాధిపత్యము నంగీకరించి పీఠము నధిష్ఠించిరి. వారి స్వకీయ తపోబలముచేతను, గణరూపమగు నిఖిల శైవ ప్రపంచముయొక్క యాశీస్సు చేతను, పరశివ తేజము శ్రీవారియందు బూర్ణముగ నావిర్భవించి నిరంతరాయముగను దిగ్విజయముగను జగత్కల్యాణ కరముగను శ్రీ పీఠముయొక్క భవిష్య త్కార్య పరంపర కొనసాగునుగాక.

పీఠము నధిష్ఠించిన వెనుక పీఠాధిపతిచేత 108 నిబంధన ప్రకారము పీఠాంతర్గతవర్గములగు గురుమండలియొక్కయు పాలక సమితియొక్కయు, పండిత సభయొక్కయు సభ్యులు పేర్కొని నియమింప బడిరి. వర్గములయొక్కయు నియమింపబడిన సభ్యులయొక్కయు వివరము ఈ సంచికయందు ప్రకటింపబడినవి.

ప్రథమ పీఠాధిపతి యెన్నుకొనబడిన క్షణమునుండి 108 (4) నిబంధన ప్రకారము, అంతవరకుగల పాలకసమితి నివృత్తమై అందలి వ్యక్తులందరును తమతమ పదవులనుండి తొలగిరి.

వర్గనిర్మాణము జరిగినది మొదలుకొని 108 (10) నిబంధనప్రకాము రిజిష్టర్డు నిబంధనావళి యంతయు నాచరణములోనికి వచ్చినది.

—♦ వార్షిక వర్ధంతి ♦—

శ్రీ శైవమహాపీఠముయొక్క 24వ వర్ధంతి (మహాసభ) గుంటూరు పురమున జూన్ నెలలో జరుగుటకు ప్రయత్నములు కావింపబడినవి.

ఉద్దిష్ట కార్యక్రమ మిందు ముద్రింపబడినది. ఉపన్యాసములందుగాని, గాన, హరికథాది కాలక్షేపములందుగాని, పరీక్షలందుగాని పాల్గొన దలచినవారు ది 20-5-41 తేదీ లోపుగ పీఠకార్యస్థానమునకు దెలిపినచో వీలువెంబడి కార్యక్రమమునందు సకాలములో చేర్చి ప్రకటించుటకు వీలగును.

—♦ పీఠ నిబంధనలు ♦—

పీఠ నిబంధనలను శైవులెల్లరు సావధానముగ బఠించి తమకుగల సంశయములనుగాని, తమ కవసరముగ దోచు సవరణలనుగాని ది 16-5-1941 తేది లోపుగ పీఠ కార్యస్థానమునకు వ్రాసినచో, రాగల వర్ధంతి మహాసభ సమావేశములో లోపుగ వాటి నన్నిటిని క్రోడీకరించి, విషయానుక్రమముగ నమర్చి, సక్రమముగ పాలకసమితియెదుట బెట్టుటకు వీలగును. కాబట్టి దయయుంచి యట్లు బంప బ్రార్థితులు.

—♦ పీఠ దక్షిణలు, పత్రిక చందాలు ♦—

నిఖిల శైవులును పీఠమందు సభ్యులుగజేరి కార్యక్రమ మందు పాల్గొనుట యత్యావసరము. వారు చెల్లించవలసిన పై బాపతు మొత్తములు (దక్షిణ రు1-0-0 పత్రికచందా రు 1-0-0 మొత్తము రు 2-0-0) వర్ధంతిదినము లోపుగ దప్పక చెల్లింపవలెను. అట్లు చెల్లింపనియెడల కార్యక్రమములందు బాల్గొనుటకు వీలుండదు కావున ముందుగనే చెల్లించుట యుక్తము.

—♦ ఆదాయ వ్యయ పట్టిక ♦—

శైవమత ప్రకాశిక 1 సంపుటము 2 సంచికలో 30-6-38 తేది వరకు వివరములు ప్రకటింపబడినవి. అది మొదలుకొని ది 1-9-40 వరకు అనగా గత వరంగల్లు సభవరకు నయిన యాదాయవ్యయముల వివరము లీ సంచికలో బ్రకటించియున్నాము.

శ్రీ శివాభ్యాన్నమః

మేల్కొనండి! జాగ్రత! మోసపోకండి!

# నియంతల దుష్ప్రచారం

# ప్రజాస్వామ్య పతనం

**శైవ మహాజనులారా!**

ఇప్పటికి షుమారు 24 సం॥ ల నుండి, శైవమహాసభ పేరుతో మహాసభ జరుగుతూ వచ్చినది. దీని ముఖ్యఉద్దేశ్యం, శైవమతోత్కర్ష, శైవమతప్రచారం, శివభక్తి అయివున్నది. ఇట్టిసభకు చందానిర్బంధము లేకుండా 18 సం॥ వచ్చిన ప్రతి సభ్యుడు, ప్రతినిధిగాఉండి, ఎన్నికఅధికారము కల్గియుండెను. అంతటి విశాలవంతమైన ఉద్దేశ్యములతో విరాజిల్లుచుండెడు మహాసభను, దాని ఉద్దేశ్యములను తొలగించి, సంకుచితమైన కఠిన నిబంధనావళులతో కూడిన సభ్యతా ప్రపంచమునకు పనికిరాని శైవపీఠమను పేరుతో మహాసభను రద్దు చేసి, శైవుల ఆమోదమును పొందకయే ముగ్గురు పండితమ్మన్యులు కలసి పీఠమును ఏర్పాటుచేసిరి. అంతటితో తృప్తిపడక సివిల్, క్రిమినల్ అధికారములతో సర్వముక్తార్ణామాతో సభ్యుల స్వేచ్ఛా, స్వాతంత్ర్యములను హరింపజేసెడి పద్ధతులలో రిజిష్ట్రేషన్ కూడా చేయించిరి. భక్తే ప్రధానముగా నిడుకొని బోయ కన్నప్ప అంతటివాడు శివుని సాన్నిధ్యము చేరగల్గినాడే, అతనికి సహాయము చేసింది ఈ పీఠాలు కాదన్న సంగతి మరువకండి.

అసలు ఈపీఠఉద్దేశ్యము వేరు. లోగడ శైవమహా సభకు సంబంధించిన మూలధనం నిల్వయున్న రు 1600/- లు పీఠాధిపతులు స్వత్త్వము చేసుకొని, సభ్యుల యిష్టము లేకనే, వారి యిష్టానుసారము భుక్తము చేసుకొనవలయుననేదే ప్రధానముగా కనబడుచున్నది. లేకపోతే యింతటి కఠిన నిబంధనలు, చందా నిర్బంధముతో అవసరమే లేదు. యిట్టి నియమాలతో, పీఠాన్ని రిజష్ట్రేషన్ చేయించుటలోనే సంకుచిత హ్రాస్వదృష్టి ద్యోతకమవుచున్నది. భక్తి, మతప్రచారం, శివోపాసన, ధ్యేయమైతే యింతటి గూఢపురాణీతో కూడిన, రహస్య ఆలోచనలేలా? అబద్ధ ప్రచారమెందులకు? నియంతృత్వమేలా! కనుక ఈశ్వరసాన్నిధ్యం, శివభక్తి, పీఠఉద్దేశ్యమైతే, కఠిన నియమావళులతో అవసరమేమిటి? ఈపీఠలక్ష్యమేమైనా, ప్రస్తుతం యిది మతకక్షలకు, వ్యక్తిద్వేషాలకు, తావాసంగేదిగా ఏర్పడ్డది. కనుక యిట్టి క్రోధాలను పురికొల్పే రిజష్ట్రేషన్ తో కూడిన పీఠాన్ని రద్దుపరచనిదే, మతానికిగాని, సంఘానికిగాని, శాస్త్రాభివృద్ధికిగాని, అవకాశముండదు. ఈశ్వరసాక్షాత్కారము శూన్యమే. యిటువంటి ప్రమాదాన్నుండి సంఘాన్ని తప్పించాలంటే సజ్జనులైన శైవమహాజనులెల్లరు; కేవలంపట్టుదలలకు ప్రధానత్వ మివ్వకుండా, సంఘాభివృద్ధి, భక్తి ప్రధానము లక్ష్యముగా నిడుకొని, సర్వజనులకు అంగీకారమైనట్టి శైవమహాసభను సమావేశ పరచండి. దానిలోనే సభ్యులుగా చేరండి. ఈ గూఢపురాని పీఠములో సభ్యులుగా చేరకండి. మహాసభ తొందరలోనే సమావేశము కాబోతున్నది. దానికి మీరందరు చేయూత

నిచ్చి, అన్నివిధాల సహాయపడి, మన భావిభాగ్యోదయమును నిర్ణయించండి. మహాసభను జరుపవలెనని 7_5_41వ తేదీన అధ్యక్షులవారైన శ్రీ పులిపాక మహానందశాస్త్రిగారికి ఈమని గ్రామ శైవులైన మేమందరము పీఠము, పీఠనిర్ణయములపట్ల అసమ్మతిని తెలియజేస్తూ ఈదిగువ నుదహరించ బడిన చేవ్రాళ్లతో కూడిన మహజరు పంపియుంటిమి. శైవ మహాజనులైన మీఅందరికి ఈకరపత్రముద్వారా తెలియ జేయుచున్నాము. పైవిధముగా మహాజనులందరు తమ తమ అసమ్మతిని అధ్యక్షులవారికి తెలియజేయుచు, శైవమహా సభను తొందరలో సమావేశపరచుటకై సహాయ పడవలసి నదిగా కోరుచున్నాము.

ఇట్లు,

ఈమని గ్రామ శైవసభ్యులు.

1. ములుగు పండితయ్య అయ్యవారు
2. శ్రీపతి పండితారాధ్యుల మల్లిఖార్జున అయ్యవారు
3. విశ్వాత్ముల వీరశరభయ్య అయ్యవారు
4. శ్రీపతి పండితారాధ్యుల విశ్వనాథం
5. తాడికొండ పూర్ణానందం
6. ముదిగొండ వియ్యన్న
7. ములుగు మల్లిఖార్జునరావు
8. ముదిగొండ పెద మల్లయ్య అయ్యవారు
9. ఇవటూరి దుర్గామల్లిఖార్జునరావు
10. ముదిగొండ లింగమూర్తి అయ్యవారు
11. శ్రీపతి పండితారాధ్యుల మల్లిఖార్జునం అయ్యవారు

12. తాడికొండ మల్లిఖార్జునరావు
13. శ్రీ॥ పం॥ నాగలింగయ్య అయ్యవారు
14. శ్రీ॥ పం॥ రామలింగయ్య
15. ముదిగొండ భద్రయ్య
16. శ్రీపతి పండితారాధ్యుల లింగమూర్తి
17. తాడికొండ కనకలింగమూర్తి
18. ముదిగొండ విశ్వనాథం
19. ముదిగొండ మల్లిఖార్జునరావు
20. ముదిగొండ రామలింగం
21. శ్రీ॥ పం॥ శరభసాళ్వం
22. శ్రీ॥ పం॥ సుబ్రహ్మణ్యం
23. శ్రీ॥ పం॥ అగస్త్యేశ్వరలింగం
24. శ్రీ॥ పం॥ మల్లయ్య అయ్యవారు
25. శ్రీ॥ పం॥ లింగమూర్తి

కల్యాణీ ప్రెస్, తెనాలి.

# శ్రీ శైవ మహా పీఠము

## కార్యస్థానము : బెజవాడ

శ్రీ శైవమహాపీఠ ప్రధానమంత్రివర్యులకు :

ఆర్యా,

స్థానము..............................................

తేది ..................................................

శ్రీ పీఠమునందు నేను సభ్యునిగ నుండదలచితిని.

శ్రీపీఠనిబంధన లన్నిటికి బద్ధుడనై యుండెదను.

శ్రీ పీఠపత్రికాళిక ముద్రిత ప్రతి ఒకటి నాకుముట్టినది.

.......... సంవత్సర శ్రీపీఠదక్షిణ ఒకరూపాయి చెల్లించితిని.

నన్ను పూర్ణ/అర్ధ సభ్యునిగ జేర్చుకొనగోరుచున్నాను.

చిత్తగించవలెను.

సంతకము ..............................................

పేరు..............................................

తండ్రి పేరు..............................................

వృత్తి..............................................

కులము.............................. వయస్సు..............................

గ్రామము.............................. పోస్టు..............................

తాలూకా.............................. జిల్లా..............................

అభ్యర్థియొక్క అర్హత
విషయములో మండల
లాధ్యక్షుని యొక్క
లేక ప్రధాన మంత్రి
యొక్క అభిప్రా

# ఆదాయవ్యయ పట్టిక

30—6—38 నుంచి 1—5—39 కొత్తపల్లిలో జరిగిన 22 వ వైశ్య మహాసభ వరకు.

**జమ**

| | |
|---|---|
| సభ్యత్వ పోషక చందాలు వగైరా | 181- 2-0 |
| కట్నములు | 0- 4-0 |
| భాష్య చందాలు | 20- 0-0 |
| భాష్య చందాల తాలూకు శ్రీ శివలెంక లింగయ్యగారి వద్దనుంచి వచ్చిన రొఖ్ఖం | 25-10-9 |
| భాష్య చందా తాలూకు శ్రీ శివలెంక లింగయ్యగారి వద్ద వున్న నిల్వ | 82- 4-9 |
| లోగడ సభ తాలూకు నిల్వ | 1454-14-6 |
| | 1764- 4-0 |

**ఖర్చు**

| | |
|---|---|
| కీ॥ శే॥ కాశీనాధుని నాగేశ్వరరావు గారి భార్య గారును, అల్లుడు శ్రీ శివలెంక శంభుప్రసాద్ గార్లవద్ద వున్న నిల్వ | 1453- 4-9 |
| డాక్టరు శివలెంక మల్లిఖార్జునరావు గారివద్ద నిల్వ వున్నది | 1- 9-9 |
| ట్రావెలింగు ఖర్చులు | 5-13-0 |
| పోస్టేజీఖర్చులు | 36-11-6 |
| యితరములు | 1- 8-0 |
| పత్రికకు | 192-15-0 |
| కాగితములు పుస్తకములు | 0- 2-0 |
| 30-6-38 వరకు ప్రకటన చేయబడిన ఆదాయ వ్యయపట్టికలో జమలో అధికముగా వ్యయింపబడిన బాపతు శ్రీ శివలెంక లింగయ్యగారి వద్ద నిల్వవున్న సైకములో తీసుకున్న బాపతు. | 37- 5-9 |
| బ్యా॥ లో శివలెంక లింగయ్యగారి వద్ద వున్న నిల్వ | 34-14-3 |
| వెరశి | 1764- 4-0 |

4—5—39 నుంచి 1—9—40 (వరంగల్లులో జరిగిన 23 వ శైవమహాసభ) వరకు

జమ

| | |
|---|---|
| లోగడ సభతాలూకు నిల్వ | 1489-12-9 |
| పీఠదక్షిణలు | 64- 4-0 |
| కం. వ. భైరవమూర్తిగారివల్ల జమ | 7- 8-0 |
| ప్రకటనల బాపతు | 6-10-0 |
| వెరశి | 1568- 2-9 |

ఖర్చు

| | |
|---|---|
| కీ॥ శే॥ నాగేశ్వరరావుగారి భార్యాగారును అల్లుడు శ్రీ శివలెంక శంభుప్రసాద్ గార్లవద్ద వున్ననిల్వ | 1453- 4-9 |
| డా॥ శివలెంక మల్లిఖార్జునరావుగారివద్ద వున్ననిల్వ | 1- 9-9 |
| శ్రీ. లో. శివలెంక లింగయ్యగారివద్ద వున్ననిల్వ | 34-14-3 |
| పత్రికకు అడ్వాన్సుగా యిచ్చినది | 28- 6-0 |
| ప్రయాణపుఖర్చులు | 33-14-3 |
| స్టేషనరీ | 6- 5-9 |
| పోస్టేజి | 9- 9-3 |
| నిల్వరొఖ్ఖం | 0-2- 9 |
| వెరశి | 1568-2-9 |

కం. వ. భైరవమూర్తి,
శ్రీపీఠ ప్రధానమంత్రి.

# ప్రబోధము

శా॥ శ్రీమంతంబయి భారతీ కృపకు పాత్రీభూతమై యిష్ట లిం
గామేయ ప్రతిభావిభాసిత సమాఖ్యానంబునై ఋగ్యజు
స్సామాథర్వణ వేదశాస్త్రవిహితాచార ప్రసిద్ధంబునై
భూమి న్శైవమతం బనాదిగ యశఃపూర్ణంబునై భాసిలున్.

మ॥ శివుడే దేవుడు భక్తియే జనని తత్సేవాచరుల్ బంధువుల్
శివు నర్చించుటె సర్వధర్మ చరణ శ్రేష్ఠం బటం చెంచి సం
భవ రాహిత్యపదంబు జెంద శివునిఁ బ్రార్థింపగా నెంచు మా
నవుడే శైవుడు స్వాభిమానము మతౌన్నత్యంబు జేకూర్చెడిన్.

మ॥ మత ధర్మంబు లెఱుంగజేయుచు జగన్మాన్యత్వ మార్జింపగా
సతతానూన శివార్చనా విధులకు న్సాఫల్యమున్ జూపగా
ప్రతిపక్షాత్మ విరుద్ధభావముల మిత్రత్వంబుచే బాపగా
క్షితిలో శైవమత ప్రకాశిక సుధీసేవ్యంబునై వర్ధిలున్.

శతావధాని జ్యోతిర్విద్యా విశారద,
ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి.

---

# శ్రీ పీఠ కార్యక్రమము

## 1. ప్రథమ పీఠాధిపతి ఎన్నిక

పీఠము రిజిస్టరు అయినపిమ్మట 108 వ నిబంధన ప్రకారము ప్రథమ పీఠాధిపతి ఎన్నిక నిమిత్తము అధ్యక్షులవారు నిర్ణయించిన 1-3-41 తేదీని పాలకసమితి సభ్యుల వరణము (Votes) ప్రకారము తెనాలి వాస్తవ్యులగు. బ్రి॥ లో॥ మహోపాధ్యాయ శివయోగి ముదిగొండ నాగలింగ శాస్త్రిగారు ప్రథమ పీఠాధిపతిగ నిర్ణయింపబడిరి.

## 2. పీఠాంతర్గత వర్గనిర్ణయములు.

ప్రథమ పీఠాధిపతిచే 25-3-41 వ తేదీని ఈ దిగువవారు ఆ యా వర్గములకు సభ్యులుగ పేర్కొని నియమింప బడిరి.

## 1. పాలక సమితి.

1 ప్రధానమంత్రి:—బ్ర॥ లో॥ కందుకూరి వటుక భైరవమూర్తి పంతులుగారు
మండలాధ్యక్షులు. బెజవాడ.

1 బరంపురం:—బ్ర॥ లో॥ శ్రీ రాజా మాన్యా కందుకూరి వీరేశలింగమ పంతులుగారు, 2 విశాఖపట్టణం బ్ర॥ లో॥ డాక్టర్ బెండపూడి పేరాజు పంతుల గారు, 3 పూర్వగోదావరి:—బ్ర॥ లో॥ మల్లంపల్లి చిన భుజంగరావుగారు, కొత్త పేట. 4 పశ్చిమగోదావరి:—ఇవటూరి దుర్గా వెంకట సుబ్బారావుగారు, వేమవరం 5 కృష్ణా:—బ్ర॥ లో॥ తుర్లపాటి వేంకటేశ్వరరావు పంతులుగారు, బారిష్టర బెజవాడ 6 గుంటూరు:—బ్ర॥ లో॥ అత్తలూరు వెంకటసుబ్బారావు పంతులుగార 7 మద్రాసు:—బ్ర॥ లో॥ డాక్టరు ముదిగొండ మల్లిఖార్జునరావుగారు 8 వరంగల్లు: బ్ర॥ లో॥ ముదిగొండ చిన వీరభద్రయ్యగారు, వరంగలు 9 సికిందాబాద్:—బ్ర॥లో॥ ములుగు బుచ్చయ్యలింగంగారు, 10 మెదక్:—బ్ర॥ లో॥ బీపేట విశ్వనాధశాస్త్రి గారు, సిద్ధిపేట, 11 నిజామాబాద్:—బ్ర॥ లో॥ నిర్మల అంబయ్య సిద్ధాంతిగారు.

## 2. గురుమండలి.

1 శ్రీ పరశివానంద స్వాములవారు, సికిందాబాద్ 2 శ్రీ పులిపాక మహ నందిశాస్త్రిగారు, వరంగలు. 3 శ్రీ ముదిగొండ నాగభూషణశాస్త్రిగారు, వరంగలు 4 శ్రీముదిగొండ నాగభూషణశాస్త్రిగారు వరంగల్లు 5 శ్రీయివటూరి బుచ్చి సోమన్న అయ్యవార్లంగారు. విశాఖపట్న. 6 శ్రీ ముదిగొండ పాపయలింగం అయ్యవార్లంగార యీమని. 7 శ్రీ ముదిగొండ రామలింగశాస్త్రిగారు, తాడికొండ. 8 శ్రీ కొడుమే భోగసోమలింగమూర్తిగారు; వరంగలు. 9 శ్రీకాశీనాధుని వీరేశలింగంగారు. బందరు 10 శ్రీ శివలెంక బుచ్చయ్యఅయ్యవార్లంగారు, పెసరమ్మ. 11 ముదిగొండ కోటిలింగ అయ్యంవార్లగారు, యీమని.

## 3. పండితసభ.

1 శ్రీ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు, వరంగలు. 2 శ్రీ ముదిగొండ నా భూషణశాస్త్రిగారు, వరంగలు. 3.శ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు, సికింద్ర బాద్. 4 బ్ర॥ లో॥ ములుగు రామలింగయ్యగారు, తెనాలి. 5 శ్రీ ముదిగొండ వీరభ శ్వరావధానిగారు, నందిగామ. 6 బ్ర॥ లో॥ మల్లంపల్లి జ్వాలా వీరభద్రశాస్త్రిగార పయిడిముక్కల అగ్రహారం. 7 శ్రీ ములుగు చంద్రమౌళీశ్వరశాస్త్రిగారు, తెనాలి 8 బ్ర॥ లో॥ కాశీనాధుని రాజలింగశాస్త్రిగారు, తెనాలి. 9 బ్ర॥ లో॥ మల్లంపల్లి మ ఖార్జునశాస్త్రిగారు, 10 బ్ర॥ లో॥ నిర్మల శంకరశాస్త్రిగారు, నిర్మల. 11 బ్ర॥ లో ముదిగొండ బసవయ్యశాస్త్రిగారు, తొండపి. 12 బ్ర॥ లో॥ పండితారాధ్యుల లిం మూర్తి శాస్త్రిగారు. సత్తెనపల్లి. 13 బ్ర॥ లో॥ ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు, 1 బ్ర॥ లో॥ ముదిగొండ రామలింగశాస్త్రిగారు, యీమని. 15బ్ర॥లో॥ శ్రీపతి పండిత రాధ్యుల శరభారాధ్యులవారు, వరంగల్లు. 16బ్ర॥లో॥ శ్రీపతి పండితారాధ్యుల పట్టె

లింగారాధ్యులవారు; బెజవాడ. 17 బ్రll లోll ముదిగొండ ముక్తిలింగశాస్త్రిగారు; పయిడిముక్కలఅగ్రహారం. 18 బ్రll లోll ముదిగొండ శంకరశాస్త్రిగారు, వరంగల్లు. 19 బ్రll లోll శివదేవుని వీరభద్రశాస్త్రిగారు, వరంగల్లు. 20 బ్రll లోll ముదిగొండ బసవయ్యశాస్త్రిగారు, బెజవాడ 21 బ్రll లోll ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారు, ఈమని. 22 బ్రll లోll శ్రీపతి పండితారాధ్యుల మార్కండేశ్వర శాస్త్రిగారు, శికిందరాబాద్.

పై సభకు విద్వాన్ సాహిత్యశిరోమణి ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారిని అధ్యక్షులుగ నియమించడమైనది.

పీఠకార్యస్థానము,<br>
బెజవాడ.<br>
30—4—41.

కందుకూరి వటుక భైరవమూర్తి.

---

# 23 వ శైవమహాసభ వరంగల్ తీర్మానములు

(1) ఆగమోక్తవిధానపూర్వకముగ శాశ్వితమూలధనముతో శ్రీశైవమహాపీఠ ప్రతిష్ఠాపనము విషయములో శ్రీరాజా ఇజ్జతాసార్, రాజా కందుకూరి బాల సూర్యప్రసాదరావు పంతులుగారు పీఠ నిర్మాతగ నుండుటకు తీర్మానించడమైనది. సాధ్యమైనంత త్వరలో పీఠప్రతిష్ఠాపనము చేయుటకు తీర్మానించడమైనది. కోడిమేల భోగసోమలింగారాధ్యులవారు నిర్మాతగారికి సహాయముగా నుండుటకు తీర్మానించడమైనది.

(2) ప్రజాస్వాతంత్ర్యము కొరకున్ను లోకశాంతికొరకు ప్రతికక్షుల నెదుర్కొని ఘోరయుద్ధమొనరించుచున్న బ్రిటిష్ సామ్రాజ్యమునకు నవ్యాహతమగు జయమొసంగవలయు నని యీ సభవారు శ్రీ పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు.

(3) నిజాంరాష్ట్రమందలి అన్నిమతములకును, జాతులకును వర్ణములకును, జెందిన ప్రజలను సమరసముగ నిష్పక్షపాత బుద్ధితో సమర్థులై పాలించుచున్న శ్రీ నిజాం రాష్ట్ర ప్రభువువారికి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధు లొసంగు గాతయని శ్రీ పరమేశ్వరుని యీ సభవారు ప్రార్థించుచున్నారు.

(4) భారతదేశమందలి స్వతంత్ర సంస్థానములలో నన్నిటికంటె పెద్దదిగా నుండుటయే గాక అన్నిటిలోను ఆదర్శప్రాయముగ నున్నదను విషయమును శ్రీ బ్రిటిష్ సార్వభౌములు అంగీకరించుటకు యీ సభవారు తీర్మానించుచున్నారు.

(5) గత కొత్తపల్లి సమావేశమునందును పిమ్మట 8-10-39 తేని బెజవాడలో జరిగిన అవసరమహాసభా సమావేశమునందును తీర్మానింపబడిన ప్రకారము శ్రీ శైవమహాపీఠమును 1860 సంll 21 నెంబరు చట్టప్రకారం రిజిష్టరీ చేయవలసియుండగా అందువిషయములో ప్రధానమంత్రిగారు అవసరమైన పనులు పూర్తి చేసి

నను కారణాంతరముచేత యింతవరకు రిజిష్ట్రేషన్ జరిగి యుండలేదు. గాన లోగడ అవసర మహాసభలో నామోదింపబడిన ప్రణాళికను జతపరుస్తూ మెమోరాండం తయారు చేసి తత్కాల ఉద్యోగుల పేర్ల నుదహరిస్తూ వెంటనే రిజిష్టరీ చేయుటకు ప్రధానమంత్రి గారికి అధికారమివ్వడమైనది.

వరంగల్ — పులిపాక మహానందిశాస్త్రి(వాలు

1-9-40 — అధ్యక్షులు.

---

ఓం అవిఘ్నమస్తు

శివాయ గురవేనమః.

# ఆహ్వానము

## శ్రీ శైవమహాపీఠము 24 వ వర్ధంత్యుత్సవము.

స్వస్తిశ్రీ వృషసంll ర జ్యేష్ఠ శు ౧౧,౧౨,౧౩,౧౪ లకు సరియగు 1941 సంll జూన్ నెల 5,6,7,8 తేదుల యందు గుంటూరులో చలమయ్య శ్రేష్ఠిగారి సత్రమందు బ్రll లోll మహామహోపాధ్యాయ శివయోగి ముదిగొండ నాగలింగ శాస్త్రిగారి అధ్యక్షతను జరుపుటకు నిశ్చయింపబడినది గాన శైవమహాజను లెల్లరు విచ్చేసి సభను జయప్రదముగా కొనసాగించ ప్రార్థన.

### కార్యక్రమము

ప్రథమదినచర్య: 5—6—41

ఉదయం : 7-0 నగరసంకీర్తనము.

8-0 శాలావిహారణము, కలశస్థాపనము, దేవతాహ్వానము, అగ్ని ప్రతిష్ఠాపనము,

8-15 ఆహ్వాన సంఘాధ్యక్షుని స్వాగతోపన్యాసము.

8-30 సభాసదుల స్వాగతపద్యములు, ఉపన్యాసములు.

9-0 అధ్యక్షులవారి ప్రారంభోపన్యాసము.

9-30 విద్యాపీఠ పరీక్షకవర్గ నిర్ణయము.

10-0 సహస్రనామపూజ తీర్థప్రసాదములు.

మధ్యాహ్నం: 2-0 పాలకసమితి సమావేశము.

4-0 సభా ప్రారంభము శ్రీ ప్రధానమంత్రిగారి ఉపన్యాసము (ప్రణాళికపై)

6-0 శివలీలా ప్రదర్శనము.

8-0 పీఠాధిపతిగారిచే శివపూజాఫలమును గురించిన ఉపన్యాసము.

9-0 సహస్రనామపూజ తీర్థప్రసాదములు.

ద్వితీయ దినచర్య: 6-6-41

ఉదయం: 4-0 ప్రభాతసేవ.

7-30 సభా ప్రారంభము మహాన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకము.

ఉపన్యాసములు:

1. బ్రll లోll పీఠాధిపతిగారిచే ప్రస్థానత్రయమునుగూర్చి
2. బ్రll లోll ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు ఈమని.
అష్టావరణ పంచాచారమునుగూర్చి.

10-30 సహస్రనామార్చనము. తీర్థప్రసాదములు.

మధ్యాహ్నం: 2-0 పాలకసమితి పండిత సభా సమావేశములు.

4-0 మహాసభా ప్రారంభము విద్యార్థుల పరీక్షలు.

ఉపన్యాసములు:

5-0 బ్రll లోll ముదిగొండ నాగభూషణశాస్త్రిగారు వరంగలు
శాంభవ దీక్షనుగూర్చి
బ్రll లోll అత్తలూరి వెంకట సుబ్బారావు పంతులుగారు, గుంటూరు. (ప్రణాళికపై)

6-0 గాన కాలక్షేపము.

7-0 వీణాగాన కాలక్షేపము.

రాత్రి 10-0 బ్రll శ్రీ బుద్ధవరపు కురంగేశ్వరరావుగారు నర్సారావుపేట
హరకథా కాలక్షేపము.

తృతీయ దినచర్య: 7-6-41

ఉదయం 4-0 ప్రభాతసేవ.

7-30 మహాన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకము.
సభా ప్రారంభము.

ఉపన్యాసములు:

బ్రll లోll పులిపాక మహానందిశాస్త్రిగారు వరంగల్లు షట్స్థలములనుగురించి.

8-30 తుమ్మలపల్లి మంత్రిమూర్తి అయ్యవార్లంగారు అల్లూరు
శైవమతాభివృద్ధినిగురించి.
బ్రllలో ముదిగొండ కోటిలింగం అయ్యవార్లంగారు, గుంటూరు.
శైవమత వ్యాప్తినిగురించి
బ్రll లోll ముదిగొండ రామలింగశాస్త్రిగారు తాడికొండ
శైవభక్త చరిత్రనుగురించి.

10-0 సహస్రనామ పూజార్చనము. తీర్థ ప్రసాదములు.

మధ్యాహ్నం 2-0 పాలకసమితి గురుమండలి సమావేశములు

3-30 శతావధానము బ్రి॥ లో॥ ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి గారు, ఈమని.

4-30 ఛాయాపటము.

5-0 పండిత విద్యార్థుల సన్మానములు

5-30 బ్రి॥ లో॥ కొంపల్లి జాలయ్యఅయ్యవార్లంగారిచే గౌరీకల్యాణము హరికథ.

6-0 బ్రి॥ లో॥ శ్రీపతిపండితారాధ్యుల పట్టెసలింగారాధ్యుల వారిచే మతవిద్యలు మతచిహ్నములను గురించి ఉపన్యాసము.

బ్రి॥ లో॥ డాక్టరు ముదిగొండ అఘోరయ్యగారు, శైవమత ప్రచారమునుగూర్చి.

7-0 పీఠాధిపతిగారిచే ఉపన్యాసము.

8-0 సహస్రనామార్చనము, తీర్థప్రసాదములు.

9-30 భ్రమరాంబా మల్లేశ్వరుల కళ్యాణ మహోత్సవము.

బ్రి॥ శ్రీ బుద్ధవరపు కురంగేశ్వరరావుగారి హరికథాకాలక్షేపము.

చతుర్థ దినచర్య:— 8—6—41

ఉదయం 4-0 ప్రభాత సేవ.

7-0 సభా ప్రారంభము. మహన్యాస పూర్వక రుద్రాభిషేకము.

8-0 వసంతోత్సవము, అవభృథస్నానములు.

9-0 శైవ మతాభివృద్ధిని గురించి వుపన్యాసములు.

10-0 ఆశుకవిత్వ ప్రదర్శనము. కవిభూషణ బ్రి॥ శ్రీ ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారు

10-30 పూర్ణాహుతి మహోత్సవము.

12-0 అన్నశాంతి.

మధ్యాహ్నం 4-0 సభా ప్రారంభం. వ్యాసముల పోటీపరీక్షల బహుమానములు.

5-0 యితరులకు ఉపన్యాసావకాశము లివ్వబడును.

6-0 సమాపకోపన్యాసము. వందనములు, సభాసమాప్తి.

9-0 స్వామివారికి పవళింపుసేవ శివగౌరీ సంవాదము; తీర్థప్రసాద తాంబూలములు.

10-0 బ్రి॥ లో॥ చాగంటి అన్నపూర్ణాశాస్త్రిగారు, తణుకు హరికథాకాలక్షేపము.

షరా:—సమయానుకూలముగా కార్యక్రమము మార్చబడును.

శైవమహాపీఠ కార్యస్థానము
21/140 రాజరాజేశ్వరమ్మ రోడ్డు
గవర్నరుపేట, బెజవాడ.

ఇట్లు,
కం. వ. భైరవమూర్తి,
శ్రీ శైవ మహాపీఠ ప్రధానమంత్రి.

# శైవయువజనులకు హెచ్చరిక

యువవృష సంII జ్యేష్ఠ శు ౧౧ మొదలు ౧౪ వరకు 1941 సరియగు జూన్ 5-8 తేదులయందు గుంటూరునందు జరుగబోవు,24వ శైవ మహాపీఠవర్ధంత్యుత్సవ సందర్భమున శ్రీశైవ మహాపీఠ సేవాదళమును, స్థాపించి కార్యక్రమమును, కొనసాగించుట. కేర్పాటులు చేయబడినవి. గాన శైవ మతస్థులగు యువకులెల్లరునూ వైశాఖ బII 30 లోగా పీఠ కార్యస్థానమునకు దరఖాస్తులు పంపుకోవలెను.

శ్రీ శైవ మహాపీఠ సేవాదళ నియమములు.

1. 25 సంవత్సరములకు లోబడినవారు.
2. విద్యా నియమము లేదు.
3. కార్యనిర్వహణ సమయమున శైవమహాపీఠమువారు ఏర్పరచిన మతచిహ్నములను ధరించి యుండివలెను.
4. మహాసభ జరుగు తేదీలకు ఒక రోజు ముందుగా సభ జరుగుచోటికి హాజరుగావలయును.

ఈ శ్రీ శైవమహాపీఠ సేవాదళములో చేరగోరువారు దరఖాస్తులు యీక్రింది వారికి 25-5-41 తేదీలోగా వ్రాయవలెను: మేనేజరు,

శ్రీశైవ మహాపీఠ కార్యస్థానము,
21/140 రాజరాజేశ్వరమ్మ రోడ్డు
గవర్నరుపేట, బెజవాడ.



# వేదశాస్త్ర విద్యార్థి పరీక్ష

24 వ, శైవమహాపీఠ వర్ధంత్యుత్సవ సందర్భమున యీక్రింద విషయములందు శైవ బాలురను పరీక్షించి బహుమతు లొసగబడును.

1. ఉత్సవాది ప్రతిష్ఠాంతము. (శివాగమము)
2. షోడశకర్మలు.
3. సంహిత.
4. పంచకావ్యములు.
5. విఘ్నేశ్వర పూజ, పుణ్యాహవచనము, నమక, చమక, పురుషసూక్త, శ్రీసూక్త, భూసూక్త, దశశాంతులు.
6. ఆరాధనవిధి.
7. మహాన్యాసము, పంచానువాకములు, పంచోపనిషత్తులు.
8. అరుణ సమేత సూర్యనమస్కారములు.
9. ఆశీర్వచన పనసలు, ఘనపనసలు, జటపనసలు, క్రమపనసలు.

కం. వ. భైరవమూర్తి, శ్రీ పీఠ ప్రధానమంత్రి.

# వ్యాసముల పోటీ పరీక్ష

## 1. విషయము :

శైవమతము, అతిప్రాచీనము.

## 2. నియమములు :

1. వ్యాసలేఖకులు, తమ పూర్తి చిరునామాలతో వ్యాసములను 25-5-41 తేదీలోగా మఠ కార్యస్థానమునకు పంపవలెను.
2. వ్యక్తి, మత, దూషణలు పనికిరావు.
3. శృతి, స్మృతి ప్రమాణములతో ఆంధ్రభాషలోనే వ్రాయవలెను.
4. వ్యాసము, పేజీకి 25 పంక్తుల చొప్పున 10 అరటావులకు మించకుండా, పేజీకి ఒక వైపుననే వ్రాయవలెను.
5. పరీక్షా ఫలితముల తుది నిర్ణయమందు పీఠాధిపతికి సర్వాధికారముగలదు.

# ప్రకటన

శ్లో॥ కళ్యాణాచల కోదండః కళ్యాణాని కరోతునః
సర్వమంగళయా యుక్త సర్వమంగళద శ్శివః॥

మహాజనులారా !

స్వస్తిశ్రీ వృషనామ సం॥ చైత్ర శు ౧ భృగువాసరము మొదలుకొని శ్రీ రామలింగేశ్వరాలయమునందలి ధర్మశాలయందు శ్రీస్వామివారి స్థిరాస్థినుండి వచ్చు ఆదాయముతో ప్రతిదినము పరదేశమునుండి పరగ్రామములనుండి వచ్చెడి మాహేశ్వ రులకు మూడుపూటలు సాహిత్యము పాత్ర సామానుతోగూడ ఇచ్చుటకు ఏర్పాటు చేయబడినది.

ఈ పద్ధతి క్రియారూపముగ నేటినుండియే ప్రారంభింపబడి సుముహూర్త మీ యుదయమందే గావింపబడినది. ఇదివరకు తక్కిన మతస్థులకు ఈ వసతి యేర్పా టయి యున్నది. కాని, శైవులకు లేదు. అట్టి లోపమును నివారించుటకై సకల ప్రపంచ పాలకుడగు శ్రీ రామలింగేశ్వర స్వామివారి యనుగ్రహమున నేడు నాచేత ఈ కార్యము ప్రారంభించబడినది.

ఈ కోవెలయందు దిగిన మాహేశ్వరులకు నల్లా దీపము మొదలగు నన్ని వసతులు సప్లయి చేయబడును.

పూజామహోత్సవములు, భక్త భజన నినాదములు, స్వామివారి సన్నిధియందు దివానక్తములు కర్ణపేయము లగుచుండును.

మా పూర్వులు తమతమ సర్వస్వము నిచటనే వ్యయపరచియున్నారు. కావున ఈ పత్రిక చూచినవారెల్లరు నితరులకీ విషయమును దెలిపి నా సంకల్పము నెరవేర్ప గోరుచున్నాను.

వరంగల్
రామన్నపేట,
29—3—41.

ఇట్లు
ధర్మకర్త
కొమరవెల్లి కాశయ్యా శ్రేష్ఠి.

# అముద్రిత గ్రంథ ప్రకటనము

మహాకవియగు బ్రి॥ లో॥ మలుగు పాపయారాధ్యుల వారిచే రచింపబడిన గ్రంథములలో నమూల్యమగు దేవీ భాగవత మహ గ్రంధ రత్నమును ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపించుటకు సమకట్టిన బెజవాడ శంకర పౌండ్రి ప్రొప్రయిటరు బ్రి॥ లో॥ చేతప్రూడి శరభయ్యగారి మహౌదార్యమును ప్రశంసించుచూ వారింకను శ్రీశైవ మహాపీఠమునకును శైవ మతమునకును తగు విధముల సహాయ మొనర్చి తొల్లింటి గౌరవమును తేగలందులకై తోడ్పడుటకును తగిన శక్తి సామర్థ్యముల ప్రసాదించుటకై కనకదుర్గా మహాదేవిని ప్రార్థించుచున్నాను.

బెజవాడ, ముదిగొండ వేరయ్యలింగం అయ్యవారు,
సత్యనారాయణపురం. 26—4—41.

# వరంగల్
# శైవ మహాజన సంఘమువారి దుష్ప్రచారము.

శ్రీశైవ మహాసభ పుట్టినది మొదలుకొని వరంగల్లులో జరిగిన యే కొలది సభలకో దక్క, తక్కిన సభలకు వచ్చుచుండిన వరంగల్లు ప్రాంతమువారి సంఖ్య యత్యల్పము. వీరిక యేకారణముచేతనో స్వస్థానదృష్టియు, స్వప్రయోజనదృష్టియు, బ్రధానముగ నుండును గాని, శైవ సమిష్టియొక్క శ్రేయము కాని, సమిష్టి ప్రయత్నములందభినివేశము కాని, ఉద్దిష్టకేంద్ర కార్యక్రమములందును సంస్థలందు అభిమానము కానివీరి యంతఃకరణముల నాకర్షించినట్లు తోచదు. వీరు నానా ప్రాంతములనుండి వెళ్ళిన వారైనను యే యల్ప సంఖ్యాకులో కాక తక్కినవారందరు స్వతంత్ర లౌకిక వైదిక వృత్తుల గ్రహింపక యందరు గురువృత్తి, లేక మాహేశ్వరవృత్తిచే; జీవనోపాధుల నార్జించువా రగుటచేతనో యితర కారణముచేతనో కాని అందరికిని దేవతాధిష్ఠాన యుక్తమగు పీఠమునినను, పీఠ కార్యక్రమమునినను, మిక్కిలి యుత్సాహము కలదు. గత మహాసభ వరంగల్లులో జరుగుటయు, ఆసందర్భములో పీఠము వెంటనే రిజష్టరుచేసి కార్యక్రమము జరుగవలసినదనియు, శ్రీదేవిడీ జమీందారుగారు తత్సభాముఖమున తాము పీఠమునకు "నిర్మాత"గనుండి స్వదత్త పరదత్తముల ద్వారా విపులమగు మూలధనమును సమకూర్చి దేవతాధిష్ఠానాది యుక్తముగ పీఠస్థాపన మొనరింతుమని వాకుర్విచ్చ శ్రీవారిని పీఠనిర్మాతగనుండుమనియు, మహాసభలో తీర్మానము జరిగినప్పుడు వీరు పరమానంద నిమగ్నులయిరి. కాని వీరిహర్షమునకు స్వస్థానదృష్టియే కాని వేరు కాదు. వీరికి దార్కాణముగ, మహాసభ పూర్తి అయిన నాటినుండియు వరంగలు పురముననే శైవమహాజనసంఘము అనుపేర నొకసంఘముగ నేర్పడి, సభాధ్యక్షులగు

బ్ర॥ లో॥ మహానందిశాస్త్రి గారిని, సంయుక్త కార్యదర్శియగు బ్ర॥ లో॥ రాజేశ్వర రావుగారిని (వీరుభయులు వరంగల్లువారే) స్థానికసంఘమున నాధికారిక వ్యక్తులుగ నేర్పరచుకొని, కొంతస్థానికప్రచారము సాగించిరని తెలియుచున్నది. సభానంతరము వరంగల్లులో కొలదిదినములు అస్వస్థులై శ్రీదేవిడీ జమీందారుగారు నిలవయుండగా, వీరలు వారి నెదుర్కొని 'మాయూరిలో పీఠము నెలకొల్పెదము, మీరెంత మూల ధనమును వ్యక్తిగతముగనిత్తురో వెంటనే జెప్పుడని' నిరోధింప; జమీందారుగారి యాశయము దేవతాధిష్ఠానము మాత్రమే కాక, వైదిక; లౌకికోన్నత విద్యాలయము; అన్నసత్రము, గ్రంథాలయము, ఉపాసనామందిరములు; మున్నగు వానితో గూడిన సాంగోపాంగ సంస్థయగుటయే కాక సర్వమండలముల పరిస్థితులు పర్యాలోచనము చేసి సర్వశైవాభిప్రాయానుసారము కేంద్రములగు సమిష్టి ప్రయత్నములు నిర్ణయము కావలసి యుండుటచేతను యింకను శ్రీవారి స్వవిషయములు అనగా సంస్థాన పరిస్థితులు నిర్ణయము కావలసి యుండుటచేతను, వారు వెంటనే ప్రత్యుత్తర మీయజాలక పోవుటచే వారిని తమ నిరుత్సాహమున చిన్న చూపుచూచినట్లు గూడా కర్ణాకర్ణికగ వినుచున్నాము.

పిమ్మట పీఠము రిజస్టరు అయి సర్వమండలముల దృష్టియు; ప్రయత్నములును కేంద్రీకృతములయి శైవ సంఘమున కొక సాంగోపాంగమగు ప్రధాన కేంద్రసంస్థ త్వరలో నేర్పడు సూచనలు కన్పట్టి నప్పటినుండియు వరంగల్లు వారి దృష్టియు ప్రయత్నములును చిత్రముగ మారినవి.

రిజిస్టరు అయిన తోడనే, పీఠము యొక్క ప్రథమ పీఠాధిపతిని నిబంధనల ప్రకారము పాలకసమితి యెన్నుకొనవలసియుండుటచే, అందులకై తేది నిర్ణయము 108 నిబంధనప్రకారము చేయవలసినదిగ ప్రధానమంత్రిచే లేఖమూలమున కోరబడి, ప్రధానమంత్రిగారికి పోస్టుద్వారా పంపబడిన అధ్యక్షుల సంతకపు లేఖమూలమున నిర్ణయింపబడిన ది 1-3-41 తేదిన జరిగిన యెన్నికలో బ్ర॥ లో॥ నాగలింగశాస్త్రి గారు ప్రథమ పీఠాధిపతులుగ తేలిరి. ఈ యెన్నికకు మరల ది 1-3-41 నాటికి ప్రధానమంత్రిగారికి చేరునట్లుగ సంతకపు వోటుకాగితములు అధ్యక్షులవారి వలనను, వరంగల్లు మండలాధ్యక్షులగు బ్ర॥ లో॥ ము॥ శంకరశాస్త్రి మున్నగువారివలనను పోస్టు ద్వారా పంపబడియుండెను.

కాని పీఠము రిజిస్టరుఅయిన క్షణమునుండి వరంగల్లులో కొంత కలవరమును కేంద్రపీఠమునకు వ్యతిరేకమగు కొంత దుష్ప్రచారమును ప్రారంభించిరి. యెన్నిక జరిగి, పీఠమునకు ప్రథమ పీఠాధిపతికూడ యేర్పడి కార్యక్రమము జరిగిపోగలదను విషయముగూడ వరంగల్లు ప్రచార ప్రముఖ బృందమునకు తెలిసినవెంటనే, వారు అధ్యక్షునియొద్దకు జని పోరబెట్టియో, బలవంతపెట్టియో నిబంధనల సంగతియే వారికి తెలియదనియు, నిబంధనలను ఉపాధ్యక్షులు వారికి చూపలేదనియు, ఎన్నిక సమావేశము వరంగల్లులో జరుగుననుకొని అనుజ్ఞ యిచ్చితిమనియు, బెజవాడ అనుకొన దనియు, మహాసభలో జరుగుచున్న ఎన్నిక యిప్పుడేల జరుగుచున్నదనియు [illegible]ంచుచు, పీఠాధ్యక్షుని యెన్నిక మహాసభవరకు ఆపవలసినదనియు వరంగల్లులో

ముఖ్య ప్రచారకులగు బ్ర॥లో॥ శ్రీపతి పండితారాధ్యుల శరభారాధ్యులుగారు ప్రధాన మంత్రిగారికి అధ్యక్షులవారిచే లేఖ వ్రాయించుకొని బెజవాడ స్వయముగావచ్చి అందచేసిరి. పై ప్రశ్నలన్నియు పొరపాటు అభిప్రాయముచే కలిగినవనియు, మామూలుగా నధ్యక్షుని యెన్నిక మహాసభలో జరుగుచుండినను సంస్థ యిప్పుడు రిజిష్టరు అయినందున రిజిష్టరు నిబంధనల ప్రకారము ఈ యెన్నిక జరిగినదనియు, వోట్లు అన్నియు లిఖితముగా పోస్టుద్వారా వచ్చుటచే యెన్నికస్థానము ఎచ్చట నను సందేహమున కవకాశమే లేదనియు, ఎన్నిక సక్రమముగనే జరిగి, కోరము, వోట్లసంఖ్య, మున్నగునవి సక్రమముగనే యుండుటచే, నిరాక్షేపణీయమనియు, అధ్యక్షులగు ప్రధానమంత్రిగారు సమాధానము వ్రాసి; వారి తృప్తికొరకు ఎన్నిక లేఖలు రికార్డు యావత్తు సహా అధ్యక్షులకు పంపి, ప్రత్యుత్తర మపేక్షించిరి. దర్మిలాను వెంటనే ప్రధానమంత్రిగారు వరంగల్లు వెళ్ళి అధ్యక్షులవారితోను యితర స్థానిక శైవులతోను సకల విషయములు మాట్లాడగ అధ్యక్షులవారి సంశయములన్నియు నిరాధారములని యెల్లరు నంగీకరించిరి. బ్ర॥ లో॥ నాగలింగశాస్త్రిగారు పీఠాధిపతిగ వచ్చినందులకు మిగుల సంతసించిరి. కాని యేదో మెలిక బెట్టుకొని కాలయాపన జేయుటయు, యీలోగా, కేంద్రసంస్థ కొనసాగకుండ దుష్ప్రచారము చేయుచు, నీలోగా వేరొక స్థానిక పీఠ స్థాపనార్థమై ప్రచారము సాగించి వరంగల్లులోని సంపన్నులును, వదాన్యులు నగు వైశ్యశ్రేష్ఠుల యొక్కయు దృక్పథమును స్థానిక సందర్భములందే నిమగ్నముగజేసి అసత్య దుష్ప్రచారములు సాగించి, మహాపీఠ కార్యక్రమము నెడ శైవులందు ఉపేక్షాభావమును జనింప చేయుటయును, వీరలు కార్యక్రమముగ బెట్టుకొనిరి. చిరకాలమునుండి మహాసభయందు అనేక పదవులలో పనిచేయుచు, వరుసగ రెండుసంవత్సరములు, శ్రీ శైవమహాపీఠమున కధ్యక్షులుగనుండి, పిమ్మట రెండుసంవత్సరములుగ నుపాధ్యక్షులుగ నున్న బ్ర॥ లో॥ విద్యారత్న శిరోమణి ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు, సమిష్టి ప్రయత్న మందభిమానముకలిగి శ్రీ శైవమహాపీఠమునకు వ్యతిరేకముగ జరుగుచున్న స్థానిక దుష్ప్రచారములందు పాల్గొనక పోవుటచే నచ్చటి ముఖ్యప్రచారకులు వీరియందు అసూయ వహించి అచ్చటి వ్యక్తిగత ద్వేషములను బలపరచి, వారియందు మిథ్యారోపణములు తద్వారా పీఠకార్యక్రమమునుగూడ దూషించుచు దుష్ప్రచారము చేయుచున్నారు.

పీఠ నిబంధనలు క్రమముగ లేవనియు, సవరణ కావలసి యున్నవనియుగూడ వీరి వాదము. నిబంధనలలో సవరణ లెవ్వియయిన నవసరముగ నెవ్వరుదలచినను అవి కార్యస్థానమునకు తెలిపినచో తద్విషయములో జరుగవలసిన కార్యక్రమమును వెంటనే పాలక సమితి జరిగించును. దీనికై విషయ మెరుగని లోకులయెదుట ఆర్భాటములు కాని, పీఠకార్యస్థానమునకు వ్రాయకుండనే, పుర వీథులలో కరపత్ర విజృంభణము కాని యనుచితము నిష్ప్రయోజనము. అట్టికరపత్రములు దురుద్దేశ్యమును దుష్ప్రచారమును సూచించుచు పీఠాపచార ప్రక్రియలుగ నెంచవలెనేకాని, యితరము కాదు.

నిజము నిలుకడమీద తెలియును గనుక, పై దుష్ప్రచారము కొంతకాలము గడచిన వెనుక, తన యంతటనే సమసిపోగలదను నమ్మకముచే నిందు పూర్తిగ ఖండింపలేదు.

అట్లుకానిచో జరిగిన యావద్విషయములు, లేఖలు, ఉన్నవాస్తవమంతయు లోకమునకు వెల్లడిచేసి వరంగల్లు మిత్రులు ప్రస్తుతము చేయుచున్న కపటనాటకమును, మిథ్యాప్రచారమును, గణద్రోహమును తేటతెల్లముగ చేయవలసివచ్చును.

శైవులెల్లరు పీఠనిబంధనావళి నంతయు స్వయముగ బఠించి విమర్శింపవలయునని ప్రార్థన. దుష్ప్రచారముల వలన మోసపోయి, కల్పతరువగు శ్రీ పీఠము నెడ దురభిప్రాయముల పాలుగాకుడు. పీఠము నిఖిలశైవులయొక్క స్వంతసంస్థ. అభిమానముతో దానియందు ప్రవేశించి, లోపములున్నచో సవరించి, పెంపొందించుడు.

యి. వీరభద్రరావు,

## లేఖలు

### కళ్యాణ మహోత్సవము వరంగల్.

### చైత్ర శు ౧౧ సోమవారము మొదలుకొని, బ ౧ పాడ్యమివరకు

మ॥ రా॥ ఆకారపు వరసింగం శ్రేష్ఠిచే నూతనముగ కట్టించబడిన విశ్వేశ్వరాలయమునందు, విశాలాక్షీ అన్నపూర్ణాసమేత శ్రీవిశ్వేశ్వరస్వామివారి యొక్కయు, వల్లీదేవసేనాసమేత శ్రీసుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి యొక్కయు, పంచాహ్నిక ధ్వజారోహణ కళ్యాణ మహోత్సవము జయప్రదముగ జరిగినది.

ముదిగొండ బ్రహ్మయ్య లింగశాస్త్రి, 12-4-41

### ఆరాధ్య విజయము.

ఇందు శ్రీపతి పండితారాధ్య చరిత్రము, ప్రప్రథమమున నిగమాగమ విశారద బ్ర॥ లో॥ ముదిగొండ వీరభద్రేశ్వరారాధ్యులవారిచే ముద్రించబడి ప్రకటనకు సిద్ధముగ నున్నది.

యి॥ వీరభద్రరావు,

బెజవాడ. 30-4-41.

### *సంశయము

### శ్రీ పీఠ ప్రధానమంత్రిగారికి

1. శైవమహాపీఠమువారు తలపెట్టు ప్రతి కార్యములకు విరుద్ధ ప్రచార మొనర్చెడి ప్రతిపక్షుల కరపత్రములకు గాని, వాక్ప్రగల్భ్యములకు గాని మహాపీఠమువారు పత్రికాముఖమున ఏల ఖండలించరాదు. నూతనప్రణాళిక రిజిష్ట్రేషన్ అయినతర్వాత గూడా అట్టి అధికారము కలుగలేదా. అట్టి అధికారము ప్రణాళిక యందుండినచో అధికారవర్గమువారు ఏల చలామణి చేసుకోజాలకుండిరి. ఇక ముందైన నిట్టి చర్యలు జరుపువారియెడ తగు చర్యలు తీసికొనబడునని ఏల ప్రకటించుటలేదు. అనుసంశయమునకు సమాధానం రాబోవు పత్రికా ముఖమున సంశయము, సమాధానముగూడా ప్రకటించ గోరుచున్నాను.

శ్రీపతి పండితారాధ్యుల పట్టైన లింగారాధ్యులు.

---

*మా సమాధానము దీనికి సంపాదకీయములో వ్రాయబడినది. ప॥ స॥

శ్రీ శివాయనమః

# ప్రతిగ్రామమునందు శైవసంఘములు చేయవలసిన విధులు



1 వారమున కొకమారు శైవులెల్లరు నొకచోట సమావేశమై శైవమతగ్రంథములలో నొకదానిని చదువుకొనుట పురాణము చెప్పించుకొనుట, లేక శివభజనసేయుట.

2 శైవమతప్రకాశికను సాంఘికులెల్లరకు చదివి వినిపించుట.

3 శైవమతగ్రంథ భాండాగారమును నెలకొల్పి మతప్రచారము చేయుట.

4 హృదయమున లింగపేటికయు, మెడలో రుద్రాక్షమాలయు మొగమున భస్మమును ధరించి, లఘుశివపూజనైనను ప్రతి శైవుడును చేయుచు తదితరులను ప్రోత్సహించుట.

5 గణార్చనా సమయములందు గాని, తమ కవకాశముగల తదితర సమయములందు గాని, తమకు శైవమత విషయములందు సంశయము గలిగినయెడల, మతపండితుల పిలిపించి యుపన్యాసములను చెప్పించుకొని సంశయములను నివారణ చేసికొనుట.

6 తీరికగల సమయములందు సంస్కృతభాషాజ్ఞానమును మతగ్రంథముల నర్థముచేసికొనతగినంత వరకైనను సంపాదించుకొనుట.

7 శాంభవదీక్షా విధానము, ఆరాధనాంత్యేష్టి విధానములు, విఘ్నేశ్వరపూజ, పుణ్యాహవాచనము (ప్రాణప్రతిష్ఠతో) నమక చమకములు, ఆశీర్వచన మంత్రములు, మంత్రపుష్పలు, నవగ్రహమంత్రములు, పంచబ్రహ్మ మంత్రములు మొదలగు వైదిక మంత్రములు చెప్పించుకొనుట,

8 శుభాశుభ కార్యములయందు, శైవమహాపీఠము పేరున గూడ మహేశ్వరులతో బాటు ద్రవ్యము వసూలుచేసి పీఠకార్యస్థానమునకు బంపుట.

# ఇందలివిషయములు







# శైవమత ప్రకాశిక

శ్రీ శైవమహాపీఠ పక్షమున ప్రకటింపబడు
సచిత్ర మాస పత్రిక.

| సంపుటము 3 | వృష వత్సర జ్యేష్ఠమాసము 1941 మే - జూన్. | సంచిక 3 |
|---|---|---|

## ప్రార్థన

శ్లో॥ సహస్రం వర్తంతాం జగతి విబుధాః క్షుద్రఫలదాః।
నమన్యే స్వప్నేవా తదనుసరణం తత్కృతఫలమ్।
హరిబ్రహ్మాదీనామపి నికటభాజా మసులభమ్।
చిరం యాచే శంభో శివ తవపదాంభోజ యుగళం.॥

---

## విజ్ఞప్తి

శైవమహాజనులారా!

ఇప్పటికి 34 సం॥రములనుండి శ్రీ శైవమహాసభ జరుగుచున్న సంగతి అందరికి విశదమే. మహాసభను యేవత్సరము యెవరు యెచటికి ఆహ్వానించుచుండిరో ఆయా ప్రదేశములలో జరుగుచు వచ్చినది. గాని నిర్ణీతముగా వకే స్థలమందుగాని, యెవరు ఆహ్వానింపని సమయములలో సభవారిచే తప్పక సభ జరుపబడుటగాని జరుగుటలేదు. ఇట్లుండగా 1936 సం॥రంలో శ్రీ శివలెంకశంభుప్రసాదుగారి అధ్యక్షతక్రింద యలకుర్తిలో జరిగిన శ్రీ శైవమహాసభలో మహాసభకు కొన్ని నిబంధనలను యేర్పరిచిన బాగుండునని అట్లు తీర్మానించి ఆ నిబంధనలను యేర్పరచుటకుగాను వకకమిటీనికూడా మహాసభవారు నియమింప నాజ్ఞాపించిరి. ఆ కమిటీవారు ఆ నిబంధనల విషయమై పూర్తిగా పనిని సాగించక పూర్వమే ఆన 1937 సం॥రములో బెజవాడలో శైవ మహాసభ జరుగుటయు ఆసభలో శైవమహాసభను

పీఠముగా మార్చి యేదో స్థిరరూపమగు వసతినికూడా యేర్పరచినచో మతాభివృద్ధికి వీలుకలుగు నని కొంత చర్చ జరిగినది. 1938 సంవత్సరములో రాజమహేంద్రవరములో జరిగిన శైవమహాసభలో శైవ మహాసభను పీఠముగా మార్చుటకును రిజిష్టర్ చేయించుటకును, 1939 సం॥రములో కొత్తపల్లిలో జరిగిన మహాసభలో పీఠమును రిజష్టరు చేయించుటకును మహాసభవారు తీర్మానించి యున్నారు. ఆ తీర్మానముల ననుసరించి 108 నిబంధనలు వ్రాయబడి ది 8-10-39 వ తేదీన ఆనిబంధనలు చర్చించుటకుగాను అప్పటి పాలక సమితిని, అవసర మహాసభను ఆహ్వానించి ఆనిబంధనలు వారిచే చదివి విమర్శింపబడి ఆ సభయొక్క యేకగ్రీవముగా అంగీకారమును పొందటమైనది. 1940 సం॥లో వరంగల్లునందు జరిగిన మహాసభలో పీఠమును ది 8-10-39 తేదీన అవసర మహాసభవారిచే ఆమోదింపబడిన నిబంధనలతో సహా రిజిష్టరు చేయవలసినదిగా మహాసభవారు తీర్మానించి యున్నారు. ఆతీర్మానము ననుసరించి ది 14-2-41 తేదీన శ్రీ శైవమహాపీఠము రిజష్టరీ చేయబడినది. పీఠము రిజిష్టరు అయిన తరువాత అప్పటికి అధ్యక్షులుగానున్న బ్రి॥ లో॥ పులిపాక మహానంది శాస్త్రిగారికి, అప్పటికి ప్రధాన మంత్రినై యున్న నేను పీఠముయొక్క 108 వ నిబంధన ప్రకారము పీఠాధిపతి యెన్నిక జరుగవలసి యున్నదనియు సమయనిర్దేశము చేయుడనియు కోరుచు జాబువ్రాయగా అధ్యక్షుల యెన్నిక జరుగుటకుగాను పాలక సమితి సమావేశమును ది 1-3-41 తేదీన జరుపుటకు నిర్ణయించి జవాబు వ్రాసినారు. తదాజ్ఞానుసరణముగా అప్పటికిగల పాలకసమితి సభ్యులందరికిని ది 1—3—41 తేదీన మహాపీఠము యొక్క నిబంధనల ప్రకారము పీఠాధిపతి యెన్నిక జరుగుననియు స్వయముగాగాని లేఖలమూలమునగాని వారి వరణములను కార్యస్థానమునకు అందజేయమని కోరుచూ లేఖలనువ్రాసి ది 1—3—41 మధ్యాహ్నం 1 గంటవరకు కార్యస్థానమునందు వేచియుండగా పాలకసమితి సభ్యులెవరును స్వయముగ రానందునను కొందరివద్దనుంచి లేఖలు వచ్చి యుండుటచేతను ఆ లేఖలను విప్పిచూచి అందరి వరణములను లెక్కించగా బ్రి॥ లో॥ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు పీఠాధిపతిగా

నిర్ణయించబడినారు. ఆరోజు ఉదయమున 7 గంటలవేళ శ్రీపతి పండితారాధ్యుల శరభారాధ్యులనువారు నావద్దకువచ్చి తాము వరంగల్లునుంచి వచ్చుచున్నామనియు అధ్యక్షుని ఎన్నిక సంవత్సరాంతమున జరుగు మహాసభవరకు జరుపకుండుట తమ యభిప్రాయమనియు తమ వద్ద మహానందిశాస్త్రిగారు వ్రాసిన వుత్తరముకూడా కలదనియు మధ్యాహ్నమునకు వచ్చే వోట్ల విషయమగు ఫలితమును చూచి అవసరమగుచో ఆ వుత్తరమును యిస్తాననియు చెప్పివెళ్ళిపోయినారు. వారు మరల ఆరోజు 3 గంటలకువచ్చి నా వలన అధ్యక్షుని యెన్నికఫలితము విని కలవరపడి అధ్యక్షుని ఎన్నిక మహాసభవరకు ఆపవలసినదని మహానందిశాస్త్రి గారిచే వ్రాయబడిన యొకవుత్తరమును నాకుయిచ్చిరి. అప్పటికి యెన్నిక పూర్తియగుటచే నేను చేయదగిన దేమియు లేదని చెప్పుచుయెన్నికఫలితమునుగూర్చి లేఖవ్రాసి పాలకసమితి సభ్యులవుత్తరములతోకూడా శ్రీ మహానందిశాస్త్రిగారి తృప్తికిగాను శరభారాధ్యుల వారిద్వారా పంపియుంటిని. తదుపరి 4—3—41 తేదీన నేను వరంగల్లు వెళ్ళి వారిని స్వయముగా కలిసికొనుట తటస్థించినప్పుడు వారును మరి కొందరును కలసి పీఠనిబంధన లేవియు వారికి తృప్తికరముగా లేవనియు, అధ్యక్షుల యెన్నిక మహాసభలో జరుగుట వారి అభిప్రాయమనియు చెప్పగా నిబంధన లన్నియును అవసర మహాసభ వారిచే నామోదింపబడిన వగుటచే ప్రత్యేకాభిప్రాయములకు తావులేదనియు, పీఠము రిజిష్టరయిన వెంటనే క్రొత్త నిబంధనలు అమలులోకి వచ్చినవనియు వాటి ననుసరించి పీఠాధిపతి యెన్నిక వెంటనే జరుగవలసి జరిగెనుగాని మహాసభవరకు ఆపుసందర్భము లేదనియు చెప్పినాను. మహాపీఠమునకు వర్ధంత్యుత్సవము గుంటూరులో జరుపుటకుగాను నిర్ణయించబడి తత్ప్రయత్నములు జరుగుచున్న సమయములో "మోసము" "నిర్మాతల నిరంకుశత్వము" అను రెండు అచ్చుపుస్తకములను కొందరు వరంగల్లు వాస్తవ్యులును, నియంతల దుష్ప్రచారము" అను వక అచ్చుపుస్తకము యీామని వాస్తవ్యులును, "సంశయము" అను వక అచ్చుపుస్తకము బందరు వాస్తవ్యులు శ్రీ శివలెంక లింగయ్యగారును ప్రచురించి యున్నారు. ఇవి గాక మహానందిశాస్త్రిగారు కొన్ని సంగతులను

నామీద ఆరోపించుచు వక రిజిష్టరు వుత్తరమును కూడా వ్రాసి యున్నారు.

సర్వశైవసంబంధమగు పీఠము విషయములకు సమాధానము యిచ్చుటకు ముందు నా స్వవిషయమున చేసిన నిందారోపణలకు సమాధానము యివ్వవలసియున్నది. సమాధాన మేమనగా—

నేను ఎప్పుడును యెవరిచేతను "పిమ్మట నెపుడో నిబంధనలను మీకు తెలియపరచియే పీఠమును రిజిష్టరు చేయిస్తాను" అని మెమోరాండము ఆఫ్ అసోసియేషన్‌లో దస్కతు చేయించి యుండలేదు. అందులో సంతకములు చేసినవారందరును యెట్టిధమయిన షరతులు లేకుండా చేసినవారే. తెలియగోరిన వారికి సంతకముల కాలమందును నిబంధనలు లిఖితరూపమున సిద్ధముగానే యుండెను.

బ్రి॥ లో॥ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారితో మహానంది శాస్త్రిగారు పీఠాధిపతి యెన్నిక వరంగల్లులో జరుపు మని అనినట్లును, రెండుసార్లు తెల్లకాగితములమీద దస్కతులు చేసి యిచ్చినట్లును కర పత్రములోని హంశములు. మహానందిశాస్త్రిగారికి నేను యెప్పుడును అధ్యక్షుని యెన్నికకు స్థలనిర్దేశము చేయుమనిగాని, వారు నాకు వరంగల్లులో అధ్యక్షునియెన్నికజరుపమనిగాని వ్రాసియుండలేదు. ఉపాధ్యక్షులైన వీరేశలింగ శాస్త్రిగారు అధ్యక్షుని యెన్నిక వరలగల్లులో జరుపుట మహానంది శాస్త్రిగారి అభిప్రాయ మని నాకు యెట్టిధముగాను తెలిపి యుండలేదు. నాకు మహానంది శాస్త్రి గారి వద్దనుంచి పీఠాధిపతి యెన్నిక విషయములో సమయనిర్దేశ్యమునుగురించిన్ని వారి వరణమును గురించిన్ని వచ్చిన రెండు ఉత్తరములను ఉపాధ్యక్షులగు వీరేశలింగశాస్త్రిగారిచే వ్రాయబడి అధ్యక్షు లగు మహానంది శాస్త్రిగారిచే చేవ్రాలు చేయబడినవై యున్నవి.

శ్రీ మహానందిశాస్త్రిగారికి స్వయముగా వుత్తరములు వ్రాయుట అలవాటు లేదని నాకు తెలిసి యున్నందునను ఉత్తరములు అధ్యక్ష ఉపాధ్యక్షుల కలయికతో వ్రాయబడియుండుటచేతను అధ్యక్షుని యెన్నిక తమకు యిష్టము లేదని గాని పీఠ నిబంధనలు తమకు క్రొత్తగా వున్నట్లుగా గాని తృప్తికరముగా లేవని గాని నాకు

వచ్చిన వుత్తరములలో యెచ్చటను తెలిపి యుండని హేతువు చేతను కరపత్రిములలో ప్రచురించిన విధముగా, నా కెన్నడును సందేహము కలిగి యుండలేదు.

నిజముగ మహానంది శాస్త్రిగారు పీఠాధిపతి యెన్నిక వరంగల్లు లోజరుప వలసినదిగ వీరేశలింగ శాస్త్రిగారితో ది 20-2-41 తేదీన చెప్పియుండిన యెడల, బెజవాడలో జరుగు యెన్నికకు తమవరణమును పంపవలసి నదిగ పిమ్మట ది 28-2-41 తేదీన కోరబడినపుడు ఏలయాక్షే పింపలేదు? బెజవాడలో జరుగనున్న పీఠాధిపతి యెన్నికకు తమ వరణమునేల పంపిరి? అప్పుడైనను వీరేశలింగ శాస్త్రిగారి యందేల యవిశ్వాసము జనింప లేదు? మీాదుమిక్కిలి రెండవ తెల్లకాగితము మీాద శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి గారికి తమవరణము నిచ్చి నట్లు వ్రాసి బెజవాడకు పంపుడని చెప్పి తమచేవ్రాలుచేసి వీరేశలింగ శాస్త్రిగారికి యిచ్చుటలో యర్థమేమి?

ది 4-3-41 తేదిన వరంగల్లు వెళ్ళినప్పుడు నేను జరిగిన దానికి పశ్చాత్తప్తుడనై క్షమాపణ కోరినట్లు ప్రచురించిన హాంశము కేవల మసత్యము. దీనికి ఆత్మలే సాక్ష్యము. మహాసభా తీర్మానములను పీఠ నిబంధనలను ఆచరణలో బెట్టుట నాకు విధియై యుండగా అందుకు నేను క్షమాపణకోరుట యసంభవము.

నేను శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారిని వరంగల్లు తీసుకుని వస్తా నని యెప్పుడును ఖరారు చేసి యుండలేదు. బ్ర॥ లో॥ పులిపాక మహానంది శాస్త్రిగారికి అధ్యక్షుని యెన్నిక అనంతరం పండితా రాధ్యుల శరభారాధ్యులద్వారా ఓట్ల వుత్తరములు పంపుటలో వారిని డిక్లరేషన చేయుమని గాని, అట్లు వారు డిక్లరేషన చేయని దే వీలు లేదని గాని గాదు. అట్లు పంపుట కేవలము వారిని తృప్తి పరచు టకే. చట్టప్రికారము వారికి ఆ యధికారము కూడా లేదు. నేను వరంగల్ స్వయముగా వెళ్ళినప్పుడు వారితో మరల పాలకసమతి సమా వేశము జరుపుదు మని యనుకొనలేదు. అట్టి సమావేశమునకు చట్ట ములో తావే లేనప్పుడు నే న ట్లంటి ననుట కేవలము సాహసమే.

పాలకసమితి సమావేశమునకు శ్రీ నాగలింగశాస్త్రిగారి రాక యనవసరము. వా రందు సభ్యులు కారు. శ్రీ నాగలింగశాస్త్రిగారు వచ్చినచో జరిగిన యెన్నిక ప్రకారము పీఠాధిపతి యగుటచే వారిని సమక్షమున నుంచుకొని, వారిచే వర్ణనిర్మాణములు చేయించు కొందమనిచెప్పిరి. రమ్మని వారికి జాబువ్రాసెద మనియు, వారువచ్చునప్పుడు నన్నుగూడ రమ్మనియు మాత్రముకోరిరి. వారురానందున నేనుబోవుటయును తటస్థించలేదు.

ఇక ఈ ప్రచురణములలోని వ్యక్తిగత దూషణములను త్రోసివేసి అసలు విషయ మే మని అలోచించగా—1. వరంగల్లు వాస్తవ్యులకు పీఠము వుండుట ఇష్టమేగాని ప్రస్తుత పీఠ నిబంధనలలో కొన్ని మార్పు గావలసి యున్నట్లును నిబంధనలు వారి ప్రత్యేకాదరణమును పొంది యుండని హేతువుచే సరియయినవి గావనియు, అధ్యక్షుని ఎన్నిక మహాసభవరకు ఆపకపోవుటచేతను, వరంగల్లునందు గాక బె జ వా డ లో జరిగియున్న హేతువుచేతను, యెవ్వరును పీఠమునకు సభ్యులుగా చేరకూడ దని వారి ప్రచారము.

2. యీామని వాస్తవ్యులకు పీఠము మోక్షసాధనము కాదనియు, నిబంధన లేవియు పనికిరావనియు యీా పై కారణములచే పీఠమే వద్దని వారి ప్రచారము.

3. బందరువాస్తవ్యు లగు శివలెంక లింగయ్యగారికి పీఠము వుండుట యిష్టమేగాని, పట్టైన లింగారాధ్యులవారు ఈ పీఠములో ఒక సభ్యుడుగా వుండుటచేతను, విధవా వివాహము చేసుకున్న వియ్యంకులను, వీరి అవినాభావసంబంధీకులను, పంక్తిబాహ్యులుగా నిర్ణయించ లేదనియు, తనకు పదిరూపాయిలు అప్పు ఇవ్వని శ్రీ దేవిడి జమీాందారుగారికికూడా ఈ పీఠముతో స్థిరసంబంధము యేర్పడునేమో యనియు, యీా పై కారణములచే పీఠము పనికిరాదనియు వీరి ప్రచారము.

ఇక వీరి అభిప్రాయములు ఎంత సహేతుకములో విచారింతము.

ఇప్పటికి జరుగుచూవచ్చిన ప్రతిశైవమహాసభకును రాజధానిలో గల్ల శైవులందరు రావలయు ననియే సభల నాహ్వానించిన వారి తలంపు.

కాని యే మహా సభకైనను సభ జరిగిన ప్రాంతములలోని వారును, ఎక్కువ అభిమానముగల యేకొద్ది మందియో యితరప్రాంతములలోని వారును వచ్చుచుండుట యాచారమై యున్నది. మహాసభ జరిగినపుడు హాజరగు సభ్యులు చేసిన తీర్మానము లన్నియు తత్సభకు రానివారిని కూడా బద్ధులను చేయుట ఆచారమును సమంజసమును అయివున్నది. దీనికి 1937 సం॥రములో జరిగిన బెజవాడ సభలో నామోదింపబడిన శ్రీ. నాగలింగశాస్త్రిగారి భాష్యగ్రంథ ముద్రణమే నిదర్శనము.

నాలుగు సం॥రములలో జరిగిన మహాసభలకు హాజరైనట్టియు, నిబంధనల విమర్శనకు ప్రత్యేకముగా జరిగిన అవసరమహా సభకు హాజరైనట్టియు, సభ్యుల విమర్శనలకు గుర్తైయె తుట్టతుదకు రిజిష్టరు చేయబడిన శ్రీశైవ మహాపీఠముఏిషయము తనకు తెలియనే తెలియదనియు, పీఠము ఆవశ్యకము లేదనియు, నిబంధనలే పనికిరావనియు, యే శైవుడన్నను, తనకు శైవమతమునందు యెంత ఆసక్తి కలదో, తన మతము వారు కలసి చేసిన సభలలో జరిగిన హంశముల నైనను తెలుసుకొనగోరని మనోనిశ్చలత యెంతయో, అటువంటివారి విమర్శనకు యెంత ప్రాముఖ్యము యివ్వవలెనో మీరే యూహించు కొనండి. నిబంధనలను విమర్శించుటకు అవసరమహాసభ నాహ్వానించుటలో మామూలుగా జరుగు సభలకంటె యేదో విశేష మున్నదని అన్ని ప్రాంతములవారు వత్తురనియు, విమర్శన కియ్యవలసిన ప్రాముఖ్యము నిచ్చుటకు వీలుండుననియు ముఖ్యాభిప్రాయము. అట్టి ప్రత్యేక మహాసభలో నామోదింపబడిన నిబంధనలను తనకు ప్రత్యేకముగా వినిపించి తన అంగీకారమును పొందలేదుగనుక తనను బద్ధుని చేయవు అని యేవ్యక్తి అన్నను హాస్యాస్పదమేగదా? అట్టి వ్యక్తుల యభిప్రాయమును లెక్కగా గొని సంస్థలను, నిబంధనలను, నివృత్తి చేయుట, మార్చుట, మొదలగు పనులు చేయుచుండినచో యే సంస్థనైనను నడుపుటకుగాని దాని అభివృద్ధిని చూచుటకుగాని వీలుండునా?

ప్రతివ్యక్తికిని పైకి తనయంతటి అధికారవాంఛాలేశ దూరులెవరునూ లేరని అన్నను, లోపల మాత్రము పదవీవ్యామోహాముండుట స్వభావసిద్ధమే. అట్టివారు తా మభిలషించుచున్న పదవులు

రాక పోయినప్పుడు మనస్సు సహజమగు మాత్సర్యమునకు గురియగు టచే హేతుగౌరవమును కూడా విడచి ప్రవర్తించుట సహజమే. మహానందిశాస్త్రిగారు పైన చెప్పిన స్వాభావికులలో నొకరు కాక పోయినను ఆశాబద్ధులగు సన్నివిష్టుల దుష్ప్రబోధములకు చెవియొగ్గుట చేతను, పదిమందిచే నామోదింపబడిన యే విషయమునైనను ప్రతి కక్షిగా నెదుర్కొనిననేగాని పేరు ప్రతిష్ఠలకు తావు లేదనియు, తాము యే కార్యము చేసినను "నైతికబలము" అను అలవాటు పదముచే సమర్థించుకొనవచ్చు నను దురూహ గల శ్రీ॥ పం॥ శరభారాధ్యుల వారు ది 1-3-41 తేది వుదయం వారు స్వయం కర్తృత్వము పూని మహానందిశాస్త్రిగారి వుత్తరమును నాకుయివ్వక వారి అధికృత్యమును సరిగా నేరవేర్చి యుండని హేతువుచేతను, యింత అనిష్టము కలిగినది.

ఒకవేళ అట్లు ఉదయముననే ఇవ్వక ఎన్నికలేఖలన్నియు చూచి పర్యవసానము తేలిన వెనుక అవసరమైతేనే వుత్తరము ఇమ్మని అధ్యక్ష నిర్ణీత విధానమే నేమో అనికూడ శంకింపదగును. అధ్యక్షులగు శ్రీ మహానందిశాస్త్రిగారి సంతకముతో గూడ ప్రకటింప బడిన "నిర్మాతల నిరంకుశత్వ"మను ద్వితీయ ముద్రిత కరపత్రములో శ్రీవారి అధ్యక్షతా కాలములో ఒకటి రెండు సారులుగ సంభవించిన అధ్యక్ష పరివర్తనమే విమర్శకు ముఖ్యలక్ష్యముగ నున్నది.

అవసరమగు నెడలనే వుత్తరమిచ్చెదనని శరభారాధ్యులనుట లోనే, పీఠాధిపతి యెన్నికను ఏసందర్భములోనైనను ఆపియే తీరవలె నని అధ్యక్షుల యభిప్రాయముకానట్లు తెలియుచున్నది.

పీఠాధిపతి యెన్నికకు తమ వరణమును బంపునప్పుడుకూడ శ్రీ శైవమహాపీఠాభివృద్ధియందు శ్రీ మహానందిశాస్త్రిగారికిగల సద్భావము, పిమ్మట శ్రీ శంకరశాస్త్రి శ్రీ శరభారాధ్యప్రభృతులు కలిసిన తోడనే మారి ప్రతిష్టంభన ప్రక్రియయందు ప్రవేశించుటకు గల కారణము యోచనీయము.

వ్యక్తిగత ద్వేషములకును పరపతులకును మహాసంస్థలు తావులు కావనియు బహిష్కారము మొదలగు సంఘకార్యములు వక రిద్దరితో

జరుగ దగిన కార్యములు కావనియు అందరికిని తెలిసిన విషయమే. ఈ పైకోరిక ప్రస్తుత ప్రశంసకు అప్రస్తుత మని వేరే వ్రాయనక్కర లేదు.

కర్తవ్యము

నాల్గు సంవత్సరములనుండి అనేకమంది వ్యక్తులు విమర్శనా దృష్టితో పరిశీలించి యేర్పరిచిన పీఠము ఇప్పుడు వద్దని యీయుని వాస్తవ్యులన్నను, అవసరమహాసభ చేత నామోదింపబడిన ప్రణాళిక తమ ప్రత్యేకామోదమును పడయక పోవుటచే సరియైనది కాదనియు వరంగల్లు నందు జరుగకపోవుటచే అధ్యక్షుని యెన్నిక సక్రమమైనది కాదనియు వరంగల్లు వాస్తవ్యులన్నను, పట్టైన లింగారాధ్యుని పీఠము నుండి వెడలగొట్టి విధవా వివాహ వియ్యంకులను వారి అవినాభావ సంబంధీకులను పంక్తిబాహ్యులుగా చేయని యెడలను శ్రీ దేవిడీ జమీందారుగారి మాటయందు అవిశ్వాసమును నెలకొల్పనియెడలను పీఠనిర్మాణముకు ఒప్పుకోనని శ్రీ॥ శి॥ లింగయ్యగారన్నను, వారి సంకుచితదృష్టి బయలుపడుటయు, మహాసంస్థలనుండి పొందదగిన ఆ ముష్మికమును పొందలేకపోవుటయు జరుగును గాని దానివలన వచ్చు ప్రయోజనముగాని పీఠ నిర్మాణముకొరకు వ్యయ ప్రయాసలకు లెఖ్కచేయక పని చేసిన వ్యక్తులకు నష్టముగాని వుండదని నా మనవి.

నిబంధనలలో మార్పులు కావలసివచ్చినయెడల ఆ మార్పులను శ్రీ శైవమహాపీఠముకు నుపపాదించి నిబంధనలలో నున్న ప్రకారము సవరణలు చేసికొన ప్రయత్నింతురు గాక యనియు, అనవసర మగు అసత్యప్రచురణల మూలముగా వ్యక్తి దూషణల చేసి మనస్సుకు కష్టము గల్గించకుందురు గాక యనియు ప్రార్థించుచున్నాను.

కం. వ. భైరవమూర్తి,
ప్రధానమంత్రి.

# వార్షిక నివేదిక

1—9—40 తేదీని వరంగల్లునందు జరిగిన మహాసభవరకును అయిన ఆదాయవ్యయము శైవ మతపత్రికాళిక 3 సంపుటం 2 సంచికలో ప్రకటించడ మైనది. అది మొదలు అనగా 1-9-40 మొదలు 31-5-41 వరకు అయిన ఆదాయవ్యయముల పట్టిక యిందుతో జత పర్చడమైనది.

ఈ సంవత్సరం జరిగిన కార్యక్రమములో శ్రీశైవమహాపీఠమును 1860సం. 21 నంబరు ఆక్టు ప్రకారం రిజిష్టరీ చేయించుటయును శైవ మతాభిమానులగు కొందరి ప్రముఖులయొక్క ద్రవ్యసహాయమున రిజిష్టరీ చేయుటయేగాక ప్రణాళికలను విరివిగా ముద్రించి నిఖిల శైవుల గ్రామములకు పంపించడమైనది. ఇంతియగాక శైవమతపత్రికాళికను పునరుద్ధరించి సక్రమముగ నేటివరకును వెలువడ జేయగల అదృష్టము మాకు లభించినందుల కెంతేయు సంతసము. యీ పత్రిక యిటులనే నడువ వలయునన్న సంవత్సరమునకు ప్రతిసభ్యుడు 2-0-0లకు తక్కువ గాకుండ చెల్లించుటయూ కనీసము మూడువందల మంది మతాభిమానులగు చందాదారు లుండిన గాని, యిద్యాది నిర్వహింప బడుట సాధ్యము గాదు. గావున శైవమతపత్రికాళికను ప్రతిశైవుడును చందాదారుగా జేరిప్రోత్సహింప గోరుచున్నాము.

పీఠమును రిజిష్టరీ చేయించినది మొదలు నేటివరకు ఎందరెన్ని విధముల వ్యతిరేక ప్రచారము చేయుచున్నను, సత్యమును సక్రమమును పురోభివృద్ధి సాధనము నగు మత ప్రచారమును విశేషముగ చేయుటకు తగినంత ద్రవ్యసహాయము లేకున్నను, యావజ్జీవమును తమ జీవితమును శైవమతమునకై ధారబోయు శక్తిగల్గిన పలువురు మతాభిమానుల తోడ్పాటు వలన విరుద్ధప్రచారము లణగ ద్రొక్కుచు సత్యమును వెలిబుచ్చుచు మతమునందు తొల్లింటిగౌరవమును బోధించుచు నూరుమంది సభ్యులను యీ స్వల్పకాలములో చేర్చగల్గి నందులకు వారి కందరకు ధన్యవాదముల నర్పించు చున్నారము.

మరియు బెజవాడయందును, వరంగల్లునందును, శైవమత ప్రికాశిక ఔన్నత్యమును దెలిసి చందాదారులుగజేర్చి బెజవాడ నగర శైవసంఘ సమావేశముజరిపి దీక్షతో కార్యమునునిర్వహించిన బ్రి॥లో॥ ముదిగొండ వీరయ్యలింగం అయ్యావార్లంగారికిన్నీ, కృష్ణా గుంటూరు మండలముల యందు శైవులు గల కొన్ని గ్రామములయందు శైవ మత ప్రిచార మొనర్చి, విరుద్ధ ప్రిచారమొనర్చెడి వ్యక్తుల ప్రిశ్నము లకు జవాబు లిచ్చుచు పీఠము తరఫున ప్రిచార మొనర్చిన బ్ర॥ లో॥ డాక్టర్ శైవాగమ విశారద శ్రీపతి పండితారాధ్యుల వట్టెన లింగా రాధ్యుల వారికిని, ఆయా గ్రామములందు ప్రిచారమునకు తోడ్పడిన నిర్వ్యాజమతాభిమానులగు మహా పురుషులకున్నూ కృతజ్ఞత నర్పించు చున్నారము. పీఠాధిపతుల యానతి శిరసా వహించి నైజమగు తమ స్వమతాభిమానమును గన్పరచుచు అయాపదవుల నంగీకరించిన పాలక సమితి గురుమండలి పండితసభాసభ్యులకును, యీ శైవ మతముయొక్క పురాకృత సుకృతవిశేషమున తేజస్సంపన్నులయి అద్వితీయ పాండితీచాతురీధురంధరు లయి బ్రిహ్మవిద్యాసంపన్నులయి శివధ్యాన తత్పరులై శివయోగియను బిరుదమున ప్రిసిద్ధిగన్న ప్రితి వాది భయంకరు లగు మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రి గారు పీఠాధిపత్యమును స్వీకరించి భావికార్యక్రిమమును అతి శాంత ముగ నిర్వహించుచున్నందులకు శ్రీ వారికిని త్రికరణ శుద్ధిగ కృత జ్ఞతా పూర్వక శరణులర్పించు చున్నారము. శైవులును, శైవ మతాభి మానులున్నూ యీ శైవమహా పీఠముయొక్క యుద్దేశ్యములను నిబంధనలను వ్యక్తిగత ద్వేషభావముల వదలి త్వరపడక బాగుగ విచారించుకొని సంశయములను పీఠాధిపతులవలన నివర్తింప జేసికొని ఎల్లరు సభ్యులుగా జేరి స్వమత గౌరవములను పెంపొందింప గోరు చున్నారము.

శ్రీ శైవ మహాపీఠ 24 వ వర్ధంతిని గుంటూరుపురమున జరుపవలె నని సంకల్పించినంతలో గుంటూరు మండలమున సుప్రిసిద్ధ న్యాయవాదు లగు బ్ర॥ లో॥ అత్తలూరు వెంకటసుబ్బారావుపంతులు గారును, ఆగమశాస్త్ర నిపుణులగు బ్ర॥ లో॥ ముదిగొండ కోట్లింగం

అయ్యవార్లంగారున్నూ రాజవైద్య ముదిగొండ అఘోరయ్యా అయ్యవార్లంగారున్నూ గుంటూరు పురమున యిదివరకెన్నడును యిట్టి సభ జరుగనందున నచ్చటనే జరుపదలచి పలువిధముల పలువుర ప్రోత్సాహ పరచి మహా వైభవముగ యీ మహోత్సవమును జరుప నాహ్వానించి నందులకు వారి నెంతయు నభినందించుచున్నాము.

కం. వ. భైరవమూర్తి,
పీఠ ప్రధాన మంత్రి.

## 1-9-40 నుండి 31-5-41 వరకు ఆదాయ వ్యయ పట్టిక.

| జమ. | రు. | అ. | పై. |
|---|---|---|---|
| లోగడ సభ తాలూకు నిల్వ | 1489 | 12 | 9 |
| బ్రి॥ లో॥ కాశీనాథుని వీరేశలింగంగారు, బందరు, వద్ద అప్పుగా తీసుకొన్న రొఖ్ఖం | 25 | 0 | 0 |
| బ్ర॥ లో॥ ముదిగొండకోటయ్యశాస్త్రిగారు, ఈమని, వద్ద అప్పుగా తీసుకొన్న రొఖ్ఖం | 62 | 0 | 0 |
| బ్ర॥ లో॥ యిపటూరి వీరభద్రరావుగారి వద్ద అప్పుగా తీసుకొన్న రొఖ్ఖం | 3 | 4 | 3 |
| బ్ర॥ లో॥ ముదిగొండ రామలింగశాస్త్రిగారి వద్ద అప్పుగాతీసుకొన్న రొఖ్ఖం | 45 | 0 | 3 |
| బ్ర॥ లో॥ కం. వ. భైరవమూర్తిగారి వద్ద అప్పుగా తీసుకొన్న రొఖ్ఖం | 24 | 0 | 3 |
| బ్ర॥ లో॥ శ్రీపతి పండితారాధ్యుల పట్టెన లింగారాధ్యులు గారి వద్ద అప్పుగా తీసుకొన్న రొఖ్ఖం | 3 | 4 | 0 |
| పీఠదక్షిణలు, పత్రిక చందాలు | 67 | 9 | 0 |
| లోగడ నిల్వ | 0 | 2 | 9 |
| | 1720 | 1 | 3 |

| ఖర్చు. | రు. | అ. | పై. |
|---|---|---|---|
| కీ॥ శే॥ కాశీనాథుని నాగేశ్వరరావుగారి భార్యా రామాయమ్మగారు, అల్లుడు శ్రీ శివలెంక శంభుప్రసాద్ గార్ల వద్ద వున్న నిల్వ | 1453 | 4 | 9 |
| బ్ర॥ లో॥ డాక్టరు శివలెంక మల్లికార్జునరావు గారివద్ద వున్న నిల్వ | 1 | 9 | 9 |
| బ్ర॥ లో॥ శివలెంక లింగయ్యగారి వద్ద వున్న నిల్వ | 34 | 14 | 3 |
| స్టేషనరీ | 1 | 10 | 9 |
| పత్రిక, ప్రణాళికల అచ్చునిమిత్తం | 99 | 6 | 0 |
| ప్రయాణపు ఖర్చులు | 63 | 2 | 9 |
| పోస్టేజి ఖర్చులు | 15 | 15 | 3 |
| శ్రీ శైవమహాపీఠము రిజిస్ట్రేషను ఫీజు | 50 | 0 | 0 |
| నిల్వ రొఖ్ఖం | 0 | 1 | 9 |
| | 1720 | 1 | 3 |

శ్రీ శైవమహాపీఠ కార్యస్థానము, గవర్నరుపేట, బెజవాడ, 31-5-41.

కం. వ. భైరవమూర్తి, ప్రధాన మంత్రి.

# శ్రీశైవ మహాపీఠ విజయవాడ నగర
# శైవసంఘ సమావేశము

ది 20-5-41 తేదీన విజయవాడనగర శైవ సభ్యు లందరును ది 14-2-41 తేదీన రిజిష్టరుకాబడిన శ్రీశైవమహాపీఠమునకును రాబోవు వర్ధంత్యుత్సవమునకును ఆటంకములు కలుగచేయు తలంపుతో నిర్హేతుకముగా అసత్యప్రచార మొనర్చుచున్న కొన్ని ప్రాంతముల యందలి శైవులు ప్రచురించిన కరపత్రములను ప్రచారములను విమర్శించి తీర్మానించుటకు బ్ర॥ లో॥ యివటూరి కుంటుంబరావుగారి భవనము నందు బ్ర॥ లో॥ ఉభయభాషా ప్రవీణ కానూరు వీరభద్రేశ్వరరావు పంతులు బి. యే., యల్. టి., వకీలుగారి అధ్యక్షత క్రింద సభను జరిపి యున్నారు. ఆ సభలో ఆధ్యక్షుల ప్రారంభోపన్యాసము తరువాత సభవారి కోరికపైన పీఠప్రధాన మంత్రి బ్ర॥ లో॥ కంచుకూరి వటుకభైరవమూర్తిగారు 1936సం॥రం లగాయతు యీ రోజువరకు శ్రీ శైవ మహాపీఠవిషయమై జరిగిన యావద్విషయములను లిఖితపూర్వక మగు దృష్టాంతరములతో ముచ్చటించి వ్యతిరేక ప్రచారకరపత్రము లలోని యాంశములు అసమంజసము లనియు, నిరాధారములనియు నిరూపించిరి. తదుపరి వరంగల్లు శైవమహాజనసంఘము వారిచే పీఠవ్యతిరేక ప్రచారము నిమిత్తం యిచ్చటికి పంపబడి ప్రచారము చేయుచు ఆనాటి సభకు హాజరయిన శ్రీపతి పండితారాధ్యుల శరభారాధ్యులు, బ్ర॥ లో॥ భండారు వీరమల్లు ప్రసాదుగార్లు తమ ప్రచారము యొక్క ముఖ్యవిషయములను తెలుప వలసినదిగా సభవారిచే కోరబడియు తమ కరపత్రములలోని ఆపాదనలనే తిరిగి తిరిగి చెప్పిరేగాని వాటికి తగిన హేతుబలమునుగాని, ఆధారములుగాని జూపియుండ లేదు. ప్రధాన మంత్రిగారి నిదర్శనములను, పీఠవ్యతిరేక ప్రచారకుల వాదనలను సభ్యులు విమర్శనాదృష్టితో పరిశీలించి యీ వ్యతిరేక ప్రచార మంతయు వ్యక్తిద్వేష పూరిత మనియు కొందరు శైవులు యీ విధ మగు సంకుచిత దృష్టికి గురి యగుచు మతమునకును సంఘమునకును కళంకము తెచ్చుచున్నా రనియు దలంచివారి కృత్యములకు విచారపడిరి. అధ్యక్షులవారు శైవమహాపీఠవ్యవస్థ రిజిష్టరు కాబడి వ్యదిలోనికి

రానున్నసమయమం దిట్టి వ్యక్తిద్వేష పూరితములును నిరాధార భూతములును అగు వ్యతిరేక ప్రచారము లసమంజసము లనియు, శైవు లెల్లరు వాటిని పాటింపక తదేక దీక్షతో శ్రీ శైవ మహా పీఠ కార్యక్రమమునకు చేయూత నొసగి శైవమతాభివృద్ధికిని, శైవమహాజనుల పురోభివృద్ధికిని సహాయ పడవలయును గాని వృధా కలహములతో పొద్దుపుచ్చరాదనియు తెలవిచ్చుచు పీఠముపట్ల వ్యతిరేక ప్రచారమునకు దిగిన శైవుల చర్యల నిరసించుచు ఒక తీర్మానమును వుపపాదించిరి. సభలో యీ దిగువ తీర్మానములు సభ్యులచే ఏకగ్రీవముగా నామోదింపబడినవి.

తీ ర్మా న ము లు

1. బెజవాడ వాస్తవ్యులయిన కీ॥ శే॥ శివలెంక శంభులింగం అయ్యావార్లం గారి యొక్కయు, బందరు వాస్తవ్యులున్నూ ప్రస్తుతము తెనాలి తాలూకా దుగ్గిరాలలో అసిస్టెంటు ఇంజనీయరుగా పనిచేయుచుండిన క॥ శే॥ బేతపూడి నాగభూషణరావుపంతులుగారి యొక్కయు అకాల మరణములకు చింతిల్లిచూ యీ సభవారు వారి కుటుంబములకు తమ సానుభూతిని తెల్పుచున్నారు.

2. ఇటీవల వరంగల్లు, ఈమని బందరు గ్రామస్థులగు శైవులు కొందరు కరపత్రముల ద్వారానున్నూ స్వయముగానున్నూ, శ్రీశైవ మహా పీఠమునకు వ్యతిరేకముగా జరుపుచున్న ప్రచారమునకు యీసభవారు విచారమును తెల్పుచు రాబోవు శ్రీ శ్రీ శ్రీశైవమహాపీఠవర్ధంత్యుత్సవమును గుంటూరులో జయప్రదముగా కొనసాగుటకు సభ్యులెల్లరు ప్రయత్నము చేయగలందులకు ఏకగ్రీవముగా తీర్మానించ బడినది.

నిబంధనల సవరణలు కోరు శైవులు రాబోవు శ్రీ శైవమహాపీఠ వర్ధంత్యుత్సవములో పాల్గొని బహుజనాంగీకారము నుండి తమ యభీష్టమును బడయవచ్చును గదా!

ముదిగొండ వేరయ్యలింగం అయ్యావారు,

ది 20-5-41. విజయవాడ నగర శైవ సంఘ కార్యదర్శి.

# గ్రహకల్లోలాలు

## మోసము

ది 20-3-41 తేదీని వరంగల్లులోని కొందరు శైవులు ప్రకటించిన మోసపు కరపత్రమునందలి 9, 12, 42 నుంచి 57 వరకును గల నిబంధనలను గుంటూరునందు జరుగబోవు 24 వ పీఠ వర్ధంతిలో పాలకసమితి వారికి నివేదించవలెనని నా కోరికగూడాను.

## నిరంకుశత్వము

18-4-41 తేదీని ప్రకటించిన వరంగల్లు రెండవ కరపత్రమున, ప్రణాళికను వినిపించినట్లును రాజమండ్రిసభలో మహాసభను మహాపీఠముగా మార్చుట కంగీకరించినట్లును కొత్తపల్లి మహాసభయందును బెజవాడ అవసరసభయందును రిజష్టరుచేయుటకు తీర్మానించినట్లును వారు స్వయముగా ఒప్పుకొనియు "నిర్మాతల నిరంకుశత్వ"మనుటలో దేవాది జమీందారులగు శ్రీరాజా కంకుకూరి బాలసూర్యప్రసాదరావు గారియందుగల వ్యక్తిద్వేషము బయల్పరుచుచున్నారు. ఎట్లన వరంగల్లు మహాసభయందు శ్రీ॥ జమీందారువారు పీఠనిర్మాతగా నుండుటకు సర్వజనాంగీకారమును పొందియుండిరి. కాన శ్రీవారిని అకారణముగా దూషించుట శ్రీవారి క్రోధాగ్నికి గురియగుట యని గ్రహింతురుగాక. తక్కినవిషయములు అక్రమములున్నూ అసూయాపూరితము లని హెచ్చరించుచున్నాను.

## ఈమనిగూడుపుఠాణి

లోగడ శైవబృందమను పేరుతోను, ఇటీవల యీమనిగ్రామ శైవసభ్యులనుపేరుతోను బయలుదేరిన గూడుపుఠాణి నియంతల దుష్ప్రచారకరపత్రములకు మోసపోకుడు. ఇందుకొందరు నాస్తికులు, కొందరు పండితమ్మన్యుల శిష్యులు, మరికొందరు ఉత్తములగు శైవులు. వీరికి నియమము అవసరము లేదట. పీఠము అసలే అవసరము లేదట. చందా నిర్బంధము పనికిరాదట. వీరికి ఈశ్వరసాక్షాత్కారము శూన్యమట,

బోయ కన్నప్పవలె మోక్షమొందెదరట. పాలకసమితికి అధికారము పనికిరాదట. గవర్నమెంటు ఆక్టుప్రకారం రిజష్టరి చేయబడి, సర్వమత సామరస్యము కలిగించుటకును, శైవమతగౌరవముకొరకును తగినట్టి కట్టుదిట్టములతోనుండిన పీఠమూలధనమును పీఠాధిపతిగారు స్వంతధనముగా అనుభవించుచురట. ఇందుకొరకే బ్ర॥శ్రీ॥ ముదిగొండ నాగలింగ శాస్త్రిగారు పీఠాధిపత్యము వహించిరట. ఇట్టి పీఠాపచారుల ఉద్దేశ్యములు హాస్యాస్పదములు. మరొక విశేషము- ఇది తెరచాటున జరుగుచున్న రహస్య ప్రచారము. మేమును పీఠస్థులమే నని విఱ్ఱవీగుచు తదితర నియోగిశైవులు పీఠఅధికారులుగా పనికిరారని రొద చేయుచున్నారు. వీరికి శాస్త్రినామధారులై నియోగిపుంగవులైన పులిపాక మహానందిశాస్త్రిగారే అధ్యక్షులట. వీరు పీఠస్థులా? గ్రహించి వరించిన బాగుండెడిది. ఇందలి సత్య మేమన, శివయోగిపుంగవుల దూషించిన వారికి నియోగిపుంగవులే గురువుగానుండి శరణ్యులగుట తగియున్నది. నాకును ఆనందమే—

ఆ కా శ వా ణి

బ్రి॥శ్రీ॥ పులిపాక మహానందశాస్త్రిగారూ! ది 14-4-41 తేదీని దివ్యవాణిలో తాము ప్రకటించిన విషయము అసంగతము. పీఠ కార్యక్రమము జరుగుచునే యున్నది. సంస్తంభనము ఎప్పుడును కలిగియుండలేదు. తమరే వరించిన పతిని అంగీకరింపకపోవుట ధర్మవిరుద్ధము. తమపదవిగాని, తదితరుల పదవులుగాని పీఠాధిపతి యెన్నిక జరిగిన తోడనే వదలిపోయిన వని తెలుసుకొనండి.

ఇట్లు,

ఆ కా శ వా ణి.

దమనకరటకులకు సలహా

శుద్ధసనాతులవలె గనుపడుచు శైవము నుద్ధరించు అవతార పురుషులవలె బయలుదేరి మతిలేని పనులొనర్చి పెద్దల ధిక్కరించి పీఠాపచార మొనర్చి మాహేశ్వరగణమును నిందించుచు గణతాంబూ

లము సమర్పించదగిన యీ యిరువురును అనగా శ్రీ శి॥ లింగయ్యగారు శ్రీ ఇ॥ సానందంగారు అనువార లిరువురు సంఘమును, పీఠమును, పీఠాధిపతులను పీఠాధికారులను మతాభిమానులను కరపత్రములద్వారా దూషింపుచు, అనాదికాలమునుంచి మహోన్నత దశయందున్న శైవ మతమును బ్రాహ్మణులకును తదితరులకును హీనముగ దోచునట్లు కరపత్రములమూలమున అశుద్ధప్రచార మొనర్చుచు సనాతనత్వమును స్థాపించవలె నని ప్రయత్నించుచున్నారుగాని ఇట్టి వారు మతములో పూజ్యులైన వారిని తిట్టుచూ సంఘైకమత్యమును ఇంత కాలమువరకును కూర్పలేకపోవుటయేగాక సర్వులకు పరిహాసాస్పదులగుచున్నారు. వీరికి అనుమానములున్న కట్టుబాట్లు చేసుకొనవలెనన్న యిరుపక్షములందుగల బుద్ధిమంతులను పెద్దలను పిలచి ఇంతవరకును ఏల ఐకమత్యమును కలుగచేసుకొనలేదు? అట్లు జరుపుకొన నసమర్థులై అప్రయోజకులై ఆగ్రహావిష్టులై అసూయాపరులై అహంకారముతో పీఠాధిపతులను, పీఠమును, మాహేశ్వరులను తిట్టినందువలన గలుగబోవు ఫలమేమో! ఇకనైనను వీరు తమ సనాతనత్వమును స్థాపించుకొననిండు. కాని తమ ఇష్టప్రకారము జరుగలేదని పరుల నిందించుట పరమపాతకము. ఇంతటితోనైనను వీరు శాంతించి కరపత్రప్రచారము మానుకొని, స్వసిద్ధాంతములయందు స్వసంఘము వారు పాల్గొనునట్టుల పరదూషణలేక ఉపన్యసించుచూ సనాతనత్వమునకై పాటుపడుదురుగాక యని నేను సలహానిచ్చుచున్నాడను.

ఇట్లు,

1—6—1941. యిపటూరి వీరభద్రరావు.

---

# లేఖలు

శికింద్రాబాద్-హైద్రాబాద్ వాస్తవ్యు లగు కొందరు శైవులు శ్రీ శైవ మహాపీఠాధి పతిగారికి మహజరురూపముగు ఒక విజ్ఞాపనమును మహాసభకు లోగడసికింద్రాబాద్ మండలాధ్యక్షులుగలుండిన భాగత్రయాయుర్వేద శిఖామణి బ్రి॥ లో॥ శ్రీ॥ పం॥ మార్కండేశ్వరశాస్త్రి

గారి ద్వారా పంపియున్నారు. ఆ విజ్ఞాపనముతో, మొదటి నుండియు శ్రీశైవ మహాపీఠ విషయమును సాంగముగా తెలిసియున్న శ్రీ॥ పం॥ మార్కండేశ్వర శాస్త్రిగారు ఈ క్రింద వుదహరించిన లేఖను గూడ పంపి యున్నారు. పీఠ వ్యతిరేక ప్రచారమునకు గల నిజమగు కారణములు శైవు లందరికి ఈ లేఖను బట్టి తెలియగలవు.

"బ్ర॥ లో॥ ముదిగొండ నాగలింగశాస్త్రి శివయోగి గారికి—శరణులు.

మన మతమందు అంతఃకలహములు విస్తరిల్లినవి. ఏ వుద్దేశ్యములు అంతరాత్మయం దున్నను మతమందు ప్రజ్వలింప జేసినారు. శంకరారాధ్యులవారు భక్తి పరవశత్వముచే మతాభివృద్ధి గావించిరి. తాము మిక్కిలి విద్యా సంపన్నులు. కాళిదాసాదులలో గణింపబడు వారు, శైవులు. గాన మత కర్తలలో ప్రస్తుత కాలమందు తామె గణింపబడుదురు. కాన తమ కాలమందే యీ మతము స్థిరీకరింపబడి యెన్నికలోనికి తే గల సమర్థులు గాన చిత్తగించి సాధ్యమైనంత శీఘ్రములో యీ కల్లోలమును నివారింప ప్రార్థితులు.

ఇవియే శరణులు,

శ్రీ॥ పం॥ మార్కండేశ్వరశాస్త్రి,

24—5—41"

2. 23 వ శంకరారాధ్య జయంతి ఈ సం॥ర వైశాఖ బ ౫ రోజున వరంగల్లులో జయప్రదముగా జరిగిన దని తెలియవచ్చినది.

3. యలకుర్రులో ఈ సం॥రం జ్యేష్ఠ బ ౫ రోజున బ్ర॥ లో॥ కాశీనాథుని వీరభద్రయ్య అయ్యవార్లం గారిచే రుద్రయాగము జరుప బడును.

## సవరణలు

1. అముద్రిత గ్రంథ ప్రకటనము.

పై శీర్షికతో గతసంచికయందు ప్రకటించబడిన "శంకర ఫౌండ్రీ ప్రొప్రయిటరు బ్ర॥ లో॥ బేతపూడి శరభయ్యగారి మహౌదార్య

ము”కు బదులు “శంకరఘాండ్రి పొర్రిప్రయిటర్లు బ్రి॥ లో॥ బేతపూడి వీరశరభయ్య బ్రి॥ పుచ్చా కోటయ్యగార్ల మహౌదార్యము’’అని పాఠకులు చదువుకొనవలెను.

1 6 41 ము॥ పేరయ్యలింగం అయ్యవారు.

2. గురుమండలి. గతసంచిక 8వ పేజీలో పైశ్రీర్షికలో ప్రకటింపబడిన 3. ముదిగొండ నాగభూషణశాస్త్రిగారు అనుటకు బదులు ఘట్టెపల్లి నాగమల్లయ్యగారు అనియు సవరించు కొనవలెను.

11. “ముదిగొండ కోట్లింగం అయ్యవార్లగారు, యీామని’’ అనుటకు బదులు “ముదిగొంట కోట్లింగం అయ్యవార్లగారు, గుంటూారు’’ అనియు సవరించుకొనవలెను. ప్రిధానమంత్రి.

# ప్ర క ట న

శైవ మహాపీఠమునందు గురుమండలి సభ్యులుగ పీఠాధిపతిచే నిదివరలో నియమింపబడిన 1. బ్రి॥ లో॥ పులిపాక మహానందశాస్త్రి వరంగల్. 2. బ్రి॥ లో॥ ఘట్టెపల్లి నాగమల్లయ్య. 3. బ్రి॥ లో॥ కొడిమేల భోగసోమలింగమూర్తి వరంగల్లు గార్లు తమసభ్యత్వముల నుండి తొలగినందున వారి స్థానములందు 1. బ్రి॥ లో॥ శివలెంక వీరభద్రయ్య అయ్యవారు, బెజవాడ 2. బ్రి॥ లో॥ ముదిగొండ కోటయ్యశాస్త్రి ఈమని. 3. బ్రి॥ లో॥ శ్రీపతి పండితారాధ్యుల బసవలింగము అయ్యవారు, తాడికొండ, గార్లు గురుమండలి సభ్యులుగ పీఠాధిపతి గారిచేనియమింపబడిరి.

పాలకసమితిలో వరంగలు మండలాధ్యక్షులుగ నియమింపబడిన బ్రి॥ లో॥ ముదిగొండ చినవీరభద్రయ్యగారు తమ సభ్యత్వమునుండి తొలగినందున వారిస్థానమున బ్రి॥ లో॥ విద్వాళశిరోమణి ముదిగొండ వీరేశలింగశాస్త్రి, వరంగల్లు,గారిని పీఠాధిపతులు నియమించిరి.

ఈ పరిస్థితిలో పండితసభాధ్యక్షులుగ బ్రి॥ లో॥ మల్లంపల్లి జ్వాలా వీరభద్రిశాస్త్రి, పయిడిముక్కల, గారిని పీఠాధిపతులునియమించిరి.

బెజవాడ, }
ది 4-6-41 } ప్రి ధా న మ ం త్రి.

# మేలుకొలుపు

ది 1-6-1941 తేదీనుంచి శ్రీశైవమహాపీఠము తరఫున యివ్వబడు రసీదులు 551 నంబరు మొదలుకొని 1000 నంబరు వరకు గలవి మాత్రమే అమలులో నుండును. 551 నంబరుకు పూర్వపు నంబర్లు అధికారిక వ్యక్తులయొద్దగాని; ప్రచారకుల వద్దగాని ఇదివరలో జారీ చేయబడి నిల్వయున్నను అవి యింతటినుండి చెల్లవు కాన పీఠమునకు పైకము చెల్లించువారు జాగరూకులయి 551 నంబరు పిమ్మట వున్న రశీదులే పొంది పైకము చెల్లించవలెను.

శ్రీశైవ మహా పీఠము తాలూకు

రశీదులు నెం.

101 నుంచి 150 వరకు బ్ర॥ లో॥ చాగంటి మల్లికార్జనరావుగారు, తణుకు.

151 ,, 200 ,, బ్ర॥ లో॥ పులిపాక మహానందిశాస్త్రిగారు, వరంగల్లు.

201 ,, 250 ,, బ్ర॥ లో॥ ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు, ఈమని.

251 ,, 300 ,, బ్ర॥ లో॥ యినటూరి బుచ్చి సోమన్న అయ్యవార్లంగారు, విజయనగరం.

301 ,, 350 ,, బ్ర॥ లో॥ శింగరాజు సుబ్రహ్మణ్యంపంతులుగారు, బందరు.

351 ,, 400 ,, బ్ర॥ లో॥ శ్రీపతి పండితారాధ్యుల మార్కండేశ్వరశాస్త్రిగారు, శికింద్రాబాదు.

401 ,, 425 ,, బ్ర॥ లో॥ శివలెంక లింగయ్యగారు, బందరు.

429 ,, 450 ,, బ్ర॥ లో॥ చాగంటి రామలింగంగారు, ఏలూరు.

501 ,, 525 ,, బ్ర॥ లో॥ యివటూరి దుర్గా వెంకట సుబ్బారావుగారు, ఆచంట వేమవరం.

పై నంబర్లుగల పుస్తకములు యికనుండి పైన ప్రకటించిన

(మేలు కొలుపు) ననుసరించి చెల్లవు గాన తాము ఆ యా పుస్తకములును, ఇంకా తమవద్దనున్న శ్రీ శ్రీశైవ మహాపీఠమునకు సంబంధించిన పుస్తకములు వగైరా శ్రీశైవ మహా పీఠ కార్యస్థానమునకు వెంటనే 1-7-41 తేదీలోగా పంపవలెను.

ప్రధానమంత్రి.

శ్రీ శివాయ గురవేనమః

# హారభక్తకధా

ఆసీత్ఖలు హిమవన్నగరప్రాంతే మహదరణ్య మేకం. తచ్చ భల్లూక బహుళం, మృగేంద్రరవ ముఖరితం, బృంహద్గజాకీర్ణం, శార్దూల శత పరివృతం, చందనవిటపిపరిష్కృత మపి వహ్ని జ్వాలా విశోషితం, విరాట నగరీవ కీచక శతావృతం, పాతాలగుహేవ బహు విధ విష భుజగ సమావృతం, బహువిధ వృక్షలతాగుల్మతయా మధ్యందినే ప్యవిరళ తమః పటలావృతంచ.

తస్మిన్నేవ ఘోరకాననే ఏకాకీ కృతావాసో భగవాం స్త్రిలోచనోఽవసత్. కిమివ హి దుష్కరం మహతాం. ఏకశ్చైవ భక్తోప్య వసత్తత్రైవ. అభిధానం త్వస్య పశ్చాచ్ఛ్రావ్యామః. సః జాత్యా వ్యాధ కులోద్భవః. ఏవం స్థితే ఏకశ్శివార్చకో ప్యవసత్తత్ర. ఏవం గచ్ఛతి కాలే కదాచిద్వ్యాధః వరాహ మనుసరన్ శివాలయ సమీప మాగచ్ఛత్.

ఆగత్యచ సః ఏకాకినం భగవంతం త్ర్యమ్బకం దృష్ట్వా మనస్యేవ మచిన్తయత్:—అహో కోసౌ వ్యక్తి రస్మిన్నరణ్యే మన్నివాసే కథమే కాకీ నివసతి. బత బతేమ హచ్చిత్రమేతత్ ఇత్యేవం విచార్య క్షణం స్థిత్వా పునర కల్పయత్:— అహోమమ మందభాగ్యతా నాసౌ సామాన్య వక్తిః; కోపిదేవః. సాసౌ కోపి దేవః, భగవాం స్త్ర్యంబక ఏవ. ఇత్యేవం విచార్య భగవంత మూచే:—

భోభగవ న్మహాదేవ ఇతః పర్యన్తం మనసి కిమప్యచిన్తయం. తత్సర్వం క్షమస్వ. అద్యప్రభృతి యథాశక్తి తవ సపర్యాం కరిష్యే. ఇత్యుక్త్వా గృహ మగాత్.

తతఃప్రభృతి గృహాన్ముఖేన కండూషజలం పర్ణపుటేన మాంసాదిక మానీయ ఇతః పూర్వం శివార్చకేన శిరసి నిహితాని పూజాద్రవ్యాణి పాదాగ్రేణాపనీయ గండూషజలేన రుద్రాభిషేకం పర్ణపుటానీత మాంసనివేదనం చ కరోతి.

ఏవంగచ్ఛతి కాలే కదాచిచ్ఛివార్చకః లింగస్యోపరి గండూషజల చిహ్నాని నివేదిత శూల్యమాంసాదీనిచ దృష్ట్వా రౌద్రమూర్తి భూత్వా ఏతన్నీచకార్యం మయిస్థితే అస్మిన్స్థానే భగవతి విరూపాక్షే కే నకృతమిత్యవోచత్. తతో దేవః ప్రత్యక్షో భూత్వా తంప్రత్యేవం నిజగాదః— హే అర్చకఏతత్కార్యం మద్భక్తేన కృతం. సః జాత్యా వ్యాధః. తథాపి సర్వేషాం భక్తానాం మధ్యే అగ్రేసరః సః. భక్త్యా త్వామపి లంఘయతి. తత్సర్వ మప్యద్యైవ తే విశదీ భవిష్యతి. తత్పర్యంతం త్వం మత్పశ్చాల్లీనో భవఇతి. సోపి తథైవాకరోత్.

అనన్తరం యదా జలమాంసాదికానానీయాగతః తదాహరస్యైకనేత్రాద్రక్తంప్రవహతీతి దృష్ట్వా వ్యాధః కథ మస్య చికిత్సాం కరిష్యామీత్యవధార్య బహువిధ వనమూలికా వైద్యమకరోత్. కింతు కించిదపి ప్రయోజనం నాభూత్. తదా భగవద్భక్తి పారవశ్యా ద్భగవన్నామ జపన్ శరేణ స్వనేత్రమేక ముత్పాట్య తన్నేత్రస్థానే కల్పయత్. తదా ద్వితీయనేత్రాద్రక్త ప్రవాహః బభూవ. తదాపిసః తత్రైవ ద్వితీయనేత్రస్థానే స్వపాదం నిధాయ శరేణ ద్వితీయనేత్ర మప్యుత్పాటయితు ముద్యుక్తోఽభవత్.

తదాశూలీ ప్రత్యక్షో భూత్వా భో మమమహాభక్త అలమలమతి సాహసేన ప్రసన్నోస్మ్యహం ఇత్యుక్త్వా అర్చక మాహూయ భో బ్రాహ్మణ దృష్టః ఖిల్వస్య మహిమా. మమభక్తిరేవ ప్రధానా నత్వాహార శుద్ధి రభిషేక శుద్ధిశ్చ. అపిచ నిర్మలబుద్ధినాసమర్పితమేక మపి సహస్ర బిల్వదళ ఫలందీయతే. అతోఽస్య నిర్మలభక్త్యైవ తుష్టోస్మి. భవానపిసేవయా అనుగ్రహీతోసి ఉభావప్యతః లింగైక్యమ వాప్స్యథః ఇత్యవోచత్, తథైవతావుభా వపి లింగైక్యమ వాపతుః-

శివలెంక ఉమామహేశ్వరము,
సాహిత్య విద్యాప్రవీణ 2 వ తరగతి

# ఇనుపగుగ్గిళ్ళు

1. శివపూజా సమయమున శివలింగమును తన హస్తమునం దెట్లు అమర్చుకొనవలెను. సద్యోజాతాది ముఖములలో నే ముఖము యే స్థలమున పూజార్హము ?

2. నిత్యశివపూజా విధానమున శివలింగమునకు కుంకుమపూజ చేయనగునా ? యిది శాస్త్రసమ్మతమా ?

3. హనుమదుపాసన శైవుల కాచరణీయమా ?

4. శైవులచే ఆచరింపబడుచున్న శైవాగమవిహిత ఉత్సవ ప్రకరణమున పాణిగ్రహణములో (1) ఆవరణాంత రేకన్యాదాన దేశం ప్రకల్ప్య (2) అవగణానంత రే కన్యాదాన దేశం ప్రకల్ప్య॥ అని పాఠబేధములు గలవు. యిందేది శాస్త్ర సమ్మతము, ఏది ఆచరణీయము ?

5. శైవాగమమునందు పంచోత్తరశతకలశారాధన పంచాశత్కలశారాధన అనునవి ఏ సమయమున చేయు ఆచారముగలదు, దీని విధానము లేమి ?

6. మృతకర్మయందు చేయు దానాదులలో కర్త ధర్మపత్నీ సమేతోహం అని సంకల్పించవలెనా, దాన సమయమున భార్యసాక్షి తోదకమును వదలవలెనా ? యీ విధానం శాస్త్రసమ్మతమా ? ఆచారమా ?

7. సంవత్సరాశౌచ మనునది గలదా ? ఉండినచో నట్టి సమయమున చేయ తగిన కార్యము లేవి ?

ఈ విషయములు పండితసభలో తగిన శాస్త్రప్రమాణములతో చర్చించి నిర్ణయించవలయును. నేను కొన్నిటిలో వాదించుటకు సంసిద్ధుడనై యున్నాను.

శైవాగమ విశారద డాక్టర్ శ్రీపతి పండితారాధ్యుల
పట్టెసలింగారాధ్యులు బెజవాడ, 24-5-41.

# ...ర్యస్తంభన రసాయనము

తేనెలూరెడి తియ్యనిమందు. వీర్యనష్టముచే పురుషత్వము తగ్గినవారు నవయౌవన వంతులై ...ర్వమువలె కామభోగ మనుభవించుటకు పెట్టినదిపేరు. 25 సంవత్సరములనుంచి అనేకమంది రసజ్ఞులు, ...ావధానులు, జడ్జీలచే చవిజూడబడి భళిరా యనిపించుకొని గొప్ప ప్రఖ్యాతిని బొందినమందు. 3 ...టలలో ప్రత్యక్షగుణము కాకుంటే సొమ్ము వాపసు. 40 దినముల డబ్బి రు. 5 లు. వి. పి. ఖర్చులు ...8-0. శాంపిల్సు అరడబ్బీలు లేవు.

# ...పుంసంజీవి

...బాల్యములో ముష్టిమైథునంచేతను, రంకు ...గముల చేతను, కాలపరిమితిలేకుండ భోగించుట ...తను నరములు బలహీనత చెందినవారికి యీ ...షధము దివ్యామృతము. వృద్ధులకు సైతము ...చ్ఛ కలిగినప్పుడెల్ల సంభోగశక్తిని గలిగిం...ను. 1 సీసా రు. 10. వి. పి. 0-8-0.

# ...తెల్లవెంట్రుకలు

...మీసాలకు వేసే రంగువంటిదికాదు. శాశ్వత ...గా వెండ్రుకల కుదుళ్ళనుంచి నల్లబడుటకు ...్యరంటి తైలం. 3 రోజుల్లో గుణం లేకపోతే ...మ్మ వాపసు 1 సీసా రు. 5. వి. పి. 0-8-0.

# ...క్షయ-ఉబ్బసం

...దగ్గు, దమ్ము, పిల్లికూతలు, శ్లేష్మములకు, ...రోజుల్లో గుణం చూపకపోతే సొమ్ము వాపసు.

సీసా రూ. 10. వి. పి. 0-8-0.

# ...మకరధ్వజరసం

మేలిమి బంగారు, కస్తూరి, అంబరు, విలువగల పునుగు భస్మముతో తయారైనది. 1 మాత్ర వేసు... కుని పాలు త్రాగినచో 1 గంటలో అప్పటి కప్పుడు 70 సంవత్సరముల వృద్ధులకైననుపుంస కులకైనను సీరైన వీర్యమును గట్టిపర్చి శీఘ్రస్ఖ... లనం అవుచేసి లింగపటుత్వము విశేష కామో... ద్రేకము గల్గించి సంభోగ సౌఖ్యము గల్గించు టకు గ్యారంటీ. సీసా 50 మాత్రలు రు. 10. ప్రతి మాత్రలోను బంగారము కనుపించును.

# గర్భనిరోధిని

అతిసంతానము దరిద్ర హేతువు. నూతన దంప తులకు సౌఖ్యము సున్న. గర్భముచే మాతా శిశువులకు ప్రమాదము. ఏ మాత్రము వ్యవధి లేకుండ వెంటనే గర్భం గలుగు చుండుటచే యౌవన స్త్రీలు తమ అంగసౌష్టవము చెడ గొట్టుకొనుచున్నారు. ఈమందును సేవించిన శరీ రారోగ్యమునకు భంగములేదు. 1, 2 సంవత్సర ములవరకు గర్భమురాకుండా అపుటకు రూ. 5/- 4, 5 సంవత్సరములు గర్భమురాకుండా రూ. 10 జీవితంలో ఎప్పటికి రాకుండా అపుటకు.

రూ. 25. వి. పి. 0-8-0

...రు లిచ్చువారు శైవమతప్రకాశిక పత్రికలో ఎడ్వరుటైజుమెంటుచూచి యిచ్చితిమిఅని వ్రాయవలెను.

జవాబులకు బిళ్ళలు పంపవలెను.

...క్టరు రత్నం & సన్సు మెడికల్ హాల్ 252 బి. మలకపేట, హైదరాబాద్ (దక్కన్)

బ్రాంచి:—టౌనుహాలురోడ్డు. విశాఖపట్నం.

# శైవమతప్రకాశిక



సంపాదకుడు

శివలెంక బసవయ్యశాస్త్రి, బి. ఏ., బి. ఎల్.

సంపుటము ౪ 294.55/05 సంచిక ౧



శ్రీ శివాయ గురవే నమః

## శైవమహాపీఠము

## 30 వ వర్ధంతి మహోత్సవము

ఈమని గ్రామమున [తెనాలి తాలూకా] ఏప్రియల్ 24_25_26 తేదీలయందు శైవమహాపీఠ వర్ధంత్యుత్సవములు ప్రత్యేకముగా నేర్పాటుచేయబడిన పందిరియందు జయప్రదముగ జరిగినవి. శైవమతాభిమానులు పలువురు విచ్చేసిరి.

### ప్రథమ దినచర్య

శ్రీ సనాతన శైవసమాజమువారు గ్రంథాలయభవనమునుండి మోటారులలో శ్రీ. లో. శ్రీపతి పండితారాధ్యుల మహాదేవయ్యగారు, ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు, శ్రీపతి పండితారాధ్యుల శివానందశాస్త్రిగారు, ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రి, పండితారాధ్యుల చినమల్లికార్జున అయ్యవారు, శివలెంక బసవయ్యశాస్త్రి. శివలెంక పున్నయ్య, ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ, కంమకూరి వటుకభైరవమూర్తి ప్రభృతులగు మాహేశ్వరవర్గమును బ్యాండువాయిద్యముతో నూరేగింపుచేసి సభాభవనము నెదుట ఫొటో తీసిరి.

శ్రీపతి పండితారాధ్యుల లింగమూర్తిగారు స్వాగతము నొసంగిరి. సనాతన శైవసమాజవక్షమున అధ్యక్షులు శ్రీశతావధాని ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారును భాషాప్రవీణ ముదిగొండ రామలింగ శాస్త్రిగారును స్వాగతోపన్యాసములను చదివిరి. అంతట శ్రీ. పం. మహాదేవయ్యగారు ఉపన్యసించిరి.

## మ ధ్యా హ్న ము

తిరిగి 2 గంటలనుండి కార్యనిర్వాహకవర్గము సమావేశమై పీఠ నిబంధనావళిని చర్చించిరి. ముసాయిదాలో కొన్ని సవరణలు సభ్యులచే చేయబడి శివలెంక బసవయ్యశాస్త్రిగారిచే చదువబడి మహాజన సభలో ఆమోదింపబడినవి. " ఖర నామ సం॥ర సవరణ నిబంధనావళి" అను పేరుగల నూతన నిబంధనావళి యాచరణలోనికి శైవమహాజనుల యామోదముతో వచ్చిన వెంటనే శ్రీపతి పండితారాధ్యుల వట్టిసలింగారాధ్యులు శ్రీ విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారిని పీఠాధిపతులుగ ప్రతిపాదించిరి. శ్రీ ఇవటూరి పాపయ్యశాస్త్రిగారును, శ్రీపతి పండితారాధ్యుల మల్లికార్జున అయ్యవారును బరపరచిరి. మహాజన సభవారి ఏకగ్రీవామోదముతో శ్రీ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు పీఠాధిపతులుగ యెన్నుకొనబడి సభాపీఠ మలంకరించిరి.

తరువాత శ్రీపతి పండితారాధ్యుల వీరభద్రయ్యగారు, శ్రీ ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రిగారు వ్రాసిన స్వాగతపద్యముల చదివిరి. తదుపరి పీఠాధిపతులు తమ సందేశమును వినిపించిరి. తరువాత శ్రీ శివలెంక బసవయ్యశాస్త్రిగారు మహాజనసభవారి యామోదముతో మరల కార్యదర్శిగ పీఠాధిపతులచే నియమించబడిరి.

గతసంవత్సరములందు జరిగిన ఆదాయవ్యయ పట్టికలను, శైవపీఠ భవన నిర్మాణమునకు దేవిడి వ్యవహారమునకును సహాయముచేసిన దాతలయొక్క పవిత్రనామములను చదివి వారి యౌదార్యమును పశంసించిరి. ఆ నాటికి సభ ముగింపు చేయబడెను.

## ద్వితీయదినచర్య

ఉదయము 8 గంటలకు సభ సమావేశమయినది. పీఠాధిపతులు నీల కంఠభాష్య వ్యాఖ్యానములోని కొన్ని శ్లోకములు చదివి వినిపించిన తరువాత శ్రీ. లో. శ్రీపతి పండితారాధ్యుల లింగమూర్తి అయ్యవారు ఇష్టలింగధారణమునుగూర్చి గంభీరోపన్యాసము నొనరించిరి. శ్రీ మోదుకూరు నాగభూషణంగారు శివభక్తినిగూర్చియు, శ్రీ ఇవటూరు పావయ్య శాస్త్రిగారు సోమనాథుని గూర్చియు, శ్రీ ఇవటూరి సానందంగారు ద్వాదశారాధ్యులగూర్చియు నుపన్యసించిరి. శ్రీ సానందంగారు వారు వ్రాసిన చెన్నమల్లేశ్వర శతకమునుండి కొన్ని పద్యముల వినిపించి సభ్యుల నానందపరచిరి.

## సాయంకాలము

3 గంటలకు సభ కూడినది. శ్రీ కాకాని సుబ్బరాయశర్మగారు శివ భక్తినిగూర్చియు, శ్రీ ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రిగారు శైవకవులను గూర్చియు మధురముగా నుపన్యసించిరి. తరువాతి మాదల గ్రామ వాస్తవ్యులగు శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారు తాము వ్రాసిన మహాకపంచాశతి, వాసవదత్త, పండితారాధ్య విజయము మొదలగు గ్రంథములనుండి కొన్ని పద్యముల చదివి సభ్యుల నానందసాగరమున ముంచిరి. వీరికి "మహాకవి" యను బిరుద మొసగబడినది.

నూతన నిబంధనావళి ననుసరించి పండితమండలి సభ్యులును, పాలక సమితి సభ్యులును పేర్కొనబడిరి. శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు ఒక సంవత్సరము పాటు ఉచితముగ పీఠమాసపత్రికను పీఠమునకు సమర్పింప వాగ్దాన మొసగిరి.

శ్రీ. లో. కందుకూరి వటుకభైరవమూర్తిగారు శైవసంఘమును గూర్చియు మతప్రచారమునుగూర్చియు, శ్రీ ముదిగొండ మల్లికార్జున శర్మగారు శైవమును గూర్చియు శ్రీ ముదిగొండ వీరభద్రారాధ్యులవారు శివలీలలను గూర్చియు మధురముగ నుపన్యసించిరి.

# తృతీయ దినచర్య

ఉ॥ 8 గంటలకు సభ సమావేశ మయినది. శ్రీ శివలెంక లింగయ్యగారు శైవులకు కార్యదీక్ష యవసరమని వచించిరి. శ్రీపతి పండితారాధ్యుల శివానందశాస్త్రిగారు తమ సహజపాండిత్య ధోరణిలో వారి యాశ యముల ప్రకటించిరి. సభ్యత్వ చందాలనుగూర్చియు, నిబంధనావళిలోని కొన్ని సవరణాలనుగూర్చియు సభ్యుల సూచనలు సుదీర్ఘముగ విమర్శించ బడి మహాజనసభవారి యామోదముతో అంగీకరించబడినవి. శివజ్ఞాన స్వామి శ్రీ తాడికొండ రాజలింగశాస్త్రిగారు పద్యముల చదువుచు మృదు మధురముగ శివునిగూర్చియు, సనాతన శైవసమాజమువారినిగూర్చియు నుపన్యసించిరి.

## సాయంత్రము

4 గంటలకు పండితమండలి సభ సమావేశమైనది. పండితమండలి అధ్య క్షులుగ శ్రీ ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారు ఎన్నకొనబడిరి.

5 గంటలకు జరిగిన పీఠవర్ధంతి మహోత్సవములో పీఠాధిపతులు తమ యంత్యోపన్యాసము నొసంగిరి. ప్రధానమంత్రిగారు సభకు వచ్చిన ఉత్తరములను చదివిరి. శైవపీఠభవన గృహప్రవేశము వైశాఖ బ ౧౦ రోజున జరుపుటకు నిశ్చయించిరి. ఆ గృహమునందు వేమనారాధ్యపీఠ సంప్రదాయకులును పామకాంతదీక్షాపరులును నిరతాన్నదాతలునగు తెనాలిగ్రామ వాస్తవ్యులయిన శ్రీ ములుగుకోటయ్య అయ్యవార్లగా రుండి మాహేశ్వరసేవ చేయుట కంగీకరించినందులకు సభ్యులు వారికి కృతజ్ఞతను తెలిపిరి.

శ్రీపతిపండితారాధ్యుల లింగమూర్తిగారు పీఠవర్థంత్యుత్సవముల నిచటజరిపించి సభలుజరిగిన 3రోజులును విచ్చేసినసభికులందరికి సకలోప చారములతో నాతిథ్యమొసంగినందులకు వారికిని, వారిసోదరులగు మల్లికార్జునరావుగారికిని, వారికుమారులగు శరభసాళ్వంగారికిని, వారి కుటుంబములకును వారుచూపించిన యాదరణమునకు కృతజ్ఞతావందన

ములు కార్యదర్శిగారర్పించిరి. పీఠాధిపతులు చిరాయురారోగ్యైశ్వర్య పుత్రపౌత్రాభివృద్ధిగ నాశీర్వదించిరి. శ్రీ॥ వ॥ లింగమూర్తిగారు గురుచ రేశ్వరారాధనయే మాకు ముఖ్యమని నుడివిరి. జ్వాలాపతిలింగశాస్త్రి గారు మలుగు పండితయ్యగారు సనాతన శైవసమాజ పక్షమున ధర్మ వాదము లర్పించిరి. ఉపనిషద్వాక్యములతో, మంగళహారతులతో, జయజయ ధ్వానములతో సభ ముగింపు జేయబడినది.

రాజోల్పు శం॥ రమున తెనాలి శైవసమాజపక్షమున 31 వ పీఠ వర్ధంతి మహోత్సవము తమ పురమున జరిపించుటకు శ్రీ. లో. ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు శైవపీఠము నాహ్వానించిరి. మరుదినము శ్రీ ముదిగొండ వీరభద్రారాధ్యులవారు పురజనులకోరికపై గౌరీకళ్యా ణము పురాణము చెప్పిరి.

---

# కార్యదర్శి వేదిక

శైవమహాజనులారా !

లోగడ తమకు 28, 29 వ పీఠవర్ధంత్యుత్సవ రిపోర్టుద్వారా శ్రీశైవ మహాపీఠమునకు సంబంధించిన విషయములను కొన్ని తెలిపియున్నాను. తదుపరి మూడుసంవత్సరములలో జరిగిన విషయములను ఈ రిపోర్టు ద్వారా తెలియజేసికొనుచున్నాను.

## శ్రీ శైవమహాపీఠ నిబంధనావళి

లోగడ శ్రీకందుకూరు వటుకభైరవమూర్తి పంతులుగారిచే వ్రాయ బడి అమలులో నున్న నిబంధనావళిలో చాలసవరణలు జరుగుచు వచ్చినవి. ఆనిబంధనలలో నిబంధనలమార్పును గురించిన 107 వ నిబంధనయు, 14 నుంచి 17 వ నిబంధనవరకున్న మార్పుకాబడి బెజ వాడలో జరిగిన మహాజనసభవారి ఆమోదమును బడసియున్నవి. నా యనుభవములో ఆ వ్రణాళికలోని నిబంధనలు చాలావరకు మార్చి ననేగాని సులభముగా పనిసాగదని తోచి, పాలకసమితి వారి తీర్మానము ననుసరించి " శ్రీఖరనామసంవత్సర సవరణ నిబంధనావళి "

యను పేరుతో పూర్వపు నిబంధనలనన్నిటిని రద్దువరచుచు, క్రొన్ని నిబంధనలను తయారుచేసి, చిత్తుముసాయిదాను అచ్చొత్తించి తల కొక కాపీచొప్పున మీకందరకును మీ యభిప్రాయమును గోరుచు పంపియున్నాను. తరువరి యీమని గ్రామములో ఈ సంవత్సరము ఏప్రిల్ నెల 24, 25. 26 తేదీలలో జరిగిన మహాజనసభలో నిబంధనల సవరణనుగూర్చిన తీర్మానమును ప్రతిపాదించగా, ఆమహాజనసభకు హాజరయిన సభ్యులు, ఆప్రణాళికను క్లాజువారీగా చర్చించి క్రొన్ని సవరణలను ప్రతిపాదించగా మహాజనసభవారు సాకల్యముగా విచారించి, నిబంధనల సవరణ ముసాయిదాను క్రొన్నిమార్పులతో నేకగ్రీవముగా నామోదించి తీర్మానముచేసి యున్నారు. ఆతీర్మానము ననుసరించి, పీఠాధిపతి, కార్యదర్శి, పాలకసమితి, పండితమండలి యెన్నుకోబడినారు.

## ఈ నూతనప్రణాళికలోని ముఖ్యాంశములు

1. పీఠసభ్యత్వము శాశ్వతపీఠసభ్యత్వముగా చేయబడినది. ఏవ్యక్తియయినను పీఠసభ్యత్వలక్షణములు గలిగియుండి ఒకరూపాయి మాత్రము పీఠమునకు చెల్లించినచో పీఠశాశ్వత సభ్యుడగును.

2. పీఠాధిపతియెన్నిక 5 సం॥ ల కొకసారి మహాజనసభలో జరుగును.

3. కార్యదర్శి నియామకము 3 సంవత్సరముల కొకసారి పీఠాధిపతిచే మహాజనసభ అంగీకారముతో జరుగును.

4. పండితమండలికి మతవిషయమును, పాలకసమితికి లౌకిక, ఆర్థికాది వ్యవహారములను, ఒకరికొకరికి సంబంధము లేకుండ పూర్తిగా వదలి వేయబడినవి.

5. ప్రణాళికా సవరణవిషయములో పాలకసమితి తీర్మానించి, మహాజనసభామోదమును బడసినచో సవరణజరుగును.

ఇవుడీ ప్రణాళిక సర్వజనామోదమును బడసినది గనుక ఇకనుంచి ఈ నిబంధలవిషయమై కాలమును వ్యర్థముచేయ నక్కరలేదు. ముందుముందు సవరణలేమైన నవసరమగు నెడల సీలువెంటసులభముగా చేసికొనవచ్చును.

## దేవిడీ వ్యవహారము

శ్రీశైవమహాపీఠము వాదిగానుండి దాఖలుచేసిన యేలూరు సబ్ కోర్టులోని దావా పెండింగులోనున్నట్లును, దీనికిసంబంధించిన విషయములోనే హైకోర్టులో అప్పీలు దాఖలుకాబడినట్లును వెనుకటి రిపోర్టులో తెలుపబడినది. దరిమిలా హైకోర్టులో దాఖలుకాబడిన అప్పీలులో శ్రీ జమీందారిణీగారు గెలిచినారు. ఆహేతువుచే అనుభవజ్ఞులగు న్యాయవాదుల సలహా ననుసరించి శ్రీపీఠము వాదిగానుండి యేలూరు కోర్టులో వేసినదావాను వదలుకోగా కోర్టువారు ఖర్చులు లేకుండా దావాను డిస్‌మిస్ చేసి యున్నారు. పర్యవసాన మేమనగా, దావా పీఠమునకు వ్యతిరేకమైనది.

దావాలో శ్రీ జమీందారిణీగారైన కందుకూరి సత్యవతమ్మగారు గెల్చినను, దావాతో సంబధము లేకుండా శ్రీ శైవమహాపీఠమునకు దానముగా పశ్చిమ గోదావరిజిల్లా తాడేపల్లిగూడెమునకు 2 మైళ్ళదూరములో నున్న కుంచనపల్లి అగ్రహారములో వారి తాలూకు స్వంతకమతము భూమిలో పది యెకరముల మాగాణీ భూమిని ఇచ్చియున్నారు. వారి యౌదార్య మెంతయు ప్రశంసనీయము.

## పీఠ భవనము

వెనుకటి రిపోరులో సూచింపబడిన భవనము పూర్తి అయినది. భవనము కట్టించుటకుగాను పలు ప్రదేశములు తిరుగగా సుమారు నాలుగువేల రూపాయలు వసూలైనవి. భవనమునకు ఉత్తర ప్రహారీ గోడను శ్రీ బేతపూడి వీరశరభయ్యా పంతులుగారు కట్టించినారు. మిగి

లిన మూడువైపుల గోడలు కట్టవలసియున్నవి. వెనుక పీఠమునకు నిలువయున్న సుమారు రు 2000–0–0 లు భవననిర్మాణమునకు వెచ్చింపబడినవి. తిరిగి ఆ సొమ్మును భర్తీచేయవలసియున్నది. ఈ వైశాఖ బహుళ దశమిరోజున భవన గృహప్రవేశము జరుపవలెనని సంకల్పము. ఆలోగా మిగతా మూడువైపుల గోడలను కట్టి, నీటిపంపును, విద్యుచ్ఛక్తి నమర్చుటకై ప్రయత్నించుచున్నాను. లోగడ విరాళము లిచ్చిన దాతలుగాక, మిగతావారు వారికి తోచిన విరాళముల నొసఁగి మిగిలిన పనులకు సహాయుపడుదురని ఆశించుచున్నాను.

## పీఠపు లెఖ్ఖలు

శ్రీ సర్వజిత్, సర్వధారి, విరోధి, వికృతి సంవత్సరముల లెఖ్ఖలను ఆడిట్ చేయించినాను. పాలకసమితివారు మహాజనసభవారు ఏక గ్రీవముగా నామోదించినారు. ఆసంవత్సరముల ఆదాయవ్యయపట్టికలను ఇందులో ప్రచురించుచున్నాను. ప్రస్తుత ఆర్థికపరిస్థితి వానినిపట్టి తెలియగలదు.

## సికిందరాబాదు మఠము

ఈ మఠము శ్రీ పండితస్వామివారు వ్రాయించిన ట్రస్టుడీడ్ ప్రకారము 16 గురు ట్రస్టీలచే పాలింపబడవలెను. ఆ పదహారు స్థానములలో శ్రీ శైవ మహాపీఠమునకు ఒకస్థాన మేర్పరుపఁబడినది. దీనివల్ల వచ్చు ఆదాయము ఆ మఠపరిపాలనకే వెచ్చింపబడును. అందువల్ల శ్రీ శైవ మహాపీఠమునకు, ఆ మఠమునుండి వచ్చు ఆదాయమేమియును లేదు. కాని, ఆమఠముకూడ శ్రీ శైవమహాపీఠపరిపాలన క్రిందనుండుట సంతోషింప దగినవిషయము.

## కాశీలోని సత్రము

వరంగల్ వాస్తవ్యులు శ్రీ కొడిమేల భోగసోమలింగారాధ్యులవారు వారి అజామాయిషీలోనున్న కాశీలోని ముదిగొండవారి సత్రమును శ్రీశైవమహాపీఠపరిపాలనకు వదలిపెట్టుచు ఉత్తరము వ్రాయించి

యిచ్చియున్నారు. ఏ శైవునినైనను కాశీలో కాపురముంచి ఆసత్ర మును పరిపాలించు పద్ధతితో మాత్రమే సత్రపుపరిపాలనను వదలిపెట్టు టకు వారు ఒప్పుకొనియున్నారు. త్వరలోనే అట్టిమాహేశ్వరుని వెదకి సత్రపుపరిపాలనను వశముచేసికొనుటకు ప్రయత్నములు జరుగు చున్నవి.

## ముందుచేయవలసిన పనులు

1. కుంచనపల్లి అగ్రహారంలోని పది ఎకరముల పొలముకు మంచి ముక్తా వచ్చు మార్గ మాలోచించి, ఒక నియామకము చేయుట.
2. విజయవాడలోని పీఠభవనములో పాత్రసామగ్రి వగయిరాల నేర్పాటుచేసి, అందులో నొక మాహేశ్వరుని నివసింపజేసి, మాహే శ్వరులందరికి అందు తాత్కాలిక వసతి నమర్చవలసియున్నది.
3. మతప్రచారము జరిపి అన్నిప్రాంతములలోని శైవులను పీఠసభ్యులుగా చేర్చవలసియున్నది.

ఇతర లౌకికవృత్తిలోనుండి తీరుబడి తక్కువగానున్న నాకు శ్రీ పీఠ మునకు సరిగా సేవ చేయుటకు వ్యవధిలేదనియు, నా యీ పదవిని మరొకరు స్వీకరించవలసినదనియు, ఎంతకోరినను, మరొక సంవత్సరము పాటైనను కార్యభారము వహించుమని పెద్ద లాజ్ఞాపించుటచే విధి లేక మరల కార్యదర్శిగా పనిచేయుచున్నాను. మీరందరును తోడ్ప డిననేగాని యేపనియు నెరవేరదు. కనుక దయయుంచి మీకు చేతనైనంతవరకు ధనసహాయమును, వాక్సహాయమును చేతురని యాశించుచున్నాను.

శైవమతమునకును శైవసంఘమునకును చాల తోడ్పడిన చాల మంది శైవప్రముఖులు ఈ మధ్య గతించినారు. వారి కుటుంబములకు మనసానుభూతిని తెలుపవలసియున్నది.

ఇందుతో జతపరచిన వికృతినామసంవత్సర ఆదాయవ్యయపట్టికలో నమోదుచేయబడిన ఋణదాతలను పీఠ శాశ్వతసభ్యులుగా చేర్చుకొని

వారి బాకీలను రద్దుపరచి కృతజ్ఞత తెలుపుచు వారికి తెలియపరచుట యైనది. ఆ ఆదాయ వ్యయపట్టికలో నమోదుచేయబడి పీఠమునకు రావలసిన బాకీలనుకూడ రద్దుచేయడమైనది. పీఠపత్రికను నడుపుటకు మొదలుపెట్టినాము గనుక ఇకనుంచి యెప్పటి విషయములు అప్పుడు మీకు తెలుపబడును. నాకు మిక్కిలిగా తోడ్పడి శ్రీ పీఠ కార్యక్రమము సక్రమముగా నెరవేర్చిన బ్ర॥ శ్రీ॥ కాశీనాథుని సుబ్రహ్మణ్యంగారికి (పెదపులివఱ్ఱు) నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

శ్రీ శైవమహాపీఠకార్యనిర్వాహక వర్గము

(ఈమని సభలలో ఎన్నికైనవారు)

పీ ఠా ధి ప తి

విద్వాన్, విద్యాప్రవీణ, బ్ర॥శ్రీ॥ శ్రీ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు, ఈమని.

కా ర్య ద ర్శి

శ్రీ శివలెంక బసవయ్యశాస్త్రిగారు బి. యే. బి. యల్. అడ్వకేటు, విజయవాడ.

పా ల క స మి తి స భ్యు లు

1. శ్రీ శివలెంక పున్నయ్యపంతులుగారు బి. యే., వకీలు, గుడివాడ.

2. శ్రీ కందుకూరు వటుకభైరవమూర్తిగారు బి. యే., వకీలు, ప్రిన్సిపాల్, కస్తూర్బా విమెన్సు కాలేజి, విజయవాడ.

3. శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు ప్రొప్రయిటరు, ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ, తెనాలి.

4. శ్రీ తాడికొండ కామేశ్వరరావుగారు, ప్రొప్రయిటర్, వెంకటేశ్వర సినిమాహాల్, తెనాలి - విజయవాడ.

5. శ్రీ ములుగు పండితయ్య అయ్యవారుగారు, కార్యదర్శి, శ్రీ సనాతన శైవసమాజము, ఈమని.

పండితమండలి

1. బ్ర॥ లో॥ శతావధాని, కవిభూషణ, జ్యోతిర్విద్యావిశారద ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారు
ప్రెసిడెంటు, సనాతన శైవసమాజము, ఈమని, పండితమండలాధ్యక్షులు.

2. బ్ర॥ లో॥ పండిత ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు, ఈమని.

3. బ్ర॥ లో॥ శ్రీపతి పండితారాధ్యుల శరభసాళ్వం అయ్యవార్లంగారి కుమారుడు లింగమూర్తిఅయ్యవారుగారు, ఈమని.

4. బ్ర॥ లో॥ శివజ్ఞానశిఖామణి, ముదిగొండ రామలింగశాస్త్రిగారు, తాడికొండ.

5. బ్ర॥లో శ్రీ॥ విద్యాభూషణ, పండితమల్లికార్జున పండితారాధ్యుల శంకరశాస్త్రిగారు, నిర్మల (సోమవారంపేట), మన్మాడ్ లైన్.

6. బ్ర॥ లో॥ మహాకవి ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు,
45 సత్యనారాయణగుడి వీధి, సికిందరాబాద్.

7. బ్ర॥ లో॥ విద్యాప్రవీణ ముదిగొండ శంకరశాస్త్రిగారు,
పాపయ్యపేట, వరంగల్.

8. శ్రీపతి పండితారాధ్యుల పట్టెన లింగారాధ్యులవారు,
స్థానాచార్యులు, శ్రీశైలం, కర్నూలు డిస్ట్రిక్టు.

9. బ్ర॥ లో॥ఇవటూరి పాపయ్యశాస్త్రిగారు (Research Scholar), బళ్లారి.

10. ఉభయభాషాప్రవీణ, మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారు
పమిడిముక్కల అగ్రహారం, (Via) వీరంకిలాకు.

11. ఆగమవిశారద, శివలెంక బుచ్చయ్యఅయ్యవారుగారు,
పెసరమిల్లి, (Via) గుడ్లవల్లేరు.

12. పండిత, శ్రీపతి పండితారాధ్యుల శరభారాధ్యులవారు, విజయవాడ.

## భవనమునకు చందాల నిచ్చిన దాతల పవిత్ర నామములు

### వ రం గ ల్

| | | |
|---|---|---|
| కొడిమేల భోగసోమలింగమూర్తిగారు | | 200-0-0 |
| ముదిగొండ శంకరశాస్త్రి | ,, | 180-0-0 |
| ముదిగొండ రామలింగం | ,, | 100-0-0 |
| ఆకారపు నరసింగంగుప్త | ,, | 500-0-0 |
| కొండూరు రామలింగంశ్రేష్ఠి | ,, | 300-0-0 |
| ఈ బుచ్చిరాజలింగం | ,, | 300-0-0 |
| ఈ మంకయ్యలింగం | ,, | 300-0-0 |
| తోట కుమారయ్య, సోమయ్య సన్నువారు | | 201-0-0 |
| కొమరవల్లి బాలరాజు గారు | | 173-4-6 |
| సిద్దం శెట్టి రామనాథం | ,, | 150-0-0 |
| రామిని రాజమౌళి | ,, | 50-0-0 |
| చెలుపూరి మంకయ్యలింగం | ,, | 50-0-0 |
| కందకట్ల మాణిక్యం బ్రదర్సు | ,, | 51-0-0 |
| బొల్లం లింగయ్య | ,, | 50-0-0 |
| చిదిర సోమశేఖరం | ,, | 50-0-0 |
| అడ్డగూడూరి రామన్న కు॥ శంకరలింగంగారు | | 50-0-0 |
| తోట కేదారిగారి చంద్రశేఖరం | ,, | 25-0-0 |
| తోట శివయ్య | ,, | 25-0-0 |
| గుండాముక్తి లింగంగారి రాజలింగం | ,, | 25-0-0 |
| కలవాల లింగమూర్తి, కరీంబాద్ | ,, | 25-0-0 |
| చిదిర రాజలింగం | ,, | 15-0-0 |
| పోలా వెంకటబాపయ్య | ,, | 10-0-0 |
| చిదిర పెదమల్లయ్య | ,, | 5-0-0 |
| బుద్దాదమ్మయ్య | ,, | 26-0-0 |
| భూపతి సోమలింగంగారు | ,, | 61-13-0 |
| తోట విశాలమ్మ | ,, | 6-0-0 |
| | | 2835-4-6 |

## ఈ మ ని

| | | |
|---|---|---|
| శ్రీ సనాతన శైవసమాజం | | 50-0-0 |
| ముదిగొండ శేషమ్మగారు | | 46-0-0 |
| శ్రీ॥ వం॥ చినమల్లికార్జున అయ్యవారు గారు | | 25-0-0 |
| ముదిగొండ రామలింగశాస్త్రి | ,, | 20-0-0 |
| ఈ కోటయ్యశాస్త్రి | ,, | 20-0-0 |
| ములుగు పండితయ్య | ,, | 20-0-0 |
| తాడికొండ మీనాక్షమ్మ | ,, | 50-0-0 |
| శ్రీ॥ వం॥ జోగయ్యగారి కు॥ లింగమూర్తి | ,, | 14-0-0 |
| ముదిగొండ లింగమ్మ | ,, | 50-0-0 |
| తాడికొండ మల్లికార్జునుడు అయ్యవారు | ,, | 13-0-0 |
| శ్రీ॥ వం॥ కాళహస్తిలింగం | ,, | 25-0-0 |
| ముదిగొండ చినభద్రయ్య | ,, | 25-0-0 |
| శ్రీ॥ వం॥ శరభసాళ్వం | ,, | 10-0-0 |
| శ్రీ ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి | ,, | 8-0-0 |
| ముదిగొండ కొండయ్య | ,, | 12-0-0 |
| శ్రీ॥ వం॥ శరభసాళ్వంగారి కు॥ లింగమూర్తిగారు | | 11-0-0 |
| మల్లంపల్లి నాగమల్లికాంబ | ,, | 10-0-0 |
| ముదిగొండ పేరయ్యగారి కు॥ లింగమూర్తిగారు | | 6-0-0 |
| ముదిగొండ యల్లమందయ్యగారి కు॥ మల్లికార్జునరావుగారు | | 14-0-0 |
| ముదిగొండ పెదమల్లయ్యగారు | | 15-0-0 |
| తాడికొండ పూర్ణానందం | ,, | 18-0-0 |
| శ్రీ॥ వం॥ విశ్వనాథం | ,, | 6-0-0 |
| ముదిగొండ విశ్వనాథం | ,, | 4-0-0 |
| శి వృ పృ సీతాంబ | ,, | 3-0-0 |
| శ్రీ వ॥ కోటయ్య | ,, | 5-0-0 |
| ముదిగొండ శేషమ్మ | ,, | 13-0-0 |
| | | 447-0-0 |

### సికిందరాబాదు

| | |
|---|---|
| ములుగు బుచ్చయ్యగారు | 50-0-0 |

### పెదపులివర్రు

| | |
|---|---|
| కాశీనాధుని వీరభద్రయ్యగారు | 50-0-0 |
| కాశీనాధుని చంగలరాయుడుగారు | 100-0-0 |
| | 150-0-0 |

### మున్నంగి

| | |
|---|---|
| శివలెంక సుబ్బారావుగారు | 100-0-0 |
| శ్రీ వం॥ వీరాంబగారు | 50-0-0 |

### గుంటూరు

| | |
|---|---|
| ముదిగొండ కోటిలింగం అయ్యవారుగారు | 10-0-0 |

### వమిడిముక్కల

| | |
|---|---|
| మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారు | 10-0-0 |

### బందరు

| | |
|---|---|
| శివలెంక మల్లికార్జునరావుగారు | 50-0-0 |

### విజయవాడ

| | |
|---|---|
| శ్రీ బేతపూడి వీరశరభయ్య పంతులుగారు | ఉత్తరపు ప్రహరీగోడ |
| ఉప్పలూరు వెంకటసుబ్బారావుగారి భార్య సీతామహాలక్ష్మమ్మ | 116-0-0 |
| సింగరాజు వెంకటసుబ్బారావు భార్య | 116-0-0 |
| ఇవటూరి పున్నయ్యపంతులు భార్య లక్ష్మీనరసమ్మగారు | 100-0-0 |
| | 332-0-0 |

### తెనాలి

| | |
|---|---|
| ముదిగొండ కొండయ్యగారి భార్య అన్నపూర్ణమ్మగారు | 500 0-0 |
| ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు | 200-0-0 |
| మల్లంపల్లి సుందరమ్మగారు | 100-0-0 |
| | 800-0-0 |

| | |
|---|---|
| కాకుమాను ప్రసాద్ గారు | 250-0-0 |
| | 1050-0-0 |
| ములుగు వీరభద్రరావుగారు | 10-0-0 |
| | 1060-0-0 |

పెడన

| | | |
|---|---|---|
| లింగరాజు అంబయ్యగారు | | 50-0-0 |
| ఈ చినమల్లవరాజు | ,, | 25-0-0 |
| ఈ సూరపరాజు | ,, | 25-0-0 |
| ఈ పేరయ్యలింగం | ,, | 10-0-0 |
| ఈ నాగేశ్వరరావు | ,, | 9-0-0 |
| | | 119-0-0 |

తోటవల్లూరు

| | |
|---|---|
| శివలెంక వీరేశలింగంగారు | 50-0-0 |

గుడివాడ

| | |
|---|---|
| తాడికొండ చినమల్లికార్జున అయ్యవారుగారు | 50-0-0 |

దేవిడివ్యవహారమునకు బాండ్లరూపములో విరాళములిచ్చిన దాతల పవిత్రనామములు

| | |
|---|---|
| 250-0-0 | కొండూరు వెంకటరాజం బ్రదర్సు, వరంగల్ |
| 100-0-0 | ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారు, తెనాలి |
| 100-0-0 | మల్లంపల్లి కుమారబ్రహ్మానందంగారు, యలకుర్రు |
| 100-0-0 | శివలెంక పరబ్రహ్మ శాస్త్రిగారు, పెసరమిల్లి |
| 100-0-0 | కొంపల్లి హనుమంతరావుగారు, ముసరాబాద్ |
| 75-0-0 | అత్తలూరు వెంకట సుబ్బారావుగారు, గుంటూరు |
| 50-0-0 | కాశీనాథుని రామలింగంగారు, దుగ్గిరాల |
| 50-0-0 | కాశీనాథుని విజయభైరవ ప్రసాదరావుగారు, శోభనాద్రిపుర అగ్రహారము |
| 50-0-0 | మల్లంపల్లి రామలింగశాస్త్రిగారు, గుడివాడ |

| | |
|---|---|
| 50-0-0 | తాడికొండ చినమల్లికార్జునుడు అయ్యవారు, గుడివాడ |
| 50-0-0 | శివలెంక పున్నయ్య పంతులుగారు, గుడివాడ |
| 50-0-0 | కొడిమేల భోగసోమలింగమూర్తి గారు, వరంగల్ |
| 50-0-0 | చిదిర సోమశేఖరంగారు, వరంగల్ |
| 50-0-0 | రామిని రాజమౌళిగారు, వరంగల్ |
| 50-0-0 | కాశీనాధుని శరభయ్యగారు, పెదపులివఱ్ఱు |
| 50-0-0 | ములుగు కుమారస్వామిగారు, పెదపులివఱ్ఱు |
| 50-0-0 | చాగంటి వీరసుబ్రహ్మణ్యం అయ్యవారుగారి భార్య సుబ్బాయమ్మగారు, గుడివాడ |
| 50-0-0 | కాశీనాధుని సాంబశివరావుగారి కుమారుడు బుచ్చయ్య, యలకఱ్ఱు |
| 50-0-0 | శింగరాజు అంబయ్యగారు, పెడన |
| 50-0-0 | శింగరాజు సూరపరాజుగారు, పెడన |
| 50-0-0 | ఇవటూరి వెంకటకృష్ణారావుగారు, ఏలూరు |
| 50-0-0 | శివలెంక వీరేశలింగంగారు, తోటవొల్లూరు |
| 50-0-0 | శివలెంక లింగయ్యగారు, మచిలీపట్నం |
| 50-0-0 | మల్లంపల్లి భైరవప్రసాదరావుగారు, మచిలీపట్నం |
| 50-0-0 | ముదిగొండ నాగలింగశాస్త్రిగారి కుమారుడు అఘోరపతి అయ్యవారు తెనాలి |
| 50-0-0 | ముదిగొండ మల్లికార్జునుడుగారు, తెనాలి |
| 50-0-0 | ముదిగొండ కోటేశ్వరరావుగారు, సికిందరాబాద్ |
| 50-0-0 | ఇవటూరి దుర్గావెంకటసుబ్బారావుగారు, ఆచంటవేమవరం |
| 50-0-0 | మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారు, పమిడిముక్కల |
| 50-0-0 | తాడికొండ పూర్ణానందంగారు, విజవలూరు |
| 50-0-0 | చాగంటి శంకరశాస్త్రిగారు, మదరాసు |
| 50-0-0 | శివలెంక బుచ్చయ్య అయ్యవారుగారు, పెసరమిల్లి |
| 50-0-0 | మల్లంపల్లి నాగమ్మగారు |
| 25-0-0 | శివలెంక పిచ్చయ్య అయ్యవారు, గుడివాడ |
| 44-8-0 | ఇవటూరి సానందరావుగారు, పమిడిముక్కల |

| | | |
|---|---|---|
| 29-4-0 | కాశీనాథుని సుబ్బారావుగారు,<br>Trustee Malleswaraswamy. | శోభనాద్రిపుర<br>అగ్రహారం |
| 25-0-0 | కానూరి వెంకట శివరావుగారు, | విజయవాడ |
| 25-0-0 | కందుకూరి వటుక భైరవమూర్తిగారు, | విజయవాడ |
| 100-0-0 | కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడుగారు, | బందరు |
| 25-0-0 | లింగరాజు బసవరాజుగారు, | పెడన |
| 25-0-0 | కాశీనాథుని వీరేశలింగం అయ్యవారుగారు, | బందరు |
| 25-0-0 | కాశీనాథుని ఓంకారం అయ్యవారుగారు, | యలకుర్రు |
| 12-8-0 | ముదిగొండ బాలకోటయ్యగారు, | తెనాలి |
| 12-8-0 | మద్ది సోమయ్యగారు, | వరంగల్ |
| 12-8-0 | ముదిగొండ విశ్వనాథం(కొండయ్యగారికుమారుడు), | ఈమని |
| 12-8-0 | తాడికొండ పున్నయ్యగారు, | శోభనాద్రిపురం |
| 11-0-0 | ములుగు వీరభద్రరావుగారు, | తెనాలి |
| 10-0-0 | ముదిగొండ బసవయ్యశాస్త్రిగారి భార్య సుబ్బాయమ్మ | విజయవాడ |

బాకీలను రద్దుపరచుకొని ఔదార్యమును చూపిన
ఋణదాతల పవిత్రనామములు

| | |
|---|---|
| ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు, ఈమని | 62- 0-0 |
| ముదిగొండ రామలింగశాస్త్రిగారు, ఈమని | 114-11-6 |
| కందుకూరు వటుక భైరవమూర్తిగారు, విజయవాడ | 111-15-9 |
| శ్రీపతి పండితారాధ్యుల పట్టిసలింగారాధ్యులుగారు | 19- 4-9 |
| శివలెంక బసవయ్యశాస్త్రిగారు, విజయవాడ | 10- 0-0 |

I శ్రీసర్వజిన్నామసంవత్సర నగదు, జమ, ఖర్చుల
కాతా 23-3-47 మొదలు 9-4-48 వరకు

జమలు

113–2–3 ప్రారంభపునిల్వ
92–5–0 బి. జ.
20–13–8 హాళీ.
87– 8–0 ఋణపత్రములవల్ల
410– 0–0 ఆంధ్రాబ్యాంక్, విజయవాడ
157– 0–0 డిటో గుడివాడ
886–12–0 29 వ వర్ధంతి విరాళములు
187– 8–0 సభ్యత్వపుచందాలు
1841–14–8

| | |
|---|---|
| 29 వ వర్ధంతిఖర్చులు | 1137–3–10 |
| స్టేషనరీ | 11–13–3 |
| ఆడిట్ ఖర్చులు | 20– 0–0 |
| పోస్టేజి | 17–15–9 |
| గుమస్తాజీతములు | 186–10–8 |
| ప్రింటింగ్ | 76–10–0 |
| ప్రయాణపుఖర్చులు | 88–12–0 |
| వరంగల్ మండలి పరిషత్తువారికి | 9– 0–0 |
| చాగంటిశంకరశాస్త్రిగారికి ఫీజు | 114– 0–0 |
| చాగంటి వీరసుబ్రహ్మణ్యం అయ్యవారుగారి ఖర్చులనిమిత్తం | 2– 0–0 |
| శివలెంకపున్నయ్య పంతులుగారికి ఇచ్చినది. | 11– 0–0 |
| మల్లంపల్లి అచ్యుతలింగంగారికిచ్చినది | 2– 4–0 |
| ఆంధ్రాబ్యాంక్, గుడివాడ డిపాజిటు | 137– 0–0 |
| నగదునిల్వ కల్దార్ 6–11–6, హాళీ 20–13–8 | 27– 9–2 |

## II శ్రీసర్వజిన్నామసంవత్సర (ది 23-3-47 మొదలు 9-4-48 వరకు) ఆదాయ వ్యయములకాతా

జమలు

| | |
|---|---|
| 65- 5-0 | బ్యాంక్ వడ్డీకాతా |
| 886-12-0 | విరాళములకాతా |
| 187- 8-0 | సభ్యత్వచందాలు |
| 849- 0-0 | నికరవ్యయం |

| | |
|---|---|
| వర్ధంతిఖర్చులు | 1137- 3-10 |
| స్టేషనరీ | 11-13-3 |
| ఆడిట్ ఫీజు | 20- 0-0 |
| పోస్టేజి | 17-15-9 |
| గుమాస్తాజీతము | 186-10-8 |
| ప్రింటింగు | 76-10-0 |
| ప్రయాణపుఖర్చులు | 88-12-0 |
| వ్యాజ్యపుఖర్చులు | 449-7-6 |
| | 1983-9-0 |

(Sd.) N. Umamaheswara Rao.
*Income-tax Practitioner & Auditor*
Ellore Road, VIZAYAWADA
8—4—51

## III 9-4-48 తేదీనగల ఆస్తి అప్పుల పట్టిక

లోకులకు ఇయ్యవలసిన బాకీలు

| | |
|---|---|
| ముదిగొండ కోటయ్యశాస్త్రిగారికి | 62-0-0 |
| ఇవటూరి దుర్గావెంకటసుబ్బారావుగారికి | 10-0-0 |
| ముదిగొండ రామలింగశాస్త్రిగారికి | 114-11-6 |
| కందుకూరి వటుకభైరవమూర్తిగారికి | 111-15-9 |
| శ్రీపతి పండితారాధ్యుల పట్టిసలింగారాధ్యులుగారికి | 19-4-9 |

## ఋణపత్రములు

| | | |
|---|---|---|
| గతసంవత్సరం తాలూకు | | |
| కల్దారు | 2327-0-0 | 2362-10-0 |
| హాలీ | 35-10-0 | |
| ఈ సంవత్సరం కల్దారు | | 87-8-0 |
| | | 2768-2-0 |

## ఆస్తులు

### లోకులవల్ల రావలసిన బాకీలు

| | | |
|---|---|---|
| శివలెంక లింగయ్యగారివల్ల | | 34-2-0 |
| శివలెంక మల్లికార్జునరావుగారివల్ల | | 1-9-9 |
| విశాఖమండలివల్ల | | 10-12-0 |
| మల్లంపల్లి అచ్యుతలింగంగారివల్ల | | 2-4-0 |
| శివలెంక పున్నయ్యగారివల్ల | | 11-0-0 |
| చాగంటి వీరసుబ్రహ్మణ్యంగారివల్ల | | 2-0-0 |
| శికిందరాబాద్ మండలి పరిషత్ వల్ల | | 12-4-0 |
| ఈమని గ్రామసంఘంవల్ల | | 10-0-0 |
| వరంగల్ మండలివల్ల | | 9-0-0 |
| ఫర్నిచరు | | 7-8-0 |
| బ్యాంకునిలవ | | |
| ఆంధ్రాబ్యాంక్, గవర్నరుపేట, బెజవాడ | 2263-3-11 | 2281-13-9 |
| ,, గుడివాడ | 18-9-0 | |
| 22-3-47 వరకు జమనిల్వ | 490-12-8 | 358-3-4 |
| ఈసంవత్సరం నికరవ్యయం | 849-0-0 | |
| నగదునిల్వ కల్దార్ | 6-11-6 | 27-9-2 |
| హాలీ | 20-13-8 | |
| | | 2768-2-0 |

## ఆడిట్ సర్టిఫికెట్టు

శ్రీ శైవమహాపీఠముయొక్క సర్వజిన్నామ సంవత్సరమునకు సంబంధించిన నగదు, జమ, ఖర్చులు, ఆదాయ వ్యయములను, ఆస్తి అప్పులపట్టికలను వోచర్లతోను, రశీదులతోను పరిశీలించితిని. అవి సరియైన పద్ధతిలోనే వ్రాయబడి యున్నవి. పైన వ్రాయబడిన ఆస్తి అప్పుల పట్టిక పీఠముయొక్క నిజస్థితిని తెలియజేయుచున్నది.

(Sd.) N. UmamaheswaraRao
8-4-51
*Income-tax Practitioner & Auditor.*
Ellore Road, VIZAYAWADA.

## వికృతిసంవత్సరం 6—4—51 తేదీకిగల ఆస్తి అప్పుల పట్టిక, లోకులకు ఇయ్యవలసిన బాకీలు

| | |
|---|---|
| ప్రధానమంత్రిగారికి | 10— 0— 0 |
| ముదిగొండ కోటయ్యశాస్త్రిగారికి | 62— 0— 0 |
| ఇవటూరి దుర్గావెంకటసుబ్బారావుగారికి | 10— 0— 0 |
| ముదిగొండ రామలింగశాస్త్రిగారికి | 114—11— 6 |
| కందుకూరి వటుకభైరవమూర్తిగారికి | 111—15— 9 |
| శ్రీపతి పండితారాధ్యుల పట్టెస లింగారాధ్యులవారికి | 19— 4— 9 |
| ఋణపత్రములు గతసంవత్సరం | 2414— 8— 0 |
| హాలీ | 35—10— 0 |
| సభఖాతా గత సం॥ నిల్వ | 3626— 6— 9 |
| ఈ సంవత్సర నికరాదాయం | 305—10— 6 |
| మొత్తం | 6710— 3— 3 |

## ఆస్తులు, లోకులవల్ల రావలసిన బాకీలు

| | |
|---|---|
| శివలెంక లింగయ్యగారివల్ల | 34—2— 0 |
| ,, మల్లికార్జున రావుగారివల్ల | 1— 9— 9 |
| విశాఖమండలివల్ల | 10—12— 0 |

| | | | |
|---|---|---|---|
| సికింద్రాబాద్ మండలివల్ల | 12 | 4 | 0 |
| మల్లంపల్లి అచ్యుతలింగంగారివల్ల | 2 | 4 | 0 |
| శివలెంక పున్నయ్యగారివల్ల | 11 | 0 | 0 |
| వరంగల్ మండలిపరిషత్తువల్ల | 9 | 0 | 0 |
| గ్రామసంఘాలవల్ల | 15 | 8 | 6 |
| భవనంఖర్చు గతసంవత్సరం | 6336 | 0 | 0 |
| ,, ఈ సంవత్సరం | 216 | 0 | 0 |
| ఫర్నిచర్ | 14 | 8 | 0 |
| సేవింగ్స్ ఎకౌంట్, ఆంధ్రబ్యాంకు | 22 | 5 | 11 |
| ఆంధ్రబ్యాంకు, గుడివాడ | 18 | 9 | 10 |
| చిల్లానిల్వ | 6 | 3 | 3 |
| మొత్తం | 6710 | 3 | 3 |

## ఆడిట్ సర్టిఫికెట్టు

శ్రీ శైవమహాపీఠము యొక్క సర్వధారి, విరోధి, వికృతి సంవత్సరములకు సంబంధించిన నగదు జమాఖర్చులను, ఆదాయ వ్యయములను, ఆస్తి అప్పుల పట్టికలను, వోచర్లతోను రసీదులతోను పరిశీలించితిని. లెక్కలు సరియైన పద్ధతులతోనే వ్రాయబడియున్నవి. ఇందు వ్రాయబడిన ఆస్తి అప్పులపట్టిక పీఠముయొక్క నిజస్థితిని తెలియజేయుచున్నది.

(Sd.) యస్. ఉమామహేశ్వరరావు
15-4-51

*Income-tax Practitioner & Auditor*
Ellore Road, VIZAYAWADA

## వికృతి సం॥ 20-3-50 మొదలు 6-4-51 వరకు

## ఆదాయ వ్యయముల పట్టిక

| | ఖర్చు |
|---|---|
| స్టేషనరీ | 1— 9—6 |
| ప్రింటింగ్ | 17—10—0 |
| పోస్టేజి | 5— 0—0 |
| పన్నులు, అద్దెలు | 73— 2—0 |
| ప్రయాణపు ఖర్చులు | 52—14—0 |
| కావలామనిషికి | 47— 0—0 |
| ఈ సంవత్సర నికరాదాయం | 305—10—6 |
| మొత్తం | 502—14—0 |

జమలు

| | |
|---|---|
| 500— 0—0 | భవనంచందాలు |
| 2—14—0 | వడ్డీ ఆంధ్రబ్యాంకు, విజయవాడ |
| 502—14—0 | మొత్తం. |

## వికృతిసంవత్సరము 20—3—50 మొదలు 6—4—51 వరకు

## నగదు జమాఖర్చు కౌతా

ప్రారంభపునిల్వ

జమ

| | |
|---|---|
| 54—3—9 | ప్రారంభపునిల్వ |
| 500—0—0 | భవనమునకుచందాలు |
| 40—8—0 | ప్రధానమంత్రివలన |
| 137—0—0 | కరెంటుఎకౌంటు, ఆంధ్రబ్యాంకు |
| 732—0—9 | మొత్తం |

ఖర్చు

| | |
|---|---|
| స్టేషనరీ | 1– 9–6 |
| అచ్చు | 17–10–0 |
| పోస్టేజి | 5– 0–0 |
| పన్నులు, అద్దెలు | 73– 2–0 |
| ప్రయాణపుఖర్చులు | 52–14–0 |
| కాపలామనిషికి | 47– 0–0 |
| భవననిర్మాణపుఖర్చులు | 216– 0–0 |
| ప్రధానమంత్రి | 305–10–0 |
| ఫర్నిచర్, లాంతర్లు | 7– 0–0 |
| చిలా నిల్వ | 6– 3–3 |
| మొత్తం | 732– 0–9 |

# శ్రీ శైవ మహా పీఠము

## [రిజిష్టర్డు]

కార్యస్థానము : విజయవాడ [బెజవాడ]

## నిబంధనావళి

### ఉపోద్ఘాతము

ఇది ఖరనామ సంవత్సర సవరణ నిబంధనావళి యని పిలువబడును.

ఇంతవరకుగల అన్ని నిబంధనలు దీనితో రద్దు అగుచున్నవి. కాని ఇంతకు బూర్వము గల నిబంధనల ననుసరించి చేయబడిన అన్ని పనులును, నియమింపబడిన అధికారిక వ్యక్తులును, ఈ నిబంధనల ననుసరించి జేయబడినట్లును, నియమింపబడినట్లును ఎంచవలెను.

ఈ నిబంధనావళి వెంటనే అమలులోనికి వచ్చును.

# 1. సంఘము

I. సంఘము పేరు.

ఈ సంఘముయొక్క పేరు "శ్రీ శైవమహాపీఠము".

II. సంఘముయొక్క సంకల్పములు.

[1] నిగమాగమాదిప్రమాణచోదితమగు శివతత్త్వజ్ఞానమును, శివోపాసనము నభివృద్ధి చేయుట.

[2] శాస్త్రీయములును, శైవార్ణములు నగు నిహపర శ్రేయస్సాధనముల నిరూపించి వాని యనుష్ఠానమును బెంపొందించుట.

[3] శైవమతమునకును, శైవసంఘమునకును, ఆశ్రయమును శరణ్యమునై యుండి సనాతన ధర్మరీతిని వాని యభ్యుదయమునకై కృషి సల్పుట.

[4] పూర్వోక్తసంకల్పత్రయమునకు సంగతములును సాధకములు నగు అన్ని కార్యములు చేయుట; అనగ (అ) నిగమాగమతంత్రపురాణేతిహాసాదివాఙ్మయమునకు జెందినట్టియు, ఇతరములయినట్టియు పుస్తకములతో గ్రంథాలయములను, పఠనమందిరములను నెలకొల్పుట.

(ఆ) తత్త్వయాథాత్మ్యనిశ్చయసాధనమగు దర్శనజ్ఞానమును, అందుకు వలయు భాషాదిజ్ఞానమును గలుగజేయుటకై సాహిత్యవేదశాస్త్రాది పాఠశాలలను స్థాపించి ప్రాచీనాధునికవిద్యల గఱపుట.

(ఇ) యథోక్తతపోమంత్రయోగాదిసాధనానుష్ఠానములచే సర్వాభ్యుదయహేతువగు తేజస్సంపాదనమును, నిశ్శ్రేయసహేతువగు పరతత్త్వానుభవమును సమకూర్చుట కొరకు యోగ్యములగు నాశ్రమములను నెలకొల్పి వివిధములగు శాస్త్రీయసాధనములను ప్రోత్సహించుట.

(ఈ) గ్రంథాలయ, ముద్రణ ప్రకటనమూలమునను, ఉపన్యాసాదులమూలమునను, ఇతర ప్రచార ప్రక్రియలచేతను, పీఠవర్ధంత్యుత్సవములమూలమునను, శివతత్త్వజ్ఞానమును, శివోపాసనమును విస్తరింపజేసి శైవమతవృద్ధికిని, వ్యాప్తికిని కృషి సలుపుట.

(ఉ) స్వస్వవర్ణాశ్రమోచితధర్మకర్మానుష్ఠానమును బెంపొందజేసి, వృత్తివిద్యల నేర్పి, కళలను, బరిశ్రమలను ప్రోత్సహించుట మూలమున శైవసంఘము యొక్క ఆర్థికాది పరిస్థితుల నభివృద్ధిచేసి సంఘాభ్యుదయమునకు దోడ్పడుట మున్నగునవి.

## 2. వివరణము

III. [2] ఈ నిబంధనలు శ్రీ శైవమహాపీఠము యొక్క నిబంధనలైయుండి, పీఠము యొక్క పరిపాలనావిధానమంతయును, పీఠాంతర్గత సకలవర్గములయొక్కయూ, ఆధికారికవ్యక్తులయొక్కయు చర్యలును, పీఠముయొక్క సమస్త కార్యక్రమములును యీ నిబంధనల ప్రకారమే జరుగవలెను.

[3] విషయమునకుగాని, ప్రకరణమునకుగాని విరుద్ధము కానియెడల యీ నిబంధనలలోని

(అ) "పీఠము" అను పదము "శ్రీశైవ మహాపీఠము" ను సూచించును.

(ఆ) "సంవత్సరము" "మాసము" మున్నగు కాలవిభాగములను చాంద్రమానరీత్యా గ్రహించవలెను.

(ఇ) "శైవుడు" అను పదమునకు యీ దిగువ 4 వ నిబంధనప్రకారము సభ్యత్వలక్షణములు కలిగియున్న యేవయస్సుగల వ్యక్తి అయినను అని యర్థము.

(ఈ) "పీఠాధిపతి"యను పదము యీ దిగువ నిబంధనల ప్రకారము ఎన్నుకోబడిన పీఠాధిపతులకు మాత్రమే వర్తించును.

(ఉ) పుంలింగ స్త్రీలింగములును, ఏకవచన బహువచనములును, అన్యోన్యద్యోతకములై యుండును.

(ఊ) నిబంధనల ప్రకారము ఆయా వర్గసమావేశములకును, ప్రత్యేక తీర్మానములకును వలయు సభ్యుల సంఖ్య లెక్కించుటలో భిన్నాంకములను బూర్ణాంకములుగ గ్రహింపవలెను.

(ఋ) "నిబంధనలు" అనగా యీ ప్రణాళికయందలియు, వీటి ననుసరించి చేయబడునట్టియు నిబంధనలు.

(ౠ) "సభ్యుడు" అనగ పీఠసభ్యుడు.

## 2. పీఠ సభ్యత్వము

4 (అ) నిగమాగమాదిప్రమాణములం దాస్తిక్యము కలిగినట్టియు

(ఆ) చాతుర్వర్ణ్యమునకు జెంది స్వవర్ణాశ్రమోచితధర్మాచరణము కలిగినట్టియు

(ఇ) శివాద్వైతమతావలంబులై చిన్మయ శాంభవ పాశుపత శిరోవ్రతాది సంజ్ఞిత దీక్షాపరియుక్త శివలింగ ధారణమును, అష్టావరణ పంచాచార పూర్వక విహితానుష్ఠానమును గలిగినట్టియు

(ఈ) సత్ప్రవర్తనము గలిగినట్టియు

(ఉ) 18 సంవత్సరములకు మించిన వయస్సు గలిగినట్టియు

స్త్రీలును పురుషులును పీఠసభ్యత్వమున కర్హులై యుందురు.

5. నిబంధనల ప్రకారము జరుగు మహాసభకు హాజరగుటకును, నిబంధనల ననుసరించి చర్చలలో పాల్గొనుటకును, తీర్మానముల నుపపాదించుటకును, తీర్మాన సమయములందు స్వాభిప్రాయ మొసగుటకును, సభ్యులు అధికారము కలిగియుందురు.

6. ఇంకను యీ నిబంధనలవలనగాని, వీని ననుసరించికాని తనకు గలుగజేయబడు అన్ని యితరాధికారములను ప్రతి సభ్యుడు గలిగియుండును.

7. అర్హత కలిగియున్నటుల తమకు తోచిన యే వ్యక్తినైనను పీఠసభ్యునిగా పాలక సమితి యంగీకరింపవచ్చును. ఏ వ్యక్తినైనను పాలకసమితి సభ్యునిగా చేర్చుకొనుటకు నిరాకరించినచో హేతువుల చెప్ప నవసరములేదు. ఏ వ్యక్తినైనను సభ్యునిగా చేర్చుకొనుటకుగాని, నిరాకరించుటకుగాని, సభ్యత్వదక్షిణవిషయమై నిర్ణయించుటకుగాని పాలకసమితికి సర్వాధికారము గలదు.

8. ప్రతి సభ్యుడును పీఠమునకు పాలకసమితిచే నిర్ణయింపబడు దక్షిణను సభ్యుడుగా చేరునపుడే సమర్పించవలెను. పీఠమునకు సభ్యుడు చెల్లింపవలసిన దక్షిణ ప్రస్తుతము రు 1-0-0 మాత్రమై యున్నది. సభ్యుడు యీ మొత్తముతప్ప మరే మొత్తమును తన సభ్యత్వ దక్షిణకిర్రింద తన జీవితములో పీఠమునకు చెల్లించ నవసరము లేదు. ఇంతకు పూర్వము పీఠమునకుగల యావజ్జీవసభ్యులు, తమ సభ్యత్వమునకు మరే మొత్తమును చెల్లించ నక్కరలేదు. తదితరపూర్వసభ్యులు, నూతనముగా యీనిబంధనల ననుసరించి సభ్యులుగ జేరవలెను.

9. పీఠపత్రిక యున్నచో ప్రతి సభ్యుడును దానికి చందాదారుగనుండి నిర్ణీతమగు చందాను చెల్లింపవలెను. అట్లు నిర్ణీతమగు చందాను చెల్లించనిచో సభ్యుడు పీఠపత్రికను పొందజాలడు. మరియు అట్టి పీఠపత్రికలో ప్రచురింపబడు అన్ని విషయములు, నోటీసులు ఆయనకు తెలిసినట్లే భావింపబడును.

10. ఏ సభ్యుడయినను పీఠ కార్యదర్శికి తన నివృత్తిపత్రము (Resignation) నర్పించికాని, వేరువిధముగ నందజేసికాని రశీదు పొందుటవలన తన సభ్యత్వమును స్వేచ్ఛచే

స్వీయముగ నంతమొందించుకొనవచ్చును. కాని అట్లు చేయుటకు పూర్వము తాను పీఠమునకు చెల్లించవలసిన అన్ని మొత్తములును చెల్లించు బాధ్యత నిలిచియే యుండును. అంతకుపూర్వము జరిగియుండు అన్ని చర్యలకును బద్ధుడైయుండును. అంతకు పూర్వము పీఠమునకు చెల్లించిన యే మొత్తములును ఆయనకు తిరిగి రావు.

## 3. పీఠాంతర్గతవర్గములు

11. ఈ దిగువ పేర్కొనబడిన మూడువర్గములు పీఠాంతర్గతములై యుండి స్వాధికారానుసారముగ పీఠ కార్యములను నెరవేర్చుచుండును.

అనగా :—

(i) మహాజనసభ (ii) పండిత మండలి (iii) పాలకసమితి.

## 4. మహాజనసభ

12. పీఠముయొక్క సర్వసభ్యుల సమష్టికి "మహాజనసభ" అని పేరు. ఇయ్యది సాధారణ పరిస్థితులలో ప్రతిసంవత్సరము చైత్రమాసములో సమావేశమగును.
13. ఇదిగాక యేవిషయములో నైనను అత్యవసరముగ మహాజనసభ యభిప్రాయము, బరిష్కారము అవసరమగు నెడల కార్యదర్శి మహాజనసభ నెన్నడైన నాహ్వానింపవచ్చును.

14. మహాజనసభయొక్క తీర్మానము పీఠాంతర్గత సకలవర్గములచే శిరసావహింపబడి... సర్వవిధముల నాచరణములో పెట్టవలసియుండును.

## 5. పాలకసమితి

15. కార్యదర్శియు ఆయనచే నియమించబడిన మరి అయిదుగురు సభ్యులును పాలకసమితి సభ్యులుగ నుందురు.

16. సంవత్సరమునకు రెండుసారులు పాలకసమితి సమావేశములు సాధారణముగ జరుగవలెను.

17. పాలకసమితికి కార్యదర్శి యధ్యక్షుడై యుండును.

18. పాలకసమితి సమావేశములకు అప్పటికిగల సభ్యుల మొత్తపుసంఖ్యలో రెండవవంతు సభ్యులు కనిష్ఠసంఖ్యగ నుండవలెను. అన్ని సమావేశములందును కార్యదర్శియే సాధారణముగ నధ్యక్షత వహింపవలెను. అప్పు డాయన లేనియెడల ఆయనచే నియమితుడగు మరియొక సభ్యుడు అధ్యక్షత వహింపవచ్చును.

19. పీఠాధిపతియు, కార్యదర్శిచే నాహ్వానింపబడిన పీఠసభ్యులును, పండితమండలి సభ్యులును పాలకసమితి సమావేశములందు ఉపస్థితులైయుండి తమకు తోచిన సలహాల నీయవచ్చును. కాని తీర్మానసమయములందు స్వాభిప్రాయ మొసంగరాదు వీరిని పాలకసమితి సమావేశ కనిష్ఠసంఖ్యలో లెక్కింపరాదు.

20. [1] పీఠసంకల్పములను సక్రమముగ నెరవేర్చుటయు

[2] పీఠముయొక్క స్థిరచరాదిరూప యావద్విశిష్టధన ద్రవ్యసత్వములందు పీఠపక్షమున స్వాధీనము కలిగి క్రమప్రకారము రక్షించి, వ్యవహరించి యథాశక్తి వృద్ధిచేయుటయు

[3] పీఠాంతర్గత సకలవర్గముల యొక్క తీర్మానములను క్రమప్రకారము నాచరణలో బెట్టించుచు, పీఠకార్యక్రమములను యథావిధిగ నడిపించుటయు పాలకసమితి కృత్యములై యుండును.

21. పాలకసమితికి యుక్తమనితోచెనేని అప్పుడప్పుడు పరిమిత నిర్దిష్టకాలములకుగాని, పీఠాధిపతి అనుజ్ఞతో ననిర్దిష్టముగాగాని తనయధికారములలో వేనినైనను లేక అన్నిటినైనను కార్యదర్శికి నొసంగవచ్చును. తిరిగి యెన్నడయిన నట్టియధికారములను రద్దుపరచి యంతటినుండి పాలకసమితి వాటిని స్వయముగనే నిర్వహింపవచ్చును.

## 6. పండితమండలి

22. (i) బ్రాహ్మణవర్ణమునకు జెంది నటువంటివిన్నీ

(ii) గ్రంథ పరిశ్రమచే గాని, విషయానుభవముచే గాని పండితులుగ నెన్నదగినటువంటివిన్నీ

(iii) వేదాంతప్రస్థానత్రియము నధ్యయనము చేసి నట్టియు

(iv) శివపంచాక్షరీ మహామంత్రమును పురశ్చరణము చేసినట్టియు

(v) శైవాగమనిష్ఠులై శైవాచారపరాయణులై శాస్త్రోక్తశైవచిహ్నములను, లాంఛనములను ధరించునట్టియు

పీఠసభ్యులలో నుండి పండితమండలి సభ్యులను 12 గురిని పీఠాధిపతి నియమించవలెను. అందెవరినైనను తనకు యుక్తమని తోచినప్పుడు తొలగించి ఆస్థానమున మరియొకరిని నియమించవచ్చును.

23. పండితమండలి సభ్యులు తమలో నొకరిని అధ్యక్షునిగా నెన్నుకొనవలెను.

24. పండితమండలి సమావేశములకు సభ్యులకనిష్ఠసంఖ్య అప్పటికిగల మొత్తపుసభ్యుల సంఖ్యలో మూడవవంతుగ నుండవలెను.

25. మతవిషయమైన యీ మండలి చేయు తీర్మానములను పీఠమండలి యన్నివర్గములు, అందరు అధికారులు, అందరు వ్యక్తులు శిరసావహించి ఆచరణలో బెట్టవలెను.

26. పండితమండలికి ఆర్థికాది వ్యవహారములయందును, సంఘాభివృద్ధికరలౌకికవిధానముల యందును యెట్టి ప్రసక్తియును లేదు. పండితమండలి తాను శాస్త్రపరిశీలన మందును, కృత్యాకృత్యనిర్ణయమందును, విద్యావ్యాపనమందును, అనుష్ఠానాభివృద్ధి యందును, మతప్రచారమందును, శాస్త్రీయ ధర్మ కర్మ ప్రవర్తనమందును ఏకైక దృష్టిని నిల్పి పనిచేయవలెను.

27. సంవత్సరమునకు మూడుసార్లు పండితమండలి సమావేశములు సాధారణముగా జరుగవలెను.

28. కార్యదర్శి పండితమండలికి కార్యదర్శిగ నుండును.

## 7. వర్గములసమావేశములకు సంబంధించిన విషయములు

29. మహాజనసభ, పండితమండలి, పాలకసమితి సమావేశములను కార్యదర్శియే ఆహ్వానించవలెను.

30. ఏదేనివర్గముయొక్క అసాధారణసమావేశము ఆవర్గమున కప్పటికిగల మొత్తపు సభ్యుల సంఖ్యలో రెండవవంతు సభ్యులకోరిక మీద, అట్టికోరిన రెండునెలలలోగా కార్యదర్శి ఆవర్గసమావేశము నాహ్వానింపవలెను. అట్టి కాలపరిమితిలోపల కార్యదర్శి అట్టిసమావేశము నాహ్వానింపని యెడల అట్టిసమావేశమును కోరిన సభ్యులు తామే స్వయముగా అట్టిసమావేశము నాహ్వానింపవచ్చును.

ఇదిగాక కార్యదర్శికి యుక్తమనితోచినపుడు ఏవర్గముయొక్క అసాధారణ సమావేశమునైనను ఆహ్వానింపవచ్చును.

31. సమావేశముల ఆహ్వానము వర్గసభ్యులకు ప్రత్యేకలేఖల మూలమునగాని, పీఠపత్రిక యున్నచో దానియందును, లేనిచో మరియొకపత్రికయందున ఒకసారి ప్రకటించుట మూలమునగాని చేయవలెను.

32. సాధారణ సమావేశములకు, ఆహ్వానము బంపు లేక ప్రకటించు దినమునకును, సమావేశ దినమునకును నడుమ సాధారణముగ 7 రోజులకు తగ్గని వ్యవధి యుండవలెను. కాని అత్యవసరసందర్భములలో తక్కువ వ్యవధికూడ నుండవచ్చును.

33. అసాధారణ సమావేశములకు ఆహ్వానము బంపు లేక ప్రకటించు దినమునకును, సమావేశ దినమునకును నడుమ సాధారణముగ 15 రోజులకు తగ్గని వ్యవధి యుండవలెను.

34. నిర్ధార్య విషయములను గురించియు, సమావేశ కార్యక్రమమును గురించియు సాధ్యమగువరకు పూర్తి వివరముల నాహ్వానమునందు తెలుపవలయును. కాని ఆత్యయికములగు విషయములను ఆహ్వానమునందు దెలుపకపోయినను సమావేశములందు చర్చించి తీర్మానింపవచ్చును.

35. ఏ వర్గమునకైనను తత్కాలమందు నియమితమైయుండు సభ్యస్థానములం దెవ్వియేని ఖాళీగనున్న మాత్రమున వర్గచర్య లక్రమములు కానేరవు.

36. స్వాభిప్రాయము నొసంగు నర్హతగల ప్రతివర్గసభ్యుడు తీర్మానసమయమందు తన యభిప్రాయము నొసంగవచ్చును. అట్టి యభిప్రాయమునకు "వృతి" లేక "వరణము" అని యీనిబంధనలలో సంకేతనామము. సమావేశమందలి సభ్యులు భిన్నాభిప్రాయు లగుచో నధికతరవరణముల ప్రకారము విషయము పరిష్కృతమైనట్లెంచబడును. ఇతర సభ్యులకంటె సమావేశ మందలి అగ్రాసనాధిపతికి నధికముగ మరియొక వరణము (విశిష్టవరణము) నిచ్చునధికారముండును.

37. పీఠాధిపతి స్వయముగ నాజ్ఞాపించినట్టి యే విషయమును గురించి యైనను లేక కార్యదర్శికి అవసరమనియు, యుక్తమనియు తోచినట్టి యే విషయమును గురించి యైనను తీర్మానమును లిఖించి కార్యదర్శి యొక్క సంతకముగల లేఖతో ఆ యా వర్గముల తత్కాల సభ్యులందరికిని బంపి వారిలో మూడవ వంతుసంఖ్యవారి యనుకూలాభిప్రాయము బడయుటమూలమున ఆ యా వర్గముల సమావేశము లేకయే తీర్మానము చేయవచ్చును. ఇట్టి తీర్మానమునకు లిఖిత తీర్మానమని పేరు.

38. స్వాభిప్రాయ మొసంగు నర్హతగల ప్రతివర్గసభ్యుడును, వర్గసమావేశములకు స్వయముగ హాజరు కాజాలనియెడల, అట్టి ఆవర్గసమావేశమందు తీర్మానించబోవు విషయమును గురించిన తన యభిప్రాయమును లిఖితరూపకముగ కార్యదర్శికి అందచేయుటమూలముగ, ఆ సభ్యుడు ఆ సమావేశమునకు హాజరయినట్లే యెంచబడును. మరిన్ని ఆ సభ్యుడుకూడ వర్గసమావేశ కనిష్ఠసభ్యుల సంఖ్యలో లెక్కించబడును.

39. పీఠసంకల్పములకును, యీ నిబంధనలకును వ్యతిరేకమగు తీర్మానముల నే వర్గమైనను చేయగూడదు. అవి చెల్లవు. ఆచరణీయములు కానేరవు.

## 8. కార్యదర్శి

40. లోకానుభవము కలిగి వ్యవహారదక్షుడై కార్యతత్పరుడైనట్టియు, శైవమతమునందును, శైవమతవ్యాప్తియందును ఆసక్తి కలిగినట్టియు, బ్రాహ్మణవర్ణమునకు చెందినట్టియు, ఏపీఠసభ్యుడైన పీఠాధిపతి, మహాజనసభ అంగీకారముతో, కార్యదర్శిగ నియమింప వలెను.

41. పై 40 వ నిబంధన ప్రకారము నియమింపబడిన వ్యక్తి కార్యదర్శిగా, అట్లు నియమింపబడిన సంవత్సర శేషము కాక తరువాత రెండు సంవత్సరములు ముగియు వరకు సాధారణముగ బదవియందుండును.

42. ఏ యితర నిబంధనయొక్క నిర్ణయ మెట్లున్నను క్రమప్రకారము మరియొక వ్యక్తి కార్యదర్శిగ నియమింపబడి పదవిని స్వీకరించువరకు బూర్వవ్యక్తి పదవియందుండి తీరవలెను. బాధ్యతను నివర్తింపవు.

43. (అ) పండితమండలియొక్కయు, పాలకసమితియొక్కయు నిర్ణయములకు లోబడి పీఠముయొక్క సంకల్పములు ఫలించురీతి దాని కార్యపద్ధతిని నడిపించునట్టియు,

(ఆ) పీఠాంతర్గత సకలవర్గములయొక్క తీర్మానములను యథావిధిగ నాచరణములో బెట్టించునట్టియు,

(ఇ) పీఠముయొక్క యుక్తపరిపాలన విషయములో పీఠాధిపతికి నుత్తరవాదిగనుండు నట్టియు,

ముఖ్యపాలకుడై కార్యదర్శి యుండవలెను.

44. కార్యదర్శికి నీడిగువ ప్రత్యేకాధికారములుండును. అనగా

(i) ఈనిబంధనలకును, పాలకసమితియొక్క పరిశీలనకును లోబడి పీఠమునకు జెందిన స్థిరచరాస్తులు, ధనము, పత్రములు, ఇతరలిఖితములు, లెక్కపుస్తకములు, ముద్ర (Seal) మున్నగు సకలమును తనస్వాధీనమందుంచుకొని విధుల మేరకు వ్యవహరించుటయు,

(ii) పీఠకృత్యములు, వేతనములు, నియమములు మున్నగు వానితో గూడినట్టి యేవిధమైన యుద్యోగస్థానములకుగాని, భృత్యస్థానములకుగాని తనక ర్హులని

తోచినవ్యక్తులను నియమించుటయు, మార్చుటయు, తొలగించుటయు తాత్కాలికముగ నిలుపు చేయుటయు,

(iii) పీఠమునకు చెందిన సమస్త వ్యవహారములను న్యాయస్థానాదులయందలి చర్యలను, ఉత్తరప్రత్యుత్తరములను పీఠపక్షమున తన పదవిపేరటనే జరుపుచుండుటయు,

(iv) పీఠమున కితరులీయవలసిన లేక యిచ్చునట్టి అన్ని బాపతుల సైకములను పీఠపక్షమున వసూలు పరచుటయు,

(v) పీఠధనసంబంధములో బ్యాంకులు ప్రభుత్వ కార్యస్థానములు, స్థానికపాలన సంస్థలు, వ్యాపారవర్గములు, ఇతర వ్యక్తులు మున్నగు వానితో జరుపబడు సకల వ్యవహారములును, మరియు ధనమును బ్యాంకులు మున్నగు వానిలో వేయుట, మార్చుట, తీయుట, వడ్డీని వసూలుచేయుట మొదలగు సకల కార్యములను పీఠపక్షమున తన పదవిపేరటనే జరుపుటయు,

(vi) అన్ని బాపతుల బిల్లులనుపరిశీలించి యంగీకరించుటయు, పీఠమువలన చెల్లింపదగినట్టియు, లేక పాలక సమితిచే నంగీకరింప బడినట్టియు అన్ని మొత్తములను పీఠపక్షమున జెల్లించుటయు మొదలగునవి.

45. కార్యదర్శిగ నుండు వ్యక్తి తనకు తోచినయెడల దన నివృత్తిపత్రమును పీఠాధిపతికి స్వయముగ నర్పించి లేక వేరువిధముగ నందజేసి పదవినుండి విరమించుకొనవచ్చును.

46. కార్యదర్శిగనుండు వ్యక్తి పీఠవ్యవహారసంబంధములో దురుద్దేశ్యముతో పీఠమునకు నష్టకరము లేక హానికరమగు విధమున దుష్పరిపాలనము (Mis-Management) గాని, మోసము (Fraud) గాని, పీఠద్రవ్య విషయములో దుర్వినియోగము గాని, అక్రమలబ్ధి (Misappropriation) నొందుటగాని, పీఠమునెడ జరిగించినట్లు దోషారోపణ చేయబడి, ఋజువు చేయబడి, మహాజనసభవారు అట్టి దోషారోపణ సక్రమమైనదని కార్యదర్శిచెప్పు సంజాయిషీని విని పరిశీలించిన పిదప తీర్మానించిన యెడల పీఠాధిపతి అట్టి వ్యక్తిని కార్యదర్శిపదవినుండి తొలగింపవచ్చును.

47. కార్యదర్శి తనయొక్క అన్ని అధికారములను పీఠాధిపతి యనుజ్ఞతో పరిమితకాలములకు పాలకసమితి సభ్యులలో నెవరికైనను నొసంగ (Delegate) వచ్చును.

48. మరణాది కారణములచేగాని, యితరహేతువులచేతగాని కార్యదర్శి కాకస్మికాభావము కలుగునెడల, పీఠాధిపతి పాలకసమితి సభ్యులలో యెవరినైనను కార్య

దర్శిత్వమునకు నియోగించవచ్చును. అట్టివ్యక్తి సక్రమముగ మరియొక కార్యదర్శి యెప్పుడి పదవి స్వీకరించువరకును, లేదా పీఠాధిపతి నియమించు కాలమువరకు కార్య దర్శియొక్క కృత్యములను, అధికారములతోను బాధ్యతతోను నెరవేర్చుచుండ వలెను.

49. కార్యదర్శి యేకారణముచేతనైన కొలది కాలమువరకు కార్యదర్శిత్వమునుండి విర మించుకొనదలచినయెడల, పీఠాధిపతి సెలవొసంగవచ్చును. అట్టి సందర్భములో 48 వ నిబంధన ప్రకారము జరుగవలెను.

50. కార్యదర్శి తనకు తోచినవారిని పాలకసమితి సభ్యులుగా నియమించుటకును తనకు యుక్తమని తోచినపుడు అందెవరినైన తొలగించి ఆస్థానమున మరియొకరిని నియ మించుటకును అధికారము కలిగియుండును.

## 9. పీఠాధిపతి

51. సనాతన ధర్మరతియు, శమదమాద్యుత్తమగుణసమృద్ధియు, జ్ఞానవైరాగ్యభక్తి దార్ఢ్యంబునుగలిగి, మంత్రతపో యోగాద్యనుష్ఠానముచే సిద్ధుడై, మహిమాన్వితుడై సర్వదక్షుడగు శివయోగి శ్రీశైవమహాపీఠము నధిష్ఠింప నర్హుడైయుండును. పీఠాధిపతి బ్రాహ్మణవర్ణమునకుచెంది యుండవలెను.

52. పీఠాధిపతిని మహాజనసభవారు యెన్నుకొనవలెను.

53. పై 52 వ నిబంధనప్రకారము పీఠాధిపతిగ నియమింపబడినవ్యక్తి 54 వ నిబంధనకు లోబడి అట్లు నియమింపబడిన సంవత్సరశేషము కాక, మరినాల్గుసంవత్సరములు ఆయన పీఠాధిపతిగ నుండును.

54. పీఠాధిపతిగనుండువ్యక్తి శివాపచార, పీఠాపచార, ధర్మచ్యుతులనదగు దుష్కృత ములలో నెద్దానినైన నొనర్చుటచేగాని, యితరనిర్దిష్టకారణముచేగాని పీఠాధిపత్య మున కనర్హుడని పండితమండలి తత్కాల సర్వసభ్యుల యేకగ్రీవాభిప్రాయముతో తీర్మానించి, ఆతీర్మానమును, మహాజనసభలో ఆమోదింపజేసినయెడల, అది మొదలుకొని అట్టి వ్యక్తి యొక్క పీఠాధిపత్యము నివర్తించును. మహాజనసభవారు అట్టి యంగీకారమునకు పూర్వము పీఠాధిపతి సంజాయిషీని వినవలెను.

55. (1) పీఠాధిపతి పీఠాంతర్గతవర్గములలో దేనియందును సభ్యుడుకాక, అన్ని వర్గము లకు నతీతుడును, సాక్షియు, బరమ నియంతయునై యుండును. తా నొక్కడే వ్యక్తి రూపమగు మహావర్గము. పీఠమునకుతా నొక్కడే యేకైక ధర్మకర్తగ

నుండి సర్వవర్గములను ఆధికారికవ్యక్తులను నిబంధనలప్రకారము శాసించుచు యథావిధిగ ప్రవర్తింపజేయుచు పీఠము యొక్క యోగక్షేమములకును, క్రమాభివృద్ధికిని, పీఠముయొక్క సంకల్పసిద్ధికిని శ్రీ శివసాక్షిగ బాధ్యత వహించి కారణభూతుడై యుండవలెను.

(౭) పీఠాధిపతికి విహిత ప్రత్యేకకృత్యము లెవ్వియు లేవు. సర్వభర్తయై యుండుటచే ప్రాసంగికముగ వలయు సర్వాధికారములను దనకుండును.

అనగ,

(అ) ఏవర్గముయొక్క సమావేశమునైనను గోరవచ్చును.

(ఆ) ఏవర్గముయొక్క యే సమావేశమందైనను తాను ఉపస్థితుడైయుండి సలహానిచ్చుచు చర్చలయందు పాల్గొనవచ్చును. కాని తీర్మానసమయము లందు స్వాభిప్రాయ మొసంగరాదు.

(ఇ) ఏవర్గముయొక్క యేసమావేశమునైనను లేక యే తీర్మానమునైనను పరిమితకాలమువరకు నిలుపుచేసి వెంటనే తనకు యుక్తమని తోచిన అవసరచర్యను దీసికొనవచ్చును. అనగ సమావేశముయొక్క నిర్ధార్య విషయములను మార్చవచ్చును. లేక సవరించవచ్చును. తీర్మానము చేయ బడిన విషయమును తిరిగి చర్చించి తీర్మానించుకొరకు ఆ వర్గమునకే తిరిగి పంపవచ్చును.

(ఈ) పీఠమునకు జెందిన సకల సంస్థలందు, భవనములందు, పరిదేశములందు ప్రవేశించుటకును, స్థితిగతులను, కృత్యములను, లెక్కలను, పుస్తకములను, వస్తువులు, సామానులు మున్నగువానిని బరిశీలించుటకును, అవసరమగుచో వానిని దాను స్వాధీనపరచుకొని అవసరమగు చర్య గైకొనుటకును అధికారముగలదు.

(ఉ) ఏ విషయమును గురించి గాయైనను యీ నిబంధనల యందలి విధులు అస్పష్టములుగను లేక అసంగతములుగను లేక సంధిగ్ధములుగను లేక పరస్పర విరుద్ధములుగ నున్నవనుకారణముచేతగాని ఏ విషయము గురించి యైనను యీ నిబంధన లందు విధి కానరాదను కారణము చేత గాని ఏదైనవర్గముయొక్క లేక వ్యక్తియొక్క చర్యలేక కృత్యమువలన పీఠకార్యములకు నిరోధము లేక భంగము గలుగు నను లేక కలిగెనను కారణము చేతగాని మరియు నేదైన సాహ్మకయాకసియ సంఘటన

మును వారించు నిమిత్తముకాని అవసరమగు వర్గతీర్మానము లేక నిబంధనాదికము లేక ఆధికారికచర్య క్రమప్రకారము శాసింపబడు లోపల నేదైన నర్యాక్రియ యవసరమని తనకు తోచిన యెడల పీఠాధిపతి పండితమండల్యధ్యక్షుని యొక్కయు, కార్యదర్శియొక్కయు సలహోను గైకొని తనకు తోచిన శ్రీముఖమును ప్రకటించుటకు సంపూర్ణాధికారము కలిగి యుండును. శ్రీముఖము లేవిషయమును గూర్చియైన నుండవచ్చును. ఇట్లు ప్రకటింపబడిన శ్రీముఖము లన్నివర్గముల తీర్మానములకంటెను బలీయములై అన్నివర్గములను శాసించునవియై యుండును. అట్టి శ్రీముఖము ప్రకటింపబడినదినము మొదలు ఆరునెలలవరకు ప్రాణముకలిగి యుండును. అంతట తనయంతనే నివర్తించును. అవసరమగు శాసనాదికము యీ లోపలనే జరుగవలెను. ఏ విషయము గురించియైన పూర్వము శ్రీముఖముపుట్టి నివర్తించినను, అప్పటప్పటి సందర్భములను బట్టి ఆ విషయమును గురించియే తిరిగి పైప్రకారము శ్రీముఖము పుట్టవచ్చును. ఇదియును పూర్వోక్త నియమములకు లోబడియుండును. సృష్టించిన శ్రీముఖమును మార్చుటకును, రద్దుపరచుటకును సంపూర్ణాధికారము పీఠాధిపతికి గలదు.

(ఈ) పండితమండలి, పాలకసమితి వర్గములుగాని మహాజనసభ వర్గముగాని క్రమముగా నేర్పడకపోయినను, యేర్పడినవర్గము సరిగా పనిచేయక పోయినను, లేక యేర్పడినవర్గము పనిచేయుటకు వీలులేని స్థితిలో నుండినను, ఆయావర్గములు చేయు కృత్యములన్నియును పీఠాధిపతి నిర్వర్తింపవచ్చును.

56. పై 54 వ నిబంధన ననుసరించి దోషారోపితుడై తొలగింపబడుటమూలమునగాని, మరణావ్యాకస్మిక కారణములవలన గాని, పీఠాధిపతిస్థానమున కభావముకలుగు నెడల క్రమప్రకారము మరియొక వ్యక్తి పీఠాధిపత్యమునకు నియమింపబడి పీఠము నధిష్ఠించువరకుమాత్రము పండితమండల్యధ్యక్షుడు గాని, అట్టియధ్యక్షుడు లేనియెడల తత్కాల పండితమండలి సభ్యులలో మండలిసభ్యులచే నెన్నుకొనబడిన సభ్యుడుగాని పీఠాధిపతియొక్క కృత్యములలో అధికారములతోను, బాధ్యతలతోను నిర్వహించుచుండవలెను.

57. పీఠాధిపతి తనకు తోచినయెడల తన నివృత్తిపత్రమును పండితమండలి కందజేసి పదవినుండి విరమించుకొనవచ్చును. అట్టిచో 58 నిబంధన ప్రకారము జరుగవలెను.

58. నిబంధనల ప్రకారము క్రమముగ నేర్పరుపబడిన వర్గముల మూలమునను, అధికారుల మూలమునను, ఉద్యోగులు, భృత్యులు మున్నగువారి మూలమునను ఆ యా పీఠకృత్యములన్నియు జరుగుచుండవలెను. కాని పీఠాధిపతి యీ నిబంధనలందును, వీనిని బురస్కరించుకొని చేయబడు శాసనాదికములందును నిర్ణయింపబడిన ఆ యా యధికారముల నిర్వహించుటమాత్రము తప్ప యెన్నడును స్వయముగ నితరాధికారుల కర్తవ్యమును గాని, యితరులు చేయదగు పనులుగాని సాధ్యమైనంతవరకు చేయరాదు.

## 10. ప్రతిజ్ఞ

59. పీఠసభ్యులందరును పీఠసంకల్పముల సమగ్రసిద్ధికై సర్వవిధముల తోడ్పడు చుండవలెను.

60. ప్రతి వ్యక్తియు వర్గసభ్యత్వమును గాని, అధికారికస్థానమును గాని, యితపదవిని గాని స్వీకరించుటకు బూర్వము పీఠాధిపతి సమక్షమున తాను శివాపచార పీఠాపచార ధర్మచ్యుతులనెడి దోషత్రయమునకు తావియ్యనని బ్రతిజ్ఞ చేయవలెను.

## 11. వార్షిక వర్ధంతి

61. ప్రతి సంవత్సరమందు పీఠముయొక్క వార్షికవర్ధంతి మహోత్సవము సాధారణముగ జరుగవలెను. ఇయ్యది ముఖ్యముగా మతప్రచారము కొరకేర్పడినందున వేర్వేరు సంవత్సరములందు వేర్వేరు ప్రాంతములందు జరుపవచ్చును. ఈ వర్ధంతులందు

[1] మంత్రోపదేశములు, దీక్షాప్రదానములు

[2] పండితులను, విద్యార్థులను బరీక్షించి వారికి పట్టములు, బిరుదములు, బహుమతులొసంగి సన్మానించుట

[3] ఐహికాముష్మికములగు నానావిషయములగూర్చి విషయజ్ఞులగు సుప్రసిద్ధ పురుషులిచ్చు మహోపన్యాసములు

[4] ఇంకను పండితమండలికి యుక్తమని తోచు నితరవిషయములు జరుపవలెను.

## 12. పీఠపత్రిక

62. అవకాశముండువరకు పీఠపక్షమున సాధికారప్రకటనముగ నొక పత్రిక ప్రకటింపబడు చుండవలెను. కార్యదర్శిగాని, కార్యదర్శిచే నియమింపబడు మరొక పీఠసభ్యుడు గాని పత్రికాధిపతిగనుండి పత్రికనుగూర్చిన సకలవిషయములలోను పీఠపక్షమున సంపూరాధికారము కలిగియుండును.

## 13. దేవాదాయ, ధర్మాదాయములు రహస్యప్రతిష్ఠాపనములు

63. పీఠస్వామ్యమున పీఠోపయోగార్థమై ఏదైన దేవాలయమును కాని, మఠము కాని, ఆశ్రమము కాని, సత్రము కాని, విద్యాలయములు, గ్రంథాలయములు మున్నగునవి కాని స్థాపితమైనపుడును అందుకు సంబంధించిన యేదైన ధర్మాదాయములు దేవాదాయములు నేర్పడినప్పుడు అట్టి సకలసంస్థలు వసతులు మున్నగు ప్రతిష్ఠాపనములు పీఠసభ్యులకు మాత్రము ప్రయోజనము కలిగినట్టియు లోకసామాన్యమున కెట్టి యధికారముగాని స్వాతంత్ర్యముకానిలేనట్టియు (Private Institutions or trusts) రహస్య ప్రతిష్ఠాపనములై యుండవలెను.

## 14. పీఠధనము, లెక్కలు, పుస్తకములు మున్నగునవి

64. పీఠమున కితరులచే వ్రాసి యియ్యబడు పత్రము (Deeds and Instruments) లన్నియు పీఠముపేరనే వ్రాయబడవలెను.

[2] పీఠముచే నితరులకు వ్రాయించి యియ్యబడు పత్రములపై పీఠపక్షమున కార్యదర్శి సంతకము చేయవలెను.

[3] మహాజనసభ ఆమోదము లేనిదే పీఠము యొక్క స్థిర చరాస్తుల నెవ్విధముగను దానాధమన విని మయ విక్రయాది రూపమగు నన్యాక్రాంతము చేయరాదు.

[4] పీఠమునకు చెందిన సకల చరస్థిరరూప ధనద్రవ్య సత్వములను గూర్చినట్టియు, ఆర్థికాది వ్యవహారములను గూర్చినట్టియు, పీఠాంతర్గత వర్గములసమావేశములను చర్యలను గూర్చినట్టియు, పీఠసంకల్పములకును గార్యవిధానమునకును జెందినట్టియు ఇంకను పాలకసమితికి యుక్తమని తోచిన యితరవిషయములకు సంబంధించినట్టియు, పూర్తివివరములు తెలియునట్టి లెక్కలను, పుస్తకములను కార్యదర్శి వ్రాయించవలెను.

[5] లెక్కలన్నియును పీఠాధిపతి నిర్ణయించు పరీక్షకుని (Auditor) వలన ప్రథ సంవత్సరము పాలకసమితి పరీక్షింపచేసి పరీక్షకుని నివేదికను మహాజనసభ సమావేశములో సర్పింపవలెను.

## 15. పీఠోత్థాపనము

## Dissolution of Peetham

15. 1860 వ సంవత్సరపు 21 వ చట్టము ననుసరించియు యీ నిబంధనల ననుసరించియు "శ్రీ శైవ మహాపీఠము" అను నీ సంస్థయొక్క నామమందుగాని, సంకల్పములందు గాని, కార్యవిధానములందుగాని యీ నిబంధనలందు గాని మార్పులు గలుగుటమాత్రమే గాక పీఠమే యెత్తివేయబడి సంస్థకు అభావము కలుగునెడల పీఠముయొక్క స్థిరచరరూప ధనద్రవ్యసత్వము లన్నియు,

శ్రీ శైవమహాపీఠముయొక్క సంకల్పములనే దానియొక్క సంకల్పములుగ గలిగి, శైవమతముయొక్కయు, శైవసంఘముయొక్కయు నభివృద్ధికొరకేర్పడిన మరియొక రిజిష్టర్డు సంఘమునకును లేక ట్రస్టునకును లేక యితర రూపములు గల సంస్థకును; అట్టి సంఘముకాని ట్రిస్టుకాని యితర సంస్థకాని లేనియెడల,

[2] సనాతనధర్మ పురస్సరముగ నిగమాగమాద్యార్ష విద్యాసంప్రదాయముల రక్షణ, వ్యాపనములకొరకేర్పడిన మరియొక రిజిష్టర్డు సంస్థకును చెందచేయబడవలెను. కాని పీఠసభ్యులు వాటిని స్వార్థమునకు వినియోగించుకొనుట గాని, తమలో పంచుకొనుటగాని కూడదు.

## 16. నిబంధనల సవరణ

ఈ ప్రణాళికలోని యేనిబంధన నైనను మార్పుచేయుటకును, లేక తీసివేయుటకును, లేక క్రొత్త నిబంధన చేర్చుటకును, అవసరమగునెడల అట్టి తీర్మానమును పాలకసమితి చేసి మహాజనసభ వారికి నివేదించి వారియామోదమును గూడ బడయవలెను. అట్లు జరిగిన వెంటనే తీర్మానము అమలులోనికి వచ్చును.

కాని నేడు ఈ సంస్థకు తన జమీను నెంతయో వ్రాసి యిచ్చిన దేవిడీ జమీందారులు పరమపదము నందినందున నీ వ్యవహారమంతయు కోర్టువారి యధీనములో నుండి మన కనుకూలించ నందున మనము భావించిన, నిర్ణయించిన, యాచరణలో పెట్టదలంచిన పనులన్నియు సరస్వతీదేవి కప్పగించి లక్ష్మీప్రసాదము కొఱకు వెతకు లాడవలసి వచ్చినది. శైవపీఠమునకు అధిపతులై శతాధికగ్రంథముల రచించి మహోపాధ్యాయ బిరుదాంకితులైన ముదిగొండ నాగలింగ శాస్త్రిగారు మతమునకు కావలసిన గ్రంథముల రచించి కొన్నిటిని ముద్రించి కొన్నిటిని మనకు ఒప్పగించి శివసాయుజ్యము నందినారు.

ఇట్టి పరిస్థితులలో మతమునందలి యువకులేమి, వృద్ధులేమి, పండితులేమి, లౌకికులేమి యందరు ఈ సంస్థను అభివృద్ధిలోనికి తీసికొని వచ్చుటకై యత్నించుట విధియని తలంచవలెను. ఎవరికివారే తమ కర్తవ్య నిర్వహణను గుర్తించి, మతము నన్నివిధములపోషించి యభివృద్ధికి తీసికొని రాగలందులకై యత్నించకోరుచున్నాడ.

శైవసమాజము తరఫున యిచటికి విచ్చేసిన మహాజనులందఱి కిని భోజనాది సదుపాయముల నేర్పాటుచేయ కంకణము కట్టుకొని నిర్వహించుచున్న శ్రీపతి పండితారాధ్యుల లింగమూర్తి అయ్యవారికి సంఘము తరఫున మా కృతజ్ఞత వెల్లడించుచున్నాడ.

ఈమని
24—4—51

ఇట్లు,
ముదిగొండ రామలింగశాస్త్రి
సనాతన శైవసమాజము

శ్రీ శివాయనమః

# శైవసభా ప్రశంస

## స్వాగత పద్యరత్నములు

నూతన శైవసమాజాధ్యక్షుడు,

ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రి, ఈమని

ఉ. శ్రీ గురులింగ జంగమవిశిష్టశివానుభవప్రశస్త వి
ద్యాగణనీయ నిత్యమహితాత్మవిచారణబోధ సత్తపో
యోగతృణీకృతామరమహోన్నతభోగ విభావులార మా
స్వాగత మందుడయ్య మనసార రసాలరసార్ద్రవాక్కులన్.

శా. కైలాసంబుననుండివచ్చి కరుణాక్రాంతప్రసన్నాత్ములై
భూలోకంబున శంభుభక్తిమహిమంబున్ బోధమున్ సల్పు మి
మ్మాలోకించిన పాపముల్ దొలఁగు పుణ్యంబుల్ తమంతన్ సదా
లీలాసాగరభంగతుల్యముగ ప్రాపించున్ శుభశ్రీలతో.

ఉ. రమ్మని మిమ్ముబిల్చి మధురమ్మగువాక్కుల గౌరవించి దూ
రమ్మని లేక త్రోవ సుకరమ్మగునా యని ప్రశ్న లేక తో
రమ్మగు సంతసమ్మున కరమ్ము ప్రియమ్మున వచ్చి వేదసా
రమ్మగుభక్తి చెప్పికొనరంగ వినంగ దలంపు పండెగా.

ఉ. వంతుకుగంతువైచి పిలువంగలవారముకాని మేము మీ
స్వాంతము సంతసింపగలసత్కృతులన్ సలువంగనేర మా
వంతయు మీరు సంతతకృపాపరిపూర్ణులునైన గాక తె
క్కంతుర భక్తిలోపమునొకించుకయేని మహాత్ములెన్నరున్.

ఉ. బాలశశాంకశేఖర కృపావరిపూర్ణత వేదశాస్త్ర వి
ద్యాలహరీతరంగ సముపార్జిత నిర్మలకీర్తిరత్నభూ
షాలలితోజ్జ్వలాంగులగు శైవమహాజనులార మాపయిన్
వాలినప్రేమగైకొనుడు స్వాగత మీమనినీఖరామనిన్.

శివజ్ఞాన శిఖామణి
ముదిగొండ రామలింగశాస్త్రిగారు, తాడికొండ

గీ. మన సనాతన శైవసమాజమునకు
శరభ సాళ్వం డధిష్ఠానవరతఁ జెలఁగు
గాన శైవమహాసభాకార్యమెల్ల
విజయ మగునట్లు జరుగ నే వినుతిఁజేతు.

కం. శంభుసమారంభం బై, శుంభద్భస్మీలకంఠ శోభిత మధ్యో
జ్జృంభితమై విశ్వేశ్వర, గుంభిత చరమంబునైన గురుతతి నెంతున్.

గీ. పండితస్వామి దెలియ నేపాటివాఁడొ
శంకరారాధ్యు నెరుగ మా శైవఘనుడు
నాగలింగయశాస్త్రి యనంగ వినమె
వారు సంస్తవనీయులుగారె మనకు.

చం. మతమున వీరుచేసిన యమానుష ధర్మము లెన్న శక్యమే
సతము శివార్చనాపరత శైవసమర్చన శాస్త్రశోధనా
శ్రిత హితచిత్త నిర్మలత బెద్దయటంచును జెప్పఁగొందుమా
క్షితిని క్రమంబుగా కడు ప్రసిద్ధులు శాస్త్రసమృద్ధులౌట సం
తతము నమస్కరింప మన ధర్మము నిర్మల చిత్తవృత్తితోన్.

సీ. మనియుండె శైవ మీమాంసనియందెగా యని
మనసు నహంబు మైమరిచియుండు
మన మందిరమును యీమానియుండె జాలగా
కలవని పీనులగాథ విందు
మనలో పాండిత్య మీమానివారిదే యని
లోకవిఖ్యాతి నాలోన జెందు

మన శైవమున సనాతనధర్మసమితి యీ
మనియుండె యని చిరంతనముగందు

గీ. నేటి శైవమహాజనకూట మిందు
వైభవోపేతముగను వహ్వారె విందు
జేయుసీమని మఱుమాట జెప్ప విందు
గాన సభ మన కీమనెగా వసందు.

గీ. సంఘబలము గలదు సర్వవిధంబుల
నర్థబలము గలదు నదియుగాక
సకలబలము శాస్త్రసంపద్బలంబుల
నీమనికిని సాటిగ్రామ మేది?

సీ. వేడిన నర్థార్థి వృథపుచ్చనట్టి దయాసముద్రు డమృతహస్తు డతడు
అమృతహస్తుండెకాదన్నదానమునందు నిరతాన్న దాతల నేతయతడు
నిరతాన్నదాతల నేతయేకాదు శ్రీఉద్భటారాధ్యుడో యుగపురుషుడు
ఉద్భటారాధ్యుడో యుగపురుషుడెకాదు పండితసత్కవిప్రముఖుడతడు

గీ. శివుడె దైవంబటంచును క్షితిని ఘంట
నాద మెల్లెడ మ్రోగించినట్టి ఘనుడు
ఇన్ని గుణంబు లతనియం దిమిడియుంట
కాదె! శంకరు నపర శంకరు డటంద్రు.

ఉ. శ్రీ ముదిగొండవంశమను క్షీరసముద్రమునందు చంద్రుడై
భూమివసించు శంకరుడు పోయెను శంకరు రాజధానికిన్
భూమి త్యజించి ముప్పదియు మూడవ వత్సరమయ్యె భక్తులా
రా! మహనీయమూర్తిని దలంపగరాదయ కోర్కెదీర్పగన్.

శ్రీ శివాయగురవేనమః

# సందేశము

శ్రు. ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం
బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోం.

శ్రు. యో దేవానాం ప్రభవశ్చోద్భవశ్చ
విశ్వాధిపో రుద్రో మహర్షిః
హిరణ్యగర్భం జనయామాసపూర్వం
స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు.

సభాసదులారా!

ఈవర్ధంత్యుత్సవమున కధిపతిగ నన్ను నియోగించిన మాహేశ్వర మండలికిని, వారికట్టి యవకాశముగలుగఁజేసిన శ్రీసనాతన శైవసమాజము వారికిని, నామనఃపూర్వక కృతజ్ఞతావందనములు.

గతవర్ధంత్యుత్సవము వఱకు నీశైవమహాజనసభాపీఠమలంకరించిన పీఠాధిపతుల తపశ్శక్తియు, శివపూజాధ్యానపరాయణులగు మాహేశ్వరుల శుభాశీర్వాదపరంపరయు నన్నీకార్యభారమును తరింపజేయుగాత.

## శైవమహాజనసభ

ఇది ప్రారంభింపబడి నేటికి 39 సంవత్సరములు. ఇది ముప్పదియవ వర్ధంతి. 1909 వ సం॥రము డిసెంబర్ 25 వ తేదీ యందు శ్రీ. లో. ముదిగొండ శంకరారాధ్యుల వారి యధ్యక్షతక్రింద, వరంగల్ నగరమున ప్రథమ శైవమహాజనసభ జరిగినది. తదాది నేటివఱకును నానా పట్టణగ్రామములందు సభలు జరుపబడి నలుదిశల శైవమతప్రభావము ప్రకటింపఁజేయబడినది.

ఇది 30 వ సభయగుటచే రజితోత్సవానందసాగరమున మునిగి యున్నది. ఈరజితోత్సవమునకు జేసాచిన ఈమని గ్రామమును, సనాతన శైవసమాజమును చారిత్రకులు చరిత్రలందు సువర్ణాక్షరములతో లిఖించు భాగ్యము నొందినవి.

## శై వ మ త ము

శ్లో. వేదశ్శివ శ్శివో వేదః వేదాధ్యాయీ సదాశివః॥

అను సూక్తి ననుసరించి వేదమతమే శివమతము పాశుపతము లేక వైదికమతమని పేర్కొ-బడినది.

శ్రు. యోబ్రహ్మాణం విదధాతిపూర్వంయోవై వేదాంశ్చప్రహిణోతితస్మై॥

అను శ్రుతివలన శివుండు బ్రహ్మను సృష్టించి వేదముల నొసంగి తద్వారా ధర్మముల నుపదేశించి ముక్తిమార్గము ననుగ్రహించినాడు.

శ్రు॥ 'యదాతమ స్తన్న దివా నరాత్రిః నసన్నచాసచ్ఛివ ఏవ కేవలః।
శివ ఏకోధ్యేయః శివాదన్యం నకించిన'

ఇత్యాది శ్రుతులాదియందుగల దైవము శివుండొకడే యనియు - అష్టమూర్తి స్వరూపుడును-మహాదేవుడు నగు నాయీశ్వరుని చరాచర ప్రపంచమంతయు భజించుటచే సకలదేశస్థులగు మానవులందఱు శైవు లనియే తేలుచున్నది. కావుననే సకల నిష్కళ స్వరూపుల వెలుగు శివలింగములు నానాదేశములందుండుటయు, నేటికిని పూజలు జరుగుటయు గాన్పించుచున్నది. బ్రహ్మహత్యాదిమహాపాతకములు పోవుటకై శివాలయములుకట్టించి శివలింగములు ప్రతిష్ఠింపబడుచున్నవి.

శ్రు. 'యదా చర్మవదాకాశం వేష్టయిష్యంతి మానవాః।
తదా శివమవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి॥'

అను శ్రుతియందు శివోపాసనలేక ముక్తి లభింపదని నుడువ బడినది.

## విద్యాగురువు

సంస్కృతాంధ్ర సారస్వతము నేర్చికొనిన వారందఱికి విద్యా గురువు శివుండే. ఆ విద్యాధిపతి అ ఇ ఉ ణ్ ఇత్యాది చతుర్దశ సూత్రముల ననుగ్రహింపనిచో మన సంభాషణకే యవకాశము లేదు.

నృత్తావసానే నటరాజరాజో ననాదఢక్కాం నవపంచవారం।
ఉద్ధర్తు కామస్సనకాది సిద్ధా నేతద్విమర్శే శివ సూత్రజాలం॥

విద్యాభ్యాసమున కచ్చులు - హల్లులు ప్రధానము. అక్షరము లన్నియు నీశ్వరుని ఢక్కానాదమువలన జన్మించినవగుటచే సర్వ వాఙ్మయ ప్రవృత్తికి శివుండే మూలము. చదువుట, వ్రాయుట, నేర్చి కొనిన సకల మానవులకు విద్యాగురువు శివుండే. శివోపజ్ఞ వాఙ్మయము నేర్చికొనినవారందఱు శైవులు.

శైవమతము దేశమందంతటను వ్యాపించియుండుట చేతనే తెనుగు దేశమందంతట "ఓ న మా లు" అక్షరాభ్యాసకాలమున ముందుగా వ్రాయుట తటస్థించినది.

ఉత్తరహిందూస్థానమునందును, మళయాళమునందును "శ్రీగణే శాయనమః" అని అక్షరాభ్యాసము చేయుదురు. ఆంధ్ర కర్ణాటక దేశములందు "ఓం నమశ్శివాయ" అను షడక్షరీమంత్రముతో చదువు ప్రారంభమగును.

జైనసాంప్రదాయము ననుసరించి "సి ద్ధం న మః" అని వచ్చినది. ఏలయన :- జైనులలో "ఓం నమస్సిద్ధేభ్యః" అని విద్యాభ్యాస మారంభింతురు. ఈ ప్రపంచమున గురునమస్కారము చేయని మూర్ఖు లుందురా!

## నమస్కారాధిపతిత్వము

అందువలననే కాబోలు! శతరుద్రీయమున నమస్తే రుద్ర- నమ స్సోమాయచ రుద్రాయచ- నమ శ్శివాయచ-శివతరాయచ" మొదలగు శ్రుతితతి నమస్కారాధిపతిత్వము శివునిదే యని వాక్రుచ్చుచున్నది.

# సందేశము

## ప్రమాణ గ్రంథములు

శివాగమములు వేదములు శైవమతమునకు ప్రధానములు. జగద్గురు శ్రీనీలకంఠారాధ్యులవారు తమభాష్యము "వయంతు వేదశివాగమయోర్భేదం నపశ్యామః। వేదేపి శివాగమవ్యవహారో యుక్తః తస్య తత్కర్తృకత్వాత్" అని శివాగమప్రామాణ్యము నుద్ఘోషించి యున్నారు.

## శైవసిద్ధాంతము

శివాద్వైతము విశిష్టశివాద్వైతమని శక్తివిశిష్టశివాద్వైతమని దీనికే నామాంతరములు. సాధనచతుష్టయ సంపన్నులయి పాశుపత వ్రతదీక్ష గైకొనిన బ్రహ్మచర్యాది చతురాశ్రమవాసులు బ్రహ్మవిద్యా జిజ్ఞాసయం దధికారులు. ప్రయోజనము కైవల్యము.

"విద్యాంచావిద్యాంచ యస్తద్వేద ఉభయగ్ంసహ" అను శ్రుతిచే జ్ఞానకర్మలు రెండును శైవులకవసరము. కర్మానుష్ఠానము, ఈశ్వరోపాసన లేనిది ముక్తిపొందనేరరు.

"నహ్యేకపక్షో విహగః ప్రయాతి"

"అంధపంగువ దన్యోన్యం సాపేక్షే జ్ఞానకర్మణీ" అని జ్ఞానకర్మ సముచ్చయ వాదమే ఆచార్యులవారి మతము.

పరమేశ్వరార్పితము చేయఁబడిన కర్మఫలార్జితమగు ఉపాసనా రూపజ్ఞానభక్తియే ముక్తిసాధనము.

జగత్తుసత్యమైనది. ఈజగత్తునకు పరమేశ్వరుడు నిమిత్తోపాదాన కారణభూతుడు.

"నతత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే"

అతడు జన్మమరణములు లేనివాడు. విభువు. ఆపరశివునితో సమానుడుకాని అతనికంటె అధికుడుకాని లేడు.

నూర్యాకాశములవలెరాగద్వేషాదులు లేని మహనీయుని కంటవు.
" అనేన జీవేనాత్మనానుప్రవిశ్య " అనుటచే జీవుఁ కంటె వేరయినవాఁడు నిత్యుఁడు, హిరణ్మయస్వరూపుఁడు, స్వతంత్రుఁడు.

జీవుఁడస్వతంత్రుఁడు. కర్మ ఫలభోగి. మాయాశక్తిచే కర్మఫల మనుభవింప జేయబడుచుండును.

పాశుపతదీక్షనొంది శివోపాసనచే భ్రమరకీటన్యాయమున శివ సాయుజ్యము నొందును.

'వ్రతం పాశుపతం చీర్ణం యైర్ద్విజై రాదరేణతు ।
తేషా మేవోపదేష్టవ్యమితి వేదానుశాసనం॥'

అని సూతసంహితయందు పాశుపతవ్రతస్థులకే తత్త్వోపదేశము చేయుడని గలదు. కాబట్టియే విద్యారణ్యులవారు,

"అథ పాశుపతవ్రతపూర్వకా దేవఉపదేశా దనుభవపర్యంతో బోధో భవతీతి వక్తుం ద్వితీయోధ్యాయః ప్రారభ్యతే"

పాశుపతవ్రతపూర్వకముగ నుపదేశము చేసిననేగాని యనుభవ పర్యంతజ్ఞానము కలుగనేరదని వచించినారు. పాశుపతవ్రతము గ్రహింప కున్న బ్రహ్మవిద్యను గ్రహించు నధికారమే లేదు.

భస్మరుద్రాక్ష శివలింగధారణాత్మకమగు నీ పాశుపతదీక్షయే యైహికాముష్మిక ఫలముల నొసంగి జన్మరాహిత్యము నీయగలదు. అనేకజన్మ సంపాదిత పుణ్యవిశేషమున గలిగిన యీ మానవజన్మయందు శివపూజ నొనర్చి తరించుట మానవమాత్ర కర్తవ్యము.

శైవము—కలికాలవశమునను, సంప్రచార లోపమువలనను, మంకు పట్టులవలనను శైవములో ననేక భేదము లేర్పడినవి. 11-12-13 శతాబ్దము లందు చోళ చాళుక్య కాకతీయుల నాధారముగ గైకొని శైవము వృద్ధి పొందినది. 12 వ శతాబ్దమున బసవేశ్వరుఁడు వీరశైవము నభివృద్ధి పరచినాడు. శ్రీనీలకంఠాచార్యులు ప్రస్థానత్రయము రచించి శివతత్త్వప్రాప్తి

కిదే మార్గమని నిరూపించినారు. భోక్త్రాపత్త్యాధికరణమున 'చిదచిత్ప్రపంచ విశిష్ట శివఏవ అద్వితీయః కార్యంకరణంచ భవతీతి విశిష్ట శివాద్వైతమనియు 'నిరస్తసమస్తకళంకం నిఖిల మంగళా ధార భూతం బ్రహ్మైవ జగతో భిన్ననిమిత్తోపాదానకారణం సూక్ష్మ చిదచిద్విశిష్టం బ్రహ్మకారణం స్థూలచిదచిదచిద్విశిష్టం బ్రహ్మకార్యం ఇదంహి జగత్ పరమేశితుః శరీరం సకలచిదచిదచిత్ప్రపంచక పరశక్తి విశిష్ట అద్వితీయువైభవః పరమేశ్వరః' అనియు వచించినారు. ఇందు శైవ పాశుపత కాలాముఖ కాపాలికాది భేదము లనేకములు గలవు.

## అభినవగుప్తపాదాచార్య మతము

శ్రీశంకరాచార్యుల వారి తర్వాత 226 సంవత్సరాలకు కాశ్మీరమున అభినవగుప్తపాదాచార్యునిచే నొక శైవమతము స్థాపింపబడినది. ఈయనకు మహామహేశ్వరాచార్యుండని బిరుదు. మతమునకు ప్రత్యభిజ్ఞ శైవమతమని పేరు. శివుడే నేనని తెలియుట ప్రత్యభిజ్ఞ యనబడును. ప్రపంచము శివాకారము. ఆత్మ శివునికంటె భిన్నమైనది. శివుడు స్వతంత్రుడు. బ్రహ్మాదు లస్వతంత్రులు. మాయకు లోబడియుండువరకు మానవులు కర్మనుబట్టి పుట్టుచు చచ్చుచుందురు. గురూపదేశముచేత మహేశ్వరుడే యని తెలిసిన తర్వాత బంధముక్తుండై సర్వశక్తిత్వాది గుణముల పొందును. బంధవిముక్తియే మోక్షమని యీమత సిద్ధాంతము.

## వీర శైవ మతము

అనగా లింగాయతమతము. ఇందు వీరశైవము, సామాన్యవీరశైవము, విశేష వీరశైవము, నిరాభారి వీరశైవము అను నాల్గు భేదములు గలవు.

సమ్మేళిత శైవము
మహావ్రతి మతము
శివసమవాది మతము

ఐక్యవాది మతము
సంక్రాంతివాది మతము
ప్రవాహేశ్వరవాది మతము
ఊర్ధ్వశైవ మతము
అనాదిశైవ మతము
ఆదిశైవ మతము
మహాశైవ మతము
గుణశైవ మతము
క్రియాశైవ మతము
చతుష్పాదశైవ మతము
శుద్ధశైవ మతము

అని పలువిధములుగ గన్పట్టుచున్నవి.

రెడ్డిరాజులు శైవమతాభినివిష్టులై శివక్షేత్రముల నుద్ధరించిరి. శ్రీశైలమునకు మెట్లుకట్టించిరి. ప్రతిదిన మూరుమూరులు శివపూజలు చేయుచుండిరి. పరమతస్థులను వీ రెంతమాత్రము బాధించినటుల కన్పట్టదు.

గణపతిరాజు గోళకీమఠమునకు చెందిన విశ్వేశ్వర శివాచార్యుల వద్ద దీక్షపొందెను. కాకతీయులందరు శైవమతమవలంబించిన వారే. కొండవీటిరెడ్లను పరమశైవాచారపరాయణులుగ శ్రీనాథుడు వర్ణించినాడు.

క్రీస్తుకుపూర్వము ౪౮వ శతాబ్దములో శ్రీముఖుడను శాతవాహన రాజు ఆంధ్రరాజ్యమును స్థాపించినాడు. ఆంధ్రరాజ్యానికి కృష్ణానదీతీరమందున్న శ్రీకాకుళం మొదటి రాజధాని. గుంటూరుజిల్లాలో కృష్ణానది యొడ్డున నున్న అమరావతి దగ్గరగానున్న ధాన్యకటకము (ధరణికోట) రెండవ రాజధాని. శాతవాహనుల కాలములో బౌద్ధమత మెక్కువగా వ్యాపించినది. అయినను వేదమతావలంబకులగుటచే యజ్ఞయాగాదులు

చేయుటమాన లేదు. మనదేశానికి వచ్చిన శకులు, పల్లవులు, యవనులు శివుని విష్ణుని పూజించేవారు.

ఆనాడు బౌద్ధస్తూపములు, బౌద్ధారామములు చాలా ఉండెడివి. స్తూపమనగా బుద్ధుని నిర్వాణచిహ్నము, బౌద్ధులవసతి గృహములు, బౌద్ధుల ప్రార్థనాలయములు, స్తూపముకల ప్రదేశములకు బౌద్ధవిహారములని పేరు. మానవుడుగానున్న బుద్ధుడు క్రమముగ దేవుడయినాడు. ఆయన మతములో దేవతలు-వారి భార్యలు-పూజలు-అసంఖ్యాకము లయినవి.

ఈ సమయమందున వైదికమతము నశించలేదు. సాలంకాయన-గోత్రజులగు దేవవర్మ మహారాజు అశ్వమేధయాగము చేసినాడు. మాధవవర్మ 11 అశ్వమేధములు చేయుటయేగాక వాజపేయ పౌండరీకాది యజ్ఞము లాచరించినాడు.

బౌద్ధసన్యాసియగు నాగార్జునుడు శ్రీశైలమున నివాసమేర్పరచికొని పరిపాలించినాడు. విష్ణుకుండి వంశపురాజులు శ్రీ పర్వతస్వామిని వృద్ధిలోనికి దెచ్చినారు. గంగవంశీకులు శైవులు. 14 వ శతాబ్దములోని రేచెర్లవంశమువారు శైవమతావలంబులే. సర్వజ్ఞబిరుదమందిన సింగమనాయకుడు శైవమతావలంబి. అనపోతభూపాలుడు, అనవేమారెడ్డి శైవమతమందభిమానులై శైవగ్రంథముల కృతినొందినారు.

కాకతీయరాజులందరు శైవులే. తమ గురువులకు శివపురాలని పేరుపెట్టినారు. శివాలయములకు చేసిన దానములకు లెక్కలేదు. శ్రీశైలముమీద నయిదు శివమఠములుండెడివి. వేలకొలది శిష్యు లుండెడివారు. త్రిపురాంతకము పుష్పగిరి మున్నగునవి గోళకీమఠ శాఖలే. గౌడదేశమునుంచి వచ్చిన శివయోగులు ఈ మఠాధిపతులు - ఈ మఠాధీశుడగు విశ్వేశ్వర శివాచార్యులకు రుద్రమదేవి 1261 లో మందడము అనే గ్రామమును అగ్రహారముగా నిచ్చినది.

రెడ్డిరాజుల కాలములో ఆంధ్రదేశములో శైవమే ప్రధానమతము. వేమారెడ్డి శ్రీశైలమునకు పాతాళగంగకు సోపానములు కట్టించినాడు. పెద

కోమటి వేమారెడ్డిని వీరభద్రారెడ్డిని ఆశ్రయించి కాశీఖండము, భీమ ఖండము మొదలగు శైవగ్రంథములు శ్రీనాథమహాకవి వ్రాసినాడు.

వేదాంత సోపానములు నేడు తండోపతండములు దృష్టిగోచరములగుచున్నవి. ఏ సోపానములు భవసాగరమును దాటించి ముక్తిసౌధమున జేర్చునో అవి నేటిముముక్షువుల కగమ్యములైయున్నవి.

నిజముగ విచారించినచో-శివుడే దైవము. శైవదర్శనమే మోక్షనిశ్రేణి. తదానోహాలాలసులగు మానవులే నిజమైన భక్తులు. వారవలంబించిన సిద్ధాంతమే శివాద్వైతము.

మానవులలో సంపూర్ణవిజ్ఞానము - పరస్పర శ్రేయస్సహనము- యథార్థపరిశీలనోత్సుకత లేని యపుడు వివాదములు ప్రారంభములై అహోమహు ప్రాకారములతో తమ తమ వాదప్రాసాదముల గట్టుచుందును. కాని యేనాడైన సత్యము బయటపడక యుండజాలదు.

## శివదీక్ష

శాంభవదీక్షగలవారే శైవులు. నానాశాఖలుగ వెలసిన శైవమతము శ్రౌతాశ్రౌతభేదములచే ద్వివిధముగ వాయుపురాణమున పేర్కొనబడినది. శివదీక్షకు లింగపురాణమును, కారణోత్తరచంద్రజ్ఞానాద్యాగమంబులును ప్రమాణగ్రంథములు.

## ద్వాదశారాధ్యులు

శ్రౌత శైవమును ప్రచారముచేసినవారే ద్వాదశారాధ్యులు. సిద్ధత్రయమని - పండితత్రయమని- ఆరాధ్యత్రయమని-ఆచార్యత్రయమని వీరు పేర్కొనబడుచున్నారు. వీరి పూర్వవృత్తాంతములగూర్చి కొన్ని శాసనములు-వర్ణనములు-రాగిశాసనలు సేకరింపబడినవి. మరొకప్పుడు సంపూర్ణచరిత్ర ప్రకటించుదును. వీరి కథలు విమర్శఘట్టములో నున్నవి. జగద్గురు పీఠములకు జెందిన సర్వశివారాధ్య- సమిష్టిపీఠమే యీ శైవమహాపీఠము.

## శైవమహాపీఠము

ఆరాధ్యగురుశిష్య పరంపరకాలవాలమైనదియే శైవమహాజనసభ

శ్లో. పీఠా యద్యపి విద్యంతే వివుతానాంచ భూరిశః
తథాపి తత్ర నైకోపి విద్యతేహి గణాశ్రయః
శివాగమప్రసిద్ధత్వాద్గణోపాస్తి మహావిధేః
శైవానాం గుణరూపోయం మహాపీఠస్సమాశ్రయః
గణాశ్రయశ్శివోనిత్యం గురవోపి గణాశ్రయాః
గణఏవమహాపీఠో గురూణామీశ్వరస్యచ
సిద్ధాంతస్యాపి శైవస్య సంఘస్యచ సమాశ్రయః
ఆధారత్వాదనిర్దేశాన్మహాన్పీఠ ఇతీర్యతే
అతశ్శైవమహాపీఠ స్సర్వపూజ్యతమస్స్మృతః॥

అనగా సర్వశైవస్వాతంత్ర్యరక్షణమునకును, శైవసంఘమునకును, శివాద్వైత సిద్ధాంతమునకును ఆశ్రయమైన గణమండలవరివేష్టితమైనది యీ శైవపీఠము. మాహేశ్వరవర్గమే దీనికి జీవితము. శివగురులు గణాశ్రయులై యుందురు. కనుక అట్టి చరసమూహమునకు ఆధారమగుటచే గణపీఠమని నుడువబడినది. శివాగమప్రసిద్ధమైన గణోపాసన ముఖ్యము కావున ఇతరపీఠములకన్న వైలక్షణ్యమును బోధించుచు ద్వాదశారాధ్యగురుశిష్యులకు అవలంబనమగుటచే నియ్యది మహాపీఠమని రచింపబడినది.

ప్రథమపీఠాధిపతులని వాసిగాంచిన శివయోగి ముదిగొండ నాగలింగశాస్త్రిగారు పీఠత్పీఠ స్థిరత్వమునకై కృషిచేసిరి. నానాముఖముల విజృంభించిన శైవమార్గముల భేదముల నిరూపించు బ్రహ్మపథాది గ్రంథముల వ్రాసి మన శైవమార్గమిదియని నిరూపించియున్నారు.

మఱియు జగద్గురు శ్రీనీలకంఠప్రస్థానత్రయ వ్యాఖ్యానముల వ్రాసి మన పీఠమునకు సమర్పించియున్నారు. ప్రారంభమునుండి తన జీవితాంతమువరకు వారి విజ్ఞానమునంతయు శైవులకు ధారబోసి పత్రికల

ద్వారా పరవాదముల ఖండించి శైవసిద్ధాంతము స్థాపించి యున్నారు. అట్టి మహనీయుల తమకందరి కొకసారి జ్ఞప్తిచేయుట నా విధి యని తలంచి మనఃపూర్వకముగ కృతజ్ఞతాసూచకముగ శరణులు సమర్పించుచున్నాను.

జగద్గురు నీలకంఠభాష్యము నాగలింగ శాస్త్రులుగారు వ్రాసిన శివచింతామణిప్రభయను వ్యాఖ్యానముతో ఆ. లో. ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారి ఓరియంట్ పవర్ ప్రెస్సునందు ముద్రింపఁబడినది. ఉపోద్ఘాతము వ్రాసి త్వరలో శైవపీఠమువారికి – శైవమహాజనులకు ఆ యుద్గ్రంథము నందజేయవలెనని కుతూహలపడుచున్నాను.

మన శైవులలో పలువురు లేఖనముద్రణములకు ద్రవ్యమొసంగుదుమని ప్రారంభించియు నీలకంఠభాష్యమును పూర్తిచేయఁజాలక పోయిరి. అట్టి యమూల్య శైవమత గ్రంథమును 10 వేల రూప్యములు వ్యయపరచి ముద్రింపించిన వరంగల్ వాస్తవ్యులు శివపూజాసక్తహృదయులు సంస్కృతాంధ్ర కళాశాలా స్థాపకులగు కీ॥ శే॥ మ॥ రా॥ శ్రీ ఆకారపు నరసింగగుప్తగారి పరిశుద్ధాత్మకు ఈ సభవారు కృతజ్ఞతల నర్పించుచున్నారు.

శైవసభ నేటివరకు సాధించిన కార్యములెవ్వి? పలుప్రదేశములందున్న శైవుల నేకత్రచేర్చి తన యౌన్నత్యమును బోధించినది. 2 వేలు పెట్టి వేదపాఠశాలల బెట్టించి విద్యార్థుల పరీక్షలందుత్తీర్ణుల గావింపజేసినది. 7 వేల రూప్యములు పురాణవిద్యాభ్యాసకులగు బీద బాలురకొసంగినది. మతగ్రంథములముద్రింపించినది. వివాదవిషయముల పరిష్కరించి మతస్థులకు రాజబాటను జూపించినది. విద్వాంసుల సత్కరించినది. విజయవాడలో తానుండుటకు నొక సుందరభవనము నిర్మించుకొన్నది. తన పోషణకు 10 యెకరముల మాగానిపొలము సంపాదించుకొన్నది. అన్ని మతములలో ఆదిమతమనియు, ముముక్షువులందరు శివోపాసన చేసియే తరించవలెననియు నిరూపించినది. శక్తికొలది మతస్థులకు మతప్రబోధము గల్గించినది. పరమతసహానము, కర్మానుష్ఠానము,

పరమేశ్వరోపాసనము, శమాద్యష్టాంగయోగసంపద గలిగి నిరంతర శివలింగ తీర్థప్రసాదములచే ఆగామిసంచితప్రారబ్ధకర్మల నణచివేసి ఆణవ మాయా కార్మికమలత్రయమును నశింపజేయుశక్తిని సాధకుల కుపదేశించినది.

## శైవపీఠము - చేయవలసిన విధులు

ఇష్టలింగధారణము గలిగిన మన మతస్థుల జనాభా తయారు చేయించవలెను. శివలింగధారణములు, పంచాక్షరీ మంత్రోపదేశములు మన బాలురకు, శిష్యులకు, భక్తులకు చేయించవలెను. ద్వాదశారాధ్యాది పీఠస్థుల సక్రమమైన చరిత్రలు రీసర్చిచేయించి ప్రకటించవలెను. స్ఫటికలింగములు, బాణలింగములు, మతగ్రంథములు పీఠకార్యాలయమున విక్రయమునకు సిద్ధముగ నుంచవలయును.

పీఠముతరఫున వేదాంతము, వ్యాకరణము, తర్కము మొదలగు శాస్త్రములందు సంపూర్ణ ప్రవేశమున కర్హులగు విద్యార్థులకు చదువుకొనుటకు వసతి గల్పించవలెను. మతప్రచారముచేసి మూలధన మార్జించవలెను. ప్రాచీనుల తపశ్శక్తి సాధనోపాయము లన్వేషింపవలెను.

పీఠమునకు వచ్చిపోవువారి నివాససౌకర్యములు గలిగించవలెను. పీఠమునకు చెందిన ధర్మాదాయముల సక్రమమార్గమున పరిపాలించు పద్ధతు లేర్పాటుచేయవలెను. సర్వాంగసుందరమగు పత్రిక నెలకొల్పవలెను.

మన సంఘమున దారిద్ర్యపిశాచము నశించుటకై శైవబాలుర బుద్ధివైశద్యము ననుసరించి మతవిజ్ఞానము, సారస్వతసేవతోపాటు రాజకీయవిజ్ఞానము, వృత్తివిద్యలు నేర్చికొనుటకు ప్రోత్సాహము చేయవలెను. మన సంఘము తదితర సంఘములతో పరస్పర స్నేహానుబంధము కలిగియుండవలెను. ఇతరమతములనుగాని, సంఘములనుగాని ద్వేషించక స్వరూపమానవులయందు దయాదాక్షిణ్యములు గలిగి

యుండవలెను. ప్రతిగ్రామమునకు నొక రాజాశ్రితుని నేర్పాటుచేయ వలెను.

మనలోగల విద్యావంతుల యొక్కయు, ఉద్యోగుల యొక్కయు, జమీందారులయొక్కయు పట్టిక యొకటి తయారుచేయవలెను. శైవ పీఠమున పీఠదేవతను నెలకొల్పి పంచాక్షరీ సప్తాహాది ధర్మకార్యములు వీలువెంట నాచరించుచుండవలెను. బ్యాంకినుండి తీసికొన్న ఉర్లాం రాజావారి ధనమును మన పీఠమూలధనముగ మరల చేర్చవలెను. ప్రచారకుల నియమించవలెను. పుష్పగిరి మొదలగు పీఠములందువలె ఆ పీఠపండితుల సంపూర్ణశాస్త్రజ్ఞానము కలవారిని నేర్పాటుచేయ వలెను. ఇవి నాకు తోచినవి. తమయందలి యభిప్రాయములు కలుపుకొని విషయముల నిర్ణయించుదురుగాక.

## వీరశైవమతము

ఇది బసవేశ్వరుని కాలమునందభివృద్ధి నొందినది. కళ్యాణకటకములో బసవేశ్వరుడు శివలింగధారుల మతమును కులధర్మముల నుజ్జగించి వ్యాపింపఁజేసినాడు. ఆ కాలములోనే మల్లికార్జున పండితుడు వర్ణాశ్రమ సనాతనమగు ఇష్టలింగధారిమతమును దృష్టప్రత్యయములతో ప్రబర్శించినాడు.

వీరభక్తిని ప్రదర్శించిన మాహేశ్వరు లనేకులుండిరి. నేత్రములు తీసి నేత్రములు పొందుచుండేవారు. నాలుకలు పెరికికొని నాలుకలు పొందుచు ఉండేవారు. దీపములు వెలిగించుటకు చమురులేకుంటే జుట్టుకు నిప్పంటించి దీపాలు వెలిగించేవారు. ధూపమునకు గుగ్గిలము లేకపోతే దేహాలనుకాల్చి ఆ పొగతో ధూపము వేసేవారట. బసవని కళ్యాణ కటకములో లక్షయొనభై వేలమంది భక్తలింగములు, 9 వేల మంది ప్రతస్థులు, 10 వేలమంది శీలవ్రతస్థులు, 9 వేలమంది ప్రతస్థులు, 12 వేలమంది మిండజంగములు మొత్తము 2 లక్షల 18 వేల 7 వందల మందివీరవ్రతస్థులున్నారని సుప్రసిద్ధచరిత్రకారులగుచిలుకూరి నారాయణ రావుగారు వ్రాసియున్నారు.

బసవేశ్వరుని కాలములో తాండవమాడిన వీరభక్తిని నేడొక్క రైన చూపింపగలరా ?

ఆనాడు మానవులు శివలింగ దీక్షతీసికొనక శివభక్తిరహితులై యుండుట తిప్పుగా పరిణమించినది. కావుననే సోమనాథుడు

'పురుషుడు శివభక్తి విరహితుడేని
పురుషుని మీరుట తరుణికి వధము'

అనివచించినాడు ఆనాడు.

ఈనాడో,

'పురుషుడు శివభక్తి సహితుడగునేని
పురుషుని మీరుట తరుణికివధము' అని

అనవలసిన స్థితిగల్గినది.

కావుననే పూర్వకాలమున దృఢమగు శివభక్తి ప్రచారమునకే మనవీరస్థులగు ద్వాదశారాధ్యులు ప్రయత్నించిరి.

అటులే ఈశైవమహాజనసభకు ప్రథమాధ్యక్షులై పదిసంవత్సరములు సభాధ్యక్షపదవి వహించిన శంకరారాధ్యులవారు కూడ లక్ష తొంబదియారువేల వ్రతమాచరించుటయేగాక మతప్రచారమును విశేషముగా జేసిరి.

నిరతాన్నప్రదానపరుడగునట్టి మహనీయుని చూచుటకే చాల మంది శైవులు వచ్చుచుండేవారు. మహానుభావుడగునట్టి శ్రీ శంకరారాధ్యులవారికి నే ననేక శరణు లర్పించుచున్నాను.

ఇంతియెగాక నేటివరకును శైవసభల కధ్యక్షత వహించిన అధ్యక్షులకును, కార్యనిర్వాహకవర్గ సభ్యులకును, మాహేశ్వరులకును, నాశరణులు.

కం. ఒక్కడె దైవము శివుడని
  నిక్కము సేయుటకు ముడిచె సివ్వాలు చీరక

సుశిక్షగ శ్రీపతి పండితుఁ
డక్షజముగ గట్టిగాడె నలజమ్మిశివా!

అని మల్లికార్జున పండితునిచే పేరెన్నికగన్న శ్రీపతి పండితుడు పండితత్రయములో చేరి మన కాచార్యపీఠము నలంకరించినాడు. ఈ రోజున, అట్టి శ్రీపతి పండితుని వంశములో జన్మించి గురుస్వరూపులైన శరభసాళ్వం అయ్యవార్లంగారి కుమారులగు లింగమూర్తిగారు ఈ కార్యమును నిర్వహించు టెంతయు శ్లాఘనీయము. అట్టి లింగ మూర్తి అయ్యవార్లంగారికిని, వారిసోదరులకును, వారికుటుంబమునకు, పుత్రులకును, సనాతన శైవసమాజమువారికిని సర్వేశ్వరుఁడాయురారో గ్యైశ్వర్య పుత్రపౌత్రాభివృద్ధి నొసంగుగాత అని పరశివునికి శరణు చేయుచు ఇంతటితో నా యుపన్యాసము ముగించుచున్నాను.

---

# శంకరారాధ్య జయంతి

## 33 వ శంకరారాధ్యజయంతి

వరంగల్ నగరమున శంకరారాధ్యసత్రమున పై జయంతీమహో త్సవము బ్ర॥ శ్రీ॥ శివపురం రామలింగంగారిచేతను, భక్తబృందంబు చేతను జరుపబడినది. చైత్ర బ ౧౧ లు ప్రారంభించి 30 రోజులు ప్రతిదినము మహాన్యాసపూర్వక ఏకాదశరుద్రాభిషేకమును పంచా క్షరీ పురశ్చరణయు అన్నదానమును శివపురాణోపన్యాసములు భజ నయు సహస్రనామపూజ మంత్రపుష్పములు జరుపబడి తీర్థప్రసాదము లొసంగబడినవి. శైవమతప్రచార మొనర్చిన శంకరారాధ్యులవారు ప్రతి భక్తుని హృదయమందును నేటికిని తాండవము చేయుచున్నాడనుటలో నతిశయోక్తిలేదు. పలువురు భక్తులా మహనీయుని పూజించి మనోరథ సిద్ధి నొందుచున్నారు.

ఇట్లు
ఓరుగల్లు భక్త బృందము

శ్రీ శివాయనమః

# శైవకవులు

శ్లో. అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీసుతః।
కామికాద్యాగమానాంచ యథా దేవో మహేశ్వరః॥

అని చెప్పుటచే ఆదికవియైన మహేశ్వరునకు నమస్కరించి శైవకవులనుగూర్చి ప్రశంసించుచున్నాను. శైవకవులు రెండు తెరంగులుగా వ్యవహరింపబడుచున్నారు. (1) శివసంబంధమైన చారిత్రములను శివభక్తి ప్రబోధకములగు గ్రంథములను వ్రాసినవారు. (2) శైవులై తమ కభిమానములగు గ్రంథములను వ్రాసినవారు. వీరికవిత్వము గద్యపద్యాత్మకముగాను కేవల గద్యముగాను కేవలపద్యముగానునుండినను శివభక్తి విశిష్టత్వము మాత్రము సామాన్యముగా నందరిచేతను బ్రకటింపబడుచున్నది. తెనుగు జాతీయతను తెనుగు భాషావైచిత్ర్యమును తెనుగు ఛందస్సులను ప్రకటింపజేసినవారు శైవకవులు పెక్కురు కలరు అని నేటి చరిత్రకారులు ప్రశంసించుచున్నమాట అందరికిని తెలిసినదే. ఈ శైవకవులలో ఇతర వాఙ్మయములనుండి అనువాదము లొనర్చినవారు కొందఱుండినను స్వతంత్రకావ్యనిర్మాతలగు కవులు పెక్కండ్రు కలరు. తాము రచించు కావ్యములయందు కథావస్తువు పౌరాణికమైనది కాక నాటి నాటి సమకాలచరిత్రాంశమై లోకరంజకమై వారి ఆంధ్రాభిమాన సూచకమై ఒప్పుచున్నది. ఈనాటికవులు నేటిచరిత్రమునే కథావస్తువుగా గ్రహించుట గొప్పతనమని యెంచుచున్నారు. ఆ విషయమును శైవకవులు ఎన్నడో గ్రహించి ఆమార్గమును అవలంబించి కృతార్థులైరి. అందుకు తార్కాణమైన మల్లికార్జునపండితుడు పాల్కురికి సోమనాథుడు పిడుపర్తిసోమనాథుడు శ్రీనాథుడు ఏకామ్రగురువు ఈ మొదలగువారనేకులు గలరు. అప్పయదీక్షితులవారు కృష్ణదేవరాయల సంస్థానమునుండి శైవమతప్రబోధకములగు ననేకగ్రంథములను వ్రాసి శివమాహాత్మ్యమును ప్రత్యక్షముగా చూపించి శివభక్తి ప్రచారమునసలిపి శైవమతమును సప్రమాణముగా వాదించి జయించి

నిలుపబెట్టుకున్నచో తాతాచార్యులు ప్రభుత్వబలమున వైష్ణవమతమునే వ్యాపింపజేసియుండును. పరమశైవాగ్రేసరుడగు బమ్మెర పోతరాజుగారికి భాగవతము తెనిగించినందునకుగాను నేటివారుపంగనామాలు బెట్టి వైష్ణవమత మంటగట్టుచున్నారు. తాము ఇవటూరివారి శిష్యులమైనట్లును తన - కొక్కింత రాముని యందు భక్తిగలిగిన హేతువుచే భాగవతము తెనిగించి శ్రీరామచంద్రున కంకిత మొనర్తునని చెప్పిన హేతువు ఇందునకు కారణము. శ్రీరామచంద్రుడు మహాపాశుపతుడని అంకిత మొనర్చెనేమొ. శ్రీకృష్ణునిలీలలు చెప్పుటకుగూడ శ్రీకృష్ణుడు ఇష్టలింగధారియని యాతని చరిత్రములను మనసారరచించి యుండునా? అచ్చటనో దక్షయాగసందర్భమున నించుక లోపము కలిగెనదని తత్పాపపరిహారంబునకై వీరభద్రవిజయంబును చెప్పితిననుట అందరికిని తెలిసినవిషయము. ఆయన శైవత్వము పూర్ణముగా స్థిరమైయున్నది. శ్రీనాథుడు హరవిలాసమున శైవేతరులకు తెలియని సాంప్రదాయ విషయములను జెప్పియున్నాడు. తెనాలిరామలింగడు తనఉద్భటారాధ్యచరిత్రయందు శివమాహాత్మ్యమును జెప్పుచు వ్రాసినఘట్టము ఆతని శైవకవిత్వమును నేటికి ప్రకటించుచున్నది. శైవకవులలో ఉత్తమోత్తముడగు పాల్కురికి సోమనాథుడు తన కవిత్వమంతయు శివభక్తి ప్రబోధమును చేయుటకొరకే కాక తెనుగుజాతీయతను తెనుగుభాషాచమత్కృతిని ఛందస్సు యొక్క సొంపును ప్రకటించియున్నాడు. ద్విపదలు రగడలు సీసపద్యములు గద్యలు ఉదాహరణములు మొదలగు ఛందస్సులతో తన కవిత్వమును ప్రకాశింపజేసెను. వారి గ్రంథములు తెనుగునకు సర్వవిషయములందును నిఘంటుప్రాయములై నేటికవులకెంతయును కావ్యనిర్మాణములయం దుపకరించుచున్నవి. పిడుపర్తి సోమనాథుని కవిత్వము మనోహరమై తెనుగు సాంకేతికపదములకు స్థానమై యొప్పుచున్నది. శ్రీనాథుడు నాకవిత్వంబు నిజము కర్ణాటభాషయనియనుటకు కారణ మజ్ఞేయవిషయము కాదు. శైవసాంప్రదాయ బోధకములైన మాటలు కర్ణాటమున పెక్కులు కలుగుటచే

వానిని తెనుగు శైవకవులు సామాన్యముగా గ్రహించుచుండుటచే తాను నట్టివాడగుట నామాటననెను.

శైవులు కర్ణాటభాషనుండియు, వైష్ణవులు అరవభాషనుండియు తమ తమ వ్యావహారిక సంకేతికములగు కొన్ని మాటలు గ్రహించుట సాంప్రదాయసిద్ధము. అనేకమంది లింగాయతులు తాము తెనుగువారయ్యును కర్ణాటభాషయందు తమ మతగ్రంథములను వ్రాసియుండిరి. నాడు కర్ణాటకప్రభుత్వము శైవమతమును పూర్ణముగ నాదరించుటయే దీనికి కారణము. తెనుగులో వ్రాసిన బసవపురాణమును కన్నడులు కన్నడమున ననువదించుకొనిరి. బసవేశ్వరుడు తాను తెనుగువాడయ్యును కన్నడదేశమునకు ప్రధానమంత్రియై తాను కన్నడములో కవియై తెనుగు కన్నడ కవులను సమానముగా గౌరవించెను. కాన శివకవులకు కన్నడమాటలు తరచుగా ననుష్ఠేయములై యున్నవి. కుమ్మరులలో అనేకమంది శైవకవులు కలరు. వారుకూడ శివభక్తి ప్రబోధకములగు గ్రంథములను వ్రాసిరి. శ్రీకాళహస్తీశ్వర శతకమును వ్రాసిన ధూర్జటికవియు, శ్రీకాళహస్తి మాహాత్మ్యమును వ్రాసిన ధూర్జటికవియు ఒక్కరైనను యిద్దరైనను శైవకవులన్నమాట నిశ్చయము. తిక్కనసోమయాజిగారి కాలమున కప్పుడప్పుడే వ్యాపకమగుచున్న అద్వైతవాసననుబట్టి హరిహరనాథుని కృతిపతిగా జేసినను శివభక్తిని గూర్చి సందుగలచోట్లనెల్ల విస్తరింపజేసియున్నారు. ఆంధ్రసంగీత మూలకందమగు త్యాగరాజుగారు వ్రాసినకృతులలో ప్రస్తుతము రామాయణమునకు సంబంధించిన కృతులే పాడుచుండుటచే నాతడు రామభక్తుడని వైష్ణవమత మంటగట్టి వంగనామములు దిద్దుచున్నారు. కాని శివుని గురించి వ్రాసిన కృతులు అనంతముగా కలవు. కాని ఒక్కటియు నేడు సంగీత విద్వాంసులనోట వెలువడని హేతువుచే వ్రాయనగ్లెంచుచున్నారు. కాని శివునిగురించి వ్రాసిన ఒక్క కృతి అనేకకృతులకు తుల్యమై ఆయన భావమును వెల్వరించుచున్నది. ఈశ్వరునికంటె నన్యదైవము లేదనియు నాద ఓంకారస్వరూపుడైనవాడు ఈశ్వరుడనియు

ఈశ్వరుని సేవించినగాని మోక్షము కలుగదనియు వ్రాసిన కృతులు అనేకములు గలవు. రామాయణమును శైవకవులు వ్రాయుటయే కాక పతివ్రత దీక్షితుడని శివభక్తుడని భారతదేశమున ప్రపవిత్ర చరిత్రుడని అభిమానముతో వ్రాసిరి.

అంతమాత్రముచే వారికి వంగనామములు పెట్టి కేవల వైష్ణవులుగా సూచించుట సాహసము. ముఖ్యముగ పాపయారాధ్యులవారు అమరావతిలో వెంకటాద్రిప్రభు సంస్థానమున ఆస్థానకవిగానుండి అనేకమంది పండితుల జయించి దిగ్విజయమును స్థాపించుటయేగాక దేవీభాగవతాది మహాగ్రంథము లనేకములు వ్రాసియుండిరి వారికి కవిత్వప్రాభవమేగాక శివానుగ్రహసంపత్తికూడ కలదు. శ్రీ జేతపూడి శరభయ్యగారిచే ముద్రింపింపబడిన శ్రీదేవీభాగవతపీఠికయందు శ్రీ పాపయారాధ్యులవారి మాహాత్మ్యము నుగ్గడించుచు నేటి నాగరికులలో కొందరు విశ్వసింపరు అని వ్రాయుట ఆంధ్రదేశమందలి మతద్వేషజనకమైనది. కొన్ని ప్రయోగములు మూలమునకు విరుద్ధముగా దిద్దబడి పరిహాసపాత్రము చేయుట వారికీర్తికి కళంకదాయము కాదు. మహాకవియైన శ్రీ పాపయారాధ్యులవారు మొదట వ్రాసిన రెండు తెరగులవారికిని సంబంధించినవారు. ముదిగొండ వీరభద్ర మహాకవి పల్నాటివీరభాగవతమును, ద్వాదశారాధ్యచరిత్రమును వ్రాసెను పల్నాటి వీరభాగవతమునందు కవిత్వమున ఒకవందసంవత్సరములనాటికి రాబోవు కవులుకూడా గ్రహింపగల క్రొత్తత్రోవలు కానవచ్చును. నేటి అభినవకవులలో శిరసావహింపనివారు లేరు. ఆ గ్రంథము తెనుగువారికి భారతముతో సమానమైన గ్రంథము. తెనుగువారి పౌరుషమును పరాక్రమమును యుద్ధకౌశలమును నేటికిని ప్రకటించుచున్నది. నాయకురాలియొక్కయు నాయకురాలికి గురువైన శివయోగియొక్కయు, పాత్రపోషణము వర్ణనాతీతము. నాడు గురువులకు శిష్యులయందును, శిష్యులకు గురువులయందును గల ప్రేమసంబంధము నాయకురాలిచే మంత్రిత్వము చేయించి శైవమతగౌరవమును పునరుద్ధరింపజేసినది. ఈ

నాడు చూపించుచున్న వస్తుప్రదర్శనములు ఆనాడే నాయకురాలిచే ప్రదర్శింపబడెను. నాయకురాలు మంత్రిత్వముచేయుటకు మూలబలము శివయోగియు శైవమతము ననుమాట కావ్యమున ప్రతిఫలించుచున్నది. అట్టి మహాకావ్యమును వ్రాసినవీరభద్రకవిఆంధ్రవ్యాసుడుగా నమస్తాంధ్ర హృదయములయందుస్మరింపదగినవాడై కీర్తిమూర్తియై నిలచియున్నాడు. వారివంశమునకు జెందిన శ్రీ శంకరారాధ్యులవారు కేవల శివస్వరూపులే కాక ఆదికవియని ప్రశంసింపదగిన శివుని యవతారమై కవియై భూలోకమున శివభక్తిప్రబోధకములగు గ్రంథములను వ్రాసి శైవమత ప్రచారమును సలిపి ఎక్కువగా నైజామురాష్ట్రమున ఇతర ప్రాంతములందు శైవమత పునరుద్ధరణ మొనరించిన మహాకవి. వారి కవిత్వము చిన్నిచిన్ని మాటలతో వేదార్థమును బోధించుచున్నది. పామరులుకూడ అందలి భావమును గ్రహించి ఆనందించుచున్నారు. తెనుగు జాతీయ కవిత్వమును ప్రతిఫలించుచున్నది. నేడు ప్రజాసాహిత్యము కావలయునని కోరువారు వారి కవిత్వమును ఆదర్శప్రాయముగా గ్రహింపవచ్చును. స్మృతి శ్రుతి పురాణేతిహాసములలో శివధర్మములను మానవుల నిత్యవిధులలో సూచించుచు పాడుకమాటలలో జాతీయ ఛందస్సులలో వ్రాసి ప్రజలకు శైవమతము ప్రబోధించి ఆచరింపజేసి శివానుగ్రహపాత్రుల నొనరించిన శ్రీ శంకరారాధ్యులవారు శైవులకేకాక తెనుగువారి కెల్లరకు చిరస్మరణీయులు. తెనుగు దేవతల చరిత్రములను తురకభాషలలో ననువదించి తురుష్క ప్రభువులకుకూడ బోధించి వారికి శైవమతాభిమానమును కలిగించిన శైవకవి శ్రీ పాపయారాధ్యులవారి కుమారులగు వియ్యన్నగారు సామాన్యజనులును, పండితులును గ్రహింపగల శివజ్ఞానమును ప్రబోధించు కీర్తనలను వ్రాసిరి. అవి నేడు శైవులచే శివపూజాకాలములయందు చదువబడుచున్నవి. నాటి ప్రభుజగన్నాథబాబునుగూర్చి విలాసముగ పద్యములు జెప్పెను. తానిలోబు అక్షరములను అంత్యనియమములుగా బెట్టుకొని చెప్పిన పద్యములలో వారి భాషాచమత్కృతియు, తెనుగుభాషలో వారికిగల విశేషపరిచయమును కనిపించుచున్నది. తెనుగునందేకాక సంస్కృతమునందుకూడ

వీరు కీర్తనలు వ్రాసియుండిరి. అంత్యనియమముగల కవిత్వము వ్రాయుట వీరికి పరిపాటియైన విషయము. కీర్తనలయందుకూడా తరుచుగా గాన వచ్చును. సర్వేశ్వర శతకమును వ్రాసిన యథావాక్కుల అన్నమయ్య తాను వ్రాసిన ప్రతిపద్యమును గల తాటియాకును నదీప్రవాహమున పడవైచి తిరిగి వచ్చిన పద్యమును గ్రహింతుననియు, అట్లు రాని యెడల తాను వ్రాసినది అబద్ధమగునని అందువలన శివాపరాధముగలదని భావించి గండకత్తెరచే తల నుత్తరించుకొందుననియు ప్రతిజ్ఞచేసి వ్రాసిన మహాకవి. అందొక పద్యము మ॥ తరులక్ అనునది ప్రవాహమున కొట్టుకొనిపోవుగా గండకత్తెరను కంఠమునకు తగిలించి ప్రతిజ్ఞ నెరవేర్చుకొననెంచులోగా ఇంకొక తాటియాకుపై మ॥ ఒకపుష్పంబు అను పద్యముగలది ప్రవాహమున పోవు మొదటి తాటియాకునుకూడా కలుపుకొని ప్రవాహమున కెదురీది కవిగారి సాన్నిధ్యమునకువచ్చినదట. వీరి గృహనామ మదివర కేదియైనను నాటినుండి యథావాక్కులవారను నింటిపేరుతో విరాజిల్లుచున్నారు. శరభాంకశతకమును వ్రాసిన శరభాంకుడను మహాకవి లోకవ్యవహారము లనేకములను ప్రజలకుగల్గు కష్టసుఖములను బోధించుచు శైవులయొక్క గొప్పతనమును సంసార నిర్లేపత్వమును తన ఆచరణచే నిరూపించి ప్రభువులనుకూడ లెక్కచేయక నిరంతర తపోనిష్ఠాగరిష్ఠులై తపఃఫలమోయనునట్లు తోచదగిన చక్కని కవిత్వమును వ్రాసిరి. మనకు పూర్వపరిచయుడైన పాల్కురికి సోమనాథునకు పితామహుడగు వేరొక సోమనాథుడు కలడు. వారు వృషాధిపశతకమును వ్రాసిరి. వృషాధిపశతకములోని శైవవిశిష్టసాంప్రదాయములు ఆ మతస్థుల కనుభవైకవేద్యములు. ఈ యిరువుర సోమనాథులగూర్చి నేటి చరిత్రకారులు ఒక్కరని అభిప్రాయపడిరి. కాని బ్రహ్మశ్రీ ఇవటూరి పావయ్యశాస్త్రిగారు ఇరువుర సోమనాథుల చరిత్రమును పూర్ణముగా పరిశీలించి వారు విశ్వారాధ్య సంతతికి చెందినవారని వారిరువు రిరువురే కాని ఒక్కరేకారని త్రిలింగపత్రికాముఖమున అనేకవ్యాసములను పాఠకులకు అందజేయుచున్నారు. అందజేయుగలరు. వారు శైవమతమునకు నేడు సలుపుచున్నకృషి ప్రశంసనీయము.

వారు తిరిగి ఈ విషయమునంతయు నొక గ్రంథముగ వ్రాసి లోకమున ప్రచార మొనరించుటకు శైవులెల్లరు సహాయ మొనరింపగలందులకు కోరుచున్నాను. వీరు వారని ప్రత్యేకముగ పేర్కొన నేల. శివుని పరాత్పరత్వమును భస్మరుద్రాక్షల మాహాత్మ్యమును బహువిధముల వ్రాసిన కవులు పెక్కుమంది కలరు. భాష్యకారులైన శ్రీ నీలకంఠాచార్యులవారు శివభక్తి ప్రబోధకములగు ననేక శ్లోకములను వ్రాసిరి. పండితస్వామి వారు శ్రీకరభాష్యమును వ్రాసిరి. ముంజభోజుని యాస్థానమున పరీక్షాధికారిగానున్న ఉద్భటారాధ్యులవారు అలంకారసర్వస్వమను ఆలంకారికగ్రంథమును వ్రాసిరి. మహర్షు లనేకులు నాటి కవిత్వరూపమగు ఉపనిషత్తు లనుపేరుతో శివభక్తిని అష్టావరణములయొక్క మాహాత్మ్యము ను లోకమున ప్రచార మొనరించిరి. సంస్కృత కవులలో సామాన్యముగా అందరును శైవకవులే. ఖడ్గములను పేరుతో సీసపద్యములను కొందరు శివకవులు వ్రాసిరి. ఆ ఖడ్గములు దక్షయాగ కథావిధానము వస్తువుగాగలవి. వీరభద్రుడు దక్షయాగమును విధ్వంస మొనరించుటకు శివాజ్ఞచే బయలుదేరినది మొదలు తిరిగి శివునివద్దకు వచ్చుటకు గల చరిత్రమును చెప్పుచున్నవి. ఆ ఖడ్గములు పాడునప్పుడు వీరరసము తొణకుటయేగాక శివభక్తి కలుగుచున్నది. యుద్ధావసరములయందు నాటి తెనుగువారికిగల ఆయుధవిశేషములను పౌరుషమును యుద్ధకౌశలమును ప్రకటింపజేయు వీరభద్రారాధనలయందు వీని నుపయోగించుచు తెనుగువారికి సంగరోల్లాసమును శివభక్తిని జాతీయతను ప్రబోధించుచున్నవి. తెనుగు సాహిత్యములో యీఖడ్గములు ముఖ్యస్థానమును వహింపగలవు. వీనిలో కొందరు శిల్పులు చేసినటువంటి శిల్పనైపుణ్యమును కొందరు వీరుల పరాక్రమమును కొందరి భక్తులయొక్క చరిత్రమును భక్తులు వీరభద్రు నారాధించిన విషయములు మాత్రమే కానవచ్చుచున్నవి. కాని యెవరువ్రాసినది కవిపేరు విస్పష్టముగా తెలియరాదు. అందలి భాష నేటి ప్రజాసాహిత్యమను భాషయై ఉన్నది. దానిని వ్రాసిన కవులందరు శైవకవులేకాన మనకు వారు చిరసంస్మరణీయులు. ఇంక ననేకమంది ద్విపదలు రగడలు సీసపద్యము

కందపద్యములు మొదలగు తెనుగు ఛందస్సులలో తెనుగుమాటలలో శివభక్తి ప్రబోధకముగ తాత్కాలిక సమకాలభక్త చరిత్రములను వ్రాసి లోకమున కందజేసిరి. వీరిలో చాతుర్వర్ణ్యమునకు జెందిన లింగధారులైన శివకవులును లింగధారులుకాక కేవల శివభక్తి ప్రధానముగాగల వారై భస్మరుద్రాక్షలనుధరించు శివకవులును లింగాయుతులను కలరు. వీరందరు మతమునకు భాషకు సంఘమునకు నేదోవిధముగ నుపకరింపగల గ్రంథములను చక్కని జాను తెనుగులోను మిశ్రభాషలోను వ్రాసి రాజకీయ నైతిక ఆధ్యాత్మిక ప్రబోధ మొనరించి నాటి ఆంధ్రలోకమును శివభక్తిమయము నొనరించి తెనుగు సామ్రాజ్యములను నాడు నిలుపుటకు ప్రయత్నించుటయేగాక నాటి కీర్తిని నేటివరకు స్థిరముగా నుండగల కావ్యరూపమునచిత్రించి జగత్స్మరణీయులై శైవకవితాయశఃకాయులై మనముందు ప్రసన్నులగుచున్నారు. మనము వారిని స్మరించి వారి అనుగ్రహమున బట్టివారమై శైవమతప్రచారములను నొనరించుటకుగాను ప్రయత్నించవలయును. నేటి తెనుగునాటి మహాకవులలో నగ్రగణ్యులైన కీ॥శే॥ మహోపాధ్యాయ శివయోగి బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిలవారు శైవమహాపీఠమునకు ప్రథమపీఠాధ్యక్షులై మతోద్ధరణ గావించినమాట అందరకు తెలిసిన విషయమే. వారు విద్వత్కవులు. వారు ఉభయభాషలయందు ననర్గళమైన కవిత్వమును జెప్పినవారు. భాష్యముల వ్రాయునప్పుడు ఎట్టి గట్టితనము కలదో తెనుగు కవిత్వమును వ్రాయుపట్టున నట్టి మార్దవముకలదు. ఇట్టి స్థితి కలుగుట లోకమందు వీరియెడ నొక్కచో గానబడియెడు. వీరి తెనుగు గ్రంథములు చదువువారు ఆంధ్ర కవియనియు ఆంధ్రభాషకు గొప్ప సహాయమును సల్పెననియు ననుకొందురు. సంస్కృత గ్రంథములు చదువువారు సంస్కృతమహాకవియనియు సంస్కృతభాషను ననేకవిధములుగా నలంకరించిరనియు ప్రశంసింతురు. భాష్యములు చదువువారు ఈయన మతాచార్యుడనియు శివుడీరూపమున నవతరించి శైవమతప్రచార మొనరించునోయని యూహించి సేవింతురు. నేటికి వారు వ్రాసిన గ్రంథములు నూటికిపైగాగలవు. వీనిలో శతకము మొదలు భాష్యాంతమువరకును

కలవు. వీరి కవిత్వమిట్టిదని నుడువుటకు చాలమిని నేటికవి సామ్రాట్టు లెందరో వ్రాసినారు. కళాప్రపూర్ణులు ఆస్థానకవులగు శ్రీ॥ బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు తిరుపతి వెంకటేశ్వరులలో నర్ధభాగమైన మహాకవి. స్కాందమును వ్రాయుటచే వారుకూడ శైవకవులుగ ప్రశంసాపాత్రులైరి. అద్వైతులను చెప్పుకొను వారందరును లింగ ధారణలేని శైవులు – భస్మరుద్రాక్షధారణములు పంచాక్షరీ మంత్రానుష్ఠానము శివపూజయు బ్రాహ్మణులకు సహజధర్మములు నిత్యానుష్ఠేయములని జెప్పుటయేగాక ఆచరింతురు. అట్టి శైవకవులలో మహాకవి శ్రీశాస్త్రిగారు. వీరు స్కాందము వ్రాసి శైవలోకమునకు ఒనరించిన మహోపకృతి విస్మరించతగినది కాదు. వడపోసినకొలది నీరు స్వచ్ఛమైన రీతిగ శ్రీశాస్త్రిగారు చిన్నతనమునుండి సమస్తశాస్త్రములు నభ్యసించి విమర్శించి విచారించి తుదకు నిశ్చితాభిప్రాయమునకు వచ్చిననాడు వ్రాసిన గ్రంథము కావ వారి నిర్మలాంతఃకరణముననే మహాత్ముని నిలిపి నిత్యము సేవించుచుండునో అట్టి పరశివునిగూర్చి సంపూర్ణముగ తమ శాస్త్రానుభవస్వానుభవములను జోడించి ఇంతకంటె నన్యవర మార్గము లేదని దృఢవిశ్వాసముతో ముసలితనమందైనను యీశ్వర భక్తిచే శరీర మనోదార్ఢ్యములుగలవాడై గ్రంథమును పూర్తినొనరించి శివానుగ్రహపాత్రులై అనన్యచింతారహితులై మద్రాసుప్రభుత్వ ఆస్థాన కవిగా సమ్మానింపబడి, శివసేవ ఒనరించు మహాత్ములు ప్రభుత్వసేవ నొనరింపడను ధర్మమును స్మరించి కైలాసంబునకేగి నేడు శివాస్థానములో ఆస్థానకవిగానున్నాడు. ఇట్టి శైవకవులెందరో నేడు మనకు తెలియనివారు కలరు. వారికందరకు సభక్తిగా నమోవాకముల నర్పించి విరమించుచున్నాను.

శతావధాని

ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రి

ఈమని

# విజ్ఞప్తి

శైవమహాజనులారా !

ఈమని గ్రామమున 30 వ శైవమహాపీఠవర్ధంతి జయప్రదముగ చైత్ర మాసములో అనగా ఏప్రియల్ 24, 25, 26 తేదీలలో యీ సంవత్స రము జరిగినది.

అప్పుడు పాలకసమితి సభ్యులుగ పండితమండలి సభ్యులుగ ఎన్ని కొనినవారి పేర్లు నాల్గవ సంపుటమున, ఒకటవ సంచికలో ప్రకటింప బడినవి. మఱియు ఆ వర్ధంతిలో జరిగిన కార్యక్రమము, ఆదాయవ్యయ వివరములు సర్వసభ్యులచే నేకగ్రీవముగా నంగీకరింపబడిన శైవమహా పీఠ నూతన నియమావళితోగూడ ముద్రించబడినవి.

ఈ సంచిక, నాల్గవ సంపుటములోని రెండవ సంచిక. యిది ౧౦ వ సంచికగా ప్రకటింపబడుచున్నది. ఈ పత్రికకు చందాదారులుగ చేరిన వారికి నందన సం॥ర మాఘమాసమువఱకు శైవమతప్రకాశిక పంపించ గలము. సం॥ ౧ కి చందా 3-0-0. కల్దారు చెల్లించవలెను. పోష కులు ౫-0-0. ప్రధానపోషకులు ౧౦-0-0 చెల్లించవలయును. ఈ చందా ధనమును శైవమహాపీఠమువారిచే నియుక్తులయి పీఠముతరఫున రసీదులిచ్చెడివారి కిచ్చుట, లేక శైవమహాపీఠ ప్రధానమంత్రిగారు, హనుమాన్ పేట, సాంబమూర్తిరోడ్డు, విజయవాడ. అను అడ్రెసునకు పంపుట అను ఈ రెండుపద్ధతులలో నేదియోనొకటి యాచరింపవచ్చును.

శైవ మహాపీఠ భవనమను పేరుతో విజయవాడలో దుర్గాకళా మందిరమునకు దక్షిణ వైపున పదివేల రూప్యములు వ్యయపరచి భక్త మాహేశ్వరులొసంగిన విరాళములతో సర్వాంగ సుందరముగ నొక భవనము నిర్మింపబడినది. అందు సుమారు 30 సంవత్సరములనుండి నియమముగ తెనాలిలో దేవీనవరాత్రులు జరుపుచున్న శ్రీ. లో.

ములుగు కోటయ్య అయ్యవార్లంగారిచే నవరాత్ర మహోత్సవముతో బాటు శైవపీఠ భవన ప్రారంభోత్సవముకూడ ఆశ్వీజ శు ౧ లు జరిపించబడినవి.

శ్రీ. లో. శివలెంక బుచ్చయ్య అయ్యవార్లంగారు

శ్రీ. లో. శివలెంక పున్నయ్య అయ్యవార్లంగారు

శ్రీ. లో. ఇవటూరి పాపయ్య శాస్త్రిగారు

శ్రీ. లో. ముదిగొండ వీరభద్రావధానులవారు

శ్రీ. లో. పండితారాధ్యుల లింగమూర్తిగారు

మొదలగువారిందు పాల్గొనిరి. ఉపన్యాసములు - పురాణములు - శివపూజలు - అన్నదానము చక్కగా జరిగినది. ఇట్లు మహోత్సవముగ జరుగుటకు మూలకారణ భూతులయిన ముదిగొండ జ్వాలాపతి లింగ శాస్త్రిగారు, శ్రీపతి పండితారాధ్యుల పట్టెసలింగారాధ్యులవారు-కాశినాధుని సుబ్రహ్మణ్యం అయ్యవారు, శివలెంక బసవయ్య శాస్త్రి గారు, ఎంతయు ప్రశంసనీయులు.

శివపూజా మతస్థులుగాని, తదితరులుగాని శివలింగధారణ గలిగిన భక్త మాహేశ్వరు లెల్లరు శైవమహాపీఠము తమతమ స్వంత ధనముగ భావించుకొని విజయవాడకు వచ్చినవారెల్లరు అచ్చట దిగియూ శైవపీఠము నభివృద్ధిలోనికి తెచ్చుటకు ప్రార్థితులు.

ఈ సంచికలో చైత్రమాసమున జరిగిన పీఠవర్ధంతిలో సర్వజనాంగీకారముతో నెన్నుకొనబడిన ద్వితీయ పీఠాధిపతులు విద్యాప్రవీణులు విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారి సందేశము (అనగా అధ్యక్షోపన్యాసమును) ఆహ్వానసంఘమువారి స్వాగతోపన్యాసమును కవిపండితుల స్వాగతపద్యములు వ్యాసములును ముద్రించబడినవి.

# శైవమతప్రకాశిక

ఈ శైవమతప్రకాశిక రెండవసంచిక యింత ఆలస్యముగ ముద్రించుటకు గల ప్రధానకారణము ప్రభుత్వమువారి యంగీకారపత్ర మాలస్యముగ లభించుటయే కాని, వేరేమియు లేదు. ఈ సంవత్సరాంతమువరకు యీ రెండుసంచిక లేగాక, మరి రెండుసంచికలు వెలువడును.



భూస్వాములు, మతాభిమానులు, భాషాభిమానులు, శ్రీమంతులు ఉద్యోగస్థులు మొదలగు సాంఘికులందరు తగినంత సహాయము పోషకులుగను, ప్రధానపోషకులుగను చేరి తమ యౌదార్యమును చూపినపుడేగాని పత్రికను ప్రతినెల సక్రమముగ ప్రకటించుటకు వీలులేదు.

ప్రతిశైవుడును ఒకొక్క చందాదారుని చేర్చవలెను. ప్రధానపోషకులును, పోషకులును చందాదారులును విశేషముగ జేరి కోటి పత్రికలతోబాటు మనపత్రికనుగూడ సర్వాంగసుందరముగ చిరస్థాయిగ జేయ సాంఘికుల నభ్యర్థించుచున్నారము.



ఒక సంవత్సరమువరకును తమ కెన్ని పను లున్నను సక్రమముగా ముద్రించి యిచ్చుటకు అంగీకరించిన శైవసంఘాభిమానులు, పాలకసమితి సభ్యులు, ఓరియంట్ ముద్రాక్షరశాలాధికారులు తెనాలినగర వాస్తవ్యులునగు శ్రీ. లో. ముదిగొండ సుబ్రహ్మణ్యేశ్వర శర్మగారికి మా కృతజ్ఞతావందనము లర్పించుచున్నారము.

ఇట్లు

ప్రధాన మంత్రి